# గుర్తుంచుకోండి, పోషణపరంగా సమతూకమైన ఆహారం తినిపించకపోతే, మీ పాపాయికి తగినంతగా బరువు పెరిగేందుకు అవసరమైన ప్రోటీన్‌లు లభించవు.

## "అందుకే నేను మా పాపకు సెరిలాక్ యిస్తాను."

మీ డాక్టర్‌ని అడగండి. ఆయన మీకు రెండు ముఖ్యమైన విషయాలు చెబుతారు. ఒకటి, ప్రోటీన్‌లు మీ పాపాయి కండరాలు, శరీర కణాలు పెరగడంలోను, రక్తం ఏర్పడటంలోను తోడ్పడతాయన్నది. రెండవది, సరయిన ప్రోటీన్‌లు లభించాలంటే మీ పాపాయికి ప్రతిసారి ఆహారం యిచ్చినప్పుడు పోషణ రీత్యా సమతూకమైన ఆహారం అవసరమన్నది. ఇటువంటి ఆహారం ప్రతి రోజు తినిపించాలి. చాలా మంది తల్లులకు సంప్రదాయమైన ఆహారంతో యీ పని సాధ్యం కాక పోవచ్చు.

దీనికి పరిష్కారం ?

సెరిలాక్. ఎందుచేతనంటే ప్రోటీన్‌లు పుష్కలంగా గల రెండు ఆహార పదార్థాలు పాలు, గోధుమ సెరిలాక్‌లో ఉన్నాయి. ఇందులో కార్బోహైడ్రేట్లు (పిండి పదార్థాలు) కొవ్వు పదార్థాలు, విటమిన్లూ, ఖనిజాలు, ఇనుము, కేల్షియం సరైన పాళ్ళల్లో ఉన్నాయి. ఇది మీ పాపాయికి 4వ నెల నుంచి, అంటే పాలు ఒక్కటే సరిపోని వయసు నుంచి, తినిపించేందుకు ఘన రూపంలోని సమతూకమైన పోషకాహారం. అదీకాకుండా, సెరిలాక్ చాలా రుచిగా ఉంటుంది. పిల్లలకు అది చాలా యిష్టమైనది.

అందుచేత పోషణ రూపేణా సమతూకమైన సెరిలాక్ వల్ల ఉండే లాభాలన్నింటిని మీ పాపాయికి అందించండి. పాపాయికి 6 నెలల వయసు వచ్చినప్పటి నుంచి, వీట్-ఆపిల్ వీట్-ఆరెంజ్, వీట్-వెజిటబుల్ యొక్క అదనపు లాభాన్ని కూడా సమకూర్చండి.

ప్యాక్ మీద యివ్వబడిన సూచనలను దయచేసి పాటించండి.

---

**ఉచితం** సెరిలాక్ బేబీ కేర్ బుక్

వ్రాయండి : సెరిలాక్, పోస్టు బ్యాగ్ నం. 21, న్యూ ఢిల్లీ-110 029

---

నెస్లె వారి నాణ్యమైన ఉత్పాదన




## మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం.

Mudra D: NES: 0020 TEL

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

* కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి సొమ్ము చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

------------ కూపన్ ------------

**జూలై 'చతుర' నవల 'తొలి అడుగు'**

సమీక్షకుని పేరు : ..............................

చిరునామా : ..............................

..............................

..............................

..............................

# చతుర ప్రపంచ

## తోడేళ్ల అభిమానం

**తో**డేళ్లు పసిపిల్లాణ్ని పెంచి పెద్దచేసినట్లు చాలాకాలం క్రితం 'చందమామ' కథల్లో మనం చదువుకున్నాం. రెండు దశాబ్దాలక్రితం అలాంటి సంఘటన నిజంగానే జరిగింది. మోలీ అనే రెండేళ్ల పాపను మతిస్థిమితంలేని కారణంగా వాళ్ల అమ్మ అలాస్కా కీకారణ్యాలలో 1970 సెప్టెంబరు మాసంలో వదిలేసింది. తర్వాత ఆ పసిదానికోసం అడవి అంతా గాలించినా ప్రయోజనం లేకపోయింది. అమెరికాలోని అలాస్కా కీకారణ్యాలంటే భయంకరమైన తోడేళ్లకు ప్రసిద్ధి కావడంతో ఆ పసిగుడ్డు తోడేళ్లవాతపడిందనే అంతా భావించారు.



అయితే నిజానికి తోడేళ్లు ఆమెను చంపలేదు. పైగా సాగిలపడి ఆమెకు మొక్కాయి. ఆకలితో ఏడుస్తుంటే రకరకాల పళ్లు ఆహారంగా తెచ్చిఇచ్చాయి. ఇతర క్రూరమృగాలు ఆమె జోలికిరాకుండా కాపలాకాశాయి. అలావాటి సంరక్షణలో ఎనిమిదేళ్లపాటు హాయిగా పెరిగింది మోలీ. ఆడ టార్జాన్‌లా పెరుగుతున్న మోలీని కొందరు మానవులు పసిగట్టారు. పొంచివుండి పట్టుకున్నారు.

డాక్టర్లు, సైకాలజిస్టులు సాయంతో ఆమె అచిరకాలంలోనే మానవుల వేషాభాషల్ని అలవాట్లని వంటబట్టించేసుకుంది. ఆమెకు 18వ ఏడు వచ్చేసరికి సంపూర్ణ ఆధునిక యువతిగా మారిపోయింది. ఓ ధనవంతుడు ఆమెను దత్తత చేసుకుని 21వ ఏట ఆమెకి పెళ్లిచేశాడు. ఆమె భర్త జోస్ఫే అడవిజంతువులపై పరిశోధనలు సాగించిన రీసెర్చిస్కాలర్! పెళ్లయ్యాక ఉద్యోగరీత్యా మోలీ దంపతులు ఇంగ్లండ్‌లో స్థిరపడ్డారు.

అయితే ఇప్పటికీ ఏడాదికోసారి భర్తతో కలిసి అలాస్కా అడవులకు వెళ్లి తన తోడేలు నేస్తాల్ని పరామర్శిస్తుంటుంది మోలీ. అవి కూడా ఆమెనెంతో ఆప్యాయంగా ఆదరిస్తాయి. తెలిసీతెలియని తోడేలు కూనలు ఆమెమీద లంఘించబోతే పెద్దతోడేళ్లు వాటిని వారిస్తాయి. విచిత్రం ఏమంటే- ఆమెను అంతగా అభిమానించే ఆ తోడేళ్లు ఆమె భర్త పొడను సహించవు. యధాశక్తి అతనిపై తమజాతి వైరాన్ని ప్రదర్శిస్తాయవి.

# గాలిలో మేడ

**గా**లిలో మేడలు కట్టేవాణ్ణి ఊహాలోకవిహారిగా భావిస్తుంటాం మనం. వాస్తవాన్ని చూడలేని దివాంధుడిగా అతణ్ణి చిన్నచూపు చూస్తాం. కాని వాస్తవ ప్రపంచంలోనే గాలిలో మేడను కట్టిచూపించి ప్రజల్ని ముక్కున వేలేసుకునేలా చేశాడు హెన్రీ అనే పెద్ద మనిషి.

ఫ్రాన్సుకి చెందిన హెన్రీ తీగెలమీద, తాళ్ల మీద నడిచిపొట్టపోసుకునే వృత్తికళాకారుడు. ఎవ్వరూ ఊహించని విధంగా వినూత్నంగా క్రిస్టమస్‌ను జరుపుకోవాలన్నది అతని చిరకాలవాంఛ. ఆ ప్రయత్నంలో భాగంగానే 5 మీటర్లపొడవు, 2 మీటర్ల వెడల్పు, 4.8 మీటర్ల ఎత్తుగల ఇంటిని చెక్కలతో చేయించాడతను. ఆ ఇల్లు సకల సౌకర్యాలతో రెండు అంతస్థులుగా నిర్మితమైంది. ఆ తర్వాత 640 మీటర్ల పొడవున్న ఓ ఇనుప తీగెను కొని, తమ నగరంలోని నదిమీద ఎత్తుగా ఉండేలా ఆ తీరం నుంచి ఈ తీరం వరకూ అడ్డంగా కట్టాడు. అనంతరం తను ముచ్చటి పడిచేయించుకున్న చెక్క ఇంటిని ఆ తీగెకు వ్రేలాడదీశాడు. ఎట్టకేలకు 1988 క్రిస్టమస్ నాటికి **అతడు** తన గాలిమేడలోకి సతీసమేతంగా ప్రవేశించి 18 రోజులపాటు అక్కడ గడిపాడు. రాకపోకలకోసం ఆ ఇంటికి తాళ్లతో కొన్నిమార్గాలు కూడా ఏర్పాటు చేయబడ్డాయి, గృహప్రవేశం సందర్భంగా ఆహ్వానాలు అందినా బంధు మిత్రులెవ్వరూ రాలేదు. పొరపాటున కాలుజారితే తమ శవం నదిలో తేలియాడుతుందన్న భయమే అందుకు కారణం. ఎవరేమనుకున్నా హెన్రీగారి భార్య మాత్రం భర్తని ఈ విషయంలో ఎంతో ప్రోత్సహించి తనతోడ్పాటు నందించింది. ఇంతకీ ఈ గురుతర కార్యక్రమాన్ని నిర్వహించిన హెన్రీగారి వయస్సెంతో తెలుసా? 75 సంవత్సరాలట, బాప్రే....





# చతుర కథలు

## పందెం

"నాగభూషణం మాష్టారు అంటే మీరేనా?" అడిగాడు చక్రపాణి. సన్నగా, పొడవుగా బుట్ట తీసిన పాపిడితో ఉన్న వ్యక్తిని.

అతనోసారి చక్రపాణిని తేరిపార చూసి- "అవునండి... నేనే ఆ నాగభూషణాన్ని"

"మీరు లెక్కలు అదరగొట్టేస్తారట. పదోతరగతి మి స్కూల్లో చదివిన వ్యక్తి లెక్కల సబ్జెక్ట్‌లో మస్ట్ అండ్ మస్ట్‌గా పాసవుతాటడ"

నాగభూషణం మాష్టారు చిరునవ్వు నవ్వారు తప్పితే ఇప్పుడు మాష్టారిలా సెల్ఫ్‌డబ్బా వాయించుకోలేదు.

"మీరిప్పుడు టెంత్‌క్లాస్ విద్యార్థులకు ఇంటి దగ్గర ట్యూషన్ చెబుతున్నారట" అడిగాడు చక్రపాణి.

"అవునండి... ఇంటి దగ్గర బోరుగా వుంటేనూ..."

"చాలా సంతోషం సార్. మీ దయవల్ల చాలామంది విద్యార్థులు విద్యావంతులు అవుతున్నారు. ఇప్పుడు నేను చెప్పేది ఏమిటంటే నిన్న మీ ట్యూషన్‌లో ఫణిధర్ అనే కుర్రాడు చేరాడు చూశారు. వాణ్ణి వెంటనే ఈ ట్యూషన్ నుంచి తగలెయ్యండి" అసలు విషయం బయటపెట్టాడు.

"అదేం?" నాగభూషణం ముఖం క్వశ్చన్ మార్కు పెట్టేసింది.

"వాడొట్టి మొద్దుసార్. వాడు టెంత్‌క్లాస్ పరీక్షల్లో గన్‌షాట్‌గా ఫెయిలవుతాడు. అలాంటి విద్యార్థులవలన మీ ట్యూషన్ ఇమేజ్ దెబ్బతింటుంది కదండి"



"అతడు ఫెయిలవుతాడని ఎందుకనుకోవాలి? పరీక్షలకు ఇంకా ఆరునెలలు టైంవుంది. ఈలోగా కష్టపడి చదివితే తప్పకుండా పాసవుతాడు" అన్నారు మాష్టారు.

"ఇంపాజిబుల్ సార్. ఆ కుర్రాణ్ణి మీరు పాస్ చేయించడం అసాధ్యం" గట్టి నమ్మకంతో అన్నాడు.

"ఎలా చెబుతున్నారు?"

"చెప్పానుకదా సార్. వాడొట్టి మొద్దు అని"

"ఫణిధర్‌ని పాస్ చేయించితీరుతాను"

"చేయించలేరు. కావాలంటే వెయ్యి రూపాయల పందెం కూడా కాస్తాను"

"ఇంతకూ మీరెవరు?"

"ఈ పందెంలో మీరు గెలిచాక చెప్తాను నేనెవరో? నేను గెలిస్తే మీరు నాకు వెయ్యి రూపాయలు ఇవ్వాలి"

"ఒకే..."

* * *

పదవతరగతి పరీక్షా ఫలితాలు వెల్లడించారు.

ఫణిధర్ ఫస్ట్ క్లాస్‌లో పాసయ్యాడు.

అన్నమాట ప్రకారం చక్రపాణి నాగభూషణానికి వెయ్యిరూపాయలు ఇచ్చాడు.

"మీరెవరో చెప్పలేదు" అన్నాడు నాగభూషణం.

"నేను ఫణిధర్ తండ్రిని సార్" చెప్పాడు చక్రపాణి.

"వ్వాట్? మీ అబ్బాయి ఫెయిల్ అవుతాడని మీరే పందెం కాయడం ఆశ్చర్యంగా వుందే?"

"అలా కాయబట్టే వాడు పాసయ్యాడు సార్?"

"అంటే...?"

"వాడు నెంబర్‌వన్ మొద్దువెధవ. మీ వద్ద ట్యూషన్ చదివే పదిమందిలో వాడొక్కడు ఫెయిలయితే మీరు పెద్దగా పట్టించుకోరు. అలాకాకుండా మీ దృష్టి వాడిమీద కేంద్రీకరించాలని నేను మీతో బెట్ కాశాను" ఆనందంగా అన్నాడు చక్రపాణి.

-కొల్లిమల్ల అప్పారావు

## లిఫ్ట్!

'బంద్' కారణంగా నగర వీధులన్నీ బోసిపోతున్నాయి. ట్రాఫిక్ చాలా పల్చగా ఉంది. అడపాదడపా ఒకటీ అరా స్కూటర్లు, ఆటోలు తప్ప రోడ్డుమీద మరెలాంటి అలికిడీ లేదు.

రోడ్డువారగా నిలబడిన ఓ ఆడశాల్తీ లిఫ్ట్ కావాలన్నట్లుగా చేయెత్తి బొటన వ్రేలు చూపడంతో సర్వేశ్వరరావు స్కూటర్‌కి సడెన్ బ్రేక్ వేశాడు.

తీరాచూస్తే ఆమె ఎవరోకాదు. తమ వీధిలో ఉండే లోకేశ్వరరావు చెల్లెలే! సర్వేశ్వరరావుకి లోకేశ్వరరావుతో పెద్దగా పరిచయం లేకున్నా కొంచెం ముఖపరిచయం మాత్రం ఉంది.

చిరునవ్వుతో వచ్చి స్కూటర్ ఎక్కింది వనజ.

అందమైన అలాంటి ఆడపిల్లకి లిఫ్ట్ ఇచ్చే అదృష్టం తనకి దొరికినందుకు సంబరపడిపోయాడు సర్వేశ్వరరావు. అతని మనసులో కించిత్ గర్వం కూడా తొంగిచూసింది.

"ఏమండీ 'బంద్' కదా ఇవ్వాళ ఇంట్లో రెస్ట్ తీసుకోవాల్సింది" స్కూటర్ ముందుకి దూకిస్తూ అన్నాడు సర్వేశ్వరరావు.

"ఇమ్మీడియట్‌గా కొన్ని ఇంపార్టెంట్ ఫైల్సు పూర్తిచేయాలని బాస్ ఆర్డర్! దాంతో రాక తప్పలేదండి" బాధగా అంది వనజ.

"ఏం బాసులోనండీ! మన కష్టసుఖాలు పట్టించుకోరుగదా!" సానుభూతిగా అన్నాడు సర్వేశ్వరరావు.

"బస్సులు లేకపోవడంతో ఉదయం రావడం కూడా చాలా ఇబ్బందయిందండి"

"కాదుమరి..." ఒప్పుకుంటున్నట్లన్నాడతను.

"ఆటో అంటే కూడా భయంగా ఉందండీ.







మీటర్ మీద ఇరవై పాతికా ఇమ్మంటున్నారు''

''అవునవును... ఇలాంటి బంద్ రోజుల్లో అయితే మరింత డిమాండ్ చేస్తారు వాళ్ళు''

ఆమె ఏమీ మాట్లాడలేదు.

ఎలాగైనా ఆ పరిచయాన్ని మరింత పెంచుకొని ఆమెకు చేరువ కావాలని సర్వేశ్వర్రావ్ ఉద్దేశం. అందుకే తనే మళ్లీ-

''పోనీ ఈ పూట మీ బ్రదర్ని స్కూటర్ తీసుకునైనా రమ్మని చెప్పాల్సింది'' అన్నాడు సంభాషణ పొడిగిస్తూ.

''ఆఁ అది మాత్రం ఏంసుఖంలెండి? పెట్రోలు ధరలు మాత్రం మండిపోవడంలేదూ!'' అందామె నిస్పృహగా.

''నిజమే... అలా అని నడిచిపోలేం కదండీ?''

''.......''

''కనీసం మీ బ్రదరన్నా ఆఫీసు వదిలే సమయానికి వెహికల్ తీసుకొస్తే మీక్కాస్త శ్రమ తప్పేది...''

''ఇందులో శ్రమ ఏముందిలెండి?''

''అదేంమాట? అదే నేనైతే మీ అన్నయ్యలా ఉదాసీనంగా వదిలేసి ఊరుకునేవాడ్ని మాత్రం కాదు...'' గొప్ప విశాల హృదయుడినని నిరూపించుకోడానికి తెగ తాపత్రయపడిపోయాడు సర్వేశ్వరరావు.

''వాడు తెస్తాననే చెప్పాడండీ... కానీ నేనే వద్దన్నాను''

''అదేం...'' ఆశ్చర్యపోయాడు సర్వేశ్వరరావు.

''ఓ ప్రక్క పెట్రోలు దొరక్క చస్తుంటే 'బంద్'నాడు కూడా తిరిగి దాన్ని వేస్ట్ చేయడం తెలివితక్కువ కాదంటారా? చెప్పండి?''

''అవునవును... మీ 'థింకింగ్ ఆఫ్ ఎకానమీ' అమోఘం'' మెచ్చుకోబోయాడు సర్వేశ్వరరావు.

''అందుకే ఎవడో ఒక తల మాసిన వెధవ లిఫ్ట్ ఇవ్వకపోడులే అని వాడికి నచ్చచెప్పి వచ్చేశానండీ...''

సర్వేశ్వరరావు బుర్ర తిరిగిపోయింది. ఠక్కున బండి ఆపేశాడు. వనజ స్కూటర్ దిగి-

''నేననుకున్నట్లే అంతలో మీరానే వచ్చారు. చాలా థాంక్సండీ! ఇదే మా ఇల్లు, రండి మా అన్నయ్యకి పరిచయం చేస్తాను'' అంటూ గేటు తీసింది.

తర్వాత ఆమె వెనక్కి తిరిగి చూసేసరికి అక్కడ సర్వేశ్వర్రావుగానీ అతని స్కూటర్కాని కన్పించలేదు.

— ఇందిర

# 'ఏడడుగులు'పై చతుర సమీక్షలు

మే నెల 'చతుర'లో ప్రచురితమైన కాకాని చక్రపాణి, వి.నాగరత్నకుమారిల నవల 'ఏడడుగులు'పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం

## సమస్యాత్మక నవల

(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)

పెళ్లి అనే సంప్రదాయంపై ఒక విధమైన వ్యతిరేకభావనతో వెలువడిన నవల 'ఏడడుగులు'. ఈ నవలలో ఎన్నోసందర్భాల్లో తమ పాత్రలద్వారా పెద్దలు కుదిర్చిన వివాహాల మీద అయిష్టత ప్రకటించారు రచయితలు. ప్రేమవివాహమైన సంధ్య, శ్రీనివాస్‌ల జంట బాగువర్ధిల్లు, మిగిలిన రెండు కుటుంబాలు అనంతృప్తితో నలిగినట్లు చూపించారు. ముగింపు కూడా ప్రేమవివాహాన్నే సమర్థించింది.

పెళ్లిపెద్దలు కుదిర్చినదే చేసుకోవాలా? ప్రేమవివాహమే మంచిదా? అన్న సమస్య అంత తేలిగ్గా పరిష్కరించబడేదికాదు. అసలు ఈ ప్రశ్నే అసందర్భమైనది. ప్రేమవివాహమైనా, పెద్దలు కుదిర్చిన వివాహమైనా ఎదుటివారి మనస్తత్వాలమీద జీవితం ఆధారపడుతుంది కాని మిగిలిన కారణాలననుసరించి కాదు. పెళ్లికిముందు ఎంతో ప్రేమ కనబరచి, తరువాత భార్యంటే నిరాసక్తత చూపే ప్రేమికులు ఎందరులేరు? ఈ విషయం రచయితలకు తెలియకపోలేదు. మీనాక్షివంటివారు తమ సంసారాన్ని నరకంచేసుకోవటానికి కారణం వివాహాన్ని పెద్దలు కుదర్చటంవల్ల కాదని తమ సంకుచిత మనస్తత్వమే అందుకు కారణమని నవలలో కనబరిచినా, సంధ్య, శ్రీనివాస్‌ల కుటుంబాన్ని మాత్రమే ఉన్నతస్థానంలో నిలపటంవల్ల ప్రేమవివాహాలపట్ల రచయితలు మెగ్గుచూపుతారని స్పష్టంగా తెలుస్తోంది.

తాము భర్తను ఎంత ప్రేమించినా, వారి వ్యక్తిత్వాన్నీ స్వేచ్ఛనూ హరించే హక్కు తమకి లేదనీ, అదే జరిగినపక్షంలో తమ సంసారం నరకమేననీ మీనాక్షి పాత్రద్వారా సందేశమిచ్చారు. అలాగే సినిమాల్లో కనిపించే అత్తగారి సాధింపులూ, ఆడపడుచు ఎత్తిపొడుపులూ సంధ్య కాపురంలో ఉండనేఉన్నాయి. కాని ఆమె కుటుంబ ఆర్థికపరిస్థితిని, కుటుంబంలోని వారి మనస్తత్వాలను అభివృద్ధిచేయటానికి సంధ్య చేసిన కృషీ, పట్టుదలా నేటి ఇల్లాళ్లందరికీ ఆదర్శప్రాయం, సదా ఆచరణీయం.

మీనాక్షి, దేవకిల సంసారాల్లో వారి మనస్తత్వాల ఆధారంగానే, భర్తల ప్రవర్తన ఆధారంగానే కష్టాలనుభవించారు. కాని వారి వివాహాలు పెద్దలు కుదర్చటంవల్లకాదు. సంధ్య తన స్వయంకృషీ, తెలివితేటలూ మొదలైన కారణాలవల్ల సుఖపడింది కాని అమెది ప్రేమవివాహమైనందువల్లకాదు. ఈ అంశంద్వారా తేలిందేమిటంటే "పెద్దలు కుదిర్చిన వివాహమా? ప్రేమవివాహమా?" ఏది మంచిది? అనే సమస్యకు నవలలో జవాబు దొరకలేదు. నిర్ణయం పాఠకులదే. పాఠకులను ఆలోచింపచేసే ఓ సమస్యాత్మక నవల 'ఏడడుగులు'.

-పి.ఆర్.కె. మూర్తి, నెల్లూరు

## నిజంగా మార్గదర్శే

(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)

'ఏడడుగులు' నవల మధ్యతరగతి జీవితాలకు నిజంగా మార్గదర్శే. పెళ్లి గురించి రచ

కవర్ పేజీ ఫొటోగ్రాఫర్: వికీహండా

యితలు తమ అభిప్రాయాన్ని నవల మొదటి పేజీలోనే చెప్పారు. వివాహం విజయవంతం కావటానికి అవసరమైనవి అవగాహన, ఆత్మీయత. ఎదుటిమనిషి భావాల్ని, బాధల్ని గుర్తించి సర్దుకుపోవటం. సర్దుకుపోవటం అంటే బానిసత్వం కాదు. ఎదుటిమనిషి తన తప్పు తనంతట తాను తెలుసుకొని పశ్చాత్తాప పడేవరకు మాత్రమే. అది భార్యాభర్తలు శత్రువుల్లా కాకుండా స్నేహితుల్లా మెలిగినప్పుడే సాధ్యమౌతుందన్నదే ఈ నవల సారాంశం.

ఆర్థిక సమస్యలు వైవాహిక జీవితంలో ఎలా అపశృతులు పలుకుతాయో జానకి పెళ్లిసమస్యతో చక్కగా ఎత్తిచూపించారు. జానకి పెళ్ళితో నాకేమి సంబంధం అని సంధ్య అనుకుంటే ఆ సంసారం మరోకరకంగా ఉండేది. భార్యాభర్తలమధ్య అవగాహనే వారి జీవితాలని అర్థవంతం చేస్తుంది అని చెప్పిన జంట, సంధ్య-శ్రీనివాస్‌లది. అపరిపక్వ మనస్తత్వానికి ప్రతీక మీనాక్షి. ద్వేషం నుంచే ప్రేమ పుడుతుందని, ఆ ప్రేమ ఆరాధనగా మారి అది అనంతమై ఎదుటివారి స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను కూడా హరించివేస్తుంది అన్న సత్యానికి చక్కని అక్షరరూపకల్పన మీనాక్షి-రామచంద్రంల జంట.

నవలలో కొంచెం ఇబ్బందికరంగా ఉన్న పాత్ర పరమేశంది.

తులసి పరమేశాన్ని ఆరాధించిందా! ప్రేమించిందా! పెళ్లి చేసుకోవాలనుకున్నాదా! వారిమధ్య సంబంధానికి అర్థం ఏమిటి? తులసి పరమేశాన్ని పెళ్లిచేసుకోవాలనుకుంటే పరమేశం వారించి తులసి పెళ్లిచేయించాల్సింది. పరమేశం వ్యక్తీకరించిన అభిప్రాయంవలన పరమేశం తులసిని కేవలం తన శిష్యురాలిగానే చూశాడు. తులసి అవివాహితగా ఉండటానికి సరైన కారణం చూపనందువలనే పరమేశం పాత్ర అసంపూర్తిగా మిగిలింది.

సమాజంలో విభిన్న వ్యక్తుల్ని అతి దగ్గరగా పరిశీలించి, వారి మనస్తత్వాన్ని, భావాల్ని సున్నితంగా అర్థంచేసుకొని ప్రతిస్పందించిన రూపమే 'ఏడడుగులు' నవల. ఈ నవలలో మధ్యతరగతి జీవితాలు ప్రతిబింబించాయి.

మొత్తంమీద నవల పాఠకుల్ని ఆకట్టుకుంది. అనవసరమైన వర్ణనలు లేకుండా బాగుంది. కాకుంటే చిన్న చిన్న వ్యాకరణదోషాలున్నాయి. చాలా సామాన్యమైన కథావస్తువుని ఆద్యంతం ఉత్కంఠతో చదివించిన 'ఏడడుగులు' మంచి నవలగా పరిగణించవచ్చు.

-యస్. లక్ష్మీకుమారి, భీమవరం

## గతం - వర్తమానం

**(తృతీయ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)**

'వైవాహిక జీవనం విజయవంతమైనా, కాకపోయినా... కలిసి బ్రతుకుతూ యాంత్రికంగా రోజులు వెళ్లబుచ్చేవారే అధికం' అన్న చేదునిజాన్ని విశ్లేషిస్తూ వ్రాయబడ్డ నవల 'ఏడడుగులు'. పెళ్లంటే శోభనంముందు జరిగే తంతుకాదు. పెళ్లంటే 'బయోలాజికల్ నీడ్' కోసం స్త్రీ-పురుషులు ఏకమయ్యే ఓ పండుగాకాదు. భార్యాభర్తలమధ్య చక్కటి, చిక్కటి స్నేహం అల్లుకొన్న దాంపత్యమే ఫలించి పుష్పిస్తుంది. అది అటు ఎరేంజ్డ్ మేరేజెస్‌లోనూ, ఇటు లవ్ మేరేజెస్‌లోనూ సాధ్యమూ, అసాధ్యమూ కూడా అవుతూవుంటుంది - ఆయా వ్యక్తుల మానసిక పరిపక్వతననుసరించి. ఈ థీమ్ కొత్తదేంకాదు. 'కలంతిరిగిన కవు'లెందరో స్పృశించారు గతంలో. ఈ రచయిత కథనం ఏకబిగిన ఆసాంతం చదివించేలా వుండడం ముదావహం.

ఇక ప్రధానంగా చెప్పుకోవలసింది మీనాక్షి రామచంద్రాల జంటని. ఎరేంజ్డ్ మేరేజెస్ వద్దంటే వద్దన్న మీనా తప్పనిసరై రామచంద్రానికి జంటవుతుంది. అయితే ఆమె అనుకున్నట్లు అతగాడేం 'కిరసనాయిలు డబ్బా' మొగుడుకాదు, కాకపోతే పుస్తకాలు చదివీ, సినిమాలు చూసీ నరనరానా ఇంకిపోయిన 'నెగెటివ్ ఎప్రోచ్' ఆమె మనసుల్ని సరిగ్గా ఎదగనీకపోయింది. రామచంద్రం పాత్రనికూడా మరీ శ్రీరామచంద్రుని లెవెల్‌కి తీసుకుపోకపోవడం రచయిత నిపుణతకి నిదర్శనం. ఈ జంటలన్నీ బాగా చదువుకున్నవే. వ్యక్తిత్వాలు పూర్తిగా వికసించకపోవడమే వీరిలో ప్రధానలోపం.

ఎరేంజ్డ్ మేరేజ్‌లు మంచివని ఎంచుకున్న దేవకీ సుఖపడలేకపోయింది. ప్రేమతత్వంతో ముక్తిని సాధిద్దామనుకున్న మీనాక్షి సుఖపడలేకపోయింది. అంచేత సుఖమనేది పెళ్లిజరిగే విధానంలో లేదు - వాస్తవాన్ని గుర్తించగలిగిన ఏ దాంపత్యమైనా నిలకడగా నడుస్తుందని నిరూపిస్తుందీ కథ. భార్య భర్తకి మార్గదర్శిగా వుండాలితప్ప పూర్తిగా సరెండరయిపోవడమో లేక 'ఎగ్రసివ్‌టైప్'తో దుఃఖభాజనం చేసుకోవడమూ తగినదికాదని చెప్తుందీకథ. గతం వర్తమానానికి పునాది అని వివరించటంద్వారా చక్కని సందేశాన్నిచ్చారు రచయితలు. మంచికీ, చెడుకీ మధ్య కొన్ని షేడ్స్ కూడా వుంటాయని గ్రహించలేని మీనాక్షిలాటివాళ్ళు జీవితంలో దెబ్బలు తింటూనేవుంటారు.

-వ్యాకరణం కనకదుర్గ, విజయవాడ.

## మంచి నవల

*(రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

పెద్దలు కుదిర్చిన వివాహాలే మంచివన్న సంధ్యను శ్రీనివాస్ వెంటబడి ప్రేమించి పెళ్లి చేసుకుంటాడు. ఇంట్లో అత్త, ఆడబిడ్డల పోరు, భర్త ఈ సమస్యల గురించి పట్టించుకోకపోయినా ఆమె ఆదర్శవనితలా వ్యాపారము మొదలుపెట్టి ఇంట్లో సమస్యలు చక్కదిద్దుతుంది. ఇక్కడ కూడా సంధ్య భర్త శ్రీనివాస్ చాలా మంచివాడే. ఇక మూడోజంట దేవకీ-పరమేశంలను తీసుకుంటే ఇందులోనూ దేవకి భర్తను అర్థంచేసుకోలేని నిస్సహాయపాత్ర. పరమేశాన్ని గొప్ప ఆర్టిస్ట్‌గా చిత్రీకరిస్తూ అతను ఎలా భార్యద్వారా నలిగిపోతాడో చూపించి తద్వారా పాఠకుల సానుభూతి అతనికే లభించేటట్లు చేశారు.

ఈ కథలోని పాత్రలూ, వారు పలికే ప్రతి మాటా, మనం నిత్యం చూస్తున్నవే, వింటున్నవే. వాస్తవానికి చాలా దగ్గరగా, సామాజిక స్పృహతో చక్కగా నడిచింది కథ. శ్రీనివాస్ సంధ్యను 'మార్గదర్శి' అనటం బాగుంది. దేవకి పెళ్లిచూపుల్లో మీనాక్షే టీ, టిఫిన్ చెయ్యటం, అందరికీ ఇవ్వటం కొంత అసహజంగా, సౌభాగ్యలక్ష్మి పాత్రకు ఏమాత్రం ప్రాధాన్యత లేనట్లు ఉంది. కేవలం రామచంద్రంతో మీనాక్షికి అరేంజ్డ్ మ్యారేజ్ చేయటానికే రచయితలు అలా రాశినట్లున్నారు. రామచంద్రం క్యారెక్టరు మ్యాన్లీగా ఉంది.

ఏతరహా వివాహం చేసుకున్నా వారిమధ్య సరైన అవగాహన, అన్యోన్యత ఉంటే అది శ్రీనివాస్, సంధ్యల జీవితంలా ఆర్శప్రాయమౌతుంది. వారే అసలైన భార్యభర్తలు తప్ప 'ఏడడుగులు' నడిచినంతమాత్రాన కాలేరు. యువజంటలు ప్రధానంగా గ్రహించవలసిన విషయమిది. వివాహవ్యవస్థ ఎప్పుడూ పవిత్రమైనదే. నవలలోని పాత్రలూ, వాటి సంభాషణలూ సహజంగా నడిచాయి. చివరివరకూ చదివాక రచయిత ప్రేమ వివాహాల్ని కులాంతర, మతాంతర వివాహాల్ని బాగా ఎంకరేజ్ చేస్తున్నారనిపించింది. ఒక మంచి విషయాన్ని నున్నితంగా మలచిన రచయితలూ, ప్రచురించిన 'చతుర'వారూ అభినందనీయులు.

-జి.యల్.కస్తూరి, సికిందరాబాదు.

## రెండురకాల పెళ్ళిళ్లు!

*(రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

పెళ్లిలో ప్రేమపెళ్లి, పెద్దలు కుదిర్చిన పెళ్లి - అని రెండు రకాలు చెప్పి, సంధ్య, మీనాక్షిలను ఆ రెంటికీ ప్రతినిధులని చెప్తూనే, దేవకిని కూడా కలిపి మూడు ఎరేంజ్డ్ మారేజస్‌నే చేశారు 'ఏడడుగులు' నవలలో.

అయితే చివరివరకూ చదివినా రచయితలేం చెప్పదల్చుకున్నారో స్పష్టంకాలేదు. పెద్దలు కుదిర్చిన వివాహాలు 'సుఖపడవు - విడిపోవు' అనే భావనే రచనలో ఎక్కువగా ద్యోతకమైంది. ముందుతరం దూతలైన పిల్లలు ఈ ప్రేమవివాహాలు చేసుకోగలిగినట్లుగా చెప్పారే గాని వారి జీవితాలు సుఖభరితాలు అనలేదు కదా! ఏరకం వివాహ వ్యవస్థను ఎంచుకోవడమనేది పాఠకులకే వదిలేసినప్పుడు రచనాప్ర





యోజనమేమిటో అర్థంకాదు.

'వివాహం కొందరికి వరమైతే, మరికొందరికి శాపమౌతుంది' - నిజమే! కాని స్వయత్నంతో మార్చుకోలేని లేదా సాధించలేని ఇలాంటి భావనలవల్ల ప్రయోజనమేమిటి. దేవకి పూర్తిగా ఓడిపోయింది. మీనాక్షి భావాలు, ఎదుగుదల అపరిపక్వంగానే మిగిలాయి. ఇక సఫలమైన జంట సంధ్య, శ్రీనివాసుమాత్రమే. అయితే వీరిది ప్రేమ కమ్ పెద్దలు చేసిన పెళ్లిగా చూపారు రచయితలు. పరస్పర అవగాహన ఉన్న జంట ఏవిధమైన పెళ్లి చేసుకుంటేనేం గనక? - వీరిది ప్రేమవివాహమైనా ఇంతే సుఖప్రదంగా జీవించగలరు.

రెండు విధాల వివాహవ్యవస్థలలోని సాఫల్య, వైఫల్యాలు ఏమాత్రం ప్రదర్శితం కాలేదు రచనలో. అలాంటప్పుడు నవల ఆరంభంలో సంధ్య, మీనాక్షిలను రెండు రకాల -పెళ్ళిళ్లకు ప్రతినిధులుగా చేయడంలోని ఆంతర్యమేమిటో అవగతం కాలేదు.

కళాకారులకు సామాజిక సూత్రాలు పట్టవని పరమేశం, స్త్రీ సహజమైన హఠం, మంకుతనంను మీనాక్షి చాలా సహజంగా ప్రదర్శించారు. అన్నివిధాలా ఉత్తమ ఇల్లాలుగా బాధ్యతలు నెరవేర్చే మీనాక్షి తన స్వభావంతో భర్తకు తలనొప్పిగా పరిణమించడం సహజంగా ఉంది.

నవల ప్రారంభంలో వివాహాన్ని గురించిన వ్యాఖ్య, మానవ సంబంధాలను ఆర్థికపరమైనవిగా విశ్లేషించడం చాలా విజ్ఞానాత్మకంగా, ఆలోచనా ప్రేరకంగా ఉన్నాయి. ప్రారంభించిన అంశానికి సరైన ముగింపు, చెప్పదల్చుకున్న విషయానికి స్పష్టమైన రూపు ఏర్పడకపోవటం ఈ నవలలోని లోపం.

-ఆర్.లక్ష్మీకుమార్, సి.మల్లవరం.

## మరచిన సత్యం...!

*(రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

స్త్రీస్వేచ్ఛ, సమానత్వం, ప్రస్తుత పరిస్థితులు గురించి మొదలైన 'ఏడడుగులు' నవల పోను పోనూ దారిమార్చి సంసారాలు దారితప్పటం లేదా బాగుపడటం స్త్రీవలనే అని నొక్కిచెబుతోంది. కుటుంబం బాగుపడటం లేదా చెడిపోవటం అనేవి ఒక్క స్త్రీ బాధ్యతే కాదు, పురుషుని బాధ్యతకూడా! ఆ సత్యాన్ని మరిచారో లేక ఈ పురుషాధ్యికతా ప్రపంచంలో పురుషులందర్నీ మంచిగానే చూపించాలన్న సదాశయమో అర్థంకాదు.

ప్రేమ వివాహాలే మిన్న అనే అభిప్రాయంగల మీనాక్షి పెద్దలు కుదిర్చిన వివాహాన్నే ఇష్టంలేకపోయినా చేసుకోవాల్సివచ్చింది. పెళ్లికొడుకు రామచంద్రాన్ని పూర్తిగా భర్తగా అంగీకరించకపోయినా ఫీజుకట్టటం, పుస్తకాలు కొనివ్వటం భర్త బాధ్యత అనే ఈమెగారి నమ్మకం. ఇక అతను ఇలా ఫీజు కట్టటం ద్వారా ప్రేమ మొదలై అతని స్పర్శ ఆమెను పెద్దలు కుదిర్చిన వివాహమే మంచిదేమోనన్న అభిప్రాయానికి వచ్చేటట్లు చేస్తుంది. నెమ్మదిగా భర్తపై అనుమానపడటం, ఆంక్షలు పెట్టటం మొదలుపెడుతుంది. ఇంతకీ మొదటినుంచి మీనాక్షి భర్త పేరుకు తగ్గట్టు సహనంగా భార్యను భరించే మంచి మనిషి.

పాతికేళ్ల తరువాత మీనాక్షిని తండ్రి, కొడుకులు విసుక్కోవటం, సంధ్యను వారి పిల్లలు పొగడడం ఇదంతా ముందే వారిని చిత్రీకరించిన తీరువలన తెలిసిపోతుంది. ఈ నవల ద్వారా ఏమి చెప్పాలనుకున్నారోగానీ ప్రేమ వివాహాలు మంచివా, పెద్దలు కుదిర్చిన వావాహాలు మంచివా అన్న విషయంమాత్రం కడవటికి తేలనేలేదు. సంసారంలోని ఎలాంటి సమస్యలకూ, బాధలకూ స్త్రీలే కారణమనీ, సంసారాలు బాగుపడటం, దారితప్పటంలో స్త్రీదే బాధ్యత అనీ, పురుష ప్రపంచమంతా స్త్రీలవల్లనే బాధపడుతోందనీ ఈ నవల చెబుతోంది. స్త్రీలకు ఆత్మగౌరవం, ఆత్మవిశ్వాసంతోపాటు తమకాళ్ళపై తాము నిలబడటం అవసరమైన ఈ కాలంలో ఆ శక్తినిచ్చే మరింత మంచి రచనలు రావాలని ఆశిస్తున్నాను.

-బి.కిరణ్‌కుమారి, తిరుపతి.

# చతుర

సంపుటి: 14 సంచిక: 6 జూలై 1991

మేం యువకులం- మాది యువ'కులం'! తొడిగే మారాకులం- విరిసే పూరేకులం!! అంటూ సాగే యువకవి కోకిల కూజితాల మాటెలా ఉన్నా నేటి విద్యాలయాల్లో కులాలూ, మతాలూ, రాజకీయాలు విజృంభించి విద్యార్థుల్ని బలవంతంగా లొంగదీసుకుంటున్నాయి. స్కూలు వదిలి కళాశాలలో అడుగుపెట్టినరోజున ఆ కల్తీ వాతావరణాన్ని చూసి గుబులుపడే విద్యార్థులు క్రమంగా రాటుతేలి అభిమాన తారల సంఘాలూ, ఎన్నికల నిర్వహణలూ, నాయకులకు మద్దతులూ అంటూ తమ అమూల్యమైన కాలాన్ని వృథాచేస్తున్నారు. పరస్పర దూషణలు, దొమ్మీలు చేసుకుంటూ రౌడీయిజానికీ, గుండాయిజానికీ మారుపేరుగా మారిపోతున్నారు- కొందరు సమస్యలకి మూలకారణమైతే మరికొందరు సమస్యల బాధితులవుతున్నారు.

చదువులంటే పెదవి విరిచే సరదాజీవులూ, పుస్తకమే సమస్తమనే చాదస్తపు యువకులూ, ఉద్రేకంతో ఉనికిని మరిచే ఆవేశపరులూ... ఇలా విద్యార్థుల్లో అనేకరకాలు...

ఈ స్థితిలో ఎటుపోతున్నామో తెలియక కొట్టుమిట్టాడుతున్న విద్యార్థులకు ఈనాడు నిజంగా ఏంకావాలి? చదువుకొంటున్న తమ పిల్లలపట్ల తల్లిదండ్రుల ప్రవర్తన ఎలా ఉండాలి? అధ్యాపకుల బాధ్యతలేమిటి?

నేటి విద్యావ్యవస్థ, సంక్షేమహాస్టళ్ళ అసలురంగు బయటపెడుతూ, కులరాజకీయాల వైఖరిని ఎండగడుతూ, వీటికి బలవుతున్న అమాయకుల ఆక్రందనలను సవివరంగా చిత్రించిన

'విద్యార్థి' రచన

## తొలిపిడుగు

ఈ నెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్ర నవల.

Bhaskar.K

కాలేజ్ ఆవరణ సందడిగా ఉంది. నవ్వులూ, పలకరింపులూ, వ్యంగ్యబాణాలు, వెక్కిరింతలూ వినిపిస్తున్నాయి.

ప్రభు సరిత ప్రక్కనే నడుస్తూ ఇంగ్లీషు జోకులు వేస్తున్నాడు. అతడు తెలుగు రానట్లు నటిస్తాడు. వెనకే అనుసరిస్తున్న వేణు ఆ ఇద్దరి మధ్య దూరేందుకు ప్రయత్నిస్తూ తనూ ఇంగ్లీషులో వాగ్ధాటి ప్రదర్శిస్తున్నాడు.

అందుకు ప్రభు అవకాశం ఇవ్వటం లేదు.

వేణు లోపల పళ్ళునూరు కొన్నాడు.

వేణు అవస్థ గమనించి నవ్వుకొంది సరిత.

ఆమె అందరితోనూ చనువుగా వుంటుంది. అది అపార్థం చేసుకొనేవాళ్ళే ఎక్కువ. అందులో వేణు మరింత ముందుకు పోయి ఆమె దృష్టిలో పడేందుకు ప్రయత్నిస్తుంటాడు ఎప్పుడూ.

అది గమనించి కొంచెం దూరంగా ఉంటోంది సరిత.

అయినా అదేం పట్టలేదతనికి. తనగోల తనదే.

అతడి మాటల్లో ఇప్పటికి వందసార్లు "సుపర్బ్ మూవీ...ఎక్సలెంట్... వావ్... మాక జిన్ డెల్హీ ఐ.ఐ.టీ.లో...నూ పెదనాన్నగారి అల్లుడు బాబాయి మూడోకొడుకు ఐ.ఏ.ఎస్ వగైరాలు దొర్లాయి.

చెప్పొద్దూ... ఇంగ్లీషులో అతను మంచి వక్త. అలా అని తప్పులు లేవనుకొంటే పొరపాటు. వ్యాకరణ దోషాలకీ వక్తృత్వానికీ సంబంధం లేదు. ముఖ్యంగా వినేవాడికి ఇంగ్లీషు రాకపోతే సరి. ఎన్నితప్పులున్నా ఉచ్చారణకీ ప్రవాహం లాంటి సంభాషణకీ ఎవరూ గుర్తించి వేలెత్తి చూపలేరు.

పోటీగా ప్రభుకూడా ఏదో ఇంగ్లీష్‌పదాల కూర్పులో నైపుణ్యత ప్రదర్శిస్తున్నాడు. తెలుగులో అయితే ఇలా అంటున్నాడు.

"ఈ సూర్యం చూశారూ! ఒట్టి టిమిడ్‌ఫెలో. మొన్న సూర్యంగాడిని కొట్టి పారిపోయిందెవరో తెలుసా? పాత మిత్రులే! అంటే ఒకప్పటి పరిచయస్థులు. 'హలో! అన్నా' అంటూ రానుకు తిరిగేవాళ్లే ఆరోజు సూర్యం రూంకొచ్చి సారీ అన్నా అని తల పగలగొట్టారు. ఆ నర్సిమ్మగాడు తెల్లారి హాస్పటల్లో చేర్పి కట్లు కట్టించి సారీ చెప్పాడట.

టి.జె.కాలేజ్‌వార్డన్ ఆ పనిమీద పంపించాడనీ అలా చెయ్యక తప్పలేదనీ అన్నాడట. మిత్రత్వానికీ కర్తవ్యానికి సంబంధం లేదు. దేనికదే అన్నాడట. ఎందుకంటే తలలు పగలకొట్టటం వాళ్ళవృత్తి. ఆ కర్తవ్యం నెరవేర్చక తప్పదు గదా!. ఆ టీ.జె.కాలేజ్ హాస్టల్లో వేలుపెట్టాడీ సూర్యం. స్కాలర్‌షిప్పులు సవ్యంగా ఇవ్వాలని ఏదో గొడవ చేయించాడు కాబోలు. సరే ఇంత అయినా ఆ వార్డెన్‌తో రాజీ పడ్డాడట చివరికి. టిమిడ్ ఫెలో" అన్నాడు ప్రభు.

"రాజీనా?" ఆశ్చర్యంగా అడిగింది సరిత.

"అదేలెండి. సాధ్యమయినంతవరకూ కలుపుకుపోదామని చూస్తున్నాడు సూర్యం. అవతలి వాడిబలం మర్చిపోగూడదుగదా! నర్సిమ్ముతాని ఎగదోలినా ఆవార్డెన్ కూడా ఇప్పుడు కొంత తగ్గాడు. ఊళ్లో సూర్యం తాలూకావాళ్లకి పలుకుబడి ఉంది. వాళ్లనాన్నగారు ఆస్తిపరులు. ఎంత కాదనుకున్నా తల పగిలినందుకు, అందునా కన్నకొడుకుది... ఆయన ఊరుకోడు కదా! ఆ రకంగా ఆ వార్డెన్ ఇప్పుడు భయపడుతున్నాడు. దానికితోడు స్కాలర్‌షిప్పుల గోల్‌మాల్ బయటకు వచ్చే అవకాశం ఉందనేది ఒకటి. మొత్తానికి సూర్యాన్ని మంచి చేసుకోవాలని బుద్ధిగా ప్రవర్తించుతున్నాడిప్పుడు. అలా నటిస్తున్నాడనుకోవచ్చు. దెబ్బలు తిన్నా సూర్యమే గెలుస్తాడు" అన్నాడు వేణు.

తమ మాటల్లో పాత్రధారి అయిన సూర్యంకోసం సరిత కళ్లు వెతికాయి. దూరంగా చెట్టుకానుకొని పుస్తకంలో ఏదో రాస్తున్నాడు అతడు. పక్కనే ఎవరో జూనియర్ ఒకతను అతడితో సంభాషిస్తున్నాడు. రాస్తూనే అతడికేదో చెప్తున్నాడు సూర్యం.

"ఏదో మేధావి ఫోజు ఇస్తాడుగా! మొన్న ఫోర్సిత్ బుక్ ఏదయినా చదివారా? అనడిగా. చెప్పొచ్చుగా. రాబర్ట్‌స్మల్లర్. అయాన్‌రేండ్. ఎలక్స్‌హెలీ... కాడ్వెల్... అంటూ ఓ పెద్ద క్లాసిచ్చాడు. ఉత్త ఇడియాటిక్ అయిడియాలజీ అంటే నమ్మండి. ఈస్థటిక్ వాల్యూస్ నిల్" అన్నాడు ప్రభు.




"ఓరీ... పండిత పుత్రా.... ఫోజులు కొట్టకు. నీకు తెల్సింది ఛేజ్, షెల్డాన్‌లేగా! ఆ పుస్తకాలే కూడబలుక్కొని చదివి ఉంటావు. ఒక్కొక్కటి నెలరోజులపాటు. అసలు ఈస్థటిక్ అంటే అర్థం తెలుసా అని" లోలోనే అనుకొని పైకి మాత్రం తల ఊపుతూ ఊ! కొట్టింది సరిత.

జియాలజీ క్లాసు ఖాళీ అయింది, లెక్చరర్ రానందువల్ల. వాళ్లుకూడా వచ్చేస్తున్నారు.

ఇంతలో రవళి సిగ్గుపడుతూ వచ్చి సరితనే దో అడగబోయింది. రవళిమీద జోక్ చేస్తూ మనోహర్ వచ్చాడు. "ఇదో పిచ్చిమేళం. ఊరు కుంటావేం రవళీ... మొన్న రామకృష్ణకి ఏదో నిక్‌నేమ్ పెట్టావుగా. ఇప్పుడు కిక్కురుమ నవేం?" అంటూ గుంపులో కలిసింది భానూ.

"అయ్యబాబోయ్ నిక్‌నేమా? నాకే... ఏమిటో అది. ప్లీజ్! రవళిగారూ చెప్పరా" అంటూ ఆటపట్టిస్తున్నాడు మనోహర్. అతడి పూర్తి పేరు రామకృష్ణ మనోహర్.

"భానూజీ! మీరు ఆ మోడరన్ డ్రెస్సుల కంటే ఈ సాంప్రదాయక దుస్తులలోనే అందంగా యుండెదరు" ఇంగ్లీషులో కాంప్లి మెంట్ ఇచ్చాడు ప్రభు.

"థాంక్స్!"

ఇంతలో అనిల్ వచ్చాడు. తెల్లపాంటులో చెక్స్ షర్ట్ టక్‌చేసి ఠీవిగా వచ్చాడు. ఎక్కువ మంది మెచ్చుకోలుగా చూశారు. రవళి ఆరాధ నగా చూసింది. ప్రభు అసూయగా, మనోహర్ అశాంతిగా చూశారు. చూపులతోనే భావాల్ని కనిపెట్టగలవాడు కాబట్టి రవళివైపు ఓరచూపు చూశాడు అనిల్. రవళి చూపులు తిప్పుకొంది.

చూపుల ప్రసహనం ఆగేట్లులేదు.

సరితమాత్రం ఇదేం గమనించకుండా పర ధ్యానంగా గుంపులోంచి బయటపడి సూ ర్యంవైపు అడుగులేసింది.

సూర్యం జూనియర్‌కి ఏదో చెప్తున్నాడు. దగ్గరగా వెళ్లింది సరిత.

"సమకాలీనత అంటే ఇప్పుడు జరిగే విష యాలు ఉన్నవి ఉన్నట్లు చెప్పటం. ముఖ్యంగా రచయితలలో ఎక్కువగా కనబడుతుంది. జే బులుకొట్టి, తప్పతాగి భార్యను తన్నేవాడి మీదా... దుర్వ్యసనాలకు బలిఅయ్యే శ్రామికు లమీదా రాస్తూ, 'ఈ శాస్తి జరగాల్సిందే... ఈ స్వభావం తోటే వీళ్లు పేదరికంలో ఉన్నారు' అని చెప్పటం సమకాలీనతను ప్రతిబింబించ వచ్చు. కానీ సామాజిక కారణం వేరు. గత చరిత్ర ఆధారంగా వర్తమానాన్ని పరిశీలించి భవిష్యత్తును ఆవిష్కరించేబాధ్యత రచయిత లది. ఇది చేయలేనివాళ్లు విశాలదృక్పథం లేని వాళ్లు ఓ వెలుగు వెలిగినా ఆ సాహిత్యం నాలుగు కాలాలపాటు నిలబడిలేదు.

"పెళ్లి ద్వారా స్త్రీ స్వేచ్ఛను కోల్పోతుంది కాబట్టి పెళ్లే తప్పు. పెళ్లికి కట్టుబడి ఉండటం అనవసరం" అంటున్న కొత్తవాదనలు సమకా లీన సత్యాన్ని చూపుతాయి తప్ప సామాజి కంగా పెళ్లి రూపంలో వచ్చిన మార్పు. అంటే వావివరుసలు లేని దశనుండీ విశృంఖల శృంగారం మీదుగా బహుభార్యత్వం దాటి ఒకే స్త్రీ ఒకే పురుషుడు దశకు చేరుకున్న పెళ్లిని అర్థం చేసుకోవటంలేదన్నమాట. ఈ పెళ్ళే వద్దంటున్నామంటే స్త్రీపురుష సంబంధాల్లోని అభివృద్ధిని కాలదన్ని చరిత్రని వెనక్కి తిప్పా లనుకొంటున్నాం అన్నమాట.

అందుకే నువ్వు కథలు రాసేప్పుడు కొంత అధ్యయనం చేయాల్సిన అవసరం ఉంది. నలుగురికీ ఏదో చెప్పాలన్న కోరికతో రాస్తా నంటున్నావు గనుక ఆ చెప్పేది సరిగ్గా ఉండే ట్లు చూసుకో. అది రచయితల బాధ్యత. ముఖ్యంగా సమస్యని వర్ణించటంతో సరిపెట్టక పరిష్కారాన్ని సరిగా ఉండేట్లు చూపించాలి" అని వివరిస్తున్నాడతడు.

సరితవైపు చూసి చిన్నగా నవ్వి ఆ జూని యర్‌ని పంపేశాడు సూర్యం.

"క్లాసులేదా" అడిగాడు.

"లేదు... నేను నీతో కొంచెం మాట్లాడాలి. సూర్యం నీకిప్పుడు వీలవుతుందా? నీకేం క్లాసు లు లేవూ. లేకపోతే అలా వెళదాం" అంది సరిత.

"క్లాసు ఉంది కానీ, నాకూ వేరేపని ఉంది. ఈ రోజు ఇంటర్ మీడియట్ వాళ్ళ ఇంటర్ వ్యూలు జరుగుతున్నాయి. వాళ్ళకి ఇదే కొత్త విద్యా సంవత్సరం. కొత్త వాతావరణం. ఇంకో పది రోజుల్లో వాళ్లకి క్లాసులు మొదలవుతాయి.

దానికి సంబంధించి కొంచెం పనిమీద అలా వెళ్తున్నాను. నువ్వు ఇంటికేగా, దారిలో మాట్లాడుకుందాం''

''సూర్యం... నాకు... ఈ సంవత్సరం పెళ్లి నిశ్చయించారు'' నెమ్మదిగా అంది సరిత.

''అరె! ఇంత త్వరగానా... ఇంకా చదువు పూర్తవలేదు. నీ కాళ్ళపై నువ్వు నిలదొక్కుకోలేదు. ఇంత చిన్నవయసులో పెళ్ళేమిటీ?''

''ఇంట్లో పరిస్థితి అలాఉంది. నాన్నగారి రిటైర్‌మెంట్ దగ్గరకొచ్చింది. ఆర్థికస్థితి ఏమంత బాగాలేదు. ఆయన రిటైర్ అయ్యేలోగా ఇది చెయ్యాలని ఎప్పటినుంచో అనుకుంటున్నదే. ఆయనేమన్నారో తెలుసా సూర్యం... ఏ బాధ లేకుండా నిశ్చింతగా నన్ను వేరే వాళ్ళ సంరక్షణలో ఉంచుతున్నారట. అతను నాన్నగారి స్నేహితుడి కొడుకేనట, మంచివాడట. ఇంత కాలానికి తన కల నిజమయ్యే అవకాశం వచ్చిందిట! కానీ... కొంతకాలం కనీసం చదువు అయ్యేవరకైనా ఆగితే బావుండేదేమో''

''పోనీ... నాన్నగారితో నేను మాట్లాడి చూడనా? అతడూ మంచివాడే అంటున్నావుగా! అర్థంచేసుకుంటాడు''

''వద్దు... వద్దులే సూర్యం. ఎలాగూ ఇంతవరకూ వచ్చింది ఇక ఆపటం అనవసరం. ఎందుకో నీకే ముందు ఈ వార్త చెప్పాలనిపించింది. ఇంకా మనవాళ్ళకెవరికీ చెప్పలేదు'' అంది అభిమానంగా చూస్తూ.

సూర్యంపట్ల ఆమెకి ఇష్టం ఉంది. అతడి కార్యనిబద్ధత... అనుకున్నవి చేయటం... నమ్మిన దానికోసం ఎలాంటి కష్టానికైనా సిద్ధపడటం... హిపోక్రసీ లేకపోవటం... కానీ ఇదే అని చెప్పలేని ఇబ్బంది. అతడితో ఎక్కువ కాలం కలిసి ఉండటం కష్టం. అంటే పెళ్లీ... జీవితాన్ని పంచుకోవటం ఇవి కాదు. మామూలుగానే స్నేహం చేయటం కూడా కష్టం.

అతడిలోని నిబద్ధత ఒక తేజోవంతమైన శిఖరమై దరిచేరనీయదు. కొంత కాలంగా అతడికి తన ఇంటిలోనుంచే కష్టాలు మొదలయ్యాయి. తోటి విద్యార్థులను కూడగడుతున్నాడనీ నలుగురి దృష్టిలోకి ఎక్కుతున్నాడనీ తెలిసి ఇంట్లో తండ్రి తీవ్రంగా మందలి చాడు. కానీ ఇతడు ఏమీ మారలేదు. పర్యవసానంగా తండ్రి అతడితో అంటీముట్టనట్లుగా ఉంటున్నాడు. కొడుకుని పట్టించుకోవటంలేదు. మొన్నీమధ్యజరిగిన కొట్లాటలో సూర్యంకి దెబ్బలు తగిలినా ఆయన చూసి పోవటానికి కూడా రాలేదు. నన్నడిగి ఇందులో దిగావా? ఇప్పుడు నేనొచ్చి పట్టించుకోవటానికి? అన్నది ఆయన ప్రశ్న. అయినా సూర్యం తండ్రి సహాయాన్ని ఆశించకుండా స్వతంత్రంగా నిలబడటానికి ప్రయత్నిస్తున్నాడు. అతడిలా అంత మొండిగా తను నిలబడలేదు. పోనీ అంటే వెనుకే ఉండి సాయం చేయనూలేదు.

అతడితో కలిసి కనబడితేనే తన మిత్ర బృందం చెవులు కొరుక్కుంటూరు. వేరేగా కాదు, ఒకలాంటి భయంతో. వాళ్ళ భద్రతని సూర్యం ఇమేజ్ చెదరగొడుతుంది. వాళ్లదాకా ఎందుకు తనకీ అదే ఇబ్బంది. మధ్యతరగతి మనస్తత్వం.

''పెళ్లికి తప్పక రావాలి. వస్తావుకదూ!'' అంది ఆలోచనల్ని ఆపేస్తూ.

సూర్యం తలూపాడు. ఎందుకో అతడూ పరధాన్యంగా ఉన్నాడు.

''సరే మళ్లీ కలుస్తాను. ఇంటికి వెళ్లావా తర్వాత కూడా చదువు కొనసాగించటానికే ప్రయత్నించు. సమాజం గురించి ఈ చదువులేం చెప్పకపోయినా నీకు కొంత వ్యవధి దొరుకుతుంది. ఇల్లే ప్రపంచం అనుకోకుండా ఆ వ్యవధిలో ఎంతోకొంత ఎదిగి పరిపక్వత సంపాదించు. నిన్ను నువ్వు అర్థంచేసుకో. ఈ సమాజాన్ని అర్థంచేసుకో. అని ఒక కవి అన్నాడు. మనం ఇంకా మననే అర్థంచేసుకోలేదు. మన చుట్టూ వున్నవాళ్లనీ అర్థంచేసుకోలేదు. నీకయితే ఈలోపే వేరే వ్యక్తి జీవితంలో ముడిపడబోతుంది. సాధ్యమయినంత వరకూ అతడిని అర్థంచెసుకుంటూ నిన్ను నువ్వు అర్థంచేయించుతూ సహజీవనం సాగించాలి. పెళ్లికి ఇంతకంటే గొప్ప అర్థంలేదు. పెళ్ళిలోకెల్లా ఉన్నతదశ ఏమిటంటే మీ ఇద్దరూ సమాజాన్ని అర్థంచేసుకొని సమాజంలోని కదలికలకు స్పందిస్తూ మీవంతు మీరు కృషి చేయటం-

నాకు తెలిసి ''ప్రేమ'' అని ఇప్పుడు మనం

అనుకొనేదంతా సంకుచిత అర్థంలోనే వాడుతున్నాం. ప్రేమ అంటే కేవలం ఇద్దరు వ్యక్తులకు సంబంధించినది మాత్రమే కాదు. ప్రేమకు పునాది సమాజంలోనుండే వస్తున్నది ప్రేమ సమాజ పరిణామంతో ముడిపడే ఉంటుంది. సమాజం మారేదశలో ప్రేమ స్వభావం కూడా మారుతూ ఉంటుంది. మరి ఇప్పటి సమాజం ఎలా ఉందో మన ప్రేమలూ పెళ్లిళ్లూ అలానే ఉంటాయి. ప్రేమకూడా ఎదగాలంటే సమాజామూ ఎదగాలి. అలా నీకూ, పెళ్లికీ, ప్రేమకీ, సమాజానికి విడదీయలేని సంబంధం ఉంది. ఆ సంబంధాన్ని నువ్వు అర్థంచేసుకోటానికి ప్రయత్నించు. టైం అవుతోంది వస్తానూ''

అతడు మెయిన్‌రోడ్డు ఎక్కి వడివడిగా నడవసాగాడు. సరిత అతడినే చూస్తూ ఉండిపోయింది.

ఇంతలో క్లాసులు ఎగ్గొట్టి వెళ్ళేవాళ్లెవరో కేకేస్తే వాళ్లతో కాసేపు మాట్లాడి ఇంటివైపు నడిచింది. మధ్యాహ్నం తనని చూసి వెళ్లటానికి పెళ్ళి వాళ్ళు వస్తున్నారు. పెద్దలు ముందే నిశ్చయించుకున్నారు. ఇప్పుడు ఫార్మాలిటీ కోసం పెళ్లికొడుకు వచ్చి చూస్తాడు.

ఇంట్లో తండ్రి ఎదురు చూస్తున్నాడు. ఆయన ఒక స్కూల్లో టీచరుగా పనిచేస్తున్నాడు. మరో సంవత్సరంలో రిటైర్‌మెంట్ ఉంది. సరిత చిన్నపిల్లగా ఉన్నప్పుడే భార్య చనిపోయింది. మగవాడయ్యుండీ తల్లిగా మారి తానే సరితని పెంచాడు. మళ్ళీ పెళ్ళి గురించి ఆలోచించే ప్రయత్నం కూడా చేయలేదు. అందుకే రాఘవయ్య మేష్టారంటే అందరికీ గౌరవం.

కాలేజ్‌కెళ్లేముందు వంటచేసి వెళ్లిపోతుంది సరిత. కాఫీ టీలు మాత్రం ఆయనే పెట్టుకుంటాడు.

సరిత వెళ్లేసరికి ఆయన అదేపనిలో ఉన్నాడు.

''నేను పెట్టిస్తా- ఆగు నాన్నా! ఫ్రెండ్స్ కనపడితే మాట్లాడి వస్తున్నాను. సూర్యం లేడూ... అతనకి చెప్పాను పెళ్ళి సంగతి. ఏమన్నాడో తెలుసా!'' స్టవ్‌మీద పాత్రను దించుతూ అంది.

''ఏమన్నాడూ''

సూర్యం గురించి తెలుసు సరిత తండ్రికి అతడంటే మంచి అభిప్రాయమే ఉంది.

''చదువు మాత్రం మానేయవద్దన్నాడు''

వంటింట్లోకి ఒక కుర్చీ తెచ్చుకొని కూర్చున్నాడు ఆయన.

''ఏంటో తల్లీ. మనం మాత్రం మానేయ్యాలనుకోవటం లేదుగా. పెళ్ళియిందంటే ఇక అతడి ఇష్టమే. చదవమంటే చదవాలి. వద్దంటే మానేయాలి. మన చేతుల్లో లేదు'' నిట్టూర్చాడాయన. సరితకి చదువుకోవాలని ఎంత తీవ్రమైన కోరిక ఉందో తెలుసాయనకి. చిన్నప్పటి నుండీ ప్రతి క్లాసలోనూ ఫస్టొచ్చేది మార్కుల్లో. ఇహపై ఆమె ఇష్టాఇష్టాలకు ప్రాముఖ్యత లేదు. కాబోయే భర్త ఇష్టమే చివరిది.

సరితకి దిగులుగా ఉంది.

ఆడ పిల్లల చదువుని తల్లిదండ్రులే నిర్ణయిస్తారు. ఇప్పుడు కాబోయే భర్త తనని నియంత్రించబోతున్నాడు. తన స్నేహితురాళ్లనయితే అన్నలూ, తమ్ముళ్లూ కూడా శాసించటం చూసిందామె. మారుతున్న సమాజంలో ఇవి మాత్రం ఇంకా మారలేదు.

ఇప్పుడిప్పుడే అందరూ చదువుని మెచ్చుకుంటున్నారు. చదివే వాళ్ళకి విలువ ఇస్తున్నారు. ఎవరయినా అభ్యంతర పెడితే అది చదువు గురించి కాదు చదివే పరిస్థితి గురించి.

ఖర్చులూ, కాలేజ్‌లో మగపిల్లల దౌర్జన్యాలూ, విద్యార్థిని కారీర్‌పై బురదచల్లటమూ, మగ లెక్చరర్ల ద్వంద్వార్థపుమాటాలూ ఇలాంటివెన్నో ఆడపిల్లల చదువుకి అడ్డుగోడలవుతున్నాయి.

ఆ మధ్యన ఒకసారి ఓ ఉమెన్స్ కాలేజ్ హాస్టల్ గురించి పుకార్లులేచాయి. జిల్లా మొత్తం గుప్పుమంది ఆవార్త. సెకండ్ షో చూసి వెళ్తున్న ఒక యువకుడిని హాస్టల్‌లోకి లాక్కుపోయి ఆడపిల్లలు అత్యాచారం చేశారట. ఎక్కడ బయట పడుతుందో అని అతడిని చంపి రోడ్డు పక్కన పడేశారట. ఇక లోకానికి కావల్సినంత మేత.

ఆ సంవత్సరం ఎవరైతే ఆ హాస్టల్‌లో




ఉన్నారో ఆ ఆడపిల్లలు ఇంటా బయటా, పై చదువుల్లో, చదువయ్యాక ఇంటర్వ్యూల్లో, ఉద్యోగాల్లో, పెళ్ళిచూపుల్లో, పెళ్లాయ్యాక అత్త వారింట్లో, ఆ సంఘటన గురించిన ప్రశ్నలకు గురయ్యారు. ఆ అత్యాచారం వాళ్లే స్వయంగా చేసినట్లు అనుమానపు చూపులూ... వెకిలి మాటలూ... భర్తల సూటీపోటీ మాటలూ ఎదు ర్కోవాల్సి వచ్చింది.

ఆ సంఘటన గురించిన నిజానిజాలు ఎవరూ పట్టించుకోలేదు.

ఎందుకంటే విషయం ఆడపిల్లలకు సంబంధించింది. అమ్మాయిలు అత్యాచారం చేయటం గురించినది. మగవాడు అత్యాచారా నికి గురవటానికి సంబంధించినది.

ఇప్పుడు ఆ హాస్టల్‌లో ఎవరూ చేరటంలే దు. అది మూతపడింది.

అసలా కాలేజీలో చేర్పించటానికే తల్లి దండ్రులు ఇష్టపడలేదు.

"ఫలానా కాలేజీలో చదువుతుందట. అవ్వ" అని అమ్మలక్కలు బుగ్గలు నొక్కు కుంటూ, చేతులు తిప్పుకుంటూ అయిదారేళ్ల తర్వాత ఇంకా ఇప్పటికీ కూడా చెప్పుకుంటు న్నారు. ఆ కాలేజ్ అమ్మాయిలు రోడ్లమీద నడుస్తుంటే వెనకాల కావలసినన్ని వెకిలిమాట లు వినవస్తుంటాయి.

ఇప్పుడా కాలేజ్ అంటేనే నవ్వులాటగా తయారయింది.

ఇప్పుడు తనకి అలాంటి స్థితే ఎదురవు తుందా? అతడు ఎలాంటివాడు. తన భావాల కీ, ఆదర్శాలకీ విలువిస్తాడా? పెద్దవాళ్లు ఇంత కుముందే ఒక నిర్ణయానికి వచ్చేశారు. ఇక తమవంతు. తమవంతు అనుకోవటమేగానీ తనవంతు ఏమీలేదు. అతడి నిర్ణయమే చివ రిది. అతడి మాటే ఇక ఆదేశం. శాసనం.

పాతమిత్రులు, కొత్త మిత్రులూ ఎందరో... అందర్నీ వదిలేసి చదువు మానేయాలంటే బాధగా వుంది సరితకి.

అప్పుడే... అతడేమీ అనకుండానే... విపరీ తంగా ఆలోచిస్తున్నానా అని సర్దిచెప్పుకుంది.

అగ్నిపరీక్షలా ఉంది ఆమెకి. ఏం జరగబో తోంది?

★ ★ ★

అగ్నిపరీక్షలా వుంది రవికి. ఏం జరగబో తోంది? ఈ ఇంటర్వ్యూ పద్మవ్యూహంలా వుంది. తనొక్కడే దాంట్లోకి ప్రవేశిస్తున్నాడు. ఇంతకుముందయితే తెలుగు టీచర్ రఘుప తిరావుగారో, ఎన్సైన్స్ టీచర్ శర్మగారో తనని నడిపించేవారు. ఇప్పుడు వాళ్లు లేరు. వెనక వుండి ధైర్యం చెప్పేవాళ్లూ లేరు.

మరోసారి ప్రిన్సిపాల్ గదివైపుకు చూశాడు.

ఆ గదిముందున్న పొడవాటి వరండాలో బెంచీలమీదా, బల్లలమీదా చోటు దొరకనివా ళ్లు ఇంకా చెట్లకింద నిలబడీ, కూర్చొనీ హడా విడిపడుతూ నిశ్శబ్దంగా వున్నారు. పిల్లలూ, తల్లిదండ్రులూ.

ఆ నిశ్శబ్దమే భయపెడుతుంది. లోపల నుండి పిలువురాగానే ఒక్కో విద్యార్థి, తోడుగా తల్లిదండ్రులూ వెళ్తున్నారు. ఎక్కువగా తండ్రులూ, మామయ్యలూ అన్నలూ ఉన్నారు. బాగా చదువుకున్న కుటుంబాలనుండీ మాత్రమే ఒకరిద్దరు తల్లులు కూడా వచ్చారు.

ఇది ఇంటర్‌మీడియట్ ప్రవేశపరీక్ష దినం.

రాతపరీక్ష లేదుగానీ టెంత్ మార్కుల్నీ బట్టీ, ఏ గ్రూపులో చేరాలనుకునేదాన్నిబట్టీ, లోపల ఇంటర్వ్యూ జరుగుతోంది.

చాలామందికి లోపల వణుకు పుడుతోంది. పెద్దవాళ్లు ధైర్యం చెప్తున్నా వాళ్లకీ ఆందోళన గానే వుంది. సీటు దొరకకపోతే ఇక ముప్పుతి ప్పలు పడాలి. హడావుడిగా ఏ ఇతర ప్రాంతంలోనో దరఖాస్తులు పెట్టి ఆ దూరప్రదే శాల్లో బిడ్డల్ని చదివించాలి. ఖర్చూ, కష్టమూ భరించినా వీళ్ల చదువేమవుతుందో తెలీదు.

పదవతరగతిలో మెరిట్‌ని బట్టి సీటు ఇస్తు న్నారు. ఇంటర్‌లో సైన్సుగ్రూపు కావాలంటే టెంత్‌లో ఎక్కువ మార్కులు వచ్చివుండాలి. వాటికి ఎక్కువ డిమాండ్. అరవయ్ శా తంకంటే ఎక్కువ వుంటేనే సీటు దొరికే అవ కాశం వుంది.

రవికి యాభైఅయిదుశాతం వుంది. ఎంపీ సీ ఇంగ్లీషు మీడియంలో చేరదామనివుంది. తీరా చూస్తే తెలుగుమీడియంలో కూడా వచ్చే

ట్లు లేదు. ఏ సియీసీనో, హెచ్‌యీసీనో దొరికే ట్లుంది.

"ఏమో సియ్యీసీలో అయినా దొరుకు తుందో లేదో?" అని పెదవి విరిచాడు తండ్రి జగన్నాథం.

ముల్లుతో పొడిచినట్లు బాధపడ్డాడు రవి. మార్కులు సరిగ్గా రానందుకే తండ్రి చీద రించుకుంటున్నాడు. ఈ సీటు కూడా దొరక్క పోతే ఇక తను మొహం చూపించలేడు. అక్కడికీ తను బాగానే చదివాడు. స్కూల్లో ఎప్పుడూ ఫస్టే. ఏ క్లాసు టీచర్నడిగినా తననే మెచ్చుకునేవాళ్లు. ఆడుతూ పాడుతూనే పరీక్ష లు రాశాడు. ఏ క్వార్టర్లీ, హాఫియర్లీ లాగానో అనుకున్నారుగానీ ఈ ఫైనల్‌పరీక్షే తన భవి ష్యత్తును నిర్ణయిస్తుందనుకోలేదు. సీరియస్‌గా చదవాలని తెలీదు.

తనకంటే వీక్ స్టూడెంట్లు కొన్ని ఫారాలే సెలెక్టు చేసుకుని బట్టీబట్టి తనకంటే బాగా రాశారు. తనేమో టెక్స్ట్ మొత్తం చదువుతాడు. వాళ్లు మట్టిబుర్రలే అయినా గత సంవత్సరాల్లో ఏమిచ్చారో చూసి, ఏం వస్తాయో ఊహించి ఇంపార్టెంట్‌వి గుర్తుపెట్టుకుని రాశారు. వాళ్లపా ట్లు చూసి జాలిపడ్డాడుగానీ, ఇప్పుడు సిగ్గుప డాల్సివస్తోంది. తనూ వాళ్లలానే అలాగే పరీక్ష లకు తయారయివుంటే స్కూల్‌ఫస్టే వచ్చేవా డు.

తనకే వస్తుందనుకున్నారు టీచర్లు. కానీ రిజల్ట్ చూస్తే ఘోరంగా వుంది. ఎప్పుడూ మూడోస్థానంలో వచ్చే విజయబాబుకి ఫస్ట్ రాంకే వచ్చింది.

వాడు ట్యూషన్ లేనిదే చదవలేడు. తనేమో ఏ ట్యూషన్లకీ వెళ్లలేదు.

ఇప్పుడు తనకి సీటు రమేష్ ఇప్పిస్తానన్నా డు. అతడొస్తేగానీ ఏ సంగతి తెలీదు. రమేష్ కిందటేడు కాలేజ్ స్టూడెంట్ కమిటీకి సెక్రెట రీగా వుండేవాడు. కాలేజ్‌లో పలుకుబడి వుంది. రమేష్ స్నేహితులు కూడా బాగా పరపతి కలవాళ్ల పిల్లలు. రమేష్‌కీ రవికీ దూరపు బంధుత్వం వుంది.

"రమేషన్నయ్య ఇంకా రాలేదేంరా? ఓసారి పై అంతస్తుకెళ్ళి చూసివస్తావా? క్లాసులో ఉన్నా డేమో" అన్నాడు జగన్నాథం కొడుకుతో.

"ఆ... ఎందుకులే. కాలేజ్‌కొస్తే మనకి కనపడకుండా వెళ్లడు. ఇంకా టౌనుకి వచ్చి వుండడు. ఆ ఊరిబస్సులు లేటుగా తిరుగు తుంటాయి. వస్తాడులే నాన్నా" అన్నాడు రవి.

"ఏమోరా అబ్బాయ్. వాడొస్తేగానీ నీ సంగతి తేలదు"

"సరిగానీ ఆ కుర్రాళ్లతోగానీ కల్సి మాట్లాడ వేంరా. ఇకనుంచి అందరూ కలిసిమెలిసి తిరిగేవాళ్లు. పో... మంచీచెడూ మాట్లాడు" అన్నాడు జగన్నాథం.

రవి ఆఫీసురూంవైపు కదిలాడు. అప్పుడే ఒక అబ్బాయి చెమటలు తుడుచుకుంటూ వచ్చాడు. లోపం ఏం జరిగిందో ఆడగాలని అటువెళ్లాడు రవి.

ఇంతలో అటెండర్ కసురుకుంటూ వచ్చి రవిని అవతలకు పంపాడు. అంత విసుగూ కసుర్లూ విసుర్లూ ఆ అటెండర్‌కి పుట్టుకతోనే వచ్చినట్టుంది.

రవి చిన్నబుచ్చుకొని వస్తున్నాడు.

"హలో మీ పేరు" అడిగారెవరో వెనక నుండి.

తనని కాదనుకుని నడుస్తున్నాడు. భుజంప ట్టి ఆపేకగానీ అర్థంకాలేదు తననే పిలిచారని. 'మీ' అనేది వినటం ఇదే మొదలు.

"ర... రవి... మీరెవరు?" అన్నాడు ఆ అబ్బాయిని.

"నేనా? మీలాగే ఆ అటెండర్ పిడతమొహా నికి భయపడి ఇటు వచ్చాను. నా పేరు కోటేశ్వరరావు" అన్నాడతడు.

రవి నవ్వాడు చిన్నగా.

"వాడికంత అదిరిపాటు ఎందుకో తెల్సా. మనం సెలక్టయ్యాక మామూలు అడుగుతా డు. ఇప్పుడు ఆ ఫోజు పెట్టలేదనుకో మనం లెక్కచేయకుండాపోతామని చిర్రుబుర్రులాడు తుంటాడు. నాకైతే లాగిపెట్టి చెంప పగలగొట్టా లనిపించింది"

"పాపం పోనీండి" అన్నాడు రవి.

"పాపం ఎందుకూ? అట్టా ఎగరకపోతే అడ గొచ్చుగా ఓ అయిదురూపాయలు పడేసేవాణ్ని








ముష్టిలాగా'' అన్నాడు తీవ్రంగా.

ముష్టి అనటం నచ్చకపోయినా ఊరుకున్నాడు రవి. అయినా ఆ అటెండర్ పద్ధతేం బావుందని? కొత్తగా కాలేజ్‌లోకి వచ్చిన తమ లాంటివాళ్లు ఎంత బెదిరిపోతారో తెలుసా? నిజంగా తనకీ అనిపించింది వెళ్లి ప్రిన్సిపాల్‌తో రిపోర్ట్ చెయ్యాలని.

''ఏ గ్రూపు అడిగారు మీరు'' రవి అడిగాడు.

''నాది ఎంపీసీనే. మాథ్స్ అంటే బాగా చేసేస్తాను. ఇంట్రెస్టు. మరి మీరేం పెట్టారు.

''నేనూ అదే. అయితే మీరు అదే అడుగుతున్నారా?'' అన్నాడు ఉత్సాహంగా.

అయితే ఇకనుంచీ మనం ఫ్రెండ్స్‌మి. ఒకే క్లాసుగా. అదిగో ఎవరో పిలుస్తున్నారు. మీ ఫాదరా?'' అన్నాడు కోటేశ్వరరావు.

రవి వెనక్కి తిరిగాడు. రమేష్‌తో మాట్లాడుతున్నాడు జగన్నాధం. రమేష్ చెయ్యి ఊపి పిలిచాడు.

''సరే వస్తాను. మళ్లీ కలుద్దాం. క్లాసులు ఎప్పుడు ఉండొచ్చునంటారు?''

''ఇంకో రెండువారాలకి ఉంటాయంటున్నారు. అదిగో నన్ను పిలుస్తున్నారు. మా చెల్లి కూడా నాతోనే చేరబోతోంది. వెళ్లండి'' అని కోటేశ్వరరావు వెళ్లిపోయాడు.

''ఆ... అదే బాబాయ్. డాక్టర్ వీరయ్యనాయుడుగారు ఫోన్ చేస్తామన్నారు. పనవుతుంది. నువ్వేం దిగులుపడకు. ఈపాటికి ఫోన్ వచ్చుండాలే. అడిగొస్తాను. ఏరా రవీ బావున్నావా?'' అని రమేష్ వెళ్లిపోయాడు.

రవి చిరునవ్వుతో తల ఊపాడు.

రమేష్ ఏదో మంచి సెంటు పూసుకున్నట్టున్నాడు. రమేష్ వాసన్ని గుర్తుపట్టేయొచ్చు కళ్లు మూసుకుని. ఖరీదైన బట్టలూ... హుందా... ఠీవీ... అన్నిటినీమించి తనని ఆత్మీయంగా పలకరించటం... తండ్రిని గౌరవించటం.

రవి అతడినే చూస్తుండిపోయాడు.

ఫ్యూన్... ఇందాక అరిచీ కరిచీ పులిలాగా ఎగిరినవాడు రమేష్ ముందు చేతులు కట్టు

కుని ఏదో చెప్తున్నాడు. అచ్చు పిల్లిలా నిలబడ్డాడు.

వాళ్లిద్దర్నీ రవి గమనిస్తున్నాడు. అదో ఫొటోలా అతడికి గుర్తుండిపోయింది. రమేష్ హుందాతనం... ఆ అటెండర్ చేతులు కట్టుకోవడం.

తను కలలో కూడా చేయలేనిపని. తనమీదకు రాబోతున్న పెద్దపులిని ఏ దేవుడో వచ్చి చిటికెనవేలితో తరిమేసినట్లు... అతడికి అనిపించింది.

రమేష్‌ని ఆరాధనగా చూశాడు.

రమేష్ తిరిగివచ్చాడు. జగన్నాథాన్ని తీసుకుని ప్రిన్సిపాల్ గదిలోకి వెళ్లాడు. పావుగంట తర్వాత జగన్నాథం కృతజ్ఞతభావంతో రమేష్ చేతుల్ని పట్టుకొని ఏదో అంటూ ఇవతలికి వచ్చాడు. రమేష్ వారిస్తున్నాడు.

"ఫర్లేదు. బాబాయ్. మనం మనం ఒకటి. మనకి చేసుకోక ఎవడికో చేస్తామా. ఊరుకోమంటున్నానా... అయ్యో... అలా అనుకోవద్దు. అవసరమొస్తే నేనూ నిన్నడగనూ. నాన్నే గుర్తు చేసి ఇవాళ పంపాడు. జగన్నాథం బాబాయికి చేసిపెట్టాలిరా అని ఎప్పట్నుంచో అనుకుంటున్నాడు. ఇప్పుడంటే బిజీ అయ్యాడుగానీ నాన్న మనవాళ్లందర్నీ తలుచుకుంటూనే వుంటాడు. పిన్నిని అడిగానని చెప్పు. ఒరేయ్ రవీ... ఇదిగో ఈ కాగితం ఉంచుకో. ఆ కిటికీ దగ్గరికెళ్ళి ఫీజు కట్టెయ్యి. బాగా చదవాలిరేయ్. మీ నాన్నపేరు నిలబెట్టాలి. డబ్బు తెచ్చారా నేనివ్వనా?"

"అయ్యో... ఎంతమాట. తెచ్చాంలే. మంచి మనసుతో మావాడికి సాయంచేసి పుణ్యం కట్టుకున్నావు. అదేచాలు. ఒరే... రమేషన్నయ్యని కలుసుకుని మంచీచెడ్డా అడుగుతూ వుండు. మావాణ్ణి కాస్త కనిపెట్టివుండు బాబూ. చిన్నవాడివి కాబట్టి కృతజ్ఞతతో సరిపెడుతున్నాను. నాన్నని అడిగానని చెప్పు. వచ్చే ఆదివారం వచ్చి కలుసుకుంటాను. ఆరోజు ఉంటాడా మళ్లీ ఊరిపనిమీద ఎటన్నా వెళ్తాడా? ప్రెసిడెంటుకదా. ఒకటా రెండా లక్షపనులు" అన్నాడు జగన్నాథం.

"ఉంటాడు. నేను చెప్తాగానీ... ఇక వెళ్తాను. టౌనులో కొంచెం పనుంది. వస్తాన్రా రవి. ఫీజు కట్టేసి వచ్చే శనివారంనుండీ కాలేజ్‌కి వచ్చెయ్యి. క్లాసులు మొదలవుతాయి. ఉంటాను" అని రమేష్ స్కూటర్‌మీద వెళ్లిపోయాడు.

తండ్రీ కొడుకులు అటే చేతులూపుతూ నిలబడ్డారు.

★ ★ ★

పెద్ద తిమింగలం నోట్లోకి ఓ నిలువెత్తు మనిషి నడుస్తూ వెళ్లే ఫొటోను ఓ ఇంగ్లీషు పత్రికలో చూశాడు రవి. ఆ తిమింగలం మరణించిందే. ఒకవేళ అది బతికితేనో? ఊహించుకుని వణికిపోయాడు అప్పుడు.

రెండు స్తంభాలమీద అర్ధచంద్రాకారంలో 'జె ఆర్‌పి డిగ్రీ మరియు జూనియర్ కళాశాల' బోర్డు అడ్డంగా ఉంది. రాక్షసుడు దవడ తెరుచుకుని అక్కడ పడుకున్నాడా అన్నట్లు. సరిగ్గా ఆ ఫొటోలో తిమింగలంలోకి వెళ్లే మనిషి తానే అయినట్లు గుండె ఝల్లుమంది... లోపలకి నడుస్తుంటే.

గేటులోంచి కేంపస్‌లోకి అడుగుపెట్టాడు రవి.

ఎదురుగా కాలిబాటకు కుడిపక్కన మూడంతస్థుల భవనం... రాక్షసప్రాకారంలా సూటిగా తననే చూస్తూ నిల్చొనివుంది. కాలిబాటకు అటూ ఇటూ అశోకచెట్లు. ఆ చెట్లను కలుపుతూ క్రోటన్స్.

ఆ భవనానికీ గేటుకీ మధ్యన కాలిబాట చీలి ఇంటర్‌మీడియట్ క్లాసురూమ్‌లకు తీసుకుపోతుంది. ఆ క్లాసుగదులన్నీ రేకులషెడ్లు, పక్కనే ఫిజిక్స్ కెమిస్ట్రీ జువాలజీ లాబ్‌లు మాత్రం డాబాగదులే. ఈ ఇంటర్ విభాగానికీ, ఆ మూడంతస్థుల భవనానికీ మధ్య ఖాళీ మైదానం. అది అటుపోయేకొద్దీ విస్తరిస్తూ హాస్టల్ గదుల్ని తాకుతుంది. హాస్టల్‌కీ కాలేజ్‌కీ మధ్యన ఈ విశాలమైన మైదానం ఆటలూ... పుట్‌బాల్ కూడా సరిపోతుంది.

కాలిబాటకు ఎడంవైపు చెట్లూ మొక్కలతో బొటానికల్ గార్డెన్‌లాగా ఉంటుంది. లోపలికి వెళ్లేందుకు చిన్న చిన్నదార్లు ఉన్నాయి. ఆ దారిమీద పసుపువచ్చనిపూలు తివాచీలాగా పరుచుకుని వుంటాయి. ఉదయం అయిదు

అరు సమయంలో చూస్తే ఊటీ కొడైకెనాల్ దృశ్యాలు కళ్లముందు సాక్షాత్కరిస్తాయి.

క్రితంసారి తండ్రితో వచ్చినప్పుడు గమనించలేదు ఇదంతా. ఇప్పుడైనా ఊరికే కళ్లు అటూ ఇటూ చూస్తున్నాయిగానీ దేన్నీ మెదడుకు పంపించటంలేదు. దేన్నీ గుర్తించటంలేదు.

తన పల్లెటూరి వాతావరణం ఎక్కడో కలలాగా అనిపిస్తోంది. ఈ కాలేజ్ వాతావరణం మింగుడుపడటం లేదు రవికీ... రవిలాంటి అనేకమంది పిల్లలకి. స్కూల్‌కీ కాలేజ్‌కీ ఉండే తేడాకి వాళ్లు సర్దుకోలేకపోతున్నారు.

స్కూల్ తనది. తన స్వంతం అని చెప్పుకోవచ్చు. ఫలానా మాస్టారు ఈ పిల్లాడిమీద శ్రద్ధ తీసుకుంటున్నారు అనుకోవచ్చు. పిల్లలకీ, టీచర్లకీ వ్యక్తిగత సంబంధాలు ఉంటాయి. ఒకే ఊరులో ఉండటంతో మరీ సన్నిహితంగా మెలుగుతారు.

ఇక్కడేదీ? ఈ బిల్డింగ్ తనని మింగేందుకు కాచుకు కూర్చునుంది. ఆప్యాయంగా పిలిచేవాళ్లు లేరు. చివరికి అటెండర్ కూడా విరుచుకుపడుతున్నాడు. తన క్లాసురూం ఎక్కడో ఎవర్ని అడగాలో తెలీటంలేదు.

లెక్కల మాష్టారు జగన్మోహనరావుగారు, నశ్యం పీల్చే శర్మగారూ, హిందీమేడం నాగమణిగారూ... ఈసారి సోషల్‌లో గ్యాసుకొట్టి రాశావంటే బెంచీ ఎక్కిస్తా, చదివి రాయరా బాబూ అని బెదిరించే రామబ్రహ్మం టీచరూ... ఏరీ వీళ్లంతా?

గణేష్, బాబ్జీ, రమేష్, విజయబాబూ. వీవీ స్వీ ప్రసాదూ, శ్రీధర్, శ్రీనూ, మహేషూ, ఎమ్మెస్సార్... అందరూ ఒకళ్లనొకళ్లూ ఆటపట్టిస్తూ క్లాస్ రూముల్లో పరుగులుతీస్తూ బెంచీలు ఎక్కుతూ దూకుతూ టీచర్ చెవులు మెలేసేదాకా అల్లరిచేసే మిత్రులు... ఎక్కడా? అసలు వాళ్లతో గడిపింది కలలోనేమో అన్న సందేహం వస్తూంది.

తెల్సినవాళ్లు ఎవరూ కనిపించటంలేదు.

ఎవర్నయినా అడుగుదామంటే... భయం. రాగింగ్ చేస్తారేమో అని. అందుకే ఎవరి దృష్టి తనమీద పడినా రవికి చెమటలు పడుతున్నాయి. ఎవరూ తనని గమనించటంలేదు కదా అని వెనక్కి చూసుకుంటూ నడుస్తున్నాడు.

ఉదయం తొమ్మిదిన్నరే అయింది. ఇంకా ఎవరూ రాలేదు. అక్కడొకరూ ఇక్కడొకరూ కనపడుతున్నారు.

ఇంకా అరగంట టైమ్ ఉంది.

ఒక్కో నిమిషమూ ఒక్కో యుగమై క్షణక్షణమూ దుర్భరంగా అనిపిస్తోంది.

అతడిలోని దిగులు ఉప్పొంగే వరదనీటి మట్టమై హృదయాన్ని అతలాకుతలం చేస్తోంది.

విద్యార్థికి కాలేజ్ ప్రవేశంతో ఎదురయ్యే సమస్యల్లో ఇదొకటి.

ఒక అపరిచిత ప్రదేశంలోకి, వందలాది కొత్తవాళ్ల మధ్యకి వెళ్లి అక్కడి స్థితిగతులకు అలవాటు పడటం. ప్రాబ్లమ్స్ ఆఫ్ ఎడాప్టేషన్. ఇతరులకి అర్థంకాని సమస్య ఇది. అత్యంత సున్నితమైనది. దాన్ని మన వ్యవస్థ మరింత సున్నితంగా పరిష్కరించబూనుకొంది. రాగింగ్ పేరుతో.

సీనియర్స్ తమలోకి కలుపుకోవటానికి సరదాగా చేసే అల్లరి అది. జూనియర్స్ బెరుకు పోగొట్టటానికి శాయశక్తులా కృషిచేస్తారు వాళ్లు. అది ఇప్పుడిలా వుందంటే...

మూత్రం తాగించటం, నగ్నంగా ఊరేగించటం, మెడలమీదనుండి దూకించటం, అమ్మాయిల దగ్గరకు వెళ్లి ఏ నెంబర్ బ్రాలు వాడతారో అడిగిరమ్మనటం, సాయంత్రం గేటు ముందు బట్టలు ఊడదీసి నుంచోబెట్టడం, వచ్చేవాళ్లు ఎటువైపు వెళ్తారో సరిగ్గా ఆ దిక్కుకి తిరిగి నుంచోని కేక వేయించటం, ఒక జూనియర్‌ని స్త్రీ అనుకొమ్మని మరో జూనియర్‌తో నోటితో వర్ణింపశక్యంగాని పనులు చేయించటం... వాటిలో కొన్నిరకాల కార్యక్రమాలు.

ఈ కార్యక్రమాల ద్వారా విద్యార్థికీ విద్యార్థికీ మధ్య మరింత సన్నిహిత్యం పెరుగుతుందని ఒక మంత్రిగారు ప్రకటించారు.

కానీ కాలేజ్‌లోకి ప్రవేశించబోయే నూతన విద్యార్థులు మాత్రం భయంతో వణికిపోతున్నా

రు. రాగింగ్‌కి గురయినవాళ్లు ఒకరిద్దరు ఆత్మహత్యలకి కూడా పాల్పడుతున్నారు. భవిష్యత్తు మాట మరిచిపోయి చదువు మానేసి పారిపోతున్నారు. అనాగరిక చేష్టలకి బెదిరిఆత్మాహుతి చేసుకొంటున్నారు.

విద్యార్థి హృదయంలోకి చొచ్చుకుపోయి, దాన్ని ముక్కలు చేస్తున్న ఈ ఘాతుకాలకి బాధ్యులెవరు?

ఇదంతా ఆలోచిస్తున్నకొద్దీ రవికి భయం నీటిమట్టంలా పెరిగి పెరిగి సుడిగుండంలా చుట్టేసింది.

ఈ పరిసరాలనుంచీ పారిపోవాలనిపించింది.

మరుక్షణమే అతడు పరుగుతీస్తున్నట్లుగా కాలేజ్‌నుంచీ ఇంటిదారి పట్టాడు. కానీ ఇంటికి వెళ్తే అడుగుతారని భయపడి సాయంత్రంవరకూ బస్‌స్టాండ్‌లోనే ఉండిపోయాడు. ఎప్పుడు కాలేజ్ వదులుతారా అని.

అతడికి నరకంలాంటి అనుభవం కలిగింది ఆ నిరీక్షణలో.



టౌను సెంటర్లో చౌరస్తా దగ్గర ఆగింది బస్సు. ఉదయం పదిదాటుతోంది. మార్నింగ్‌షో అందుకోవటానికి హడావిడిపడుతూ దిగుతున్నారు జనం. ఎక్కేవాళ్లని కుమ్ముకుంటూ, దిగేవాళ్లని తోసుకుంటూ, అందర్నీ తిట్టుకుంటూ బస్సు దిగాడు రమేష్.

"అబ్బ... ఈ బస్సుల్లో వద్దురా అంటే వినలేదు నానా చావు..." అంటూ వెనకేవచ్చాడు ఇంకొకతను.

"సర్లే... రా... స్కూటర్‌కేదో రిపేరు. తీసుకురావటానికి కుదర్లేదు. నాన్నేమో పట్టించుకోడు. తొందరగా నడు శివాజీ మళ్ళీ దొరకడు" రమేష్ అతన్ని ఈడ్చుకెళ్తున్నట్టు నడవసాగాడు.

ఆ చౌరస్తాకి ఎడంవేపు రోడ్డులో ఉంది రమేష్‌వాళ్లు కలునుకునేచోటు. ఒక టీస్టాలు ముందు అయిదారు కుర్చీలు వేసివుంటాయి వీళ్లకోసం.

అప్పటికే అక్కడ ఓ పదిమందిదాకా కూర్చునివున్నారు. శివాజీ అవతలగా నుంచొని ఎవరితోనో మాట్లాడుతున్నాడు.

రమేష్ కూడా వచ్చిన వ్యక్తిని పలకరింపుగా చూసి అక్కడ కూర్చోమన్నట్టు చెయ్యి ఊపాడు అతడు. ఇద్దరికీ టీ తెచ్చిఇచ్చారు.

"పనవుతుందంటావా?"

"చెప్పాగా. నూటికి తొంభైవంతులు అవ్వాలి. అవునూ రిలీజెప్పుడు. వచ్చేవారం అన్నావుకదూ"

"ఆ మంగళవారం. ఆరోజు మన జనాలు చాలామంది వస్తారు. ఇక్కడ కూడా మనోళ్లు ఏర్పాట్లు చేస్తే హుషారవుతారు. కాలేజి కుర్రాళ్లంటే ఇక ఎదురేముంది. పోయినసారి ఆ వెధవలు నాలుగైదురోజులు పండగ చేసినట్టు ఫోజుకొట్టారు. మనం ఈసారి వారం రోజులయినా చెయ్యాలి"

శివాజీ గెడ్డం బరుక్కుంటూ వచ్చాడు. ఎర్రటి మొహం. ఫాషన్‌గా పెంచుతాడు గెడ్డాన్ని. లాల్చీ తెల్లటిది. మామూలు ప్యాంటు వేసుకుని ఉన్నాడు. చూస్తే అల్లాటప్పా అనిపిస్తాడు. టౌనులో కాలేజి స్టూడెంట్స్‌కి మాత్రం తెలుసు అతడి అసలు స్వరూపం.

"శివాజీ... ఈయన... శ్రీమన్నారాయణ... అనీ..."

"తెలుసు... తెలుసు. ఏమ్మా బావున్నావా? మద్రాసులో ఓసారి మెరీనా బీచ్‌లో చూశాను మిమ్మల్ని. రెండు లారీలను నడిపించినట్టున్నారు. మీ శక్తి గురించి అందరూ చెప్పుకున్నారు" -శివాజీ.

"ఆ... ఆ... నాదేముందండీ. చంద్రుడికో నూలిపోగు. ఇంకా ప్లాను వేసుకున్నాగానీ నాట్లూ, ఊడుపులూ అని కుర్రాళ్లు రాలేదు.





మీరూ వచ్చారా మద్రాసు"

"లేదమ్మా. నాకు వేరేపనుండి వచ్చాను. ఏమంటున్నాడు మీ హీరో"

"ఏమంటాడు. ఈసారి నిర్మాతలకి చెప్పి ఇంకా సహాయం చేస్తానన్నాడు. అన్నదానం... రక్తదానం లాటివి చెయ్యమంటాడు. ఈ జనా లు ఆయన్ని గుర్తుంచుకుంటారా. ప్రజాసేవే అంటాడు గానీ"

"దానికో కారణం ఉందిలే. ఈసారి ఎన్నిక ల్లో నిల్చుంటానన్నాడు. ఒంగోలు ఏరియాలో నిల్చుంటాడనుకుంటా. అంకినీడుగారు ఆమ ధ్య మాటల్లో ఇదంతా చెప్పారు. ఇంకా కన్ఫాం కాలేదు" - శివాజీ.

"నిజంగా?" ఆనందంగా అడిగాడు.

"మరి. సినిమాల్లో ఎంతకాలం ఇరు క్కుంటాడు. అదీగాక అల్లుడు తెగబుక్కయిపో తున్నాడు. ఇంక మామని తప్పుకోమంటున్నా డు. పోటీ అంటే మాటలా? అల్లుడికి పోటీ మామనేకదా. ఎవడున్నాడు ఇంకా గట్టిగా పోటీ ఇచ్చేవాడు"

"ఆ... అల్లుడుగారు బుక్కవుతున్నారా?" థ్రిల్లయిపోతున్నాడు అతడు.

మరి. మామా అల్లుళ్ల సవాల్ అంటే మాటలా...!" ఇంకా ఉబ్బేశాడు శివాజీ... మద్రా సు కబుర్లు చెప్తూ...

ఆ వ్యక్తి ఏవేవో లోకాల్లోకి వెళ్లిపోయాడు. 'నటభీకర' బిరుదాంకిత హీరోకి వీరాభిమాని అతడు. ఆయన పుట్టినరోజున మద్రాసుకి ఊరే గింపు చేయించాడు. ఈ టౌను చుట్టుపక్కల ఏడెనిమిది ఊళ్లనుంచి రెండు లారీలనిండా కుర్రవాళ్లనీ, యువకులనీ కూడగట్టి మద్రా సులో తన హీరో ఇంటిముందు స్వంతంగా ఖర్చుపెట్టి జేజేలు కొట్టించాడు. ఈమధ్యనే అప్పుల్లో ఇరుక్కుపోయాడు

'నటభీకర'గారు తన వారసుడిగా తన అల్లుణ్ణి సినిమాల్లో ప్రవేశపెట్టి తాను రాజకీ యాల్లోకి దిగుదామని చూస్తున్నాడు. అయితే బుక్ చేసుకోటానికి ఎవరూ ముందుకి రావ టంలేదు. ఎందుకంటే ఆ అల్లుడు 'నటశూ న్యుడు'. అతన్తో తీసిన రెండు సినిమాలూ ఘోరపరాజయం పొందాయి. మొహంలో ఏ ఫీలింగూ పెట్టకపోవటం అల్లుడిగారి ప్రత్యే కత. లవ్‌సీనయినా, చావుసీనయినా ఒకే మోస్తరుగా నటించడంతో 'నటశూన్య' బిరుదు ఇచ్చారు వ్యతిరేకులు.

శివాజీ తండ్రికి మూడు సినిమా థియేటర్లు ఉన్నాయి. ఇంకా వృత్తిలో సంపాదించిన మంచి నైపుణ్యం ఉంది. 'డాక్టర్' వీరయ్యనా యుడుగారంటే టౌనులో మంచి పేరుంది. ఆ హాస్పటల్‌మీదే ఆదాయం వేలలో ఉంటుంది.

శివాజీ ఆ సినిమాహాలు పనిమీద మద్రాసు వెళ్తుంటాడు. అక్కడి సినీజనారణ్యంలో వినవ చ్చే పుకార్లూ, అభిప్రాయలూ బాగా తెలుసు. ఇప్పుడవే నాలుగుముక్కలు ఈ వీరాభిమాని చెవిన వేశాడు.

"సరే... పని గురించి ఆలోచించండి. వచ్చే శనివారం ఎలా చేద్దామనుకుంటున్నారు. అస లు ప్లానువేసుకుంటే మన కుర్రాళ్లకీ చెప్తారు. టౌనులో మంచి సందడిగా చేయాలి" అన్నా డు శివాజీ సీరియస్‌గా అయిపోతూ.

"ఇక కార్యక్రమంలోకి దిగాల్సిన టైం వచ్చింది శివాజీగారూ... ఆ పోటీవాళ్లు పోయిన సారి పదిహేను బిందెలు పాలు వాడారు. ఈసారి మనం ఇరవై ఐదు అయినా వాడాలి. ఎందుకంటే అల్లుడుగారి వయసు అంతే కదా. మన గురువుగారికి అభిషేకం చేసినట్టూ ఉంటుంది. అల్లుడుగారి వయసు చెప్పినట్టూ ఉంటుంది"

"ఇంకా ఏం చెయ్యాలి? చెప్పండి త్వరగా నాకు టైం లేదు" అన్నాడు శివాజీ.

"గురూగారు బిజీలో ఉన్నట్టున్నారు. సరే ఈసారికి ఒక కటౌట్ అరవై అడుగులది సెంటర్‌లో పెట్టాలి... అన్న ఆలోచన ఉంది. మొదటి రోజు మొత్తం టిక్కెట్లు మన అభిమా నులుకే రిజర్వ్‌చేయాలి. రెండు రోజులపాటు సినిమాకొచ్చేవాళ్లకి స్వీట్స్ పంచాలి. ఒక జాంగ్రీ, ఒక హాటేదైనా. నాలుగురోజుల పాటు ఇంటర్వెల్‌లో టీలు ఉచితంగా ఇవ్వాలి. కరప త్రాలు టౌనంతా పంచాలి. గురువుగారి స్టిక్క ర్లు వారం రోజులపాటు వచ్చిన వారందరికీ ఇవ్వాలి. వాటి మీద నెంబర్లు వేసి ఉంటాయి.

వారం తర్వాత డ్రా తీస్తాం. గెలిచిన వారికి

ఈ సంవత్సరం మొత్తం గురువుగారి సినిమాలు రిలీజయినప్పుడల్లా మొదటి రోజు చూసే అవకాశం కల్పిస్తాం. ఫామిలీ మొత్తం ఉచితంగా చూడొచ్చన్నమాట. ఇంకా...''

''అయ్యిందా... ఇంకేమన్నా ఉందా? వీటన్నిటికీ ఖర్చు ఎంతవుతుందో తెలుసా?'' శివాజీ కంఠంలో చిరాకు.

''అయ్యో గురూగారు విసుక్కుంటున్నారు. ఇన్ని తెల్సినవారు అది కూడా చేయలేరా? మన టౌను ఏరియాకి నాలుగువేలు పంపారు నిర్మాతగారు. గురూగారు ఈసారి ఎక్కువ పంపమని చెప్తారట. ఆ నాలుగైనా నిర్మాత ఏడ్చుకుంటూ ఇచ్చాడు. మళ్లీ డబ్బులు రాల్చుకోటానికి ముందుంటాడు. గురువుగారు ఒక సినిమాలో వెయ్యకపోతే ఆ నిర్మాత చిప్పపట్టుకోటమే...''

''సరే... మేం టౌను నుండి రెండువేలు కంట్రిబ్యూట్ చేస్తాం. మీరే ముందుండి జరిపించండి''

''అయ్యా... మరీ రెండువేలా? కనీసం ఐదయినా వేసుకుంటే...''

''చూడమ్మా... మాకీసారి చాలా ఖర్చులు ఉన్నాయి. కాలేజీ ఎలక్షన్స్ వస్తున్నాయి. ఈసారి గట్టిపోటీ ఉండేట్టు ఉంది. అదీ గాక మీరొక్కరేనా... ఇంకా అటు వుత్తరాది నుండి పది ఊళ్లలో మనవాళ్లు ఏర్పాట్లు చేయటానికి డబ్బు చూడాలి. తాలూకా మొత్తం ఇప్పుడిప్పుడే మనం బలపడుతున్నాం. ఈసారికిది సరిపెట్టుకోండి...''

''మరీ రెండా?... గురూజీ కనీసం మూడున్నర...''

''ఊహు... చెప్పాగా వచ్చే సినిమా రిలీజ్ లోపు మన అభిమాన సంఘాలు మొత్తం టౌనులో సమావేశమవుతాయి. ఊరుకొకటి కాకుండా అంతా ఒకటిగా చేద్దామని ఉంది. నాకైతే మిమ్మల్ని వీటన్నిటికి నాయకుణ్ణి చేయాలని ఉంది. మరైతే బాధ్యతలు తెల్సినవారు మీకే ఆ బాధ్యత ఇద్దామని''

అతడు ఆనందంగా నమస్కారం చేశాడు. చేతులు పట్టుకొని కళ్లు చెమర్చినంత పనవుతుండగా శివాజీని కౌగలించుకున్నాడు.

''వదలండి... అరె వదలమంటుంటే. ఈ మాత్రానికే... మనం ఇంకెన్ని చేయాలో. అల్లుడుగారు త్వరలో సూపర్‌స్టార్ కావాలి. అందుకు మనం అంతా పనిచేయాలి. గురువుగారు ఎన్నికల్లో నెగ్గాలి. మంత్రిపదవి అయినా రాకపోతే వేస్టు''

ఆ వ్యక్తి ఒక పక్కన ఆనందంతో మరోపక్క విచారంగా శివాజీకి నమస్కరించి, రమేష్‌కు చెప్పి నడువసాగాడు. ఈసారి ఈ సినిమా రిలీజ్‌కి తన పొలంలో అరెకరం అయినా అమ్మాల్సి వచ్చేట్టుంది. పాత అప్పులూ, ఇప్పుడు పదివేలకు పైగా ఖర్చులూ.... డబ్బులు వాడటానికి ప్రతివాడూ వెనక్కి తప్పుకుంటాడుగానీ గురువుగారి సినిమా అంటే ఎగబడతారు. ఈసారి ఏర్పాట్లకి అందరూ దంగైపోవాలి. ఏమో... శివాజీ సాయంచేస్తే తాలూకా లెవెల్లో నాయకుడయితే... మద్రాసువెళ్లి గురువుగారినడిగి కొంత డబ్బు సాయం పొందవచ్చు. కష్టాలన్నీ తీరిపోతాయి. ఇంకా అల్లుడుగారు దిగుతున్నారు. ఆయనకి కొత్తగా అభిమాన సంఘం పెట్టాలా? గురువుగారిది సరిపోతుందా? కొత్తకొత్త ప్లానులేసి ఆ పోటీ వెధవల్ని ఓ ఆట ఆడించాలి.

ఆ వ్యక్తి ఆలోచించుకుంటూ నడుస్తున్నాడు.

★ ★ ★

టౌనులో బస్సుదిగాడు రవి. చేతిలో ఒక నోట్‌బుక్కూ, ఇంకో పాఠ్యగ్రంథం రెండే ఉన్నాయి. స్కూలుకిలాగా నంచినిండా పుస్తకాలని తెచ్చుకోనవసరంలేదు. నాలుగైదు పుస్తకాలకంటే ఎక్కువ ఉంటే నవ్వుతారట.

కాలేజి వేపు నడుస్తుంటే కాళ్లు వెనక్కి లాగుతున్నాయి. సంకోచం బిడియం అతడిని కాలేజ్ వాతావరణానికి అలవాటు పడనీయటంలేదు. వందలమంది కొత్త మొహాల మధ్య అతడు బెరుకుగా ప్రవేశిస్తున్నాడు. ఈ కాలేజి అతడికి బోనులాగా ఉంది. లెక్చరర్లూ, క్లర్కులూ, ప్రిన్సిపాల్, లైబ్రేరియన్, అటెండర్లూ అందరూ విద్యార్థులతో కలవకుండా తనుచుట్టూ ఓ కనపడని వలని చుట్టుకొన్నారు. వాళ్ల చుట్టూ కనబడని గోడ ఏదో ఉంది. గంభీరపు ముసుగు తొడుక్కుని నెమరేసుకుంటున్న సింహాల్లాగా కూర్చుని- తల్చుకుంటేనే రవికి




వళ్లు కుంచించుకుపోతోంది.

తోటి విద్యార్థుల్ని చూస్తే తనకంటే తెలివి గలవాళ్లుగా కనపడుతున్నారు. కొంతమంది ఇన్‌షర్ట్ చేసుకుని వస్తారు. వాళ్లని చూసినా రవికి బెరుకు కలుగుతోంది. కళ్లజోడు పెట్టుకుని వచ్చేవాళ్లని చూసినా అంతే. వాళ్లందరూ తనకంటే ఎంతో తెలివైన వాళ్లనీ, క్లాసులో లెక్చరర్‌ని ప్రశ్నలతో విసిగించరనీ, ఒక క్లూ ఇస్తే చాలు అల్లుకు పోతారనీ అతడి అభిప్రాయం.

అందుకే క్లాసులో సందేహాలొచ్చినా లేచి అడగటం లేదు. వీడెవడో పల్లెటూరి వెధవ అనుకుంటారని భయం. క్లాసులో అందర కంటే వెనకబెంచీలో కూర్చుంటున్నాడు.

గ్రామీణ జీవితం మూలంగా వచ్చిన బెరుకుతనం. పట్నవాసులతో పోటీపడలేని స్థితి. చొరవలేకపోవటం. కొత్తవారితో మాట్లాడటమే కత్తిమీదసాములా అయినప్పుడు ఇంకా వ్యక్తిత్వం రూపుదిద్దుకోనప్పుడు బాల్యానికీ, యవ్వనానికి మధ్యన ఉండే అడాలొసెంట్ స్థితి ఈ కాలేజి జీవితాన్ని నరకప్రాయం చేస్తుంది.

ఒకవైపు లేతలేత పువ్వులా వికసించే యవ్వనం. అది యుక్తాయుక్తాలు ఆలోచించే యుక్తవయస్సూ కాదు. ఇంటా బయటా మంచిదైనా కాకపోయినా అదుపు ఉండే బాల్య దశా కాదు. అది అటూ ఇటూ కాని స్థితి. ఏ మాత్రం అదుపు తప్పినా తీగ మీద నడిచే మనిషిలా వ్యక్తి ఛిద్రమయిపోతాడు.

రూపుదిద్దుకొనే వ్యక్తిత్వం చిన్నాభిన్నం అవుతుంది.

మన సమాజం గంభీరంగా కూర్చొని సర్వజ్ఞానిలా ప్రదర్శన చేస్తూ, నిర్లక్ష్యదృష్టితో మూర్ఖత్వంతో వేలాది లక్షలాది యువకుల జీవితాల్ని తారుమారు చేసి నేర ప్రవృత్తి, హింసాప్రవృత్తుల వైపుకు నెట్టుతూ ఉంది.

రవి పరిస్థితి అయోమయంగా ఉంది. స్కూల్ నుండీ కాలేజికు వచ్చాక ఎదురయ్యేది తీవ్రమైన మార్పు. వాతావరణం... స్నేహితులు... అధ్యాపకులు... మొత్తం సంస్కృతే మారినట్లుగా ఉంది. స్టేజీ మీద నర్తకుడు భరతనాట్యం చేస్తుండగా హఠాత్తుగా వెనుక నేపథ్య సంగీతం బ్రేక్‌డ్యాన్స్‌కి అనుగుణంగా మారినప్పుడు ఆ నర్తకుని అవస్థ ఎలాంటిదో, రవి లాంటి వాళ్లదీ అంతే.

అయితే కొందరు సులభంగా ఈ మార్పుకు అలవాటు పడిపోతారు. చదువులో రాణిస్తారు. కొందరు సుదీర్ఘకాలం బాధకు గురవుతారు.

యవ్వనం మరపురాని, తిరిగిరానికలగా భావించే వారున్నారు. వారు సాధారణంగా ఉన్నత స్థాయిలో జీవించేవారు. అంటే అర్థం... వాళ్లు తమ అడాలొసెంట్ దశని సులభంగా దాటగలిగారనీ ఒడిదుడులకూ మార్పు చేర్పులకూ అలవాటు పడిపోయారనీ.

జీవితం మీద అత్యంత ప్రభావం చూపించేది అడాలొసెంట్ దశ.

ఈ దశలో నిలదొక్కుకో గలిగినవారే ఏ రంగంలో అయినా అగ్రగామిగా ఉండేది. అన్నిటికంటే కష్టభూయిష్టమైనది జీవితాన్ని సరిదిద్దుకోవటం. ఈ నవయవ్వన దశలో జీవితాన్ని ఒక పద్ధతిలో ఉంచితే పట్టాల మీద ఎక్స్‌ప్రెస్‌లా సాగిపోతుంది.

సమస్యల్లా బండిని పట్టాల మీద పెట్టటమే. కాలువ గట్టుమీద రవి నడుస్తూ... మెయిన్ గేటు దగ్గరకు చేరాడు. అటు సిమెంట్‌రోడ్డు మీదనుండి నాలుగైదు స్కూటర్లూ, మోటారు సైకిళ్ల మీద రమేష్ బృందం వచ్చింది. రమేష్‌ని చూసి రవి త్వరత్వరగా నడిచి దగ్గరకుపోయాడు.

రమేష్ ఒక స్నేహితుడితో మాట్లాడుతున్నాడు. రవిని చూసి కూడా చూడనట్లు నిర్లక్ష్యం నటిస్తూ వాళ్లతో తీవ్రంగా వాదిస్తున్నాడు. మధ్యలో రవి వైపు తిరిగాడు. రవి గొంతు సవరించుకుని పిలిచేలోపు అటు తిరిగాడు.

రమేష్‌ని పిలిచేందుకు సర్కస్ ఫీట్లు చేస్తున్నాడు రవి. రమేష్ మిత్రులు లోపలలోపల ఆనందిస్తూ ఈ నాటకాన్ని రసవత్తరంగా పోషించారు.

రమేష్‌కి ఒక్క ఆ పనే కాదు. ఇంకా అనేకం ఉంటాయి. ఎన్నిపనులు చూసుకోవాలో. కాస్సేపు ఇక్కడనుంచుందాం అనుకుని ఓ పక్కగా నిల్చున్నాడు.

ఈ రవిగాడు ఇంకా ఉన్నాడా? లేకపోతే

లెక్కలేకుండా పోయాడా? అని రమేష్ ఓర చూపు చూశాడు. అప్పటికీ రవి ఒక సర్కస్ ఫీటు చేశాడు.

"ఆరేయ్ ఈరోజు 'రాధికా'లో డెకరేషన్ చేయాలి. నువ్వేమో మీ ఊర్నుంచీ ఏడు బిందెలు తెస్తానన్నావు. ఆరోజు ఒక్కటే నీకు ఇబ్బంది. మేమేమో రోజా రంగు కాగితాలు అంటించటం, దండలు అంటించటం సరిపోతుంది. ఒక్కసాయం చెయ్యావు..." అంటున్నాడు రమేష్ మిత్రుడు.

"అరే... దానికే ఖంగారవుతావు. ఎవర్నాయినా పంపమంటావా? ఏంటీ రంగు కాగితాలూ దండలేగా" అంటూ తల అటు ఇటూ తిప్పాడు ఎవరి కోసమో అన్నట్లు.

రవి మామూలుగా ఆరోసారి తీగమీద నడిచే మనిషిలాగా సర్కస్ ఫీటు చేసి రమేష్ దృష్టిలోపడ్డాడు. అలా అనుకున్నాడు అతడు.

"ఓ ... నువ్వా రవీ... ఇక్కడే ఉన్నావా? సరే... చిన్న పనుంది. మనోడు స్కూటర్ మీద తీసికెడతాడుగానీ ఆ పనిచూడు. సినిమాలు చూస్తుంటావా? ఎల్లుండి ఫ్రీగా చూడొచ్చు, ముందే వచ్చెయ్యి. ఏరా ప్రసాదూ తీస్కెళ్లు"

తనతో ఏదో పని! రవికి లోపల గర్వం వేసింది. ఇంక రమేష్‌తోకలిసి పూర్తిగా ఇన్‌వాల్వ్ అయిపోయి అతడి రుణం తీర్చుకుని తన పెద్దలు మెచ్చుకునేలా చేయాలని ఆ క్షణాన్నే నిర్ణయించుకున్నాడు. ఇక తను రమేష్ వర్గం, రమేష్ జట్టు. ఆ సర్కిల్ తన ప్రపంచం. రమేష్‌కి సాయపడుతూ అభినందించబడుతూ స్కూటర్లమీద తిరుగుతూ. ఊహల్లోనే







అంతా చూసేశాడు.

ఇంతవరకూ రవిని ఆ మాత్రం పలకరించిన వాడెవడూ లేడు. అది ఒక కారణం. ఎవరో ఒకరు తమ స్నేహహస్తం చాస్తే అందుకోవటానికి రవి సిద్ధంగా ఉన్నాడు. అంత తహతహ లాడుతున్నాడు. అందుచేత రమేష్ అందించిన హస్తాన్ని అందుకునే యత్నంలో ఉన్నాడిప్పుడు.

"క్లాసులు లేవురా?" అడిగాడు రమేష్.

క్లాసుకెళ్ళకపోవటమే రిలీఫ్‌గా హాయిగా ఫీలవుతున్నాడు రవి. ఉన్నాయంటే ఎక్కడ వెళ్ళమంటాడో అని.

"ఆఁ... లేవు. మధ్యాహ్నం ఒకటుంది. పర్లేదు ఇంపార్టెంట్ కాదు" అన్నాడు రవి.

ఇంతలో ప్రసాద్ స్కూటర్ స్టార్ట్ చేసి రవి పక్కకి వచ్చాడు.

రవి దాన్ని ఎక్కటానికి ప్రయత్నించాడు. రెండుకాళ్లూ ఒకవైపునే పెట్టి కూర్చున్నాడు.

ఎవరో కిసుక్కున నవ్వారు. ప్రసాద్ వెనక్కి చూసి తనూ నవ్వాడు. నిండుసభలో ద్రౌపదిలా రవి మనసు కుంచించుకుపోయింది.

కృష్ణ భగవానుడిలాగా రమేష్ ఆదుకున్నాడు.

"రవీ... ఒక కాలటు - ఒకటి ఇటూ వేసికూర్చో. ఆడాళ్ళకి వీలు కాదని అలా కూర్చుంటారు. నువ్వు మగాడివేగా" అని రవిని సరిగ్గా ఎక్కించి స్కూటర్‌ని పోనీయమన్నాడు.

ఇంకా నవ్వుతున్న ప్రసాద్‌నీ ఇతరుల్నీ గదమాయించి వీళ్లని పంపేశాడు.

రమేషంటే ఇంకా గాఢమైన ఆకారం ఒకటి సద్భావంతో రవి మనసులో తిష్టవేసుకుంది. ఆ ఆకారం రవిని పూర్తిగా ఆక్రమించుకుంటూ ఏదో ఉత్తేజాన్నిచ్చింది. రమేష్ గురించిన ఆలోచనలోనే ఉండిపోయాడు రవి.

'రాధికా'లో పోస్టర్లు అంటించటం, దండలు అంటించడం, ఫాన్స్‌క్లబ్‌ల పోస్టర్లు పోకేనులో పెట్టటం లాంటివి ఉత్సాహంగా చేసేశాడు రవి.

ఇంకా నాలుగైదు సెంటర్లలో చిన్న చిన్న కటౌట్ల మెడల్లో దండలువేసి ఎవడో దండం పెట్టుకోవాలంటే ఆ నటభీకర కటౌట్‌కి నమస్కరించి మరీ నుదిటిమీద బొట్టుపెట్టాడు

* * *

ప్రెస్‌లో అచ్చుపనేదో చూసుకుని భాస్కర్‌ని వెంటపెట్టుకుని రాధికా సెంటర్‌నుండీ టీ.జె. కాలేజ్‌వైపు నడుస్తున్నాడు సూర్యం.

భాస్కర్ తన స్కూల్ కబుర్లు చెప్తున్నాడు. టి.జె. కాలేజీలో ఫస్ట్‌రాంక్‌లో పాసయ్యిన విషయమూ, ఇంట్లో పరిస్థితికి తలవగ్గి ఒక ట్యుటోరియల్ కాలేజీలో టీచరుగా జాయినవ్వటమూ చెప్తున్నాడు.

"మేమున్నప్పుడు ఇంత దరిద్రంగా లేదోయ్! ఈ కొత్తవార్డెను ఉత్త లోఫర్. బకాసురుడు నోరు తెరిచి కూర్చున్నట్లు రోజుకు ఇరవై నాలుగ్గంటలూ సిద్ధంగా ఉంటాడు. హాస్టల్‌కి

ఎలాంటి సరుకు చేరినా సగం మింగుతాడు. ఇంకో పావు పైవాళ్లకి పంపుతాడు. పిల్లలకి చేరేది సగంలో సగం అన్నమాట.

"సరేగానీ ఇకనుండి సోషల్‌వెల్ఫేర్ హాస్టల్లో పిల్లలకి ట్యూషన్లు పెడతారట. సైన్స్, మాథ్స్, ఇంగ్లీషుల్లో కావాల్సిఉంటుంది. నువ్వు ప్రయత్నించరాదూ? నెలకి ఐదొందలు దాకా ఇవ్వొచ్చు" సాలోచనగా అన్నాడు సూర్యం.

"ఆఁ!! ఐదొందలంటే నాకు ఎక్కడైనా వస్తుంది" అనబోయాడు భాస్కర్.

"అదీగాక మనకి హాస్టల్‌కి సంబంధించి గట్టి లింక్ దొరుకుతుంది. పిల్లలకి ధైర్యం చెప్పటానికీ, గైడెన్స్ ఇవ్వటానికీ ఒక గట్టిపట్టు దొరుకుతుంది. బైటవాళ్లని అయితే కలువకుండా చేయగలడేమోగానీ ఒక టీచర్‌గా ప్రవేశిస్తే వాడికి కష్టమే. ఆ పిల్లలు ఉత్సాహంగా ఉన్నారు. అయితే ఈ స్టీవెన్సన్ భయంతో తగ్గుతున్నారు" పూర్తిచేశాడు.

"ఆఁ!! ఆఁ!! అవునంట. ఆ ఎస్.సి., ఎస్.టి హాస్టల్‌లో పరిస్థితి దారుణంగా తయారయ్యేట్లుంది. స్టీవెన్సన్ ముఠాని వార్డెన్ వెనక ఉండి నెడుతున్నాడు. స్కాలర్ షిప్పులు మింగటం, ఎదురు నిలిచినవాడ్ని స్టీవెన్సన్‌కి అప్పగించటం. వాడు వెనకాముందూ చూడడు. టౌనులో ఈ వెల్ఫేర్ హాస్టళ్ళన్నింటికీ ఈ ముఠా అధికార రౌడీలుగా నడుస్తున్నారు. అసలు ఎలా తయారవుతారో"

"ఏ కులంలో అయినా అంతే కొందరు కులాన్ని ఉద్ధరించే ఫోజుపెట్టి జేబులు నింపుకొంటారు. అవతలి కులం వాడి భయంతో ఇవతలివాడూ, ఇవతలి వాడి భయంతో అటు దిక్కువాడు, ఇద్దరూ రెండు గ్యాంగుల వెనక చేరుతున్నారు. తీరా చూస్తే పైన ఇద్దరూ వీళ్లని అణగదొక్కుతూ ఉంటారు. వదిలించుకునే దశ దాటిపోయి ఉంటుంది. ఇప్పుడదే సమస్య. జాగ్రత్తగా డీల్ చెయ్యాలి"

"ఈ జైంట్‌లని ఎదుర్కోవటం మనవల్ల అవుతుందంటావా సూర్యం? ఒక్కోసారి అనిపిస్తుంది, మనం కొండని ఢీకొంటున్నామేమోనని. ఒక్కో కాలేజ్ ఒక్కో కొండలా బలిసిపోయింది. కులరాజకీయాలు తారాస్థాయికి చేరాయి. వీళ్ళపీడ వదుల్చుకుంటే విద్యార్థులు ప్రశాంతంగా బతుకుతారు"

"అదే సాధించాలి. ఇవ్వాళ పరిస్థితి ఎటు నడుస్తుందంటే డిగ్రీ కాలేజీలో తొందరలో నరమేధం జరుగుతుందేమో అనిపిస్తోంది. అరుణ్ కుమార్ వర్గం మెల్లగా బలపడిపోయింది. శివాజీ ఆక్టోపస్‌లా తయారయ్యాడు. బహుశా ఇక నువ్వూ నేనూ అందరం కులం గొడుగు కింద దూరే పరిస్థితి వచ్చేట్లుంది. ఈ ఎలెక్షన్లు జరిపించేవరకూ నిద్రపోరు. వస్తుతానికి అరుణ్‌కుమార్, శివాజీ ఇద్దరూ సమాన బలాలతో ఉన్నారు. ఏదయినా ఫోర్స్ నడిపించి శివాజీ గెలుస్తాడేమో!! అభిమాన సంఘాలతో ఇప్పుడే ఎలయన్స్ కడుతున్నాడు. ఆ దిక్కునుండీ సరుక్కొస్తున్నాడు. ఇద్దరూ తామే గెలుస్తామనే నమ్ముతున్నారు"

"అందుకే కలిశారంటావా? ఎన్నడూ లేనిది ఇద్దరూ కలిసి ఎలక్షన్లు జరిపించమని డిమాండ్ పెడుతున్నారు. రేపోమాపో కాలేజీ మొదలంటున్నారు. ఎన్నికల రొచ్చుతో చస్తున్నారు స్టూడెంట్లు. అసలు వాటి పర్పస్ ఎగిరిపోయింది. నీ బలం ఎంత, నాదెంత? నీదా కులమా? నాది యాంటీ కులం. నీకులానికి యాంటీ. అంతేగానీ అసలు కులమే వద్దు అన్న ఆలోచనేలేదు"

"ఈ సంవత్సరమే బాన్ అవుతాయని విన్నాను. ప్రభుత్వం విద్యార్థి సంఘాల ఎన్నికలు రద్దు చేసే ఊపులో ఉందని వార్త. ఆ ధైర్యంతోనే మా కాలేజీ ప్రిన్సిపాల్ ఇప్పుడు ఎన్నికలు జరిపించటం లేదు. నిరుడు శివాజీ బాగానే మిగిల్చాడంటున్నారు. కాలేజీ ఫండ్స్ వీళ్ళ పొట్టలకే సరిపోవు. ఈ సారి మనం వదలకూడదు. జూనియర్స్‌ని కన్విన్స్ చేయగలిగితే ఈ నాయకమ్మన్యుల్ని పరిగెత్తించొచ్చు"

"ఈ ఎలక్షన్స్ రద్దయితే సగం తలనెప్పి తగ్గుతుంది. ఈ సంవత్సరం జరగవంటావా?"

"ఎలక్షన్స్ రద్దు చేస్తే ఏం లాభం. ఎలక్షన్స్‌కి గొడవలు జరుగుతున్నాయి. హత్యలు చేస్తున్నారని రద్దు చేసినంత మాత్రాన పరిస్థితి ఏం మారుతుంది? కళాశాలలో వేళ్ళూనుకుని మహావృక్షాలవుతున్న పరాన్నభుక్కులు అలాగే ఉంటారు. వాళ్ల కాలిగోరు కూడా కదలదు.





ఇప్పుడేమో ఏ ప్రెసిడెంటనో సెక్రెటరీనో అదో పేరు పెట్టుకొని దోపిడీ చేస్తున్నారు. రేపు ఆ పేరు లేకుండానే చేస్తారు. నామమాత్రమైన చర్చలు ఏం మారుస్తాయి? అసలు పునాదిని మార్చకుండా ఇల్లు అందంగా కడదామంటే వీలవుతుందా?''

''అవును సూర్యం... నేనలా ఆలోచించలేదు. ఆ మాటకొస్తే ఈ ప్రభుత్వాలు మాత్రం ఎన్నికల్లో గెలిచేదాకా విద్యార్థుల్ని వాడుకోవటంలేదూ. రెండు మూడు పాలకవర్గ పార్టీలకు అనుబంధంగా విద్యార్థి సంఘాలు ఉండనే ఉన్నాయి. ఓ పక్కన విద్యార్థుల్ని రాజకీయాల్లోకి దించి మరోపక్క విద్యార్థికి రాజకీయాలతో ఏంపని అంటూ ఉపన్యాసాలు''

''అందుకే విద్యార్థి రాజకీయాలకు దూరంగా ఉండే ప్రశ్నలేదు. ఖచ్చితంగా అతడు పాల్గొనే తీరాలి. అలీనంగా తటస్థంగా ఉన్న విద్యార్థులు కూడా తమకు తెలీకుండానే ఒక రాజకీయ పరిధిలోకి వెళ్తున్నారు. అలా లాభం లేదు. విద్యార్థులకు రాజకీయాలు ఉండాలి. కుళ్ళును కడిగేసే మంచి రాజకీయాలు. మంచిగా చదువు కొనేందుకు డిమాండ్ చేసే రాజకీయాలు. కులం చీడను తుడిచేసే రాజకీయాలు. ఇవి తప్పనిసరిగా కావాలి. అసలు రాజకీయాలే వద్దంటే మన మేడిపండు రాజకీయనాయకులకు జేజేలు కొట్టటమే అవుతుంది. అది ఇంకో రాజకీయం'' నవ్వాడు సూర్యం.

ఇద్దరూ టౌనుకు ఒకపక్కకు వచ్చారు. అక్కడ మెయిన్‌రోడ్‌కి అవతలగా ఒక మట్టిరోడ్డులో ఉంది టి.జె. కాలేజీ హాస్టలు. ది టౌన్ జూనియర్ కాలేజ్‌కు అనుబంధంగా పెట్టారు.

ఇక్ష్వాకుల కాలంనాటి పెచ్చులూడి ఇటికరాళ్ళు కనపడుతూ, పెళ్ళలు రాలుతూ ఉండే భవనం అది. కుంగి కృశించే ముష్టివాడిలా లోపలి భాగాలన్నీ బైటకు చూపిస్తూ ఎండిన చర్మంతో పొడుచుకొచ్చిన బొమికలతో కూడిన అస్థిపంజరంలా ఉందది.

సూర్యం మేయిన్‌రోడ్డుమీదే ఒక టీ దుకాణంలో కూర్చుని భాస్కరని పంపించాడు. భాస్కర్ హాస్టల్‌ని సమీపించేటప్పుడు లోపల యుద్ధం జరుగుతున్నంత ఉద్విగ్నంగా ఉంది. వార్డెన్ సువర్ణరాజు కుర్చీలో కూర్చుని ఆయాసంగా ఊపిరి వదులుతున్నాడు. బుసలు కొడుతున్నాడు. ఎదురుగా ఇద్దరు పిల్లలు నుంచొని ఉన్నారు.

సువర్ణరాజు చేతిలో ఓ కాగితం రెపరెపలాడుతోంది. వార్డెన్ గది బయట పిల్లలంతా బిక్కుబిక్కుమంటూ నిశ్శబ్దంగా ఉన్నారు. తుమ్మెద రెక్కల ఝుంకారంలాగా ఫ్యాను తిరుగుతున్న శబ్దం చెవుల్ని బద్దలు కొడుతోంది. గుండెలు బిగబట్టి చూస్తున్నారు అంతా. ఉన్నట్టుండి-

ఆ కాగితాన్ని బల్లమీద విసిరికొట్టి పులిలాగా దూకాడు సువర్ణరాజు.

ఇద్దరు పిల్లలూ పరిగెత్తబోయారు. దాసు దొరికిపోయాడు.

దాసుని వంగదీసి ఒక పిడికిలితో శక్తికొద్దీ గుద్దుతున్నాడు సువర్ణరాజు దభీదభీమని శబ్దాలు. దాసు మూలుగుతూ నెట్టియ్యబోయాడు.

జుట్టు పట్టుకొని బలంగా వంచి తన రెండు కాళ్లమధ్యకి లాగి వీపుమీద బాదసాగాడు. దాసు లేవబోతుంటే తన బరువంతా అతడి మెడమీద వేసి బూతులు కూస్తూ ఒక ఆదిమ మానవుడిలా వొగరుస్తూ పశుబలంతో కొట్టీ, గుద్దీ, తన్ని... చివరి ప్రయత్నంగా మోకాలుతో దాసు పొట్టమీద పొడిచాడు.

దాసు నేలమీదపడి విలవిలలాడుతుంటే పిల్లలంతా ఓ అని అరిచారు.

''సైతాన్ వెధవల్లారా! ఎవడాడు? అరుస్తున్నాడు'' అని బయటకు పరిగెత్తాడు సువర్ణరాజు. పిల్లలు కకావికలయ్యారు. దొరికినవాడ్ని దొరికినట్టు బాదుకుంటూ వీరవిహారం చేసి దాసుతో ఉండి పారిపోయిన రెండోవాడ్ని ఈడ్చుకొచ్చాడు.

''చెప్పురా! ఎవడీ కాగితం రాసింది? సంతకాలు ఎవరెవరు చేశారు? సూర్యంగాడు మళ్లీ వచ్చాడా?''

''రాలే... వచ్చి రెండునెలలయింది. వచ్చినా మేం మాట్లాడమని చెప్పేసినం కదా! దాసుగాడే సార్‌ని అడుగుదాంరా మంచిగ అడిగితే ఏమనుకోడు. అని రేపెట్టి నాతో

రాపిచ్చాడు. రాఘవులికి వంటినిండా నల్లమచ్చలు పెరిగినియ్యి. ఆడు గోక్కొని గీసుకుని సీము పట్టిచ్చుకున్నాడు. ఆడి బట్టలమీద మాసికలు. పిల్లగాళ్లు అడ్నీ గేలి చేత్తుంటే జాలేసి మేమే రాసినం. మరి మీరేమో పట్టించుకోరు''

''ముయ్యి, మాదచ్చొద్ ముండాకొడుక. హాస్టలు ఎట్ల నడపాల్నో నాకు చెప్పొచ్చావ్. చెప్పుతె గేదాక వాయింపిస్తా తొత్తుకొడక. స్టీవ్‌స్సన్నకి తెల్సిందంటే ఇయ్యాల నీ శవం ఊరేగించి ఇంటికి పంపేవాళ్లం. కాగితం నా చేతికి దొరికింది. బత్కిపోయారు. అసలెవడ్రా ఇది రాయమంది'' కోపంగా కాయితం తీసి చూపిస్తూ అడిగాడు.

అందులో వచ్చీరాని భాషలో ఇక ఉత్తరం రాసి ఉంది.

ఆర్డీవోగారిని హాస్టల్ చూడటానికి రమ్మని ప్రాధేయపడుతూ దాసుతోపాటు ఆరుగురు పిల్లలు సంతకం చేశారు. సంతకాలు గజిబిజిగా అడ్డదిడ్డంగా ఉన్నాయి. ఏడో సంతకం సగంలో ఆగిపోయిఉంది. అది రామస్వామిది.

రామస్వామి అది చదివి సంతకం చేస్తుండగా వంటగదిలో ఏదో రగడ అయ్యి దాన్ని ఆపటానికి పరిగెత్తుకెళ్తున్న సువర్ణరాజు కంట్లోపడింది.

వంటలక్క బాయమ్మకీ ఇంకో పనివాడికీ జుట్టూజుట్టూ పట్టుకునే స్థాయిలో తగాదా వచ్చింది. బాయమ్మ ఒక గిన్నెలో కూరా, ఇంకో దాంట్లో కందిపప్పు, పొట్లమూ పెట్టుకొని సాయంత్రం ఇంటికి పట్టికెళ్లటానికి కట్టెపేళ్ల వెనుక దాచింది. అది చూసి తోటిపనివాడు ఏదో అడిగాడు. ఈమేదో అంది- తేలుకుట్టిన దొంగలా ఏమీ చెయ్యలేదనుకొని ''రాత్రిపూట నిద్ర పట్టటంలేదు ఒంటరిగా ఉంటే'' అన్నాడు వాడు. కప్పు లేచిపోయేట్టు తిట్టసాగింది ఆమె.

వంటగది పక్కనే బట్టలుతుక్కునే తొట్టి దగ్గర రామస్వామి సంతకం చేస్తున్నాడప్పుడు. అలా ఆ విజ్ఞాపన పత్రం దొరికిపోయింది.

''అయితే సూర్యంగాడు మళ్లీ రాలేదంటావు. వస్తే బొక్కలిరగతంతానని తెలును. కొజ్జావెధవ, వాడి బుర్ర రామకీర్తన పాడించి నంక ఇటువైపు ఎట్ల వస్తాడులే! వాడి సంగతి అటుంచు. నీకేమొచ్చింది? అయ్యకు లెటర్ రాయమంటావురా. వచ్చి చెమ్డాలు తీస్తాడు''

''చెప్పినా గద్సార్... దాసుగాడురేప్పెట్టాడని, అక్కడకీ నేను వద్దనే చెప్పిన, నాక్కూడా గజ్జిల్లో ఏమో వచ్చింది సారు. దురదమంట గోక్కొంటే ఇంకా పెర్గుతున్నది- ఏమన్నా మందులు'' ఆపేశాడు రామస్వామి.

ఉరిమి చూశాడు సువర్ణరాజు.

''అహా! పాతికమందికి పైనే వచ్చింది. ఏదో చర్మవ్యాధి అని పేపర్ల రాసినారు. అదేనేమో! ఎవరన్నా చూడొస్తె బాగోదు. పిల్లగాళ్లంతా గోక్కుంటూ చీములు కార్చుకుంటూ ఏంబావుంటాది. దాసుగాడేమో తెలియక చేసి అంతా చెడగొట్టి పెట్టాడు. మంచిగ చెప్పుకుంటే సారు కన్నతండ్రోలే చెయ్యడూ. ఏరా దానూ పడుకొని గుడ్లు మిటకరిత్తున్నావు. సారుకి సారీ చెప్పురా'' అన్నాడు దాసు వైపుతిరిగి కన్ను గీటుతూ.

దాసు నేలమీదపడి కళ్లు తెరిచి చూస్తున్నాడు. సువర్ణరాజు తన్నులనుంచి ఇప్పుడే తేరుకున్నాడు.

వార్డెన్ని చల్లపరచటానికి రామస్వామి చేస్తున్న ప్రయత్నం అతడికి అర్థమయింది.

హాస్టల్ పిల్లలకి నలభైమందికి పైనే చర్మవ్యాధులు వచ్చాయి. గజ్జి, తామర... లాంటివి. సామ్యేలు అనే విద్యార్థికి వళ్లంతా నల్లటి మచ్చలు... మొహం నుండీ రొమ్ముదాకా... పాకాయి. చేతులు కూడా మెల్లగా నల్లబడుతున్నాయి. రాఘవులుకీ అంతే.

పరిశుభ్రత లేకపోవటం... పరిసరాల్లో మురికి పెరగటం... ఇవన్నీ ఒకచోట ఉండే పిల్లలకి అంటువ్యాధులు వ్యాపించటానికి సాయపడతాయి. హాస్టల్ కాంపౌండ్‌వాల్ పడిపోయింది. పందులూ, కోళ్లూ తిరుగుతూ ఉంటాయి.

వంటగదికి దగ్గరే పాయిఖానా దొడ్లున్నాయి. నీళ్లు దొరక్కపోవటంతో మానవమాత్రుడు కన్నెత్తి చూడలేనంత దారుణంగా ఉంటుందక్కడ. నీళ్ల పంపు శాంక్షన్ కాలేదని సువర్ణరాజు చెప్తూంటాడు. పిల్లలు మెయిన్‌రోడ్డు పక్కన కుళాయిల్లో నీరు తెచ్చుకుంటారు.




అవి ఎప్పుడూ దొరకవు.

పదివదిహేను రోజులకోసారి బట్టలు ఉతుక్కుని రోజులు గడిపేస్తుంటారు పిల్లలు. చంకల్లో, గజ్జల్లో చర్మవ్యాధులు అతి సాధారణం అక్కడ. కొత్తగా నల్లమచ్చలు వస్తున్నాయి.

పదిహేనురోజులకోసారి ఒక వైద్యుడు వచ్చి పిల్లల్ని పరిశీలించి వైద్యసహాయం చేయాలి. దాను వచ్చిన కొత్తలో ఒక డాక్టరు వచ్చాడు. ఇంజక్షన్లు పొడుస్తాడేమో అని పిల్లలంతా దాక్కున్నారు. ఒకళ్లిద్దర్ని చూసి ఆయన వెళ్లిపోయాక అంతా ఊపిరి పీల్చుకున్నారు. అప్పటినుండీ పిల్లలకే భయమూ లేకుండా ఆ డాక్టరు ఇటు కన్నెత్తి చూడటం కూడా మానేశాడు.

"డాక్టరుబాబుని పిలవరాదు సారు. లేకపోతే మీకూ వస్తుంది. మీకు వస్తే మీ ఇంట్లో అమ్మగారికీ, పిల్లలకీ" అంటూ కావాలని లాగూలో చెయ్యిపెట్టి గోక్కుంటున్నాడు రామస్వామి.

చీదరగా చూశాడు వార్డెన్.

"అవరా బద్మాష్. నోర్ముయ్యి. నోటికి హద్దుండాలిరా. ఇష్టమొచ్చినట్లు వాగుతున్నావు. ఓసారి రమ్మని డాక్టరుబాబుకి చెప్పాలి. రేపోసారి గుర్తుచెయ్యి. వెళ్లి తీస్కొస్తే, మళ్లీ ఎవడితోనైనా వాగారో తోలు వలిసేస్తాన్రోయ్. ఒరేయ్ దానూ... దొంగలమ్డీ... ఈసారి విమానం ఎక్కించి కుళ్ళబొడుస్తా. సూర్యంగాడు నా కాలిగోరు కూడా పీకలేడు. గుర్తుంచుకో. అయినా ఆ కులంవాడి కాళ్లు నాకుతావేమిరా? అంత నోరు చేదుగుందిరా? మన ఊర్లల్లవాళ్లంతా మనని ఎట్ల నాశనం చేసినారో నీకు తెలుసురా? మీ అయ్యనడుగు చెప్తడు. మనం ఒక్కటిగా ఉంటి ఆళ్లని ఎదిరించాలె. అంతేగాని వాడి కాళ్లు నాకుతూ నాకే ఎసరు పెట్తావేందిరా నువ్వు. కులం తప్పిన కాకీ వెధవా?"

మరి నేనూ వాళ్ళతో కలుస్తున్నకదా అంటావేమో?

చూడు... ఇదిగోరా అబ్బాయ్ మనం నిలదొక్కుకోవాలంటే మన పైన భుజాల మీదున్నోడ్ని మంచి చేస్కోవాలె. ఆ అంకినీడు సారు మంచోడు. మనకోసం వాళ్లవాళ్లతోనే కొట్లాడుతున్నాడు. నూటికో కోటికో ఒకడుంటాడు. వాళ్లని మనం సపోర్టు చెయ్యాలె. పిల్లగాళ్లు మీకా తెలిసీతెలీని వాయను. వేడికబుర్లు చెప్తుంటే కాకమీదుంటారు... కార్చుకొండిరా. మనోళ్లు బాగుపడాలె. మనమంతా ఒకటి కావాలె. సువర్ణరాజు కూడా కులాన్ని సాయం తెచ్చుకుంటూనే పిల్లలని నియంత్రిస్తున్నాడిప్పుడు.

నీతి బోధ సాగిస్తున్నాడు సువర్ణరాజు. కిటికీలోంచి బైటకు చూశాడు రామస్వామి.

"సార్ బాయమ్మేమో అరుస్తున్నది" అన్నాడు వార్డెన్‌తో.

"వీళ్లతో చావొస్తోంది" తిట్టుకుంటూ వెళ్లిపోయాడు సువర్ణరాజు

చటుక్కున వార్డెన్ రూం బైటకు ఉరికి హాస్టల్‌లోకి రాబోతున్న భాస్కర్ దగ్గరకు పరిగెత్తాడు. రామస్వామి భాస్కర్‌ని బయటే ఆపేశాడు.

లోపల కాక మీదున్నడు. దానుగాడ్ని చావగొట్టి రూంలో పడిపోయేదాక తన్నిండు. మేము బయటే కలుస్తం సూర్యమన్నకు చెప్పండి. మళ్లీ మాట్లాడనీకి కుదరదేమో"

"అదే అక్కడ చాయ్ దుకానంలో కూర్చున్నాడు- నువ్వెళ్లిరా. నేనీలోపు వార్డెన్‌ని మాటల్లో ఉంచుతా" అన్నాడు భాస్కర్.

రామస్వామి మెయిన్ రోడ్డువైపు పరుగందుకున్నాడు.

లోపలకి వచ్చిన భాస్కర్‌ని సువర్ణరాజు ఆపేశాడు. ఒకప్పుడు భాస్కర్ టి.జె. కాలేజీలో తాలూకా ఫస్ట్ వచ్చాడు. ఆ గుర్తింపుతో సువర్ణరాజు దగ్గర పరిచయం చేసుకొన్నాడు.

అంత బ్రిలియంట్ తనని పొగుడుతుంటే పొంగి ఉబ్బి తబ్బిబ్బవుతూ ఈ రోజు పిల్లలు చేసిన ఘోరకృత్యాన్ని వివరిస్తూ తెలంగాణా కృష్ణా జిల్లాల మిశ్రమ భాషని ఉపయోగిస్తూ దానునీ సూర్యాన్నీ అర్థమైన తిట్లూ తిడుతూ లోపలకి తీస్కెళ్లాడు సువర్ణరాజు.

"అట్లనా? ఇంకా దొర్లితే బొక్కలిర్గ తీయాల్సింది లఫంగి వెధవల్ని" అని దానువైపు తిరిగుతూ వెళ్లమని సైగచేశాడు భాస్కర్.

"అవును సాబ్... మీ హాస్టల్లు ఏమో ట్యూషన్లు పెట్టిస్తున్నరంట. నేను సరిపోనూ. ఎప్పటి

నుండో సార్‌ని అడగాలనుకుంటున్న"

"అవు... అవు... ఓ అప్లికేషను ఇవ్వు పైవాళ్ల కి చెప్త" అంటున్నాడు సువర్ణరాజు టి.జె. కాలేజీ సాంఘీక సంక్షేమ హాస్టలు వార్డెన్.

★ ★ ★

వేణూ విశాలమైన ఆ ఇంటి ఆవరణలోకి అడుగుపెట్టాడు. ఐదు లక్షలకు పైనే విలువచేసే బిల్డింగ్ అది. డూప్లెక్స్ టైప్‌లో కొన్ని గదులు కింద మిగిలినవి పై అంతస్తులోనూ ఉన్నాయి. ఇంటి స్థలం చాలనప్పుడు డూప్లెక్సులు కడతారు సాధారణంగా. కానీ ఈ స్థలం పెద్దదే ఎందుకు కట్టారో అని ఆలోచిస్తూ కాలింగ్ బెల్ నొక్కాడు. శ్రావ్యంగా ఎక్కడో సంగీతం వినిపించింది.

ఒక నడివయసు స్త్రీ తలుపు తీసింది.

"వేణూ నువ్వా! రాబాబూ. వీడు టిఫిన్ తినకుండా పోతానంటున్నాడు" ఫిర్యాదు చేసింది ఆమె.

సోఫాలో కూర్చుని సాక్స్ వేసుకుంటున్నాడు అనిల్.

ఏరా? ఏమొచ్చింది తినటానికి. పాపం ఆంటీ ఎంతసేపు నుంచుని ఉంటుంది. ముందు లేచి ఆ ప్లేటు పట్టుకోరాబాబూ"

అంత బాధగా ఉంటే నువ్వే పట్టుకొని ఖాళీ చెయ్యి, నావల్ల కాదురా" అన్నాడు అనిల్ లేసులు బిగిస్తూ.

"ఆంటీ! ఇలా ఇవ్వండి ఎంతసేపు బతిమాలతారు. వీడెటూ తినడు"

"ఏంటో బాబూ! వీడీమధ్య తిండీ, తిప్పలూ వదిలేసి తిరుగుతున్నాడు. వీళ్ల నాన్నగారికి తెలిస్తే చంపేస్తారు. ఆయన ఇక్కడ లేరుగనుక సరిపోయింది" అందామె.

"అంకుల్ ఇక్కడికి ట్రాన్స్‌ఫర్‌మీద వస్తామన్నారు. ఏమయింది ఆంటీ"

"ట్రై చేస్తున్నారు. ఇప్పట్లో అయ్యేట్లులేదు. ఏరా బాబూ ఇది తిని పోరా నీకు పుణ్యం ఉంటుంది" బ్రతిమాలుతూ.

టైం అవుతోంది. వదరా" లేచాడు అనిల్.

తల్లి మాటలు వినిపించుకోకుండా విసురుగా నడిచాడు. వేణూ నర్దిచెప్పినా ససేమిరా అని ఆమె వెంటపడింది.

కాంపౌండ్ దాటి రోడ్ మీదకి వచ్చాక కూడా కొడుకుని బతిమాలుతూ టిఫిన్ ప్లేటు పట్టుకుని అనుసరించింది.

వేణూక్కూడా చిరాకువేసింది. ఇరవై ఏళ్లొస్తున్నాయి అనిల్‌కి. ఇంకా ప్రతిదీ గారాబంగా చేయబోతుంది. తన పనులు తను చేసుకోలేడూ?

చివరికి అనిల్ ఆమెని తిడుతూ ఆ రోడ్డు మీదే టిఫిన్ ప్లేటు పట్టుకొని తల్లిమీదకు విసిరేసి విసురుగా వెళ్లిపోయాడు.

రోజూ జరిగే తతంగమే అది.

ఇంటర్ దాటి డిగ్రీలోకి అడుగుపెట్టాక అనిల్ విజృంభించాడు. అంతకుముందు తల్లి అంటే వణికి పోయేవాడు. కానీ ఆమె ఎదుగుతున్న కొడుకుని చూసి అజమాయిషీ తగ్గించుకొని అధికారం అనిల్‌కే అప్పగించింది. ఆ అధికారాన్ని ఆమోదించి కొడుక్కి పూర్తి స్వేచ్ఛ ఇచ్చింది. అసలు అనిల్ చేత తిట్లు తింటేనే ఆమెకి తృప్తి కలుగుతుందని వేణూ అనుమానం.

అనిల్ తండ్రి ఉత్తర భారతదేశంలో రైల్వేలో ఛీఫ్ ఇంజనీర్. ఇక్కడికి నెలకోసారి వచ్చి వెళ్తుంటాడు. తండ్రి కూడా లేకపోవటంతోఅనిల్‌ని ఎవరూ అదుపులో పెట్టలేకపోతున్నారు. ఒక్కసారి స్వేచ్ఛ వచ్చిపడటం అనిల్ ప్రవర్తననే మార్చివేసింది.

ఇంట్లోనేకాక కాలేజీలో కూడా చురుగ్గా అమ్మాయిలతో చొరవగా తిరుగుతున్నాడు. పూర్వం ఇల్లు, కాలేజీ, ట్యూషనూ ఇంతే. ఇప్పుడు మూడూ లేవు. కాలేజీకి పేరుకి వస్తుంటాడు. ఇంటికి ఆలస్యంగా వెళ్తాడు. ఏం చేస్తాడో వేణూక్కూడా తెలీదు.

ఇద్దరూ బస్టాండ్ పక్కనుండి నడుస్తున్నారు. అనిల్ కొత్త డ్రస్సులో ఉన్నాడు.

బ్యాగీఫాంటు, గళ్లషర్టు, చైనీస్ మాస్‌తో నడుస్తుంటే వెనక ఫ్లైయింగ్ హెయిర్ గాలికి ఎగురుతోంది., దానికి తోడు కూలింగ్ గ్లాసెస్.

వెనకనుండి ఎవరో స్టూడెంట్ అనిల్‌కి డాష్ కొట్టి రానుకుంటూ వెళ్లిపోయాడు.

"ఎవడీ చుమ్మాగాడు" అన్నాడు అనిల్ చిరాకుగా.





పది అడుగులు ముందుకు వెళ్లిన ఆ డ్యాష్ వీరుడు వెనక్కి తిరిగి వచ్చాడు అనిల్ మొహంలోకి చూసి ఆశ్చర్యపోయాడు.

"సారీ బాస్! ఎవరో అమ్మాయి అనుకున్నా. నువ్వు సెకండ్ బి.కాం. కదూ. ఏంటీ డ్రెస్సు. జపాన్ కుర్రదానిలాగా ఉన్నావు. వెనకనుంచి చూసి పప్పులో కాలేశాను" అన్నాడతడు.

వేణుకి నవ్వొచ్చింది.

"అనుకుంటూనే ఉన్నా. ఈ అనిల్‌గాడు నానారకాల మేకప్‌లతో ఎప్పుడో ఈ పరిస్థితి తెస్తాడని"

అనిల్ కూడా నవ్వేశాడు.

"ఓరే!! ఆ కూలింగ్ గ్లాసెస్ తీసెయ్యరా నాయనా. లేకపోతే ఇవ్వాళ నిన్ను డాష్‌లు కొట్టి నలిపేస్తారు" అన్నాడు వేణు.

"సరేగానీ నువ్వు పదరా నేను ఓ పని చూసుకుని వస్తా" అన్నాడు అనిల్.

"నీ ఖర్మ. ఏదోకటి ఏడువ్! నేను పోతున్నా" అని వేణూ ఆ డ్యాష్ వీరుడితో కలిసి వెళ్లిపోయాడు.

అనిల్ ఆ పక్కనే ఒక సందులోకి నడిచి ఇంకో రోడ్డెక్కాడు.

ఓ పావుగంట నిరీక్షణ తర్వాత అతడి కళ్లు మెరిశాయి.

రవళి ఒక్కటే తల నేలలోకి దించుకొని వస్తోంది.

ఫ్యాంటుకంటిన మట్టి దులుపుకున్నట్టు వంగి ఆమె దగ్గరకి వచ్చాక లేచాడు.

అప్పుడే గమనించినట్లు ఫీలింగ్స్ మార్చి "హలో! రవళి!!" పలకరించాడు.

పలకరించాటానికే సిగ్గుపడిందామె.

"మీ ఇల్లు ఇక్కడేనా. కొంచెం పనుండి వచ్చానిటు"

రోడ్డున పోయే జనం వీళ్లవైపే చూస్తున్నారు.

నవ్వాలో, పలకరించాలో, నుంచొనే ఉండాలో, నడుస్తూ మాట్లాడాలో అర్థంకాక రవళి చేతిలో పుస్తకాల్ని నవరిస్తోంది. తల వంచాలా? ఎత్తాలా? తలెత్తి అనిల్‌ని చూడాలా? కూడదా? చూస్తే కళ్లలోకా! కాళ్ళవైపా! అంతా గజిబిజిగా ఉంది.

ఆ ఆందోళితా హృదయంతో మాటలు పెగలక నవ్వలేక, తలెత్తలేక, నుంచోలేక, వినవిసా నడిచి అనిల్‌కి దూరంగా వెళ్లిపోయింది.

"రవళిగారూ! మిమ్మల్నే..." పిలుస్తూ వెంబడించలేక ఆగిపోయాడు.

అయ్యో మర్యాదకయినా వస్తా అని చెప్పకుండా ఇలా పరిగెత్తుకొచ్చానేమిటి? పాపం అతడేమను కొంటాడో. ఎంత అసహ్యంగా అనుకుని ఉంటాడో నా గురించి. అసలు మగాడు కనబడితేనే ఈ గుండెదడ, చెమటలు ఎందుకొస్తాయో తనకు. ఎలా అయినా తగ్గించుకోవాలని ప్రయత్నిస్తోంది తను. అందుకే సరితా వాళ్లతో కలుస్తోంది.

లాభంలేకపోయింది. ఎవరు పలకరించబోయినా తనకి అనుకోకుండా గుండెదడా, చెమటలూ వరుసగా వచ్చేస్తాయి. వెనక్కి వెళ్లి అతడిని సారీ అని పలకరిస్తే... లాభంలేదు. మళ్లీ అదే పరిస్థితి వస్తుంది మళ్లీ నోరుపెగలదు. ఈ సారి కనిపించగానే క్షమాపణలడగాలి. అనుకుంటూ నడుస్తోంది రవళి.

రవళి పరుగెత్తినట్లు వెళ్లిపోగానే ఓ కాలుతో నేలను తన్నుతూ వెనుతిరిగాడు అనిల్.

అది సిగ్గా? పొగరా? అర్థం కావట్లేదు. సిగ్గయితే ఫర్వాలేదు. తను తగ్గించగలడు. పొగరయితేనే కొంచెం కష్టం. కష్టమయినా ఓర్చుకోవచ్చు. సరితలాంటి టఫ్‌కేసు కాకుండా ఉన్నంతవరకూ సరిత మామూలు ఆడది కాదు, డేర్ డెవిల్. ఏమాత్రం త్వరపడినా కరిచి పారేస్తుంది.

మళ్లీ వచ్చినదారినే నడిచి బస్టాండుదాకా వచ్చాడు.

ఒకరిద్దరు స్టూండెట్లు హడావిడిగా వెళ్లిపోతున్నారు. క్లాసులు ఈ సరికి మొదలయ్యి ఉంటాయి.

ఆగిఉన్న బస్సుల మధ్యనుంచీ నడిచి బస్టాండులోకి వెళ్లాడు. లోపల ప్రయాణికుల సౌకర్యార్థం కట్టిన హొటల్ ఉంది. అందులోకి నడిచి ఫ్యామిలీ సెక్షన్‌లో కూర్చున్నాడు.

కాఫీ తాగి అరగంటసేపు వెయిట్ చేశాక లోపలికి వచ్చిందామె.

"హాయ్ సుజీ..." సుంచొని పిలిచాడు.

"సారీ అనిల్... బస్‌లు అందలేదు, హెవీ రష్" అని చిరాగ్గా అంటూ అతడి ఎదురుగా కూర్చుంది.

ఆ సెక్షన్‌లోనే కూర్చొన్న పల్లెటూరి దంపతులు వీళ్ల మాటలనే వింటున్నారు. వాళ్లకోసం నిరర్థకమైన సంభాషణ కాస్సేపు నడిపి ఇద్దరూ బయటకి నడిచారు. నిజానికి సుజాత ఏ బస్‌లోనూ రాలేదు. ఆమెదీటౌనే.

ఇవ్వాళ బస్టాండులో కలుసుకోదలిచిన కారణాన ఇద్దరూ వచ్చారు. సంకేతస్థలంగా కొన్ని ప్రదేశాలను ఎన్నుకోవటం, ముందూ వెనకగా అక్కడకి చేరుకోవటం, ఇద్దరూ కలిసి ఏ సినిమాకో వెళ్ళటం మామూలే.

సభ్యతతో ప్రవర్తించటం, ఆసక్తికరంగా మాట్లాడటం, హుందాగా అభిప్రాయం వ్యక్తంచేయటం, పరోపకారం సమ్రతగా, నిగర్విలాగా ఉండటం ఇవీ అనిల్‌లో సుజాతకి నచ్చిన లక్షణాలు. ముఖ్యంగా సమకాలీన ప్రపంచం గురించిన వివరాలు అనిల్‌కి కరతలామలకం.

ఇవి అతడికి స్వభావ సిద్ధమైనవా? లేక తనకోసం వేసుకున్న ముసుగా? అనేది ఆమె ఆలోచించలేదు.

ఇతరుల్ని ప్రభావితం చేయటం అతడికి చేతనవును. తన పరిధిలో వాళ్లందర్నీ వేరువేరుగా విడగొట్టి అవసరంమేరకు ఎవరెవర్ని ఎంతవరకు దగ్గరకు రానీయవచ్చో అంతవరకూ రానిస్తాడు. ఒకరితో ఉన్నట్లు ఇంకోకళ్లతో ఉండడు. సాధారణంగా ఒక మిత్రబృందంలో అందరికీ ఒకరిపై ఒకేరకమైన అంచనా ఉంటుంది. కనీసం స్వభావం వరకూ.

అనిల్ స్వభావంమాత్రం నిగూఢమయినది. అతడిగురించి ఒక్కొక్కళ్లకి ఒక్కోరకమైన ఆలోచన ఉంది. సరితకి ఒకరకంగా, వేణుకి ఇంకోరకంగా ఇలా.

ఏ ఒక్కటీ ఇంకొకదాంతో సరిపోలదు.

ఓసారి సరితని పలకరించాడు. ఆమె వ్యక్తిత్వం కొంత భిన్నమయినది. సూర్యంతో సన్నిహితంగా ఉంటుంది. అందరిలా ఆలోచించదనీ, ప్రత్యేకత కలిగినదనీ అతడికి తెలును.

"'మైదానం' చదువుతారా? ఇవాళే కొన్నాను" అన్నాడు అనిల్.

ఒక్కచూపు చూసింది. అంతే హడలిపోయాడు. ఒక జ్వాలా వలయమేదో తనని చుట్టుముట్టినట్లు అనిపించింది. చివాలున తలతిప్పి ఆమె చూసిన చూపు అతడు జీవితంలో మర్చిపోలేడు.

ఆమె చూసిన చూపూ, అందులో జుగుప్సా చలం పుస్తకం పై కాదనీ తనపైనే అనీ. అతడికి ఏ కొంచెమో అర్థమయ్యింది. చలం పుస్తకాలు చదవటానికి కూడా కొన్ని అర్హతలుంటాయనీ, ఆ ఏముంది ఫ్రీ సెక్సేగా చలం చెప్పిందీ అని అమూల్యాభిప్రాయం వెలిబుచ్చేంత స్థాయినుండీ ఎదగాలనీ అతడికి తెలీదు.

అతడికి తెల్సిందల్లా ఆ పుస్తకం చదివి ఆహా... మా గురించి ఏం రాశాడండీ... ఈ రోజుల్లో ఇంతగా ఆలోచించేరచయితలేలేరు. ఆ పుస్తకాలు ఆదరించి మా బాధలు పట్టించుకునే కుర్రవాళ్లూ లేరు. ఓ కుర్రదీ, కుర్రాడి మధ్య ఎంత అద్భుతమయిన రొమాన్సు ఉండొచ్చో కదూ! చలం పుస్తకం చదివే వరకూ నాకు తెలీనే లేదు. అని తనపైపు ఓ అర్థయుక్తమయిన చూపు చూస్తుందనీ...

ఆ చూపుని అర్థంచేసుకుని తను అంగీకారంగా ఆ స్నేహహస్తాన్ని అందుకొని ముద్దిడాలని.

అయితే ఇవ్వేమీ జరగకపోగా మళ్లీ సరిత వైపు తలెత్తి చూసేధైర్యంకూడా తనలో మిగలకపోవటం అతడికి అర్థంకాకుండా మిగిలిపోయింది.

అనిల్ తల్లిదండ్రులు బాగా సంపన్న కుటుంబాలనుండీ వచ్చిన వాళ్లు. తల్లివైపు మరీ ఆస్థిపరులు, అందుచేత ఇంటివిషయాల్లో ఆమెదే నిర్ణయాత్మక పాత్ర. తండ్రి ఎప్పుడూ ఉద్యోగ నిమిత్తం దూరప్రాంతంలోనే ఉండేవాడు. ఆయనది సాధుస్వభావం.

బోర్డింగ్ స్కూల్లోనే ఎక్కువగా విద్యాభ్యాసం జరిగింది అతడికి. క్రమశిక్షణ కోసం ఎప్పుడూ అదుపు వుండాలని తల్లి విశ్వసించేది. వార్డెన్ల కఠినత్వం కన్నవాళ్లకి దూరమవ్వటం దుర్భ





రంగా తోచి ఇంటికి పారిపోయివచ్చేశాడు ఒక సారి. మళ్లీ తల్లే బలవంతపెట్టి పంపించింది.

ఉన్నతవర్గాల పిల్లలకి సహజంగా ఎదురయ్యే పరిస్థితి అది. చాలావయసు వచ్చేవరకూ వారికి అన్నిరకాలుగా రక్షణ కల్పించబడుతుంది. కనిపెట్టుకుని ఉండేవాళ్ళు ఎక్కువ. ఆయానుండీ తోటమాలివరకూ అందరూ వారిపై ఆతృత కనబరుస్తారు.

ఎక్కువమంది బోర్డింగ్ స్కూళ్లల్లో రెసిడెన్షియల్ కళాశాలల్లో ఊటీలాంటిచోట్ల చదువుతారు. అది సమాజంనుండీ దాపరికానికి దారితీస్తుంది.

అలాంటిచోట్ల అనిల్ పెరిగాడు. మగపిల్లల హాస్టల్స్‌లో అనేక వికృత కార్యకలాపాలు జరిగేవి. అనిల్‌కి కూడా ఆ స్వభావం అలవడింది.

అక్కడ ఎక్కువగా లైంగిక విషయాలమీదే సంభాషణ జరిగేది.

ప్రతి పనికీ ముగింపుగా ఒక లైంగిక విషయం తెచ్చేవాళ్ళు. పెద్దపిల్లలు తమకంటే చిన్నవాళ్ళముందు గొప్పతనం చూపించేవాళ్ళు. మగతనం ప్రదర్శించేవాళ్ళు.

కొన్ని కొన్ని వ్యక్తిగత విషయాల్లో గైడెన్స్ ఇచ్చేవాళ్ళు.

ప్రత్యేకించి వ్యక్తిగతంగా కుటుంబ జీవనానికి దూరమైన కారణంగా వారొక అస్తవ్యస్థ జీవితం గడిపారు. విద్యార్థుల్లోని ఈ సెక్సువల్ డిసార్డర్‌కి కారణం ఈ అస్తవ్యస్థతే.

కాలేజి జీవితంలో కూడా ఉన్నతవర్గాల పిల్లలకే లైంగిక సంబంధాలు ఎక్కువ. దూరప్రాంతంలో ఉండి చదివేవారిలో ఇంకా ఎక్కువ.

అలాంటి నేపథ్యంనుండీ వచ్చిన అనిల్ ఇప్పుడు సుజాతతో సినిమాహాల్లోకి ప్రవేశించాడు.

స్టీవెన్ స్పిల్‌బర్గ్ గురించీ, బెన్‌హర్ గురించీ తన జ్ఞానాన్నంతా గుప్పించాడు. గుండుసూదినుండీ అణుబాంబువరకూ అతడికి తెలీని విషయం లేదు.

బాల్కనీలో వెనక సీటుపై కూర్చున్నాక మాట్లాడుతూ మాట్లాడుతూ సుజాతవైపు తిరి

గాడు. ఆమె కళ్లార్పకుండా అతడినే చూస్తోంది.

వెనుక ఓసారి మీక్కాబోయే భర్త ఎలా వుండాలి? అని ఓ పత్రిక శీర్షికని ప్రవేశపెట్టింది. అందులో మారుపేరుతో సుజాత కూడా ఒక ఉత్తరం రాసింది. అభిప్రాయాలకి విలువిచ్చేవాడు తననర్థం చేసుకుని లాలించి ప్రేమించేవాడు, గుండుసూది నుంచీ అణుబాంబువరకూ తెలిసినవాడూ, కట్నం ఆశించనివాడూ తన భర్త కావాలని అతడికి ఓ చిన్నమేడా, కనీసం మోటారుసైకిల్ అయినా ఉంటే మంచిదనీ దాని సారాంశం.

సినిమా జరుగుతుండగా హేండిల్‌బార్ మీద చెయ్యి చెయ్యి తగిలాయి. వెనక్కి తీసుకొన్న ప్రయత్నమేమీ చేయలేదు సుజాత.



**జి**ల్లా మొత్తంలో ఒక్క ఈ టౌనులోనే అధికార పార్టీ తరపున అంకినీడు ఎన్నికయ్యాడు. ఆయనకి అధిక ప్రాధాన్యం ఇవ్వక తప్పలేదు. జిల్లాకి ప్రాతినిధ్యం వహించేందుకై సహాయమంత్రి పదవైనా ఇవ్వాలని అంకినీడు డిమాండ్ చేస్తున్నాడు.

జిల్లా మొత్తంలో అభ్యర్థులు ఓడిపోయినా తాను గెలవటం వెనుక ఒక రహస్యం ఉంది. అది బహిరంగ రహస్యమే. విద్యార్థివర్గాల్ని తనకనుకూలంగా తిప్పుకొని వారిద్వారా నియోజకవర్గమంతటిలోకీ ముఖ్యమైన పట్టణాన్ని పట్టుకోవటం.

అంకినీడుకు కుడిభుజం శివాజీ.

శివాజీకి కుడిభుజం రమేష్.

ఎడమభుజం శంకర్రావు.

సమాజంలోకెల్లా అత్యంత శక్తివంతమయినది యువతరం. ఒక్కొక్కరూ ఒక్కో అయుధంవంటివారు. కొందరు మారణాయుధాలు. కొందరు అస్త్రశస్త్రాలు 'ఉక్కునరాల ఇనుపపిడికిళ్ల శక్తి' యువకులది.

యువకులలో పురోగామి విద్యార్థివర్గం. మార్గదర్శకత్వం విద్యార్థి నాయకులది. నాయకుల మార్గదర్శకత్వం వేరేమార్గంలోకి పోతే యువత అడ్డదారుల్లో పయనించక తప్పదు. తద్వారా వచ్చే సమస్యలకి అనేకమంది బలికాక తప్పదు.

మళ్లీ సరయిన నాయకత్వం కోసం అన్వేషణల ఫలితంగా కొత్త శక్తులు ఉద్భవిస్తాయి. వారు నాయకత్వస్థాయిలోకి వెళ్లాకగానీ వారి స్వభావం ఏమిటనేది తెలియదు. వారూ అలాంటి అడ్డదారులు తొక్కించేవారే అయితే చరిత్ర పునరావృతం అవుతుంది.

క్రిందటి ఏడాది స్టూడెంట్స్ యూనియన్ నాయకుడు శివాజీ. అధ్యక్షపదవి నిర్వహించాడు. సెక్రటరీగా రమేష్ ఎన్నికయ్యాడు.

అప్పుడు శివాజీ రెండవ సంవత్సరం బి.కాం.లో ఉంటే రమేష్ ప్రథమ సంవత్సరం బి.ఎ.లో ఉన్నాడు. ఇప్పుడు ఇంకొక పై ఏడులోకి జరిగారు.

చదువు అవసరమయ్యి కాదు. కాలేజీతో సంబంధం కొనసాగించటానికి అదొక వ్యాపకం. ఎన్నికలవరకే కాలేజీ కనపడేది. తర్వాత సాధారణంగా పట్టణ రాజకీయాల్లోనే తలమునకలవుతూ ఉంటారు. అప్పుడప్పుడు కాలేజీని 'విజిట్' చేసినా క్లాసుల మొహమైనా చూసెరగరు.

నాయకత్వం కేవలం పరువుప్రతిష్టలకి సంబంధించింది మాత్రమే అయితే వివిధవర్గాల మధ్య ఎన్నికల్లో ఘర్షణ అంత తీవ్రంగా ఉండదు. నాయకత్వం ఒక మత్తు.

నాయకత్వం ఒకమందు. ఒక నిషా.

కాలేజీకి సంబంధించి రాజకీయంగానేగాక ఆర్థికంగా కూడా లాభాలుంటాయి. కాలేజి ఫండ్స్‌ని భుక్తం చేసుకునే అవకాశం ఉంది. విద్యార్థి ప్రయోజనాల కోసం కేటాయించిన నిధులు మేనేజిమెంటు సాయంతో పంపిణీ

చేసుకోవచ్చు.

వేలరూపాయల సొమ్ము దుర్వినియోగం అవుతుంటుంది.

ఇక హాస్టలు సీట్లు అనుయాయులకే లభిస్తాయి. స్కాలర్‌షిప్పులలో అవకతవకలు తప్పనిసరి.

ఒకవర్గం నాయకత్వంలోకి వెళ్తే వ్యతిరేకవర్గం బలహీనపడుతుంది. తటస్థంగా ఉండే విద్యార్థులు రకరకాల అవసరాల కోసం నాయకుల్ని ఆశ్రయించుతారు.

సైకిల్‌ని స్టాండులో పెట్టుకోవటంనుంచీ లైబ్రరీలో పుస్తకం తీసుకోవటంవరకూ నాయకుల అవసరం ఉంటుంది. బాట్‌మింటన్ నెట్ దగ్గర్నించీ క్రికెట్‌లో వికెట్లవరకూ నాయకుల నియంత్రణాధికారం ఉంటుంది.

అందుకే వారి ప్రాపకం కోసం అనేకులు ప్రయత్నిస్తుంటారు.

ఇది జె.ఆర్.పీ. డిగ్రీ అండ్ జూనియర్ కాలేజ్ పరిస్థితి.

అటెండెన్స్ చాలకపోయినా ఇంటర్నల్ ఎగ్జామ్స్ అబ్సెంటయినా ఎప్పుడూ పుస్తకం తెరచి చూడకపోయినా రమేష్ శివాజీ వర్గీయులు సులభంగా గట్టెక్కారు.

అధికారం వారసత్వంగా సంక్రమించుతుంది మన సమాజంలో

ప్రధానినుంచీ పల్లెకు సర్పంచ్‌దాకా, డాక్టర్ నుంచీ యాక్టర్‌దాకా వారసత్వ వంశపారంపర్య స్వభావం కనబడుతూనేవుంది.

డాక్టర్ వీరయ్యనాయుడిగారి కుమారుడు శివాజీ.

సర్పంచ్ శాయోజీరావు కొడుకు రమేష్.

ఆయన పట్టణంలో ప్రముఖ వైద్యుడు. వ్యాపారి కూడా.

ఈయన పల్లెకు ఎదురులేకుండా ఎన్నికయిన సర్పంచ్. భూస్వామి.

పల్లెలను పట్టణాలు తోసిరాజని విస్తరిస్తున్నట్లు శాయోజీరావుని తోసిరాజనకపోయినా కలిసిరమ్మని స్నేహహస్తం అందించాడు వీరయ్యనాయుడు.

తండ్రినను సరించి రమేష్‌ని కుడిభుజం చేసుకున్నాడు శివాజీ.

అన్నిచోట్లా ఉన్నట్లే ఇక్కడా ప్రత్యర్థివర్గాలున్నాయి.

అంకినీడుకు మంగిరెడ్డి.

వీరయ్యనాయుడుకు సారంగధర్రావు.

శాయోజీరావుకి కృష్ణమూర్తి.

ఒకపక్కన కొందరు నిలబడితే ఎదురుగా అటుపక్కన ప్రత్యర్థులు నిలబడతారు.

అలాగే మంగిరెడ్డి, సారంగధర్రావూ. కృష్ణమూర్తి ప్రత్యర్థివర్గంగా ఏకమయ్యారు.

కాలేజిస్థాయిలో వీరికి కుమారరత్నాలు లేరు. అంచేత శివాజీకి పోటీ ఇవ్వగల నాయకుడికోసం వెదుకులాట మొదలయ్యింది.

ఎంతో కొంత విద్యార్థి సమస్యల గురించి హడావుడి చేస్తున్నది అరుణ్‌కుమార్. గత సంవత్సరంనుంచీ కాలేజిని అధ్వాన్నస్థితిలోకి తెచ్చిన శివాజీపై అతడు ధ్వజమెత్తాడు. సాధారణంగా ఒక బలమైన నాయకుడిపై తిరగబడే సత్తా ఎవరికి ఉంటుంది?

ఇంకో బలమైనవాడికి.

అరుణ్‌కుమార్‌కి ధనబలం లేదు. అతడు ఒక మధ్యతరగతి రైతుకొడుకు. చొరవ ఉత్సాహం ఇవన్నీ కొంచెం బలాన్నిస్తాయి. శివాజీపై విద్యార్థులకు పెరుగుతున్న వ్యతిరేకత ఇంకొంచెం బలాన్నివ్వొచ్చుగానీ ఢీ అంటే ఢీకి సరిపోదు. అందుచేత అతడు కులబలాన్ని సంపాదించాడు. మెల్లమెల్లగా తన కులస్థులైన విద్యార్థులు అతనికి దగ్గరయ్యారు.

కులసమస్య ఊరికే చోటుచేసుకోదు. ఇటుపక్కన శివాజీ కాలేజి స్టూడెంట్ కమిటీకి తన కులస్థులనే ప్రతినిధిగా చేశాడు ఒకరిద్దర్ని తప్పించి.

వ్యక్తి వ్యక్తికీ ఉండే మానవ సంబంధాలస్థానే క్రూరమైన సంబంధాలు ఈనాటికీ కులప్రాతిపదికపైనే ఏర్పడుతున్నాయి. మనదేశ కాలపరిస్థితులననుసరించి మనకి ఇష్టమయినా కాకపోయినా ఉంటున్న యదార్థస్థితి ఇది.

పల్లెపట్టుల్లో కులప్రాబల్యాన్ని ఏమాత్రం తగ్గించే ప్రయత్నం చేయకపోగా కులాలమధ్య సంకుల సమరం సాగించి అధికారాన్ని చేపడు

తున్నారు నాయకులు.

స్వకులస్థులనే చేరదీయటం స్వకులస్థుల తోనే చేరటం అనేది ఒక సంప్రదాయంగా, సంస్కృతీ లక్షణంగా వస్తున్నది. అది ఒక సమస్యగా తయారయ్యాకగానీ దాని స్వభావం అర్థంకాదు.

అంకినీడు నియోజకవర్గమైన ఈ పట్టణం కూడా దీనికి మినహాయింపు కాదు. చుట్టుపక్కల పల్లెలు... అక్కడినుండి వలసవచ్చినవారు పట్టణాల్లో స్థిరపడటం, పట్టణాల్లో ప్రాబల్యం సంపాదించుకోవటం, పట్టణానికీ పల్లెకు సంబంధాలు పెరగటం, రోడ్డు రవాణాల్లాంటివి అభివృద్ధి చెందటం, పల్లెకూ పట్టణానికి మెల్లగా వ్యత్యాసం పెరుగుతున్న సమయంలో కులసమస్య తారాస్థాయికి చేరటం ఇవన్నీ క్రమం తప్పనివి. ఆ గ్రామాల్ని పరిశీలిస్తే...

కులానికి ప్రాతిపదిక వృత్తి. ఒకప్పుడు కులవృత్తిని బట్టి కులంలోనివారు అంతా ఇంకో కులంనుండి విడిగా ఉండేవారు. వేరువేరు వృత్తులు వేరువేరు కులాల్ని సృష్టించితే కాలక్రమంలో ఒకేకులం వారందరూ ఒకే వృత్తి చేయటం తగ్గిపోవటంతో కులం ఛిన్నాభిన్నమవ్వాలి. ఇప్పుడు కులానికి ప్రాతిపదికయిన వృత్తిపని ఎవరూ చేయలేనట్లయితే, చేపట్టకపోయినట్లయితే కులం పోతుందా?

సరిగ్గా హేతువిరుద్ధంగా జరుగుతోంది. కులవిద్యల భౌతికపునాది నడలిపోతోంది. అదే సమయంలో కులవ్యవస్థ బిగిసిపోతోంది. ఈ రోజున ఒక కులంవారందరూ కాదుకదా ఒక కుటుంబంవారంతా ఒకే వృత్తిచేసే అవకాశం లేదు, ప్రత్యేక పరిస్థితుల్లో తప్ప.

ఒక ఇంట్లో తండ్రి కుండలు తయారుచేయొచ్చు. కొడుకు పోస్ట్‌మాన్ అయిఉండొచ్చు. అలా ఒక ఇంట్లో అందరూ ఒకేవృత్తి చేసుకోవటం లేదుకదా?

మరి కులవ్యవస్థ రోజురోజుకీ బలపడటానికి కారణం ఏమిటి? ఎక్కడ వుంది?

ప్రతి దానికీ గతం వర్తమానం ఉన్నట్లే భవిష్యత్తూ వుంటుంది.

మంచి భవిష్యత్తు మాత్రం అన్నిటికీ ఉండదు. కొన్నిటికే ఉంటుంది.

భారతదేశంలో వలసపాలన మొదలయ్యాక చేనేత, కుమ్మరం, కమ్మరంలాంటి వృత్తులు కుప్పకూలిపోయాయి. గ్రామీణ స్వయం ఆర్థిక వ్యవస్థ దెబ్బతింది.

అంటరానికులాలు మరింత అణగిపోగా మిగిలినకులాల్లో అస్థిరత్వం పెరిగిపోయింది. అభద్రత వ్యాపించింది. పారిశ్రామికీకరణం ద్వారా, ఆనకట్టలూ నదుల ద్వారా వ్యవసాయంలో వెంట్రుకవాసంత ఆధునీకరణం జరగటం ద్వారా గోదావరి, కృష్ణానది పరిసరాల్లో వ్యవసాయం అభివృద్ధి చెందటం, అభివృద్ధి ఫలితమైన విద్యా సాంస్కృతికరంగాల్లో నిపుణులవటం ద్వారా కొన్ని కులాలు మిగతా వాటికంటే పైకి వెళ్లగలిగాయి.

దీనర్థం కులంలోని అందరూ సంపన్నులయ్యారని కాదు. కానీ సాంఘికంగా, సాంస్కృతికంగా పైకి వెళ్లగలిగారు. ఆర్థికంగా కాకపోయినా ఇది కులవైషమ్యానికి దారితీసింది.

అన్నిటికీ అవకాశాలు లేని పరిస్థితి, అందరికీ అవకాశం ఇవ్వలేని పరిస్థితి ఏర్పడటంతో కులభేదాలు తీవ్రతరమయ్యాయి. స్వార్థశక్తులు నాయకత్వ స్థానంలోకి వచ్చారు.

తరతరాల సాంప్రదాయాల్ననుసరించీ, సంస్కృతి స్వభావాన్ని బట్టీ, రక్తసంబంధాలవల్లనూ ఒక కులస్థులందరూ తమలోని సంపన్నవర్గాలను అంటిపెట్టుకొని ఉండటం ఒక కులాన్ని అగ్రకులంగానూ,ఉ ఇంకొకదాన్ని నిమ్నకులంగానూ విడిపోవటానికి దారితీసింది.

నిర్మొహమాటంగా పరిశీలించక పోయినట్లయితే సమస్య తీవ్రతరమవుతుంది. ఎనభయ్యవ దశకం ముగింపు మానవచరిత్రకు నెత్తుటిమరక పూసి ఈ సమస్యను ఎత్తిచూపిస్తోంది.

దీనంతటికీ కారణమైన ఆర్థిక సామాజిక సాంస్కృతిక పునాదిని పునర్వ్యవస్థీకరించక పోయినట్లయితే ఇంకెన్నియినా నెత్తుటిగాయాల్ని చరిత్ర మోయక తప్పదు.

పెద్దచేపను చిన్నచేప మింగలేదు.

కానీ తనకంటే చిన్నచేపల్ని మింగగలదు.




అలా మింగుతూనే పెద్దచేపకు భయపడు తుంటుంది. దానిని ఎదుర్కొకపోతే ఎప్పటి కైనా ముప్పు తప్పదని భావిస్తుంది.

తనకంటే ఇంకా చిన్నచితకా చేపల్ని కూడ గట్టి పెద్దదాని భయం చూపించి అన్నింటిని ఏకం చేస్తుంది.

అలా ఏకమైనప్పుడు ఆ చిన్నచేపకు ఆహారం ఎలా? తమకు రక్షణ ఇస్తున్నందుకు కృతజ్ఞతగా మిగిలినవి ఆ బాధ్యతను తీను కుంటాయి. ఒక్కొక్కటి దాని నోట్లోకి వెళ్ళి ఆత్మత్యాగం చేస్తాయి.

చివరికి జరిగేదేమిటంటే ఈ చిన్నచేప పెద్ద చేపగా ఎదగటం. ఇక రెండు పెద్దచేపలూ ఒకదానికొకటి తమవారికి చూపిస్తూ వబ్బిం గడుపుకుంటాయి.

చిన్నాచితక చేపలు ఈ మోయలేనిభారా న్ని మోస్తూ కుంగిపోతూ చస్తూ బతుకుతూ తమ శక్తియుక్తులన్నీ పెద్ద చేపలకి నైవేద్యంగా అర్పిస్తాయి.

ఆ పెద్ద చేపకింద్రా, ఈ కొత్తగా పెద్దవయిన కొత్తచేపకింద్రా నలిగిపోతున్నవి ఒకటిగా ఆలో చిస్తే పెద్దచేపలు రెండూ కుప్పకూలిపోతాయి.

అలా ఆలోచించకుండా కులం సాయపడు తుంది. చిన్నాచితక చేపలు కులభేదాలు చద రంగంలో ఎదురెదురుగా నిలబడి చూస్తూ వుంటాయి. చస్తూ రాజును గెలిపిస్తుంటాయి. కానీ ఇద్దరూ రాజులనీ అవతలికినెట్టి చావు లేని పరిస్థితిని సృష్టించుకోవు.

తాము నాశనమైన తమ రాజు గెలిచేందుకై పోరాడతాయి.

దీనికి కారణం ఏ కులానికీ భద్రత లేకపో వటం. భద్రత లేనట్లు కనబడటం. భద్రతా రాహిత్యభావన కులవ్యవస్థను మరింత పటి ష్టం చేసింది.

పల్లెల్లోని కట్టుబాట్లు పట్టణంలో లేకపో యినా పట్టణంలో కూడా కులప్రభావం మెల్ల మెల్లగా పెరుగుతున్న దశలో శివాజీ తన వర్గాన్ని ఎన్నికల్లో నిలబెట్టాడు. సహజంగా అందులో ఎక్కువమంది అతడి కులస్థులే. అందరూ ఉన్నతవర్గాలవారే. సంపన్నుల పిల్లలే ఉన్నారు.

మొదట అది ఎవరూ పట్టించుకోలేదు. ఎన్నికల్లో నెగ్గాక జిల్లా రాష్ట్ర రాజకీయ సంఘట నలపట్ల అతడి వైఖరి కులాన్ని గుర్తించేట్లు చేసింది. పైకి ఎదగటానికి అతడు తన కులా న్ని వాడుకోదలిచాడు. అందుచేత అంకినీ డుకు అనుకూలంగా అంకినీడు సమస్యల్ని నెత్తికెత్తుకొని అధిష్ఠానవర్గం దృష్టికి తీసుకె ళ్లేందుకు కాలేజి విద్యార్థులచేత క్లాసులు బహిష్కరింపచేశాడు.

పట్టణ బంద్ ఒకటీ. అంకినీడుకు వ్యతిరేక మయిన ఒక ఆఫీసర్‌ని బదిలీ చేయించాలనీ. నిరాహారదీక్షలు ఒకసారీ, ఇవన్నీ శివాజీ ఫలానా కులస్థులనీ; ఆ కులప్రయోజనాలు రక్షిస్తున్నాడనీ ఎత్తిచూపాయి. దాని మూలంగా రెండు ఫలితాలు సాధించాడు.

ఒక కులప్రయోజకుడుగా పేరు తెచ్చుకోవ టంతో ఇతరకులాలవాళ్లు వ్యతిరేకవర్గంగా ఏకమవ్వసాగారు. అవతలి కులాలు ఒకటవ్వ టంతో శివాజీ కులస్థులందరూ అతడిని ఏకగ్రీ వంగా నాయకుడ్ని చేశారు. ఇది మొదటిది.

రెండవది కాలేజి మేనేజ్‌మెంట్‌తో ముడిప డివుంది. మేనేజ్‌మెంట్ అతడిని గు ర్తించింది. 'తమవాడే' అని శివాజీని స్నేహవ ర్గంలో చేర్చుకున్నారు. ఆ కాలేజీ స్థాపకులైన జమీందార్‌గారి వంశీకులే ఇంకా మేనేజ్ మెంట్ కమిటీలో ప్రెసిడెంటూ, సెక్రటరీగా ఉన్నారు.

వారికున్న లక్షల రూపాయల ఫ్యాక్టరీలూ, పొలాలూ రాష్ట్రంలోనూ రాష్ట్రంబయటా ఉన్నాయి. శివాజీ తమకు విశ్వాసంగా ప్రవర్తి స్తున్నాడు గనుకా విద్యార్థి నాయకుడిగా తమకు సమస్య కావటంలేదు గనుక అతడిని తమలో ఒకడిగా భావించుకున్నారు. అతడికి కావల్సినంత ఆర్థిక సహకారం లభించింది. కరస్పాండెంటూ కోశాధికారి కూడా జమీందారు గారి మనుమలే.

ఇక రాజకీయ సహకారం అంకినీడునుండీ ఎటూ ఉండనే వుంది.

ఇది పైవర్గాల సహకారం.

గ్రామాలనుండి పట్టణానికి వచ్చి కాలేజిలో చేరే వందలమంది విద్యార్థులు అతడి వెనుక సమీకృతమయ్యారు. అతడివల్ల తమ కులాని

కే మేలు జరిగిందో తెలియకపోయినా అతడి నాయకత్వాన్ని ఆమోదించారు.

ఇటు శివాజీలాగే అటు అరుణ్‌కుమార్ కూడా మెల్లగా ఎదగటం ప్రారంభించాడు.

అంకినీడు ప్రత్యర్థి మంగిరెడ్డి అతడి వర్గమూ అరుణ్‌కుమార్‌ని పైకి తెచ్చారు. అరుణ్ కుమార్ వట్టి కులప్రాతిపదిక మూలంగాకాక శివాజీపై తిరుగుబాటు ప్రకటించినవాడిగానే ఎక్కువ పేరు సంపాదించాడు.

ఈ విద్యాసంవత్సరంలో కాలేజి తెరిచాక విద్యార్థి ఎన్నికల్లో బలాబలాల్ని తేల్చుకునేందుకై ఇరువర్గాలూ సిద్ధంగా ఉన్నాయి.

కానీ ఎన్నికలు జరిగే ఆశలు సన్నగిల్లటంతో ఎన్నికలు సత్వరమే జరగాలని డిమాండ్ చేస్తూ క్లాసుల్ని బహిష్కరించారు. ఈ విషయంలో ఇద్దరూ కలిసే స్ట్రైక్‌కి పిలుపు ఇచ్చారు.

రవి జీవితంలో ఒక ముఖ్యమయిన సంఘటన జరిగింది-

కాలేజ్‌వైపు నడుస్తుంటే సారథి అనే ఇంటర్ విద్యార్థి కనబడ్డాడు. మామూలుగా రవి కొత్తవాళ్లని పలకరించడు. కాని ఇరవైరోజులు దాటినా ఒక్క క్లాసుకీ వెళ్లకపోవటంతో క్లాసుల గురించిన సమాచారం అడగటానికి అవసరమయింది.

సారథి చేతిలో నోట్‌బుక్‌మీద అతడి పేరూ, క్లాసూ రాసిఉన్నాయి.

' అవి చూసి రవే పలకరించాడు. అతడూ కలుపుగోలుగా మాట్లాడాడు.

"మా బ్రదర్ మారేజి ఉంది అందుకే ఈమధ్య కాలేజీకి రావటంలేదు. మన క్లాసులు నడుస్తున్నాయా?" అడిగాడు రవి అబద్ధంచెప్పి.

"ఆహా! బాగానే జరుగుతున్నాయి. ఇంగ్లీమకి ఎవరూ రావటంలేదు. ఆ లెక్చరర్ లాంగ్‌లీవ్‌మీద మద్రాను వెళ్లిపోయాడట. అక్కడ సినిమాల్లో డైలాగులు రాయటానికి ఛాన్స్ దొరికింది. ఈమధ్యన ఇంగ్లీమ సినిమాలే తెలుగులో రీమేక్ చేస్తున్నారుగా. ఈయన ట్రాన్సులేట్ చెయ్యాటానికి బాగా పనికివస్తాడని తీసుకెళ్లారు"

"ఎవరి సినిమాలకి రాస్తున్నాడు?"

"నటభయంకర సినిమాలు బాగా యాక్షన్ సినిమాలు. వాటికే పనిచేస్తున్నాడేమో! సరేగానీ ఎంత బ్రదర్‌మారేజయినా ఇరవైరోజులు ఆబ్సెంటయితే ఎలా? మాథ్స్ చాలా స్పీడుగా అవుతోంది. మీరు ఫాలో అవలేరు"

"ఆ!! అదే... తప్పలేదు. చుట్టాలూ, పెళ్లి పనులూ..." నసిగాడు రవి.

"అయితే మీకు తెలీదన్నమాట. కాలేజి జరగటంలేదిప్పుడు"

"ఏం? ఎవరో అన్నారుకానీ. ఎందుకో సరిగ్గా తెలీదు"

"సమ్మె చేస్తున్నారుగా. డిగ్రీ స్టూడెంట్స్ పిలుపిచ్చారు. ఈ సంవత్సరం ఎన్నికలు ఇంతవరకూ జరగలేదని. మూడు రోజుల నుండీ స్ట్రైక్ జరుగుతోంది. ఇవ్వాళ ఏంఅయ్యిందో తెలుసుకుందామని వచ్చా. మీరేమో తెలీక వచ్చారు"

"అయ్యో... ఎలాగిప్పుడు. ఎవరూ లోనికి పోవటానికి వీల్లేదుగా?"

"ఏమన్నా పనుందా మీకు?"

"ఈనెలకి స్టూడెంట్‌పాస్ తీసుకుందామని వచ్చాను. ఇవ్వాళే లాస్ట్‌డేట్. అప్లికేషన్‌మీద ప్రిన్సిపాల్‌గారి సంతకం కావాలి"

"ఏమోమరి... లోనికయితే వదలరు. అడిగి చూడండి"

రవి ఆందోళనగా నడవసాగాడు. రెండు రోజులక్రితం వచ్చిఉంటే పనయిపోయేది. తనేమో నటభీకర సినిమా పనిలో ఇరుక్కుపోయాడు. రమేష్‌ని కాదనలేక-

కాలేజి గేటుదగ్గరే నలుగురు నిలబడిఉన్నారు. వచ్చేవాళ్లని ఆపేసి వెనక్కి పంపేస్తున్నారు. సారథి, రవీ వాళ్లని సమీపించారు.

"వారంవరకూ క్లాసుల్లేవుపొండి. శలవులొస్తే వద్దంటారేం. హాయిగా ఇళ్లకుపొండి" అంటున్నారు వాళ్లు.

వచ్చినవాళ్లు ఇంటిముఖం పట్టారు.

సారథి రవితరఫున వాళ్లనడిగాడు లోపలికి




వెళ్లివస్తామని.

"ఎందుకూ? బుద్ధిమంతుల్లాగా క్లాసుల్లో కూర్చుంటారా?"

"కాదండీ... అప్లికేషన్‌మీద ప్రిన్సిపాల్ సంతకం కావాలి. ఇవ్వాళ్లే లాస్ట్‌డే"

వాళ్లు ససేమిరా వీల్లేదన్నారు. సారథి బ్రతిమాలుతున్నాడు.

రవి మాట్లాడలేకపోతున్నాడు. తన తరఫున సారథి అడగటం అతడికి గిల్టీగా ఉంది. పని తనది. పాపం అతడు బతిమాలుతున్నాడు. తనకేమో కొత్తవాళ్లముందు గొంతు పెగలదు.

కాసేపు ఆటగించుకొని చివరికి వదిలారు. అయితే ఒక్కరినే వదుల్తామన్నారు. సారథి బైట ఉంటానన్నాడు.

రవి లోపలకు ప్రవేశించాడు.

కాంపౌండ్ మొత్తం నిర్మానుష్యంగా ఉంది. ఒక్కడే బిక్కుబిక్కుమంటూ నడిచాడు ఆఫీస్ రూం వైపుకు.

క్లర్క్ ఒక్కడే కూర్చుని ఉన్నాడు. అతడు కాళ్లు టేబుల్‌మీద బారచాచి కూర్చున్నాడు. పనేమీ లేకపోవటంతో విశ్రాంతిగా ఉన్నాడు.

రవిని చూసి కళ్లెగరేశాడు.

"బన్ను... పాను... అప్లికేషనూ..." అంటున్నాడు రవి. మధ్యలోనే ఆపి

"ఓహో... సైన్ కావాలా? అలా ప్రిన్సిపాలుగారిని కలువు. ఏవోయ్ మంగపతీ... ఈయనగార్ని సార్‌దగ్గరికి తీస్కెళ్లు. సైన్ కావాలంట" వ్యంగ్యంగా అన్నాడు.

ఆ గొంతులో ఏదో శాడిజం కనబడుతోంది. వెళ్లు... నీ పని ఉందిలే అన్నట్లు నవ్వాడు అతడు.

ఆ నవ్వుకి మరీ ఆందోళన చెందుతూ ప్రిన్సిపాల్ గదివైపు నడిచాడు.

లోపలికి వెళ్లనని కాళ్లు మొరాయిస్తున్నాయి. మంగపతి వచ్చి రవి చెయ్యి పట్టుకొని లోపలికి లాక్కెళ్లాడు తప్పుచేసిన ఖైదీని జైల్లోకి తోసినట్లుగా.

లోపల కుషన్ ఛైర్లో కూర్చుని ఉన్నాడు ప్రిన్సిపాల్ సిద్ధప్ప.

అతడి కళ్లు సూటిగా రవిని చూస్తున్నాయి. వేడిగా సూర్యకిరణాల్లా తాకుతున్నాయి రవిని.

చేతులు వణుకుతున్నాయి. గుండె దడదడ... భయం... చెమటలు.

నిర్లక్ష్యంగా చూస్తూ వుండిపోయాడు సిద్ధప్ప. ఏమిటి ఎందుకు అని కూడా అడగలేదు. ఐదు నిముషాలు నిశ్శబ్దంగా కరిగిపోయాయి.

మంగపతే కదిలించాడు.

'సార్ ఈయనకు ఏమో సైన్ కావాలంట'

అతడెందుకో నవ్వుకుంటున్నట్లు కనిపించింది.

మంగపతి బైటకు పోయాడు. ఇప్పుడు సిద్ధప్పకెదురుగా రవి లోపల కుచించుకుపోతూ భయోత్పాతంతో తల్లడిల్లుతూ లేడిపిల్లలా నిలబడ్డాడు.

"క్లాసుకి వెళ్లవా?" ఉన్నట్లుండి కఠినంగా అడిగాడు... సిద్ధప్ప.

"లేదు సార్... ఈరోజు లేవంటే..."

"ఎవరు అంటే?"

"బైట ఎవరో"

"ఏబైట?"

"..."

"కాలేజీలో ఎందుకు చేరావు? బయటే చదవకపోయావా?"

రవి మొహం పాలిపోయింది. చేతులు నలుపుకుంటూ, తల వంచుకుని ఉన్నాడు.

"సరే! నీ అడ్మిషన్ కాన్సిల్ చేస్తాను. బైటకెళ్లి చదువు. ఇకనుండి కాలేజీకి రానవసరంలేదు"

బెల్లు నొక్కాడు సిద్ధప్ప. మంగపతి పరిగెత్తుకుంటూ వచ్చాడు.

"వీడి అప్లికేషన్ తీసుకురా. ఏరా నీ పేరేమిటి చెప్పు? ఏం చదువుతున్నావు?"

రవి మాట్లాడలేదు. కళ్లవెంట నీళ్లు తిరుగుతున్నాయి. ఎవరికీ కనిపించకుండా తల నేలలోకి వంచుకున్నాడు.

అందరూ నిశ్శబ్దంగా ఉండిపోయారు.

రవి చేతిలో నోట్సు బైటకి తీసి చూశాడు మంగపతి.



"రవికుమార్, యం.పి.సి. ఫస్ట్ఇయర్ ఇంగ్లీష్ మీడియం" చదివాడు పైకి.

"క్లర్క్‌నడిగి వీడి అప్లికేషన్ తీసుకురా. వీడు బైటే చదువుతాడంట. వాడి కోరిక మన మెందుకు కాదనాలి? ఏదీ ఆ నోట్సు ఇవ్వు"

మంగపతి నోట్సు అందించి బైటకు వెళ్లిపోయాడు.

నోట్సు తెరచి చూశాడు. లోపల ఖాళీగా వుంది. ఒక్క పేజీమీదకూడా ఏమీ రాసిలేదు.

"ఏంటీ ఖాళీగా వుంది? క్లాసులు ఎగ్గొట్టి తిరుగుతున్నావా?"

టప్‌మని రవి కాళ్లమీదకన్నీటి బొట్టు రాలింది. ఏడుపు అపుకుంటున్నాడు. లోపల ఆనకట్టలాగా కట్లు తెంచుకుని ఏడుపు రాబోతుంది.

ఆదుకోడానికి శివాజీ, రమేష్ ఎవరూలేరు. ఇలాంటి విషయాల్లో అసలు వాళ్లు జోక్యం చేసుకోరు. తప్పు తనదే. క్లాసులు మానేసి వాళ్ల వెంబడి తిరగటం. క్లాసులకి భయపడి ఇష్టంలేని విషయాల్లో జొరబడటం. ఒక్కరోజు అవకాశం దొరికినా ఇంతవరకూ అయిన పోర్షన్ పూర్తిచేసి నోట్సులు రానుకోవాలి. తను అమ్మా నాన్నలని మోసంచేశాడు. కాలేజికనిచెప్పి సినిమాహాళ్లలో కూర్చుని సమయం గడిపేశాడు.

అసలు క్లాసులంటే పాఠాలంటే ఎందుకు భయపడ్డాడు. తనమీద తనకే అసహ్యం వేస్తుంది. నిర్లక్ష్యంగా తన భవిష్యత్తు తనే నాశనం చేసుకున్నాడు. కాలేజీలో చేరేప్పుడు ఏంఅనుకున్నాడు? ఈసారి క్లాసులో అందరికంటే బాగా చదివి ఫస్ట్‌క్లాస్ తెచ్చుకోవాలనుకున్నాడు. రోజూ టైంటేబుల్ వేసుకుని ఒక్కో సబ్జెక్టూ లెక్చరర్‌కంటే ముందు ప్రిపేరయ్యి క్లాసులో అందర్నీ ఆశ్చర్యపరచాలనుకున్నాడు. టెంత్‌లాగా కాకుండా పరీక్షల్లో బాగా మార్కులు తెచ్చుకోవాలనుకున్నాడు.

ఏమైపోయింది అదంతా? ఏమైంది తనకు?

అసహ్యకరమైన పరిస్థితిలో ఇరుక్కున్నాడు. చేతులారా పీకలమీదకు తెచ్చుకొన్నాడు.



ఇప్పుడెలా? ఒక్కరోజు, ఒక్కరోజు అవకాశం ఇస్తే చాలు, చేసిన తప్పు దిద్దుకుంటాడు. ఇక రమేష్ వెంట తిరగడు. రేపటినుండీ బుద్ధిగా చదువుకుంటాడు. తను మారిపోయాడని ప్రిన్సిపాల్‌కి ఎలా తెలియాలి? ఆయనకి ఒక్క అవకాశం ఇవ్వాలని ఎలా తోస్తుంది. తనే అడగాలి. అవసరమైతే కాళ్లు పట్టుకోవాలి. అసలు గొంతే పెగలటంలేదు. బతిమాలటమే రావట్లేదు. కాళ్లెలా పట్టుకుంటాడు.

ముందు ఏడుపు ఆపాలి? ఏడ్చేవాళ్లంటే తనకి అసహ్యం. తనే ఏడుస్తున్నాడు. ఏడవబోతున్నాడు.

"ఊఁ... చెప్పు మాథ్స్‌లో ఏం చెప్తున్నారు?"

"తెలీదు"... "పోనీ ఇంగ్లీషులో"

"అసలు ఒక్క క్లాసన్నా అటెండయ్యావా?"

ప్రశ్నమీద ప్రశ బాణాల్లా వస్తున్నాయి.

వీటికి జవాబు లేదని సిద్ధప్పకీ తెలుసు. అయినా అడుగుతున్నాడు. అడిగి లాభంలేదు. కానీ ఎవడిమీది క్రోధమో ఇలా తీర్చుకుంటున్నాడు. రవిని బాధిస్తున్నకొద్దీ అతడికేదో ప్రశాంతత లభిస్తోంది.

దాదాపు అరగంటసేపు ప్రశ్నల ఫరంపర కొనసాగింది.

రవి ఇప్పుడు వెక్కుతున్నాడు. నోరు నొక్కుకుని నిశ్శబ్దంగా ఏడుస్తున్నాడు. ముక్కువెంట కారుతుంది. కళ్లు తడిసిపోయాయి. మోచేత్తో తుడుచుకుంటుంటే మొహమంతా తడితడిగా అయ్యింది.

సిద్ధప్పకి తృప్తిగా వుంది. ఇక ఈ ఆట ముగిద్దామనుకున్నాడు.

"సరే...ఒకపనిచెయ్యి. ఏడుపు ఆపి క్లాసుకెళ్లి కూర్చో. సాయంత్రం వచ్చి సంతకం పెట్టించుకో. మీసార్లందరూ నువ్వు క్లాసులో కూర్చున్నావని చెప్తేనే సైన్ చేస్తాను. అర్థమైందా? ఒక క్లాసైనా ఎగ్గొట్టావో తోలు తీస్తా. ఏడుపు ఆపమన్నానా? వెళ్లు. పోయి క్లాసులో కూచో. ఇంతవరకూ అయిన పోర్షనంతా రెండురోజుల్లో నువ్వు చదివి నోట్సు రాసుకుని తీసుకురా" అన్నాడు నోట్సు విసిరేసి. అది కిందపడింది.

రవి వణుకుతున్న చేతులతో నోట్సు తీసుకున్నాడు. జేబులోంచి చిల్లర గదంతా పడింది. ఒక్కటి వెదుక్కుంటూ ఏడుస్తూ కళ్లు తుడుచుకుంటూ, ముక్కుచీదుకుంటూ ఎలాగో చిల్లరని చేతుల్లోకి తీసుకున్నాడు.

స్ప్రింగ్‌డోర్స్ తోసుకుని బయటకు నడిచాడు.

క్లర్కూ, అటెండర్ మంగపతీ బైటే ఎదురుగా వున్నారు. వాళ్లకీ ఏదో తృప్తి లభించింది. నవ్వుకొంటూ మాట్లాడుకొంటున్నారు.

ఒక కుళాయిదగ్గర మొహం కడుక్కుని తన క్లాసు వెతుక్కుంటూ వెళ్లాడు. అప్పటికే ఒక నలుగురు విద్యార్థులు కూర్చొని ఉన్నారు. మాథ్స్ లెక్చరర్ దక్షిణామూర్తి ఏదో లెక్క చెప్తున్నాడు.

రవి వెళ్లి అందరికంటే వెనక కూర్చున్నాడు. ముందు బెంచీలో కూర్చుని ఉన్న కోటేశ్వరరావు వలకరింపుగా నవ్వాడు. రవి బలవంతంగా నవ్వేప్రయత్నం చేశాడు.

ఓ అరగంట భారంగా గడిచింది.

ఇంతలో డోర్ దగ్గర ఓ తల కనపడింది. ఆ మనిషి లోపలికి వచ్చి బైటకు తలపెట్టి కేకపెట్టాడు.

"ఇదిగో ఇక్కడున్నారోయ్... రండి" అన్నాడు.

"వచ్చేశారు... వచ్చేశారు" అనుకుంటూ కూర్చుని ఉన్నవాళ్ళు నిలబడిపోయారు. ఓ పదిమంది డిగ్రీ స్టూడెంట్లు లోనికి వచ్చారు.

దక్షిణామూర్తి లెక్చర్ ఆపేసి చూస్తున్నాడు.

వాళ్లు ముందువరసలో ఉన్నవాళ్లని అడుగుతున్నారు.

"ఏంతమ్ముళ్లూ? క్లాసులో బుద్ధిగా కూర్చున్నారు. తెగచదివేసి స్టేట్ ఫస్ట్ కొడదామనా?" ఎవరూ మాట్లాడలేదు.

రవి గుండె హైస్పీడ్‌తో రక్తాన్ని పంప్ చేస్తోంది. వీళ్లు కొడతారా? స్టూడెంట్స్ గురించి ఎవరెవరో అనుకుంటుండగా విన్నాడు. గ్రూపులుగా చీలిపోయి కొట్టుకుంటారట. తలలు పగిలిపోతాయట. పోలీసులు కూడా భయపడతారట. అనవసరంగా ఈరోజు వచ్చి ఇరుక్కుపోయాడు. ప్రిన్సిపాల్‌తో తిట్లుతిన్నాడు క్లాసుల కెళ్లలేదని. వెళ్లినందుకు వీళ్లు ఏం చేస్తారో?"

కోటేశ్వరరావు ముందుకు వెళ్లి ధైర్యంగా అడుగుతున్నాడు.

"ఒక్కమాట. అన్నా... మేం మీకు వ్యతిరేకం కాదు. మీతో ఏమీ తగాదా పెట్టుకోలేదు. జస్ట్... వచ్చి క్లాసులో కూర్చున్నాం. మేమూ మీకు సపోర్టే. ప్రిన్సిపాల్‌ని అడుగుదాం. అందరం వెళ్దాం. మేమూ మీతోటే వచ్చి డిమాండ్ చేస్తాం. క్లాసులు మానేయటం ఎందుకు? మానెయ్యకుండానే మన డిమాండ్లు సాధించుకోవచ్చు"

"ఎవడండీ ఈ మొనగాడు? సాధించి పెడతాడంట. మాకు చేతకాకే ఊరుకున్నాం. నువ్వొచ్చి ఇక సాధించిపెడతావు"

"ఏడాదికి నాలుగు నెలలే మనకి కాలేజీ జరిగేది. దాన్నికూడా బంద్‌లూ, సమ్మెలతో చెడగొట్టుకుంటే ఏం వస్తుంది. ఇంటిదగ్గర అమ్మా నాన్నలు ఎన్ని ఆశలతో వంపిస్తున్నారో తెలుసా?"

కోటేశ్వర్రావుని చూసి రవి ఆశ్చర్యపోతున్నాడు. ఎంత ధైర్యంగా నిలబడ్డాడు. వాళ్లని చూస్తేనే కాళ్లు చల్లబడిపోయాయి తనకి. అతదేమో నుంచొని వాదిస్తున్నాడు వాళ్లు ఊరుకుంటారా? కోటేశ్వర్రావుని వారించి అవతలకు తీసుకెళ్దామనుకున్నాడు.

ఎవరో అడగనే అడిగారు.

"ఏయ్! నీ పేరేంటి, ఏ ఊరు నుంచీ వస్తావు?"

"ఏం? కొడతారా? అంతకోపంగా ఉంటే ఇక్కడే తన్నండి రండి" కోటేశ్వరావు వాళ్లముందు కెళ్లి నిల్చున్నాడు.

దక్షిణామూర్తి హడావిడిగా బయటకు నడిచాడు.

"ఏంటి బ్రదర్? కొట్లటాలూ తన్నటాలూ అంటున్నావు. మాకు చేతకాదనా? మంచిగా చెప్తున్నాం. ముందు బయటకి నడవండి. మీరు కొత్త వాళ్లు ఇంకా తెలీదు. ఇక్కడవేరు, మీ ఊరులో నువ్వు హీరోవి కావచ్చు ఇక్కడ కాదు. ముందూ వెనకా చూస్కొని నడిస్తే నవ్వంగా ఉంటారు, లేకపోతే బొక్కబోర్లాపడి కాళ్లో చే




తులో విరగ్గొట్టుకుంటారు'' అన్నాడొకడు.

''ఊరంతా ఒకదారి ఉలిపిరి కట్టెది ఒక దారి అన్నట్టు నువ్వొక్కడివీ వీళ్లని వెనకేసు కొస్తున్నావు. ఏయ్ మీరు బైటకు పొండి. వీడొక డూ కూర్చుంటాడు తర్వాత తెలుస్తుంది'' ఇంకొకడు మిగతావాళ్లవైపు తిరిగి చెప్పాడు.

రవీ ఇంకోముగ్గురూ బైటకు నడిచారు. కోటేశ్వర్రావు కూడా నిస్సహాయుడిలా అనుసరించాడు. వాళ్లు మళ్ళీ మళ్లీ హెచ్చరించి వెళ్లిపోయారు.

అందరూ ఇంటిదారి పట్టారు.

రవి ఒక్కడూ మిగిలిపోయాడు.

దక్షిణామూర్తి సిద్ధప్పని తీసుకొని వస్తున్నాడు. ఏదో వివరిస్తూన్నాడు. వీలైనంత నెమ్మదిగా నడుస్తూ వచ్చారు ఇద్దరూ.

అప్పటికీ అందరూ వెళ్లిపోయారు.

''రాస్కెల్స్... వెళ్లిపోయారు, ఉంటేనా తోలు వలిచేవాడ్ని'' అని సిద్దప్ప వెనక్కి తిరిగాడు. వాళ్లెవరూ లేనందుకు సంతోషిస్తూ-

రవి వెనకే నడుస్తూ సిద్ధప్పని అడుగుతున్నాడు.

''సార్ సైన్ చేస్తామన్నారు''

''ఒరేయ్! నీకిందాకే చెప్పాను. సాయంత్రం వరకూ కనబడొద్దని. పోయి క్లాసులో కూచో. రూం దాటివచ్చావా నేనేం చేస్తానో నాకే తెలీదు''

''సార్!సార్!!'' అని ఆగిపోయాడు. సిద్ధప్ప వెనక్కితిరిగి నించొన్నాడు.

సిద్ధప్పకి పూనకం వచ్చింది. బి.పి.తో వణికిపోతున్నాడు.

ఆఫీసురూం దగ్గర్నుంచీ మంగపతి గ్లాసుడు నీళ్లతో టాబ్లెట్లుపట్టుకొని వస్తున్నాడు. స్టాఫ్ రూం బైట లెక్చరర్ల గుంపు వినోదంగా చూస్తున్నారు.

ఒక్కసారిగా కాలేజీ మొత్తం తలెత్తి సిద్ధప్పనే చూసింది.

సిద్ధప్ప కేకపెట్టాడు. అది చావుకేకలా ఉంది. అది పొలికేకలా ఉంది.

''నువ్వు చచ్చావురా! నా చేతిలో ఇవాళ నీకు చావు మూడిందిరా. నీ ప్రాణం తీసి పారేస్తా'' అని గొణుక్కుంటూ కీచుగొంతుతో అరుస్తూ ఉన్మదిలా చేతులు ఊపాడు. రవి ఒక అడుగు వెనక్కి వేశాడు.

అతడు నడుముకున్న బెల్టు ఊడతీసి పట్టుకున్నాడు.

''నీకూ నేను తేలికయిపోయాను కదరా! నేను ఫకీరుగాణ్నని నీకూ తెల్సిపోయిందిరా? నేను బిచ్చగాణ్ణనీ, నేను చవటననీ, చేతకాని వెధవననీ అనుకుంటున్నావురా? అది ప్రశ్నించటమో, స్వగతమో వాసిజ్ఞానమో తెలీదు. ట్రాన్స్‌లో ఉన్నట్టు అంటున్నాడు.

అతడు రవినే చూస్తున్నాడు. రవిని చూడనట్లు శూన్యాన్ని చూస్తున్నాడు. రవిని చీల్చుకుంటూ దూరంగా ఏ దృశ్యాన్నో దర్శిస్తున్నట్టు ఆకళ్లు నిస్తేజంగా ఉన్నాయి.

బెల్టుని ఝళిపించాడు. రవి దూరంగా జరిగాడు.

మంగపతి పరిగెత్తుకుంటూ వచ్చి సిద్ధప్పని పట్టుకొబోయాడు. అప్పటికే రవిమీదకు బెల్టు విసిరాడు. ఊహించని వేగంతో కొట్టాడు.

రవి వీపుచుట్టూ ఛెళ్‌మని మోగింది.

కాంపౌండ్ మొత్తం ప్రతిధ్వనించిందా అన్నట్టు రవి చెవులు దిమ్మెక్కిపోయాయి. రవి నేలమీద కూర్చుండిపోయాడు.

మంగపతి సిద్ధప్పని ప్రిన్సిపాల్ అన్న సంకోచం వదిలేసి నడుముని వాటేసుకుని బలమంతా వుపయోగించి నెట్టుకుంటూ లాక్కెళ్ళసాగాడు.

సిద్ధప్ప ఏదో అరుస్తున్నాడు మంగపతిని ఊపేస్తూ విడిపించుకోబోయాడు. మంగపతి ఉడుంపట్టు వదలలేదు.

రవికి వాంతయ్యింది. భళ్లున కక్కుకున్నాడు. తీవ్రమైన మానసిక కల్లోలం కడుపుని తిప్పేసింది. లోపలిదంతా బయటకు వచ్చేసింది.

ఒకవంక అసహాయస్థితిలో సర్వస్వం కోల్పోయిన బాటసారిలా దుర్భేద్యమయిన కోటలో చిక్కుకుపోయిన పావురంలా నిరాదరణా, ఆందోళనా మిన్నంటిన్నప్పుడు... తానొక్కడే ఈ



విశాలమయిన కాలేజీ ఆవరణలో మొహాన్ని చేతుల్లో దాచుకుంటూ ఆనకట్ట తెగినట్లు ఏడవసాగాడు.

ఆదుకోవటానికి ఏ ఒక్కరూలేని క్రూర సమాజంలో గాయపడిన లేడిపిల్లలా అతడు కుములుతున్నాడు.

ఎంతసేపు గడిచిపోయిందో తెలీదు.

ఎవరో రవిని నడిపించుకొంటూ దూరంగా వరండాలో బెంచీమీద కూర్చొబెట్టారు. పక్కనే కుండలో నీళ్లు లోటాలో వంపి తెచ్చిచ్చారు.

శక్తివిహీనుడిలా కూర్చుని ఉన్నాడు రవి.

ఒక వ్యక్తి నీళ్లని చేతుల్లోకి వంపుకొని అతడి మోహం కడిగాడు.

"ఇంకొంచెం నీళ్లు కావాలి. కుండలో లేవు గానీ కుళాయి దగ్గర పట్టుకురా సారథీ" అన్నాడతడు.

సారథి అటు నడిచాడు.

"రవీ... ఏయ్ ఇటు చూడు. ఏమిటిది చిన్నపిల్లాడిలా. ఏడవకు. ఇదిగో ఇటు చూడు. ఇంత సున్నితం అయితే ఎలా?" లాలనగా అడిగాడు ఆ వ్యక్తి.

రవి తలవంచుకొని ఇంకా కుములుతున్నాడు.

అతడు ఓదార్పుగా మాటలు చెప్తున్నాడు.

"నువ్వు గట్టిపడాలి రవీ... ఈ కాలేజ్ ఎలాంటిదనుకున్నావు. రాక్షసులూ, రాజకీయ బకాసురులూ కలిసి విద్యార్థి జీవితాన్ని ముక్కలుచేసి నంచుకుంటారు. నువ్వింకా స్కూలు వాతావరణంనుంచీ బయట పడలేదు. స్కూల్లో అంతా సవ్యంగా ఉందనికాదు. ఇక్కడ కంటే అది కొంత నయం.

ఈ పెద్ద పెద్ద బిల్డింగుల్లో చదువుకొందామని వస్తాం. చదువు కొనుక్కునేవాడే నిలుస్తాడుగానీ చదువుకొనేవాడు ఎందుకూ చెల్లడు.

మొదట లెక్చరర్లు పీక్కుతింటారు. నువ్వు ట్యూషన్‌లో చేరకపోతే ఇక అష్టకష్టాలు మొదలు. క్లాసులో నిలబెట్టి అడ్డమైన ప్రశ్నలూ వేస్తారు. ఏవో ప్రాబ్లమ్స్ సాల్వ్ చేయమంటారు. నీకు సమాధానాలు తెలీదు. ఇక వందల మంది విద్యార్థుల ముందు గేలిచేస్తారు. ఇంటికిపోయి గేదెల్ని కాయమంటారు. వీళ్లైనచాటల్లా నొక్కేస్తారు. ప్రాక్టికల్స్‌లో, ఇంటర్నల్ ఎగ్జామ్స్‌లో మన జుట్టు వాళ్ల చేతుల్లోనే ఉంటుంది.

పరీక్షాపత్రాలు అవుట్ చేస్తారు. ఇన్విజిలేషన్‌లో అవకతవకలు చేస్తారు. ఆన్సర్‌పేపర్లు మార్చేస్తారు. దిద్దేప్పుడు అవకతవకలు చేస్తారు.

సరే...చావంతా ఎవడు చస్తాడు. ట్యూషన్‌లో చేరితే సరిపోదనుకుంటే పొరపాటు. వాళ్లని కాకపట్టాలి. నేను నీ అనుచరుణ్ణని గుర్తుచేస్తూండాలి. ఇంటిపనులనుండీ వంటపనుల దాకా చేసిపెట్టాలి.

ఒకడికీ ఇంకొకడికీ పడదు. వీణ్ని పట్టుకుంటే వాడికి కోపం. వాడిని పట్టుకుంటే వీడు ఎగిరిపడతాడు. ఇద్దర్నీ మంచి చేసుకుంటూ మన శక్తియుక్తులన్నీ వీళ్లకే తగిలెయ్యాలి.

ఇక ప్రిన్సిపాల్‌ని చూడు. మేనేజింగ్ కమిటీ చేతిలో తోలుబొమ్మ. తలకిందులుగా నడవమంటే నడవాలి. నగ్నంగా గెంతమంటే గెంతాలి. చేతకాని దద్దమ్మలాంటివాడు. ఎందుకు ఎగిరిపడ్డాడనుకున్నావ్. పైనుండి పెద్ద షంటింగ్ వచ్చిఉంటుంది. ఎవడో వెనకునుండి ముడ్డిమీద తంతున్నాడు. అడకత్తెరలో పోకచెక్కలా విద్యార్థినాయకులకీ మేనేజ్‌మెంట్‌కీమధ్యనలుగుతున్నాడుఏదో చేయమని ఉంటారు. చెడామడా తిట్టివుంటారు. ఆ చిర్రుబుర్రులు తలకెక్కి పూనకం వచ్చింది.

నువ్వు దొరికావు. నీమీద మండిపడ్డాడు. వాడి విసుర్లకీ కసుర్లకీ తలవంచి భరించేవాడు దొరకాలి దొరికావు. ఇక కోపమంతా చూపించాడు.

నువ్వు ఎదురుతిరిగి ఒక్కమాటంటే గిజగిజలాడి చచ్చేవాడు.

అందుకే ఏడ్చిలాభంలేదు. ఇక్కడెవరూ నీమీద జాలిపడరు. నువ్వే తలెత్తి పరిస్థితుల్ని ఎదిరించాలి.

ఎదురించైనా బతకాలి. బానిసగిరీ అయినా చెయ్యాలి.

"ఒక్కడివే కుందేలులా నిలబడితే లాభం లేదు"

రవి మెల్లగా సాంత్వన చెందుతున్నాడు.





అతడి కంఠం మార్దవంగా, గంభీరంగా సూటిగా వినిపిస్తోంది. "శివాజీనే, అరుణ్‌కు మారో వీళ్లందరూ బలపడి మనపైకి ఎక్కి కూర్చున్నారంటే కారణం ఉంది. ఈ పరిస్థితుల్ని ఎదిరించలేక ఎవడికో ఒకడికి మనం శిష్యరికం చెయ్యాలి. ఎవడో ఒకడి అనుచరుడిగా మారాలి. 'ఫలానావాడి మనిషి' అని గుర్తింపు పొందాలి. లేకపోతే కాకులు పొడిచినట్టు పొడుస్తారు.

ఇదంతా వద్దనుకుంటే ఉండనే ఉంది. ఏదొకరోజు తలని ఏ రైలుకిందో పెట్టటం, అలా కాదనుకుంటే ఈ జంతువుల్ని తరిమికొట్టేందుకు నిలబడి పోరాడటం. బతకటంకోసం పోరాడక తప్పదు. మన అస్తిత్వంకోసం, మన మనుగడకోసం మనకోసం మనం యుద్ధం చేయాలి. లేకుంటే ఈ గుంటనక్కలు మనల్ని ఛిద్రం చేస్తారు. ఈ కాలేజీ ఎవరిది. మనది. ఎవరికీ భోజ్యంకాదు. మనది. మన స్వంతం. ఈ వ్యవస్థ, ఈ దేశం అన్ని మనవే. మనమే సంస్కరించుకోవాలి. మనమే పునర్నిర్మించుకోవాలి.

ఇప్పుడు పద... ప్రిన్సిపాల్‌ని అడుగుదాం. నీకు తోడు నేనున్నాను. ఇంకా అనేకమ్మంది వుంటారు. వాడు చేయగలిిందంతా చేశాడు. ఇంకేం చేయలేడు. చెప్పానుగా. చవట పెద్దమ్మ అని. ఆ బీపీ తగ్గిఉంటుంది. ఇప్పుడు అయినా బుర్ర స్వాధీనంలోకి తెచ్చుకుని ఉంటాడు. లేకపోతే మనమే సాయం చేయాలి"

రవిని నడిపిస్తూ ప్రిన్సిపాల్ రూం చేరుకున్నాడు.

లెక్చరర్లంతా అక్కడికి వచ్చారు. మంగవతి అడ్డంగా నుంచొని బతిమాలుతున్నాడు. వెళ్లిపోండి. మరోసారి అడగొచ్చు. ఆయన స్థితి బాలేదు అంటున్నాడు.

"మంగవతీ తప్పుకో. నీకు అనవసరం. ఒక విద్యార్థికీ, ప్రిన్సిపాల్‌కీ సంబంధించిన ఇష్యూ ఇది. ఎవరికీ సంబంధంలేదు. మీకు కూడా" అని లెక్చరర్లవైపు చూశాడు. వాళ్లు వెనక్కితగ్గి నిలబడ్డారు.

స్ప్రింగ్‌డోర్లు తోసుకుంటూ లోపలికి దారితీశాడు. సిద్ధప్ప కలవరపడిపోయాడు. అతడు రవిని ముందుకు జరిపి అన్నాడు.

"ఎవరిమీద దుగ్ధో ఇతడిమీద తీర్చుకున్నారు. విద్యార్థులంటే మీకు చులకన అయిపోయింది. నిజానికి ఈ కాలేజీలో ప్రతిఒక్కడూ మీకంటే అంతో ఇంతో సమర్థులే. ఏమీ చేయలేరని ఎగిరివచ్చారు. ఫలితం ఏమిటనేది మీకు తెలీదా? ఈ పిల్లాడు ఎంత హర్ట్ అయ్యివుంటాడు? రేపు ఇతడు ఆత్మహత్య చేసుకుంటే ఎవరు బాధ్యులు.

మీ స్వలాభంకోసం నిరుడు తలవంచి లొంగిపోయారు. ప్రోత్సహించారు. ఇవ్వాళ వాళ్లు మీ నెత్తిన ఎక్కి ఆడుతుంటే చేతగానితనంతో ఇదిగో ఇలా అక్కసు తీర్చుకున్నారు.

చెయ్యండి. మీ సంతకం ఏమీ విలువైంది కాదు"

సిద్ధప్ప భీతహరిణంలా చూశాడు.

అతడు తన అంతరంగాన్ని బయటకుతీసి ఒక్కోముక్క విడదీసి చూపుతున్నట్లు విడిపోయాడు. తన హృదయం తేటతెల్లమయినట్లు తన మననుమాలల్ని చూపుల్తో కాల్చివేస్తున్నట్లు భావించాడు.

మారుపలకకుండా వణికే చేతులతో సంతకంచేసి తలవంచి కూర్చున్నాడు.

అతడు అక్కడే రవిని చూస్తూ అన్నాడు.

"ఈయన్ని చూసి నువ్వు భయపడకు. అసహ్యించుకోకు. జాలిపడు. అర్థమైందా మన్నుతిన్నపాముని చూసి భయపడినా అర్థముంది. కానీ చచ్చినపాముని చూసి కాదు. చచ్చిన పాముని చూసి జాలిపడు. ఇక పద. ఇంకా చంపితే తెలుగు నుడికారంలా అవుతుంది"

రవి చెయ్యి పట్టుకుని బయటకు నడిచాడు.

సారథి వెనకే అనుసరించాడు రవి పుస్తకాలు పట్టుకొని.

రవి లోపల ఏదో పొంగుతోంది. కృతజ్ఞత కాదు అది. తీవ్రమైన ఆ భావాన్ని వర్ణించే శక్తిని కోల్పోయాడు. అతడు ఒప్పుకుంటే పాదాలు తాకుదామని ఉంది. ఒక ప్రవాహంలో ఊపిరాడని తనని ఒకేఒక్క హస్తం



రక్షించింది. ఆదుకుంది. అభయం ఇచ్చింది.

మరింత గట్టిగా అతడి చేతిని పట్టుకొన్నాడు.

అతడు రవి మోహంలోకి చూసి గుర్తించినట్లుగా నవ్వాడు.

"నీ పేరు రవని సారథి చెప్పాడు. నా పేరు అడగవామరి? నా పేరు సూర్యం"

ఇంకా రవి చెయ్యి సూర్యం చేతిని మరింత దృఢంగా చుట్టుకుంది. ఎన్నికల కోలాహలం.



విద్యార్థుల సమ్మె కారణంగా ఎన్నికలు జరుపుదామని ప్రకటించారు. ప్రిన్సిపాల్ సిద్ధప్పకి మేనేజ్‌మెంట్ మందలింపూ కరస్పాండెంటుగారి నుతిమెత్తని సభ్యమైన తిట్లూ తప్పలేదు.

క్లాసులు నడిపించటంలో విఫలమయినందుకు కరస్పాండెంటుగారే స్వయంగా కళ్లు చేతబూని కాలేజీని నడిపించేందుకు నడుం కట్టారు.

ఫలితంగా ఎన్నికల నోటిఫికేషన్ రూము రూముకీ తిరిగింది.

శివాజీ అరుణ్‌కుమార్‌లు తమ ప్యానల్స్‌లోకి ఎవరెవర్ని తీసుకోవాలో నిర్ణయించుకునేందుకు హడావుడి పడుతున్నారు. వాడు కాదనీ వీడూ ఇద్దరూ వద్దని మిగతావాళ్లూ రకరకాల అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తున్నారు.

అంకినీడు ఇంట్లో శివాజీవర్గం సమావేశమైంది.

ప్రధానమైన పోటీ శివాజీకి అరుణ్‌కుమార్‌కీ అనేది స్పష్టం.





స్పోర్ట్స్ కల్చరల్ విభాగాలకీ క్లాస్ రిప్రజెంటేటివ్‌లకి ఎవరెవరో కొంతవరకూ ఏకాభిప్రాయం కుదిరింది. అయితే సెక్రటరీ స్థానం గురించి మాత్రం తర్జనభర్జన మిగిలింది.

క్రితం సంవత్సరం రమేష్ ఆ స్థానంలో నిలబడి గెలిచాడు.

శివాజీకి విశ్వాసపాత్రులైన శంకర్రావుకి అన్యాయం జరగకూడదని ఈసారైనా సెక్రటరీ పదవికి అతడిని పోటీచెయ్యనివ్వమని పట్టుబడుతున్నారు అతడి మిత్రులు.

రమేష్‌కి ధనబలం, పరపతీ తండ్రి అండదండలూ ఉన్నాయి. తండ్రి శాయోజీరావుకి స్వంత ఊళ్లోనేకాక చుట్టుపక్కల పేరుప్రఖ్యాతులున్నాయి. ఆయన సర్పంచ్ కావటం కూడా రమేష్‌కి మరింత ప్లస్‌పాయింట్.

శంకర్రావుకి ఇవేమీ లేవు. మధ్యతరగతిలో కూడా దిగువస్థాయికి చెందినవాడు. అయితే ధనబలం లేకపోయినా గుండెబలం ఉంది. ఆ గుండెలనిండా శివాజీపై విశ్వాసం ఉంది. నమ్మినబంటులా ప్రాణమివ్వగల సత్తా ఉంది. శివాజీకి తప్ప మరెవరికీ తలవంచడు. అతడు ఆదేశిస్తే శత్రువర్గంలోకి వంటరిగానే దూసుకుపోయి ఆత్మత్యాగం చేసుకోగలడు. అరుణ్‌కుమార్‌కి ఉన్న నేపథ్యమే శంకర్రావుది. చెప్పాలంటే... డైనమిక్ నేచర్ అనొచ్చు.

ఈ కారణంగా విద్యార్థుల్లో రమేష్‌కంటే శంకర్రావుపై ఎక్కువ సదభిప్రాయం ఉంది.

ఎవర్ని ఎన్నుకోవాలో విషమ సమస్యగా ఉందిప్పుడు.

రమేష్ మొహం ముడుచుకుని కూర్చున్నాడు. శంకర్రావు ఎలా పోటీకి వస్తున్నాడో అర్థంకాలేదు. అతడికి పదవుల యావలేదు. ఎప్పుడూ శివాజీకి సన్నిహితంగా ఉంటాడు తప్ప మరే విషయాలలోనూ తనకిబ్బంది కలిగించలేదు.

అతడికి తెలీని రహస్యం ఒకటి ఉంది.

శంకర్రావుని నిద్రలేపి పదవికోసం నిలబెట్టింది శివాజీయే అనేది. రమేష్ తనకే పోటీగా తయారవ్వకుండా శివాజీ పన్నిన పథకం అది. అభిమానసంఘాల వ్యవహారంలో రమేష్ 'యువనాయకుడు'గా ఎదగటానికి అతడు ప్రయత్నించటం అతడు మర్చిపోలేదు.

ఎవరైనా తన వర్గంలో ఉన్నప్పుడు తన

నీడన పెరగాల్సిందే తప్ప స్వంతగా వేళ్లూను కొని పోటీ కావటం సహించటం కష్టం.

అరుణ్‌కుమార్‌ని ఎదుర్కోవటంకంటే తమలో తాము కుమ్ములాడుకోనటం ఎజెండా లోకి వచ్చింది.

శివాజీ లోపల అంకినీడు చర్చించి ఆయ న్ని ఒప్పించి ఒక ముఖ్యాతిముఖ్యమైన విషయం మనసులో ఉంచుకొని బయటకు వచ్చాడు. అతడి మోహంలో ఏ భావమూ కనిపించటంలేదు.

అందరూ ఆతృతగా చూశారు.

రమేష్‌వైపు తిరిగి దగ్గరికి రమ్మని పిలిచా డు అతడు.

నీరసంగా నడుస్తున్నట్లు వచ్చాడు రమేష్.

రమేష్ భుజంపై చెయ్యివేసి ఒకచెయ్యి లాల్చీజేబులో పెట్టి చిన్న ఉపన్యాసం ఇచ్చా డు.

ముందుగా కృతజ్ఞతలు చెప్పాడు. తనపై నిర్ణయించే బాధ్యత ఉంచినందుకు. అంద రూ ఐక్యంగా పురోగమించాలని పిలుపు ఇచ్చా డు. అంకినీడూ తాను కలిసి సెక్రటరీగా ఎన్నుకున్న వ్యక్తిని పరిచయం చేస్తానన్నాడు. అందరూ రమేష్ అనుకున్నారు.

రమేష్ మొహంలో చిన్నగా చిరునవ్వు మొ లకలు వేస్తోంది. తనకి అన్యాయం చెయ్యడు శివాజీ. లేకపోతే తనని పిలిచి భుజంమీద చెయ్యి వేయటం ఎందుకు?

ఆ చిరునవ్వు మొగ్గలు తొడిగి వికసించబో యేటప్పుడు బాంబు పేలింది.

"శంకర్రావుని మన సెక్రటరీగా నిలబెడు తున్నాం" అన్నాడు శివాజీ.

రమేష్ మిత్రులు అభ్యంతరం చెప్పబోయా రు. కానీ మెజారిటీ శంకర్రావు మిత్రులే. వాళ్ల హర్షామోదాల మధ్యా కేకలకిందా వేరే ఏమీ వికసించలేదు.

పదినిమిషాల తర్వాత సద్దుమణిగింది.

రమేష్ ఖిన్నుడై నుంచొని ఉన్నాడు.

"ఇది అన్యాయం! రమేష్ మనకోసం ఎంత కష్టపడుతున్నాడు? ఆయన సంగతే మిటి. ఇదంతా కుట్ర. ఈ ఎన్నికని మేం వ్యతిరేకిస్తున్నాం" అన్నాడు నళినీమోహన్. అతడు రమేష్ అనుచరుడు.

'వీణ్ణి గుర్తుంచుకోవాలి' అనుకుని రమేష్ మోహంలోకి చూశాడు.

అతడు ఏమీ బయటపడలేదు.

"వెల్... ఇంకా ఎవరయినా ఉన్నారా? అభ్యంతరం చెప్పదలుచుకున్నవాళ్లు స్వే చ్ఛగా, నిస్సంకోచంగా చెప్పండి. మనది ప్రజా స్వామ్యయుతమైన వైఖరి. ఆ స్ఫూర్తితోనే ప్రవ ర్తిద్దాం. ఏమ్మా... ఇంకెవరయినా ఉన్నారా" నళినీని అడిగాడు.

"ఏమో? ఎవడికి తెలును. మీరు నిర్ణ యించాక ఎవరు అడ్డుచెప్తారు? ప్రజాస్వా మ్యం అంటున్నారుగా. రమేష్‌కి న్యాయం చేయండి చూద్దాం. ప్రజాస్వామ్యాల సూత్రాల ప్రకారం అందరికీ సమాన న్యాయం జరగా లిగా" సవాలు చేస్తున్నట్లు నిలబడ్డాడు నళినీ.

"శభాష్ ఫ్రెండ్... ఇదీ. ఇదే నేను కోరు కుంటున్నది. అవసరమైతే నాయకుల్ని ప్ర శ్నించగలగాలి అనుచరులు. ఇప్పుడు రమేష్‌ని మీకు పరిచయం చేస్తున్నాను. అందరికీ తెలిసినవాడేగా అనుకుంటు న్నారా?" ఆగాడు అందర్నీ పరిశీలిస్తూ. ఎవ రూ మాట్లాడలేదు.

"మీట్ అవర్ ఫ్రెండ్... ప్రెసిడెంట్ రమేష్" రమేష్ చెయ్యిఎత్తి గాలిలోకి లేపేశా డు శివాజీ.

ఒక్కసారిగా కలకలం రేగింది. హోరున కోలాహలం మిన్నుముట్టింది. రమేష్‌కు జైలు కొట్టారు. అభినందలు చెప్పారు. నళినీ మొహం నల్లబడింది.

రమేష్ నమ్మలేని ఆశ్చర్యంలో వున్నాడు.

శివాజీమీద చెప్పరాని గౌరవం కలిగింది. తాను స్వయంగా తప్పుకొని తన స్థానాన్ని త్యాగం చేశాడు. ఇంకా నయం తొందరపడి చెడగొట్టలేదు. బైటకుపోయి 'స్వంత కుంపటి' పెడదామనుకున్నాడు. శివాజీకి ఎదురుతిరి గితే తన పరువుపోయి ఉండేది.

అందరూ ఏకగ్రీవంగా శివాజీ గురించి ఆందోళన వ్యక్తం చేశారు.

తనకేం ఫర్లేదనీ... మీ వెనుకే ఉంటాననీ



అదీగాక అంకినీడుగారికి మరింత సాయం చేయటానికై రాష్ట్ర రాజకీయాల్లో పాల్గొనదలిచా ననీ అందుకు అందరూ ఐక్యంగా ఒకపై సహకరించాలని అభ్యర్థించాడు.

అతడు తప్పుకోవటం బాధగా వున్నా ఇంకా ఎదుగుతున్నందుకు ఆనందిస్తూ అందరూ ఛీర్స్ చెప్పి 'లైట్'గా డిన్నర్ పార్టీలో పాల్గొని శలవు పుచ్చుకున్నారు.

శివాజీ ప్రయోగించిన చాణక్య సూత్రం రమేష్‌కి అర్థంకాలేదు.

అరుణ్‌కుమార్‌కి వ్యక్తిగతంగా మంచి పేరు వచ్చింది. అధికారంలో ఉన్న వాళ్లపై నెగటివ్ ఫీలింగ్ ఎప్పుడూ ప్రత్యర్థులకే సాయం చే స్తుంది. అరుణ్‌కుమార్ గెలుస్తాడనేది తిరుగు లేని సత్యం. అందుకే దాన్ని తనకనుకూలంగా మార్చుకున్నాడు శివాజీ.

మొదటిది తన పరువుపోకుండా ఓడిపో యానన్న అపఖ్యాతి అంటకుండా తప్పించు కున్నాడు.

రెండవది. రమేష్ ప్రెసిడెంట్ పదవికై అరుణ్‌కుమార్ చేతిలో భంగపడతాడు. ఆవి ధంగా రమేష్‌ని దెబ్బకొట్టాడు.

మూడవది సెక్రటరీ స్థానంలో అటువైపు వీక్ కాండేట్ నిలబడుతున్నాడు. అతడిపై గెలవబోతున్నది రమేష్ కాదు శంకర్రావు. అంటే కాలేజి ప్యానెల్‌లో తమ తరపున ఒక శంకర్రావే గెలుస్తాడు. రమేష్ లేకుండా వుంటే కాలేజి కూడా తన గుప్పెట్లో ఉంచుకునే అవ కాశం వుంది.

ఎలాగూ ప్రెసిడెంట్ పదవి అరుణ్‌కుమార్ దే. మిగతా వాటినైనా నిలబెట్టుకోవాలి. రమేష్ కి ప్రాధాన్యత ఇచ్చినట్లు కనబడి తన ప్రాధా న్యత పెంచుకున్నాడు శివాజీ. అలా తనవ ర్గంపై తిరుగులేని పట్టు సంపాదించాడు.

ఇంత రాజకీయం నెరవకపోయినా అరుణ్ కుమార్ కూడా అదే స్థితిలో ఉన్నాడు. కొత్త గాబట్టి గాబరా పడుతున్నాడు. అసమ్మతిని అణిచేసేందుకు బుర్ర తిరిగేట్టు ఆలోచనలు చేస్తున్నాడు. ఒక్కడే అయితే జుట్టు పీక్కోవా ల్సివచ్చేది.

మంగిరెడ్డిలాంటి పెద్దలు తలా ఓ చెయ్యి వేసి చక్రం అడ్డేశారు. నెత్తిమీద పడబోయే బండల్ని చిటికెనవేలుతో ఎత్తివేసినట్లు అతడి సమస్యల్ని పరిష్కరించారు. ఇంకా వాళ్లనుంచీ నేర్చుకోవాల్సింది ఉంది. రాజకీయం అంటే ఇదా? అని ఆశ్చర్యపడ్డాడు అతడు.

అతని ప్రతి అవసరానికీ పరిష్కారం మంగి రెడ్డి దగ్గర దొరుకుతోంది. అతడి పరాయీ కరణం అంతటితో పూర్తికాలేదు.

అంకినీడు ఎమ్మెల్యే స్థాయినుంచీ మంత్రివ రకూ ఎదగటం కోసం శివాజీ వేసే ఎత్తుగడల్ని తిప్పికొట్టాల్సిందిగా మంగిరెడ్డి ఆదేశించారు.

తన ఆర్థిక హార్దిక అవసరాలు మంగిరెడ్డే తీర్చుతున్నాడు గనుక తాను సాయం చేయవ ల్సిందే. కానీ అంకినీడు ఎవరు? అతడితో తనకేమిటి సంబంధం? అతడు మంత్రి అయితే ఏమిటి కాపోతే పోయేదేమిటి?

పోనీ మంగిరెడ్డి చెప్పినట్లు చేద్దామనుకు న్నా ప్రెసిడెంట్‌గా పోటీ చేయటానికే గిజగిజ లాడుతున్నాడు తను. ఇంకా ఆ శివాజీ ఎత్తుగ డల్ని ఎదుర్కోవటం అలా వుంచి తెలుసుకోను కూడా లేదు.

మార్గమేమిటి? అని తడుముకుంటున్నా డు.

మంగిరెడ్డి ఖరీదైన చిద్విలాసమే మార్గం చూపించి ఉంటుంది.నీ వెనకే అని అభయం ఇచ్చింది. మార్గదర్శకత్వం నెరపటమూ, ధన బలం మందిబలం ఇవ్వటమూ అయితే చూ సుకుంటాడు. తాను చేయాల్సిందల్లా దూసు కుపోవటం.

బలాబలాల్ని సమీకరించటం పూర్త యింది.

ఇక ఎలక్షన్ల రోజునేగానీ జయాపజయాలు తేలవు. ఇంకా రెండురోజుల వ్యవధి వుంది.

★ ★ ★

అరుణ్‌కుమార్ గెలుపు మేనేజ్‌మెంట్‌కు ఊహించని దెబ్బ. అనేక ఏళ్లుగా స్టూడెంట్ కమిటీలు వారి చేతుల్లోంచే నడిచిపోయాయి. తమకి తలనొప్పి కలిగించకుండా సహకార ధోరణితోనే ప్రవర్తించారు అనేకమంది.

శివాజీ కూడా అంతే. తాము కోరుకున్నదాని కంటే ఎక్కువ సహకారాన్ని అందించాడు.




కాలేజికి నిధులు సేకరించేందుకు ఒక సంస్థ ఉంది 'జెఆర్‌పీ అకాడమీ' అనేది. అమెరికాలాంటిచోట్ల ఉండే తెలుగువారి నుండీ, విదేశాంధ్రులనుండీ పెద్దఎత్తున నిధులు సేకరించి అకాడమీ ఆధ్వర్యాన పంపిణీచేస్తారు. విద్యాదానం గొప్పదని నమ్మినవాళ్లూ, తమపేరు నిలిపోతుందనుకున్నవాళ్లూ కూడా లక్షలమొత్తంలో అకాడమీకి డొనేట్ చేస్తారు. ఆయా విరాళాలకు పన్నులబాధ ఉండదు. నిర్భయంగా దానం చెయ్యొచ్చు.

ఇంకా విద్యార్థుల తల్లిదండ్రులు కూడా కాలేజీ పురోభివృద్ధికోసం స్వచ్ఛందంగా తోచినంత విరాళమిస్తారు.

ఇవ్వకపోతే సీటు దొరకటం కల్ల అని అందరికీ తెలుసు.

ప్రభుత్వం డొనేషన్లు రద్దుచేస్తామని ప్రకటించింది. తన చట్టాల్లో రద్దుచేసిందేమో కూడా! అయినా అకాడమీకి స్వచ్ఛంద నిధులు పోగవుతూనే ఉన్నాయి.

బి.యస్.సి.లో ఎలక్ట్రానిక్స్ కంప్యూటర్, సైన్స్ లాంటి కొత్త సబ్జెక్టులు క్రితంసంవత్సరం ప్రవేశపెట్టారు. కంప్యూటర్ జనరేషన్... ఇరవయ్యొకటో శతాబ్దం... అన్ని ప్రకటనలు చదివి చేరబోయే మెరిట్ స్టూడెంట్స్ ఖంగుతిన్నారు.

కంప్యూటర్ సైన్స్ తీసుకోవాలంటే పదమూడు వేలూ, ఎలక్ట్రానిక్స్‌కి పదివేలూమాత్రం విరాళంగా ఇచ్చుకోవాలి. నిజానికి ఇరవైఐదువేలు తీసుకోవాల్సిఉంది. కొత్తబిల్డింగ్స్‌కీ, కంప్యూటర్స్‌కీ, ఇతర పరికరాలకీ కేవలం విద్యార్థుల పై దయాభావంతో మేనేజ్‌మెంట్ సగం భరిస్తుందనీ, మిగిలిన సగభాగం తల్లిదండ్రులే చెల్లించాలని కమిటీ పెద్దలు చెప్పారు.

ఆ ఇంటర్వ్యూలూ, కాల్‌లెటర్లూ అంత రహస్యంగా నిర్వహించటం ఎందుకూ? ప్రభుత్వం అనుమతిస్తే... మామూలుగానే చెయ్యవచ్చుకదా అనేది ఆ స్టూడెంట్స్‌కి అర్థంకాని ప్రశ్నగా మిగిలింది.

అప్పుచేసీ, పొలాలమ్మీ ఎలాగో తెగింపుతో కొందరు ఆయా కోర్సుల్లో చేరారు. కొత్త బిల్డింగ్స్ ఇంకా పూర్తికాలేదు. పునాదులు పడ

లేదుకాబట్టి.

పైఅంతస్తులోని లేడీస్ వెయిటింగ్ రూమ్‌ని చెట్లకిందకి మార్చి ఆ రూమ్‌లో కంప్యూటర్ క్లాసులు జరుపుతున్నారు. మూడు పీ.సీ.లకి ఆర్డరిచ్చామన్నారుగానీ అవి బెంగుళూరు నుంచి రావాల్సివుంది.

ఈలోగా టైపు నేర్చుకోమనీ, తద్వారా కంప్యూటర్ కీబోర్డుని ఈజీగా ఆపరేట్ చెయ్యొచ్చుని చెప్పటంతో కొందరు త్వరపడి టైపుకి వెళ్లటం మొదలుపెట్టారు. వారిప్పుడు టైపు హయ్యర్ కూడా పాసయిపోయారు.

ఎందుకైనా మంచిదని మిగిలినవాళ్లు కూడా టైపు నేర్చుకుంటున్నారు. కనీసం ఆ సర్టిఫికెట్ అయినా దక్కుతుందని.

నిధులకు సంబంధించేకాక ఇలాంటి తరగతుల నిర్వహణలోని అవకతవకలు ఏ స్టూడెంట్‌కమిటీ కూడా పట్టించుకోలేదు.

కంప్యూటర్‌యుగం శివాజీ కాలంలోనే ప్రారంభమయింది. విద్యార్థి నాయకుడుగా అతడికి కమిషన్ ముట్టింది. అదీ వేలలోనే.

ఎన్నికల్లో ఖర్చు పెట్టినదానికి కనీసం పదిరెట్లయినా రాకపోతే ప్రెసిడెంట్ అవ్వటం అనవసరం అని అతడి నిశ్చితాభిప్రాయం. అప్పుడు పదివేలకుపైగా ఖర్చయింది. ఎంతరాబట్టాడనేది అతడి ప్రావీణ్యతకు గీటురాయి.

ఈ ఏడాది ఆ ఖర్చూలేదు. అంకినీడు వ్యాపకం సంపాదించాక టౌనులోని చిన్నాపెద్దా దుకాణాలనుండీ పెద్ద వ్యాపారస్థులదాకా స్వచ్ఛందసాయం చేశారు. అతడి శక్తి కాలేజీ దాటి పట్టణ పొలిమేరలదాకా విస్తరించింది.

ఈసారి గెలుపు వరించకపోయినా పెట్టిన ఖర్చుకు ఇరవైరెట్లు మిగిలిందని గిట్టనివాళ్లనుకోవటం అబద్ధం కాదు.

కాలేజికి అనుబంధంగా ఉన్న హాస్టళ్ళ తంతు మరొక పర్వం.

కాలేజీనానుకొని మామూలు హాస్టలు బిల్డింగ్స్ ఉన్నాయి.

దూరంగా పొలాల్లో ఎస్సీ, ఎస్టీ హాస్టలు ఉంది. ఇక్కడ కూడా జమిందారుగారి సాంప్రదాయం అవిచ్ఛిన్నంగా కొనసాగుతోంది. దానినే ఎస్సెమ్ హాస్టలని కూడా అంటారు.

ఆ హాస్టలుకి ప్రధాన వార్డెన్‌గా కాలేజీ ప్రిన్సిపాలే ఉంటాడు. ఆయనచే నియమించబడిన ఒక వ్యక్తి వార్డెన్‌గా పని చేస్తుంటాడు. ఫిజిక్స్ లెక్చరర్ రామ్మూర్తి ఇప్పుడు వార్డెన్‌గా ఉన్నాడు. ప్రిన్సిపాల్ సిద్ధప్పకి ఏ విధమైన శ్రమాలేకుండా ఆయన్ని జోక్యం చేసుకోనీయకుండా అతడే నిర్వహిస్తున్నాడు. మెస్ సెక్రెటరీగా స్టీవెన్సన్ అనుచరుణ్ణి నియమించాడు.

సిద్ధప్పతో ప్రమేయం లేకుండానే అతడు కరస్పాండెంటుతోనో, మరొకరితోనో డైరెక్టుగా నిర్వహణ గురించి చర్చలు జరిపి విద్యార్థుల సమస్యలు పరిష్కరిస్తూ వచ్చాడు.

టి.జె. కాలేజి హాస్టలుకీ దీనికీ తేడా ఉంది.

అక్కడ వార్డెన్‌కే సర్వాధికారాలు, సువర్ణ రాజు అక్కడ రారాజు. పై అధికారులు సాంఘిక సంక్షేమ శాఖనుండీ వస్తే వారికి టౌనులోని లాడ్జిలో ఏసీరూములు ఏర్పాటు చేసీ మందు, విందులు పెట్టించీ, కొంత చదివించుకొనీ వదిలించుకొంటాడు. ఆయా అధికారులు కనీసం హాస్టలు దిక్కుకు కూడా పోయి ఉండరు.

స్కాలర్‌షిప్పులు కోతకి గురవుతాయి. ప్రస్తుతం మెస్ ఛార్జీక్రింద ఒక్కొక్క విద్యార్థికి వచ్చే నూట ఇరవై రూపాయలతో నెల మొత్తం భోజనం ఖర్చు వెళ్లిపోవాలి. రెండు పూటలా భోజనంపెట్టాలి. అంటే నాలుగు రూపాయలతో రోజు గడవాలి.

నీళ్లసాంబారు, పాచిపోయిన అన్నం, పురుగులూ - రాళ్లూ, వాంతులూ విరేచనాలూ, కడుపునొప్పి ఆకలీ ఇవన్నీ తప్పనిసరి.

నూట ఇరవై చాలవనీ, రెండొందలకి పెంచాలనీ విద్యార్థుల డిమాండ్. చాలవనేది ఒట్టిమాట. సువర్ణరాజు తొంభై రూపాయలతోనే సరిపెట్టగలడు. కేవలం రూపాయి ఖర్చుతో పూటభోజనం పెట్టి మిగిలిన ముప్పైయీ జేబులో వేసుకోకపోతే కొత్తగా డాబా ఎలా కట్టగలిగాడు. ఏడాదికి లక్షకు పైగా ఎలా మిగుల్చుకున్నాడు.

పై అధికారికి కొత్త మోటారు సైకిల్ ఎలా బహూకరించగలిగాడు?




ముందే వంటమనిషిని నియమించేటప్పుడు జాగ్రత్త తీసుకొన్నాడు. బాయమ్మ అనే మనిషి నలుగురు కూతుళ్లనీ, అవిటి భర్తనీ పోషించేందుకై సువర్ణరాజుకి లొంగిపోయింది. తన మనిషే వంటలక్కగా నియమించబడితే ఎదురులేకుండా హాస్టల్‌ని ఏలొచ్చు.

వార్డెన్‌ల గోత్రాలు వంట మనుమలకెరుక.

అందుచేతనే బాయమ్మ ఉప్పూ - పప్పూ తీసుకుంటే అడ్డు చెప్పలేకున్నాడు. తన మనిషే అనే కారణం ఒకటి. వంటకోసం ఎంత సరుకు వాడి, ఎంత మిగల్చుకుంటున్నాడో ఆవిడ అంకెలూ వివరాలతో సహా చెప్పగలదు అనేది ఇంకొకటి.

పై అధికారులని డీల్ చెయ్యటంలో వంట మనిషి పాత్ర విస్మరించరానిది. వంటమనుమల సూత్రాలు పనిమనుమల కెరుక.

పనివాడికి బాయమ్మ చులకనైపోయింది. వాడి శరీర బాధ గురించి ఆమెని బెదిరిస్తూంటాడు. ఇంటికి చేరేసే సరుకులలో వంతు అడుగుతాడు. ఇవ్వకపోతే సువర్ణరాజు గురించి ఆమె భర్తకు చేరేస్తానంటాడు.

వారి వీరి గోత్రాలు విద్యార్థుల కెరుక.

దాగు రామస్వామి ఈ అవక తవకల గురించి సూర్యంతో చెప్పారు. అతడు మిగిలిన పిల్లల్ని సమీకరించి వాళ్లతో ఒకరోజు పాచికూడు తినకుండా నిరాహారదీక్షచేయించాడు. బంగారంలాంటి పాచిపోయిన అన్నం పరబ్రహ్మస్వరూపం కాబట్టి విద్యార్థులకి పాపం అంటుకుంటే దానికి విమోచన లేదని బాధపడి సువర్ణరాజు నర్సిమ్మని పిలిపించాడు. అప్పటికి స్టీవెన్సన్ ఇంకా బలపడలేదు.

గాంధీనగర్ అనే పేటలో దొంగసారా తయారవటం విచిత్రం కాదు. గాంధీనగర్ బ్యాచ్ అంటే నర్సిమ్మ ముఠా అవటం వింత కాదు. టౌనులో గాంధీనగర్ బ్యాచ్ అంటే తెలియని వాళ్లులేరు గాంధీగారెవరో ఎప్పుడో మర్చిపోయినా.

నిరాహారదీక్షకు కూర్చున్న పిల్లలకి క్రమశిక్షణ నేర్పేందుకు నర్సిమ్మ ముఠా రంగంలోకిదిగింది. దారుణంగా కొట్టి ఒక్కొక్కరి నోరూ పగలదీసి అన్నం తినిపించారు. ఆ రాత్రే సూర్యం మీద దాడి జరిగింది. రూంలో నిద్రపోతున్న అతడిని బయటకు పిలిచి తల పగలగొట్టి పారిపోయారు. సూర్యంతో సంబంధం పెట్టుకొంటే వీపులు పగులుతాయని పిల్లలకి అర్థమయింది. అప్పటినుండీ అతడికి పిల్లలు దూరమైపోయారు.

జెఆర్‌పీ హాస్టల్స్‌లో పరిస్థితి వేరు. ఇక్కడ స్టీవెన్సన్ అనే యువకుడు ఉన్నాడు. వార్డెన్ వాటా తక్కువ. అన్నంలో పురుగులుండవు అదే తేడా.

మిగిలినవన్నీ మామూలే.

మరుగుదొడ్లకీ, మంచినీళ్లకీ కరువే. పాడుబడిన చీకటి కూపాలయిన గదులు, అంటురోగాలూ, సిబ్బంది వేధింపులతో విద్యార్థులు కృశించిపోతున్నారు. యమయాతనలువడి నిత్య సమరంలో గెలిచేందుకు యత్నిస్తారు వాళ్లు.

వార్డెన్ రామ్మూర్తికి సువర్ణరాజంత మిగులు ఆదాయం లేదు. తనపై ఉండే మేనేజ్‌మెంట్‌తో వాటాల పంపిణీలో అతడికి మిగిలేది తక్కువ.

సాంఘిక సంక్షేమ సూత్రాల ప్రకారం రోజుకు రెండు కూరలూ, రెండు రోజులకి ఓసారి కోడిగుడ్డూ, వారానికోసారి మాంసం ఇవ్వాలి. కాని ఆచరణలో వాటిని గురించి ఆలోచించటమే, కోరుకోవటమే సాధ్యంకాదు.

చద్దన్నమే పరమాన్నం, కారమే కూర. నాసిరకం ఆహారం. ఇసుకా... రాళ్లూ.

అయితే దీనికి మరొక పార్శ్వం ఉంది.

అధికారులకి లంచమిచ్చి రికమండేషన్లు పెట్టి, బూటకపు సర్టిఫికెట్లూ పెట్టి కొందరు చేరుతూనే ఉన్నారు. ప్రభుత్వం కల్పించిన అవకాశాలు దుర్వినియోగం అవుతున్నాయి.

నిబంధనల ప్రకారం హాస్టల్‌కి ఐదు కిలోమీటర్ల అవతలి గ్రామాల విద్యార్థులకే ప్రవేశించే అర్హత ఉంటుంది. నకిలీ పత్రాలూ ముడుపుల సాయంతో స్థానికులు కూడా చేరుతున్నారు.

ఈ నరక కూపాల్లాంటి హాస్టల్స్‌లోకి ప్రవేశించటంకోసం ముడుపులు కట్టాల్సిన అవసరం వచ్చిందంటేనే వారి ఆర్థిక స్థితిగతులు అర్థంచేసుకోవచ్చు.

ఈ విద్యార్థుల ఉత్తీర్ణతా శాతం చాలా



తక్కువ. అనేక ఏళ్ళ తరబడి వారు హాస్టల్ లోనే ఉండిపోవటానికి ప్రయత్నిస్తారు. తిండి కోసం తప్ప మరి కనపడరు.

వీళ్ళకు తిండి ఖర్చు వృధాగా అవుతుందనీ, ప్రభుత్వం తమని దోచి వీళ్ళకు పెడుతోందనీ జనం అనుకుంటారు. ఏవగింపుగా, హీనంగా చూస్తారు.

తిండికి చాలకపోయినా షోకిల్లాగా కనబడాలని కొందరు విద్యార్థులు ప్రయత్నించటం వారి అభిప్రాయాలకు బలమిస్తోంది. తమలోని ఆత్మన్యూనతా భావాన్ని కప్పిపుచ్చుకొనేందుకు వికారమైన మేకప్‌తో, వస్త్రధారణతో ఘరానాగా వ్యవహరించబోయి తేలికగా బయట పడిపోతారు. ఎంత ఆధునికమైన దుస్తులు ధరించినాగానీ వాటిలో సుఖంగా ఇమడలేక సులభంగా పట్టుబడిపోతారు.

అరుణ్‌కుమార్ గెలుపుకి వాళ్ళూ తోడ్పడ్డారు.

మేనేజ్‌మెంట్‌తో అతడి వైఖరి ఎలా ఉంటుంది, ఎంతమేరకు కలిసి వస్తాడనేది ఊహించలేక పోతున్నారు.

విద్యార్థుల సమస్యల పరిష్కారానికి ఏ పద్ధతిలో ప్రయత్నిస్తాడు?

కొత్తలో గట్టిగా ఉండి, తర్వాత మెత్తపడిపోయేవాళ్ళున్నారు.

కొత్తలోనే మెత్తబడి నీరుగారిపోయేవాళ్లూ ఉన్నారు.

భౌతిక జీవితంమీద విరక్తి చెందిన యోగుల్లా తమ లోకంలో తాము ఉండే వాళ్లూ ఉన్నారు.

ఇందుకు భిన్నంగా అరుణ్‌కుమార్ చూపు ఇక్కడలేదు. అది కాలేజీ గోడల్ని దాటి పట్టణం పైగా ప్రసరిస్తోంది. ఇక్కడ నాయకత్వం ఇక సంవత్సరమే ఉంటుంది. అధికారం పరిమితంగా ఉంటుంది.

పట్టణాన్ని పట్టుకోగలిగితే తను నిలదొక్కుకోగలడు. సమాజంలో ఉన్నతస్థానాన్ని పొందటానికి కొన్ని మార్గాలుంటాయి. అవి తెలుసుకోగలగటమూ, ఆ మార్గాల్లో నడవటమూ, అడ్డంకులు అధిగమించటమూ చేస్తేగానీ కృషి ఫలించదు. అనుకొన్నది నెరవేరదు.

తనకంటే ముందే ఆ మార్గాన పోతున్న శివాజీ అడ్డుకోగా అన్నాడు తనకి.

అతడ్ని దెబ్బతీస్తేగానీ విస్తరణ సాధ్యంకాదు.

కానీ అతడికి ఉన్న అనుభవం తనకిలేదు.

రాజకీయంగా ఓనమాలు నేర్చుకొనే దశలోనే ఉన్నాడు. పరిపక్వతలేదు. దూరదృష్టితో భవిష్యత్తుకు పునాదులు తీయటం ఇంకా తెలీదు.

లేడికి లేచిందే పరుగన్నట్లు కాక నెమ్మదిగా ఆలోచించి మరీ అడుగువేయాలి.

అతడికి ఉన్న అవకాశాలు తనకిలేవు.

మేనేజ్‌మెంట్ తోడ్పాటు తనకి ఉండదు. శివాజీకి ఉంది.

అడ్మిషన్స్‌లోనే గూడుపుఠాణీ జరిపి తమకు అనుకూలమైన వాళ్లని ప్రవేశపెట్టారు. సైన్సు గ్రూపులో ఈ ప్రభావం బాగా కనిపిస్తుంది. అనేకమందికి సీట్లు ఇప్పించుకొన్నాడు శివాజీ.

టీచింగ్‌స్టాఫ్, హాస్టల్‌వార్డెన్‌తోసహా మెజారిటీ శివాజీకి అనుకూలం. అసలు టీచింగ్ స్టాఫ్ నియామకాలే అందుకు తగినట్లు జరిగాయి. తన బంధువుకి లెక్చరర్ ఉద్యోగమిప్పించటం శివాజీ పలుకుబడికి నిదర్శనం. అలాంటివారినీ తను ఎదుర్కోవాల్సింది. అరుణ్‌కుమార్ ఆ పనిలోనే ఉన్నాడు.

★ ★ ★

రామ్మూర్తి జమాఖర్చులు రాస్తున్నాడు. మెస్‌కి అవసరమయిన పప్పూ, బియ్యంలాంటి సరుకులు ఇక కిరాణా వ్యాపారస్థుడు పంపించాడు. బిల్లుకీ, వచ్చిన సరుక్కీ పొంతనలేదు. బస్తా పప్పు తెచ్చినట్లు బిల్లులో ఉంది కానీ ఇరవై కిలోలు తక్కువగా ఉంటుంది. ఆ ఇరవై కిలోల ఖరీదులో దుకాణాదారుడికి కొంత పోగా మిగిలింది రామ్మూర్తీ అతడిపైవాళ్లూ పంచుకుంటారు.

ప్రభుత్వం నిర్దేశించిన సూపర్ మార్కెట్ల లోనే నిత్యావసర వస్తువులు కొనుగోలు చెయ్యాలని ఒక సూచన ఉంది. కానీ దూరం అనే వంకతో ఆ పనిచెయ్యటంలేదు. తాను కొనే కిరాణా దుకాణం టౌనుకా చివర అంతకంటే ఎక్కువ దూరంలో ఉందనేది వేరే సంగతి.




అక్రమాలు యాధాతథంగా కొనసాగేందుకు తన మేధావితనం అంతా ఉపయోగిస్తాడత డు.

అసలు ప్రభుత్వమే నేరుగా హాస్టళ్లకు పంపిణీ చేస్తే ఈ విషయంలో మిగులు ఆదాయం ఉండేది కాదు. కానీ అప్పుడు ఇంకో పద్ధతి వెతకరని నమ్మకంలేదు.

హాస్టల్ వెనక ద్వారం నుంచీ దుకాణాలకి తక్కువ ధరకి నల్లయి చేసి అమ్మేయనూ గలరు.

ఆటో ఆగిన చప్పుడు వచ్చింది.

రామ్మూర్తి ఉలిక్కిపడి కిటికీలోంచి చూశా డు. అనుకోని పరిశీలకులు రాలేదు కదా?

ఆటోలోంచి స్టీవెన్సన్ దిగుతూ కనిపించా డు.

"ఈ గాలి వెధవ ఆటోలో దిగాడేం" అను కుంటూ మళ్లీ వెనక్కి వచ్చి పనిలో మునిగాడు.

ఐదు నిముషాల తర్వాత స్టీవెన్సన్ గొంతు వినిపించింది.

"హల్లో రామ్మూర్తీ సాబ్! రావచ్చా?"

మొహంనిండా నవ్వు పులుముకొని ఆహ్వా నించాడు రామ్మూర్తి. స్టీవెన్సన్ మురికి బట్టలు వేసుకొని ఉన్నాడు. వాటినే వారం నుండీ వేసుకుంటున్నాడు. అవి ఫ్యానుగాలికి రెపరెప లాడుతుండగా వచ్చి కూర్చున్నాడు.

ఓ పక్కన తన పని చేసుకుంటూనే అతడు వేసే ప్రశ్నలకి జవాబిస్తూ సంభాషిస్తూ అర గంట గడిపాడు. అప్పటికీ స్టీవెన్సన్ వదల్లేదు.

కాస్సేపటికి రామ్మూర్తి అనుమానం నిజం చేస్తూ అడిగాడు.

"సాబ్... ఈ నెల కొంచెం ముందే... ఇస్తారే మోనని" నసుగుతూ అడిగాడు అతడు.

"ఏంటి నాలుగురోజుల్లోనే మళ్ళీ ఇవ్వాలా. ఇచ్చినవి ఏం చేశావు. అప్పుడే ఉష్ కాకీనా?"

"లేద్సాబ్... మనోళ్ళు రాధికా దగ్గర కనబడ్డా రు. కుర్రోళ్ళు సరదా చేద్దామంటే... చూడండి. రెండొందలు నేనే ఇచ్చొచ్చా. అయినా సాబ్ మనకి అవసర పడుతారు. ఇవాళ్రేపు కాలేజీలో గ్రూపులు ఎక్కువయిపోయినయి. రేపెవడన్నా ప్రాబ్లమయితే మనకి హెల్ప్ అందుద్ది. ఇయా లెట్లుందంటే పైసాయే పరమాత్మ. అయిస్తే గానీ ఎవడూ సాయం రాడు. దానుకోనేప్పుడు దానుకోవాల. ఖర్చెట్టాల్సిన చోట ఖర్చెట్టాల, సాబ్ కామాత్రం తెలీదా?"

"అసలు అదికాదు... ప్రతిదానికీ నామీద పడితే ఎట్లా? నేనెక్కడ సముదాయించుకురా వాలి? కరస్పాండెంటు నించీ అన్నీ ఆళ్లయేన య్యే. చివరికి ఈ ఎకౌంట్స్‌ని ముగ్గురు శల్యప రీక్షచేస్తారు. నీకిస్తే ఆ బరువు నామీద పడు తుంది. నీకెట్లా ఇవ్వాలిరా నాయనా!

"పోనీ సాబ్ ఈ ఒక్కసారికి మరిచ్చె య్యండి. రేపే నేను కరస్పాండెంట్‌కి చెప్తా. నెక్ట్స్ టైమ్ ఆయన దగ్గరే తీస్కుంటూ"

ఊఁ! సర్లే... ఈ వందా ఉంచు. ఈ సారి చూద్దాం. అవునుగానీ ఎవడయినా చెకింగ్ కొస్తే పీకలమీదకొస్తుంది. నువ్వేమో ఓ రూం మొత్తం అక్రమిస్తివి అబ్బుబ్బబ్బ. ప్రాణాలు పోతున్నాయ్ సర్దుకోలేక"

"ఊఁ! అట్లనే అంటరు ఏం లాభం నాకేమో ఓ పాకయినా కట్టియ్యరు"

"ఆ! ఇక డాబాలు కట్టించి నీకే ఇస్తాం"

"సరే సాబ్ వస్తా... థాంక్స్ సాబ్"

నాలుగురోజుల క్రితమే అందిన వాటాని వాడేసుకొని మళ్ళొచ్చాడు స్టీవెన్సన్. స్టూ డెంట్స్‌ని కంట్రోల్ చేయగలడని తప్ప మరో కారణం లేదు అతడ్ని పోషించటానికి అన్ని రకాల అవసరాలకీ ఆదుకుంటాడు. తన మి త్రుడి సాయంతో న్యాయపరమైన సలహాలు పొంది ఆచరిస్తుంటాడు. ఏయే పద్ధతుల్లో అయితే పలలోంచి తప్పించుకోవచ్చు అనేది ఆ సలహాల సారాంశం.

స్టీవెన్సన్ ఎవరో ఎవరికీ తెలీదు. అతడికి కుటుంబం ఉందా లేదా అనేదికూడా గోప్య మైన విషయం. అతడి నివాసం ఈ హాస్టల్ లోనే మూడో అంతస్థులోని పెచ్చులూడిపోయిన ఓ గదిలో ఉంటాడు. ఆ గదిలో ఐదుగురు విద్యార్థులుండాలి. వాళ్లని కిందకి తరిమి తానొ క్కడూ ఆక్రమించుకున్నాడు. అతడి డిగ్రీ చదువు ముగిసి ఐదేళ్లవుతోంది. ఇక కోర్టులో అప్పుడప్పుడు కనిపిస్తాడు. కారణం అతడో అడ్వొకేట్. 'లా'పూర్తి చేశాడు. కానీ హాస్టల్‌ని మాత్రం వదలలేదు.



అసలు ఏ కేసూ తగలకపోవటంచేత నానా మార్గాలు తొక్కి సంపాదిస్తాడు. అతడికి పది మంది అనుచరులున్నారు. వీళ్లందర్నీ కరస్పాండెంటుగారు పోషిస్తారు. ఇంకా పై సంపాదన వారి శక్తితాహతులను బట్టి ఉంటుంది. రాత్రి కరంటు పోయిన సమయాల్లో గొలుసులు కొట్టేయటం, బెదిరించి డబ్బుగుంజుకోవటం నుండి సినిమాటిక్కెట్లు బ్లాక్‌లో అమ్మటం, వీలుకుదిరినప్పుడు ఇళ్లల్లో దొంగతానాలు చేయటం వరకూ సాధ్యమైనన్ని చేస్తారు.

అతడి స్నేహితుడు సాధుకూడా లాయరే. అతడు సివెన్సన్‌కి మంత్రిలాంటివాడు. చురుకైన బుర్ర. ఎలాంటి ఇబ్బందులూ ఎదురవ్వకుండా ఏ పద్ధతిలో పనిపూర్తి చేయాలో చెప్తాడు. ఇతడు చేయిస్తాడు. అనుచరులు చేస్తారు.

వాళ్ళందరూ మామూలుగా ఏదొక వృత్తిపని చేస్తుంటారు. వెల్డర్‌గా హొటల్ వర్కర్‌గా సైకిల్ రిపేరు చేసే మెకానిక్‌గా ఇలా పనులు చేస్తుంటారు. ఆ పనులు తాత్కాలికమైనవి. అవి పోగానే మరొకరకంలోకి దిగుతారు. కార్మిక వర్గంలో దిగిజారి పోయిన మడ్డిలా ఈ పనుల్లో స్టీవెన్సన్‌కి సాయపడతారు. అదో లోకంలోని వికృతత్వానికి ప్రతీకలు వీళ్ళు.

స్కాలర్‌షిప్‌ల గురించీ తిండి శుభ్రతా వగైరాల గురించి విద్యార్థులు అడిగేందుకు భయపడతారు- కారణం స్టీవెన్సన్. క్రూరంగా ప్రవర్తిస్తాడు వారితో. అనేక ఏళ్లుగా ఆ హాస్టల్ మీద బ్రతుకుతున్నాడు. ఒక్కసారి ఏదోక మారుపేరుతో విద్యార్థిగా కొనసాగుతాడు. ఈ మధ్యన అదీ లేదు. ఏమాత్రం నిఘా, భయం లేకపోవటంతో విచ్చలవిడిగా తిరుగుతున్నాడు.

వంద నోటుని జేబులో పెట్టుకుంటూ మెట్లెక్కుతున్నాడు స్టీవెన్సన్. వెనకనుండి ఎవరో పిలిచారు. కిందకి చూశాడతడు. బసవకోటి అనే సెంకడ్ ఇంటర్ స్టూడెంట్. ఏదో రహస్యం చెప్పాలన్న తహతహ కనిపిస్తోందతడిలో.

"ఏరా? ఏమయింది" అడిగాడతడు.

"ఇవ్వాళ నీకు పండగేనన్నో" అన్నాడు బసవకోటి ఆనందంగా పైకి వస్తూ.

"ఇట్టారారా! ఊ! చెప్పు ఏందీ కత?"

కాస్సేపు గుసగుసలాడాడు బసవకోటి.

"అన్నోయ్! ముందే పిలవబాకు. ఆడికి డౌటు వత్తది. చివర్లో కాత్తి వదిలుంచు అప్పుడు నేనే ఒత్తా" జాగ్రత్తలు చెప్పి వెళ్లిపోయాడతడు. స్టీవెన్సన్ రెండో అంతస్థులో ఆగిపోయి వరండాలోకి నడిచాడు. చివర గది ముందు మూసి ఉన్న తలుపులకు చెవి ఆన్చి లోపల సంభాషణ కాస్సేపు విన్నాడు. తనకు కావల్సిన వ్యక్తి లోపలే ఉన్నాడు.

"ఏరోయ్ శ్రీనివాసా? అరేయ్ నేనేరా. తలుపుతీయరారేయ్" తలుపుమీద కొడుతూ పెద్దగా పిలిచాడు. లోపల ఖంగారు పడినట్లు శబ్దాలు ఆగిపోయాయి. ఎవరో గబగబా వచ్చి తలుపు తెరిచారు. తీసినవ్యక్తి అతడిని చూసి పక్కకు తొలిగినుంచున్నాడు.

స్టీవన్సన్ లోపలకి రెండు అడుగులు వేసి రూంని పరిశీలించి చూశాడు.

తన గదిలాగే పెచ్చులూడి, ఫ్లోరింగు పగిలిపోయి, దుమ్మూ ఇసకాతో ఉందా గది గోడకు కొట్టిన మేకులు చుట్టూ నెర్రలు కనపడుతున్నాయి. అక్కడ దండెంమీద గుట్టలు గుట్టలుగా చొక్కాలూ లుంగీలూ వేలాడుతున్నాయి. అలమరలో నాపరాళ్లు పగిలి ఉన్నాయి.

రూం మధ్యలో నాలుగు చాపలు. వాటిమీద నలుగురు నుంచుని అతడినే బెదురుగా చూస్తున్నారు. వారిలో ఒకరిని ఉద్దేశించి అడిగాడతడు.

"ఏరా శ్రీనివాసా? ఏందిరా మీటింగెట్టావు. నామీదేనా?"

"మీటింగా?... కాదన్నా. ఏదో క్లాసులగొడవ"

"జాగర్తగుండరా తమ్మీ. ఏంది అన్నకు దెల్వకుండానే దాస్తున్నావు?"

"నీకు దెల్వకుండానా? ఏందన్నా అది"

"ఇయ్యాల నీకేదో వచ్చింది గదరా? ఆదీ నేనడిగేది"

"అదా అన్నా! ఈ నెల జరంత కావాల్సుండి. నీకు నేనే చెప్దామనుకుంటుంటే నువ్వే వచ్చినావు. అమ్మకి పంపాలె. కాలు చచ్చుబడి పోద్దేమో" రుద్ధమైన స్వరంతో చెప్పున్నాడతడు. అతడి తల్లికి పక్షవాతం మొదలయింది.




స్టీవెన్సన్ గోడకు ఆనుకొని ఉన్నా చాపమీద పడుకున్నాడు విశ్రాంతిగా. తల కిందకి పక్క చాపలమీది దిళ్లను కూడా లాక్కుని కాళ్లు బారచాచాడు.

"అదంత నాకు చెప్పొద్దు రోయ్. కహానీలు కాదు నాక్కావల్సింది పని. పని జరగాలె ఓ పావుగంటలో ఎల్లోచ్చేయ్. రామ్మూర్తి నడిగి ఓ సైకిల్ దీస్కుపో. రెండు బిరియానీ. ఒకటి హాటు. నీకు బ్యాండు దెల్సుగా. ఓ పావుకిలో మిర్చిబజ్జీ. ఇంకో పావు పకోడి. ఓ పాకిట్టు సిగిరెట్లు. ఈ చాల్లే నేను నిద్రలేసేప్పటికవి ఉండాలి. ఈనెల టైటుగుంది కదర. జేబు బోరుకొడుతుంది. ఓ పాతిక ఇచ్చుకొని పో. రాత్రిల్లా నిద్రలేదురా. కూసింత సేపు కళ్లు మూస్త. తల దిమ్ముగుంది. ఈ త్వరగా చెప్పిన పంజెయ్యి. కళ్లు తెరిచేసరికి ఇక్కడుండాలి"

అది సీవెన్సన్ ఆదేశం. శ్రీనివాస్‌కి నెత్తురు భుగభుగ ఉడుకుతుంటే ఏమిచెయ్యలేక తల బాదుకొని అతడు చెప్పిన ఏర్పాట్లు చేశాడు- తనకందిన స్కాలర్‌షిప్పు డబ్బులను ఖర్చుపెట్టి.



**న**ళినీమోహన్ సాగర్‌తో మాట్లాడుతున్నాడు. ఒక చెట్టుకింద నిలబడి ఉన్నారిద్దరూ- రమేష్ రెండురోజులుగా తన ఇల్లు వదిలి బయటకురాలేదు. అతడిగురించి బాధపడు తున్న నళినీని ఓదార్చుతున్నాడు సాగర్.

ఆ ఇద్దర్నీ గమనించిన తాతారావు గబగబా పోయి రాధకృష్ణకి చెప్పాడు అరుణ్‌కుమార్ అనుచరులు. రాధాకృష్ణ మరికొందరిని జమ చేశాడు.

ఆడిటోరియంలోకి దున్నపోతును తోలింది నళినీమోహనే అని తెలిసింది వాళ్లకి అతడిని ఏదోరకంగా శిక్షించాల్సిందే అని అనుకున్నారు. ఇప్పుడా అవకాశం వచ్చింది.

కొద్దిసేపటికి రాధాకృష్ణ ఇంకొక వ్యక్తిని తీసుకొని నళినీ వైపుగా నడిచాడు.

రాధాకృష్ణకీ సాగర్‌కీ ఒకరంటే ఒకరికి పడదు. పాత శత్రుత్వం ఉంది. ఇద్దరూ హెూటల్‌కి పోయినప్పుడు టిఫిన్ కాఫీలు రాధాకృష్ణే పెట్టించేవాడు. సాగర్‌కి ప్రతిరోజూ డబ్బు ఖర్చుపెట్టగలిగే స్తోమతలేదు. కొన్నాళ్లకి ఒకరంటే ఒకరికి పడక తిట్టుకొని కొట్టుకొనేదాకా వచ్చారు.

ఇప్పుడు మళ్లీ గొడవపెట్టుకునేందుకు వచ్చాడతడు.

ఇద్దరూ వెళ్లి నళినీ, సాగర్‌ల పక్కనే నిలబడి పెద్దగా సంభాషించుకొంటున్నారు.

"నవయుగాలో స్వీటు తినిపిస్తా వస్తావుగా రాధాకృష్ణా?" అడిగాడతడి మిత్రుడు.

"నాకేం పెట్టిస్తావుగానీ ఈ చెట్టుకింద ఒకడు తయారుగా ఉంటాడు. వాడు రడీ నువ్వు పిలిస్తే రావటానికి. ట్వంటీఫోర్ అవర్స్ ఎవరెడీ అన్నమాట. అయితే బిల్లు నువ్వే ఇచ్చుకోవాలి. డబ్బులు జేబులో ఉంచుకొని వెళ్లు."

"ఎంత కావాలేం ఓ ఇరవై చాలదూ?"

ఊహుఁ! వీడసలే అవురావురుమంటున్నాడు. నేను టిఫిన్లు పెట్టించటం మానేసి నెలవుతోంది. నెల రోజుల ఆకలి ఊర్కేతీరుతుందా?"

"ఎవడబ్బా ఆ బకాసురుడు?"

బకుడు ఒక రాక్షసుడు, వాడు రోజుకి ఒక మనిషినీ రెండు దున్నపోతులనూ బండెడు అన్నమునూ తినును. కానీ బిల్లు మాత్రం కట్టడు" అప్పచెప్పాడు రాధాకృష్ణ.

అప్పటికే ఈ మాటలు వింటున్నసాగర్ కళ్లు ఎరుపెక్కాయి. లీలగా కంట నీరుబికింది.

నళినీకి ఏమీ అర్థంకావటంలేదు ఈ సంభాషణ. అయినా సా ?ర్‌ని అవమానిస్తున్నారని అర్థమయ్యింది. అతడు జోక్యం చేసుకున్నాడు.

"ఏయ్ రా ధాకృష్ణా!ఎందుకు ఊరికే అర్థం పర్థంలేకుండా మాట్లాడతావు. నీకెంత కట్టాలో

చెప్పు నేనిస్తా. తిరిగినన్నాళ్లూ తిరిగారు. ఇప్పుడు మాత్రం ఎత్తిపొడుస్తున్నావు''

"అర్థంలేకుండా వాగుతున్నావా? ఏంటిరా నువ్వు చెప్పేది. నువ్వు కొడతావా? నీడబ్బు ముష్టిగా వేస్తున్నావా? ఆ రమేష్‌గాడిదగ్గర అడుక్కొచ్చి నాకు ముష్టివేస్తావన్నమాట. అంతేలే అడుక్కునే వాడిదగ్గర గీక్కునే వాడనీ''

"నోర్మూయ్ రమేష్‌సంగతి నీకనవసరం'' కోపంగా అన్నాడు నళినీ.

"చెప్పు తెగుద్ది. సాగర్ సంగతి నీకెందుకంటా?''

"నాకు రెండు కొత్త చెప్పులున్నయ్''

"అయితే?''

"అయితే ఏంటిరా చెప్పుతో కొట్టేంత వాడివయ్యావన్నమాట'' అతడు మీదకొచ్చాడు.

"ఏంటిరా మీదకొస్తున్నావ్, ఊరుకుంటే ఆటలుగా ఉందే'' రాధాకృష్ణ మిత్రుడు నళినీని వెనక్కితోశాడు.

సాగర్ ఇద్దరి మధ్యకి వచ్చి సర్దిచెప్పబోయాడు.

సాగర్‌ని పక్కకితోసి ఎగబడ్డాడు రాధాకృష్ణ. అతడి చెంప ఛెళ్లుమంది.

నళినీ పొట్టలో తన్నాడు రాధాకృష్ణ మిత్రుడు అతడు కిందపడ్డాడు.

"ఏంటి గొడవ?'' అనుకుంటూ వచ్చారు కొందరు. వాళ్లూ అరుణ్‌కుమార్ వర్గమే.






వాళ్లూ తలా ఒక తన్ను తన్నారు. నళినీ బట్టలు అక్కడక్కడా చిరిగాయి. బాగా దెబ్బలు తగిలాయి.

రాధాకృష్ణ ఆవేశ పడుతున్నట్టుగా మళ్లీ మళ్లీ మీదకిళ్లి ఇష్టమొచ్చినట్టు కొడుతున్నాడు.

అతడు వచ్చింది నళినీ కోసమేననీ తనని అడ్డంపెట్టుకుని నళినీని కొడుతున్నారనీ సాగర్‌కి అర్థమైంది. అతడు పరిగెత్తుకుంటూ వెళ్లి రమేష్ క్లాస్‌రూం లోకి ప్రవేశించాడు.

అక్కడెవరూ లేరు.

రమేష్‌కు సంబంధించి ఎవరూ కనబడక పోయేసరికి ఇంటర్ షెడ్లలోకి వెళ్లి లెక్చరర్ వినయబాబుకి చెప్పాడు. వినయబాబుకి ఉద్యోగం ఇప్పించింది శివాజీయే.

వినయబాబు మరికొందరు లెక్చరర్స్‌ని తీసుకొని చెట్టుదగ్గరకి పరిగెత్తాడు.

అప్పటికే నళినీకి నోటివెంట నెత్తురు మరకలు కనిపిస్తున్నారు. రక్షించమని వినయబాబు వైపు చూస్తున్నాయి కళ్లు. నోటివెంట మాట రావటంలేదు.

రాధాకృష్ణనీ అతడి బృందాన్నీ చెడామడా తిట్టి అవతలికి తోసి నళినీని లేపి ఆఫీసువైపుకు తీసుకెళ్లారు లెక్చరర్లు. వినయబాబు రాధాకృష్ణని చెయ్యిపట్టి లాక్కుంటూ ప్రిన్సిపాల్ రూంలోకి ఈడ్చుకుపోయాడు.

రాధాకృష్ణని వారం రోజులు సస్పెండ్ చేశారు.

★ ★ ★

రూంలో ఇరవైమందికిపైనే విద్యార్థులు ఉన్నారు. ఇంకా అందరూ రాలేదు.

దాదాపు రవికి అదే మొదటిక్లాసు. నెల దాటినా ఇంతవరకు ఏ క్లాసూ అటెండ్ కాలేదు. కొత్తగా చేరాడేమో అనుకొన్నారు చాలామంది. మొదటెప్పుడో రెండు క్లాసులకి వెళ్లాడు అంతే.

మొహంలో బెరుకు కనిపించకుండా ప్రయత్నించేస్తూ సారథిని పలకరించాడు రవి.

సారథి మరికొందరు మిత్రులకు పరిచయం చేశాడు.

అందరూ సరదాగా వేళాకోళం చేస్తూ ఒకరినొకరు ఏదోఒక ముద్దుపేరుతో పిలుచుకుంటూ ఉండటంతో త్వరగానే కలసిపోయాడు.

'పరిచయం చేసుకోవటం' అనే కార్యక్రమం గురించి చాలా తెలుసుకొన్నాడు రవి. తన ఊళ్లోనే ఉండిపోయిన ఒక కుర్ర టీచరు దగ్గర తన సందేహాలు అడిగి కొత్త వాళ్లు కల్సినప్పుడు ఎలా కరచాలనం చెయ్యాలి? ఎలా మన్నించాలి? ఎలా మాటలు ప్రారంభించాలి ఇత్యాదులన్నీ చెప్పించుకొన్నాడు.

ఇప్పుడవి ఉపయోగపడ్డాయి.

కరచాలనం చేసేప్పుడు తన పేరు చెప్పటం మర్యాద. ఇప్పుడు సారథి పరిచయం చేస్తున్నాడు కాబట్టి అతడే చెప్పాడు ఇద్దరిపేర్లు.

షేక్‌హాండ్ ఇవ్వటం అవతలివ్యక్తి చెయ్యి చాస్తే అందుకొని మృదువుగా పట్టుకోవటం రవికి కొత్త అనుభవం ఇదివరకు టౌనులో ఏ సినిమాకో వచ్చినప్పుడు ఎవరయినా షేక్ హ్యాండ్ ఇస్తే వింతగా అనిపించేది. తిరిగి చూస్తూ వెళ్లిపోయేవాడు. ఇప్పుడు తనే ఇస్తు న్నాడు.

కొత్తలోనే నువ్వు నీ అనటం తప్పు. ముందు అవతలి వాళ్ళెవరరైనా మీరు మీ అంటూ గౌరవం ఇవ్వాలి. పరిచయం పెరిగాక ఎలా అయినా పిలవొచ్చునని రవికి తెలుసు.

దుగ్గిరెడ్డి అనే విద్యార్థితో కరచాలనం చే స్తుండగా అతడు ప్రశ్నించాడు.

"మీ ఫేవరెట్ ఎవరు?" అదే మొదటిప్రశ్న రవికి.

"అంటే?" తడబడ్డాడు రవి.

"నట భయంకరే అయ్యుండాలి. మా గురు వుగారంటే తెలికనుకున్నావా?" అన్నాడు రంగారావు వక్కనుండి.

రవి వైపు తిరిగి - "అవునా రవీ? మీ ఫేవరెట్ పేరు కరెక్టుగా చెప్పానంటారా?" అన్నాడు.

"నోర్మూయ్‌రా... కోతిడాన్సులు చూసి అంద రూ ఫేవరెట్‌లవుతారా" దుగ్గిరెడ్డి చీవాట్లుపె ట్టాడు.

ఇద్దరూ ఒకరి హీరోని ఇంకోకరు వేళాకోళ మాడారు. అందులో ద్వేషభావంలేక పోవటం గమనించాడు రవి. కొంతనయం.

ఇద్దర్నీ సమాధానవరుస్తూ చెప్పాడు రవి-

"నాకెవరూ ఫేవరెట్ లేరు"

"నిజంగా?" ఒకేసారి చుట్టువక్కల నలుగు రు అడిగారు.

వారికి తెగ ఆశ్చర్యమేసింది. ఎవరో ఒకరు కనీసం హిందీ హీరో అయినాసరే ఉండా ల్సిందే. ఇదెలా సాధ్యం అనుకున్నారు.

"నిజంగానే ఎవరి యాక్షన్ వాళ్లది. ఒకరిని ఇంకొకరితో ఎలా పోల్చుకుంటాం? అందుకే ఒక్కళ్లే ఫేవరెట్‌గా ఉండటం తప్పు" రవి అన్నాడు.

"ఆహాఁ మేం ఒప్పుకోం. ఎవరి యాక్షన్ వాళ్ళదే ఎలా అవుతుంది. మాగురువుగారి లాగా స్టెప్పు ఎవరూ వేయలేరు" రంగారావు అన్నాడు.

"మా గురువుగారిలా డైలాగులు చెప్తాడా మీవాడు?" అన్నాడు దుగ్గిరెడ్డి కోపంగా సారథి అందుకున్నాడు-

"అందుకే రవికి ఇద్దరూ నచ్చి ఉంటారు. మీవాడి స్టెప్పూ, మా వాడి డైలాగులూ నచ్చితే మరి ఇద్దరూ ఫేవరెట్లేగా" అన్నాడు ఇద్దర్నీ చూస్తూ.

వాళ్ళకి ఏం చెప్పాలో తోచలేదు.

ఏ ఫేవరెట్టూ లేకపోవటంతో రవంటే చిన్న గుర్తింపు కలిగింది. తర్వాత పరిచయం అయినా వాళ్లలో ఆ భావం కనబడటం రవికి తెలుస్తూంది.

టీనేజ్‌లో ఎవరో ఒకరు అభిమాన హీరోగా ఉండటం, ఆ హీరో గురించి వాదోపవాదాలు చేయటం, ఇంకా అభిమానం పెరిగితే ఇక సర్వస్వమూ ఆ హీరోనే అయ్యి పోటీ హీరో మీద ద్వేషభావం ఏర్పడటం గమనించాడు రవి.

"అయితే నీకో తోడు దొరికింది. నీదీ అదే మతంగా?" దుగ్గిరెడ్డి సారథితో అన్నాడు.

"మతం కాదు అభిమతం" సారథి నవ్వా డు.

"నువ్వు కవిత్వం రాయాల్సింది"

"నేను రాస్తే వినయబాబుకి జ్వరమొ స్తుంది"

"అవునురోయ్... ఫస్టవరు వినయబాబుదే. ఇవ్వాళేం వాయిస్తాడో" రంగారావు అందుకొ న్నారు. బయట నుండీ అందరూ లోనికి వచ్చేశారు. అంటే లెక్చరర్ వస్తున్నాడని అర్థం.

"గురుడు వచ్చేశాడు" అని చిన్నగా అరిచా డు గోపీచంద్.

అందరూ హడావిడిగా నించున్నారు. బట్ట లు గరగరమన్నాయి. చిన్న చిన్న చప్పుళ్లు మెల్లగా ఆగిపోయాయి.

"సిట్‌డౌన్ ప్లీజ్" వినిపించింది. రవికి ఎవరూ కనిపించలేదు. అతడి ముందు బెంచీ వాళ్లు చాలా ఎత్తుగా ఉన్నారు. రవి వాళ్ళ భుజాలక్రిందకి వచ్చాడు.





# ఏరిన ముత్యాలు

★ మౌనంగా ఉండి నిన్ను నీవు రక్షించుకో. మౌనం నిన్నెప్పుడూ నమ్మకద్రోహం చెయ్యదు.

— జాన్‌బ్యాయల్

★ మౌనంగా ఉండు లేదా మౌనంకంటే విలువైన మాటలు మాట్లాడు.

— పైథాగరస్

★ మౌనం అన్నిటికంటే అసహ్యమైన, కఠినమైన వ్యంగ్యోక్తి.

— చెస్టర్‌టన్

★ తిరస్కారాన్ని ప్రదర్శించడానికి చక్కని పద్ధతి మౌనం.

— జార్జిబెర్నార్డ్‌షా

★ యవ్వనం నిస్సందేహంగా మంచిదే. కానీ జీవితపు లోతుల్ని సమగ్రంగా పరిశీలించినచోట మాత్రం దానికి విలువ ఉండదు.

★ యవ్వనం ప్రేమను చుంబిస్తుంది. అంతకన్నా తీయనిది, సుదీర్ఘమైనది మరోటి ఉండదు.

— బైరన్

★ యుద్ధంవల్ల మానవమేథ మొద్దుబారి తన జాతి దృక్పథాన్ని తప్ప వేరే ఆలోచనను చొరనివ్వదు.

— నెహ్రూ

★ యుద్ధం అనే భయంకర క్రీడవల్ల మానవజాతి ఎప్పుడూ ఆసక్తి చూపిస్తూనే ఉంటుంది.

— స్విఫ్ట్

★ యుద్ధం అన్నిటికంటే భయంకరమైన మహమ్మారి లాంటిది. ఇది ధర్మాన్ని, దేశాన్ని ,కుటుంబాన్ని నాశనంచేస్తుంది.

— మార్టిన్ లూథర్

★ బతకడం కోసం తినాలి; కానీ తినడం కోసమే బతకకూడదు.

— సిసిరో

★ మితిమీరిన తిండి మెదడునూ, ఆత్మను చంపివేస్తుంది. చాలీచాలని కూడు శరీరాన్ని నశింపజేస్తుంది.

— బైబిల్

★ యుద్ధం అనేది ఆటవిక జాతికి చెందిన వారి వృత్తి.

— నెపోలియన్

★ యుద్ధం దొంగలను సృష్టిస్తుంది. శాంతి వారిని ఉరి తీస్తుంది.

— ఆంగ్ల సామెత

★ మనిషి అడిగే ప్రశ్నలనుబట్టి అతని మేధస్సును గ్రహించాలిగానీ అతడు ఇచ్చే సమాధానాలనిబట్టి కాదు.

— ఓల్టేర్

సేకరణ: నల్లబెల్లి సూర్యనారాయణ

వెనక బెంచీల దగ్గర నమావేశమైన వాళ్ళు అలాగే నుంచునిపోయారు. వెల్లప్పుడు గబగబా ముందుకు వెళ్ళి తమ బెంచీల మీద కూర్చున్నారు.

డయాస్ మీద వినయబాబు కనిపించాడు. రవి ఎలాగో తల నిగిడ్చి నడుం ఎత్తితేనే ఆ మాత్రమైనా కనవడింది. అటెండెన్స్ తీసుకొంటుంటే గమనించాడు.

అందంకోసం ట్రిమ్ చేసిన గెడ్డం, మెడలో గోల్డ్ ఛెయిన్, ఖరీదైన చొక్కా అంతకు మించి భారీ కాయం. ఇవి వినయబాబు ప్రత్యేకతలు. ఖరీదైన మనిషిగా కనిపిస్తాడు.

"ఇంతకీ ఏం క్లాసదీ?" రవి సారథిని అడిగాడు.

"మీరే కనుక్కోండి చూద్దాం" సారథి నవ్వుతూ అన్నాడు.

వినయబాబు స్టయిలిష్‌గా ప్రారంభించి మాటలు జలపాతంలా ఉరికించాడు. గొంతులో కొంత మాధుర్యం ఉంది. అదే రవిని కట్టివడేసింది. పొయట్రీని చక్కగా చెప్పగలడు.

అప్పుడే ఆడపిల్లలు కూడా ఉన్నారన్నది గమనించాడు రవి. వినయబాబు డయాస్‌కి ఆ వక్కన నిలబడి మాట్లాడుతోంటే ఆడపిల్లలు కిలాకిలా నవ్వారు.

మాటల్లోపడి వాళ్లని గమనించలేదు. రవి ఆలోచనలోపడ్డాడు.

"షి ఈస్ డెస్పరేట్ టు రీచ్‌మీ. ఆమె నన్ను చేరుకోవటానికి శాయశక్తులా ప్రయత్నించింది. నేనూ అంతే మా ఫ్రెండ్స్ ఎగతాళి చేసేవాళ్లు. మేమిద్దరం అర్ధనారీశ్వరుని రెండు భాగాలం అని మా ప్రొఫెసర్‌కీ ఎఫైర్ నంగతి తెలిసి ఓ రోజు నన్ను పిలిపించారు"

రవి ఉలిక్కిపడ్డాడు. ఇదేమిటీ ప్రేలాపన. ఇంతవరకూ ఇంగ్లీమ పొయట్రీ గురించి చెప్పాడు వినయబాబు. ఇప్పుడేదో స్వంత కవిత్వం మొదలుపెట్టాడు.

సారథిని ప్రశ్నార్థకంగా అడిగాడు.

"ఇది వాయిదాల వద్ధతిన చెప్తున్నాడు. మీరు ముందు క్లాసులు మిస్సయ్యారు. అందుకే అర్థం కావటంలేదు" సారథి చిన్నగా చెప్పాడు.

"దేని గురించి? ఏ విషయం మీద ఈ లెక్చరు?"

"ఆయన భార్య గురించి"

రవికి ఆశ్చర్యం వేసింది. క్లాసులో భార్య గురించి చెప్పటం వింతగా ఉంది. ఇదేం జబ్బు.

అమ్మాయిలు మరింత ఉత్సుకతగా ముందుకు వంగివింటున్నారు. వినయబాబు వారినే ఓరచూపులు చూస్తూ తల మగపిల్లల వైపు తిప్పి కళ్లు ఆడపిల్లలమీద పెట్టి ఆసక్తికరంగా తన భార్య గురించి చెప్పటం ప్రారంభించాడు.

ఈ పల్లెటూరి ఇంగ్లీమ మీడియం పిల్లలకి ఇంగ్లీమలోనే చెప్తే అర్థంకాదు. అందుకని తనే అనువాదంచేసి ఇంగ్లీమ ముక్కలూ, తెలుగు ముక్కలూ కలగలిపి వివరిస్తున్నాడతడు.

"హి గాట్ ఎ డౌట్. ఆయనకి నందేహం. వెదర్ ఐయామ్... నేను పెళ్లికి సిద్ధపడుతున్నానా లేదా? దెన్ హి సెడ్. అప్పుడన్నారు. లైఫ్ ఈస్ వర్త్. జీవితం అమూల్యమైనది. వుయ్ డోంట్... మనం నాశనం చేసుకోకూడదు..."

కవిత్వం కొండెక్కిపోయింది. మగపిల్లలు మెల్లగా తమలో తాము గుసగుసలాడుతున్నారు. ముందువాళ్ళు వెనక్కితిరిగి వెనకవాళ్ళు ముందుకి వంగి నంభాషించుకోవటం మొదలుపెట్టారు.

ఆడపిల్లలు మాత్రం క్యూరియాసిటీతో వింటున్నారు. కొందరు చిన్న చిన్న ప్రశ్నలు వేస్తున్నారు కూడా.

ఎడ్మైరింగ్‌గా చూశారు మరికొందరు.

ఈ చూపుల జడిలోపడి అబ్బాయిల గొడవ పట్టించుకోకుండా వివరంగా చెప్పటం వారిని ప్రోత్సహించటం చేస్తున్నాడు వినయబాబు.

కాసేపటికి మగపిల్లలదో ప్రపంచం, ఆడపిల్లలది ఒక ప్రపంచం అయింది. ఎవరి గొడవలో వారున్నారు. వినయబాబు ఆడపిల్లల ప్రపంచంలో వుండిపోయాడు.

అమ్మాయిల్ని ఆకట్టుకోవటానికి భార్య గు





రించి చెప్పటం అద్భుతంగా ఉపయోగిస్తుందని వినయబాబుకి అనుభవం చెప్పింది. మరి దానికి తిరుగులేదు.

అందుకు శైలజే సాక్ష్యం. ఆమె వినయబాబుని ఆరాధనగా చూస్తుంది.

అతడు వర్ణించే రసవత్తరమైన కథనంలో ఈ సార్‌ని పెళ్ళిచేసుకున్న ఆ అదృష్టవంతురాలెవరో అన్న సందేహంతో ప్రారంభించిన శైలజ మెల్లగా అతడి భార్య స్థానంగురించి ఆలోచించటం తర్వాత తర్వాత తనను ఆ భార్యలో ఐడింటిఫై చేసుకోవటం చివరికి తననే ఆ స్థానంలో ఊహించుకోవటంవరకూ వచ్చింది.

ఇప్పుడు అతడు చెప్తున్న కథలో కథానాయిక పాత్రను పోషిస్తున్న శైలజ తన అర్ధనిమీలిత నేత్రాలను వినయబాబువైపు తిప్పి మానసికభావనాలోకంలో ఒక ప్రేమమందిరాన్ని నిర్మించుకొంటోంది.

మగపిల్లల గోలతో చేపలబజారులా అయిన ఆ తరగతిగది బెల్లు మోగడంతో ఆగిపోయింది. గోలతగ్గింది.

వినయబాబు అయిష్టంగా లేచి- "రేపు కంటిన్యూ చేద్దాం" అని వెళ్ళిపోయాడు. శైలజ ఒక్కసారిగా ఈ లోకంలోకి వచ్చింది. ఒక్కసారిగా నీరసం వచ్చినట్లుందామెకి.

రంగారావు వచ్చి సారథి పక్కన కూర్చున్నాడు.

"ఏం రవీ? ఎట్లావుంది క్లాసు? భార్యా, నా భార్యా మిస్సూ, మిసెస్సూ బావుందా?" రవిని అడిగాడు.

రవి మోహమాటంగా నవ్వాడు.

"ఆయనేం చెప్తాడు? మొదటి క్లాసు మొదటి లెక్చరు. మొదటి భార్య, మొదటి ఎక్స్‌పీరియన్సూ" దుగ్గిరెడ్డి జవాబిచ్చాడు.

"ఈయన సబ్జెక్టు గురించి చెబితే ఉత్తమ ఉపాధ్యాయుడి కిందకి వస్తాడు. మన దురదృష్టం. భార్యా విలాపం చెప్పటంలో మునిగిపోయాడు అన్నాడు సారథి.

"అవునూ? కోటేశ్వరరావు రాలేదా?" రవి అడిగాడు.

"రాలేదు. ఏదయినా పనితగిలిందేమో"

"రవి... కోటేశ్వరరావు తెలుసన్నమాట. ఇవాళేగా క్లాసుకి వచ్చింది. అప్పుడే ఎవరెవరో తెల్సిపోయిందా?" దుగ్గిరెడ్డి ప్రశ్న. అందులో శ్లేష ధ్వనించింది.

రవి తడబడ్డాడు. సారథి మొహంలోకి చూశాడు.

తను బస్‌పాస్‌కోసం రావటం... సారథి పరిచయం... సిద్ధప్ప వేధింపూ... క్లాసుకెళ్ళినప్పుడు కోటేశ్వరరావు చూపిన ధైర్యం... తనను బెల్టుతో కొట్టిన సిద్ధప్పా సూర్యం ఓదార్పూ...

సూర్యం... సూర్యం... అవును ఆయన్ని కలవాలని అప్పట్నించీ అనుకొంటున్నాడు. ఎలా కలవాలి? సారథికి తెలిసేవుండాలి. సారథి సాయం చేస్తాడేమో?

సారథి మాటకలిపి అడుకున్నాడు.

"ఇంటర్వ్యూకి రవి వచ్చినప్పుడే కోటేశ్వరరావు తగిలాడు. అప్పుడు తెలుసు ఇద్దరూ"

"అయితే సంధ్య తెలిసేవుండాలి రవికి" రమణ అనే మరో బెంచ్‌మేట్ కల్పించుకొన్నాడు.

"సంధ్యా... ఆమెవరు?"

"కోటేశ్వరరావు చెల్లెలు. మనక్లాసే. అదే మొదటి బెంచీలో కూర్చుంది"

"ఆఁ... ఆఁ... గుర్తొచ్చింది. ఆరోజు వాళ్ల చెల్లి కూడా ఇంటర్వ్యూకి వచ్చింది. కాపోతే నేను చూడలేదుగానీ..." అంటూ రవి సంధ్య వైపు చూశాడు.

ఒక మలయమారుతం అతడిని తాకింది. సంధ్య... అంటే వెలుగా? తొలిసంధ్యా? ఉన్న పదిమంది అమ్మాయిల్లోనూ ఆమె రూపం ఆకట్టుకొంది రవిని. ఆమె పేరుని మననం చేసుకున్నాడు.

"అప్పటి సంగతి గుర్తొచ్చిందిగానీ నేను చెప్పింది గుర్తురాలేదన్నమాట" సారథి అన్నాడు చిన్నగా నవ్వుతూ.

"ఏమిటదీ..." అన్నాడు రవి తలని ఇటు తిప్పి.

"అదే మన ఇంగ్లీషు లెక్చరర్ సంగతి"

"ఇంగ్లీషా? వినయబాబు కాదూ"

అంతా నవ్వారు. రవిని చూసి వినోదం చెయ్యాలనుకొన్నారు.

"అయితే మనకు ఇంగ్లీమ చెప్పింది వినయబాబేనంటావు" సారథి నవ్వుతూ అడిగాడు.

"మరి ఇంగ్లీష్ పొయిట్రీ చెప్తున్నాడుగా?" రవి మరింత అయోమయంలో పడిపోయాడు.

రంగారావూ, దుగ్గిరెడ్డి ఘొల్లున నవ్వారు. మిగిలినవాళ్ళు కూడా నవ్వుపట్టలేకపోతున్నారు.

గోపీచంద్, రవి అవస్థని చూసి జాలిపడ్డాడు. అతడు కల్పించుకొన్నాడు.

"అదే బ్రదర్ ట్రాజెడీ. వినయబాబుది ఇంగ్లీమకాదు కెమిస్ట్రీ. కెమిస్ట్రీ చెప్పాల్సింది, పొయెట్రీ చెప్తున్నాడు"

రవి విస్మయంలో పడ్డాడు.

"నీకు ఆరోజున చెప్పాననుకుంటూ మన ఇంగ్లీమసార్ మద్రాను వెళ్లి సినిమాల్లో చేరిపోయాడు. ఇంతవరకూ ఎవరూ అప్పాయింట్కాలేదు. ప్రిన్సిపాల్ని అడుగుతుంటే ఇదిగో అదిగో అంటున్నాడుగానీ ఎవర్నీ వంపటంలేదు" సారథి అన్నాడు.

రవికి గుర్తొచ్చింది.

"ఆఁ... మీరు చెప్పారు- కరెక్టే" నవ్వుతూ చెప్పాడు.

కెమిస్ట్రీ బదులు ఇంగ్లీమ పొయట్రీ చెప్పటం మళ్లీ అందులో భార్య గురించి సీరియల్గా భాస్వర్ల లెక్కన ఉపన్యసించటం. నవ్వొస్తోంది.

"అందుకేనా? ఏ క్లాను అనడిగితే నన్నే కనుక్కోమన్నారు" సారథిని అడిగాడు.

"ఊఁ! మీరు పప్పులో కాలేస్తారా లేదా అని"

దుగ్గిరెడ్డి బయటకు పోయి వచ్చాడు.

"దక్షిణామూర్తి రాలేదనుకుంటా?" సారథి అడిగాడు దుగ్గిరెడ్డిని.

"ఏమో ఆరూ మూడూ కదూ లేటవుతుంది" గోపీచంద్ వ్యాఖ్యానించాడు.

ఇంతలో ఓ స్టూడెంట్ వచ్చి పెద్దగా చెప్పాడు.

"ఆ... తెలుగు మేడమ్కి బాలేదంట- సిక్ లీవ్"

"అయితే ఇంకేం... మాథ్స్ క్లాస్ ఖాళీ" అని పుస్తకాలు చేతబట్టి లేచాడు రమణ.

"మిగిలినవాళ్లు కూడా వెళ్లిపోయేందుకు తయారవుతున్నారు"

సారథి లేచి నుంచొన్నాడు.

"తెలుగు మేడంకి సీరియస్ అయితే ఇప్పుడెందుకు క్లానులేకపోవటం?" అడిగాడు రవి.

"దక్షిణామూర్తిగారూ తెలుగు మేడమ్ భార్యాభర్తలు. గోపీచంద్ ఏదో అన్నాడు అర్థంకాలా? ఆరూ మూడంటే" రమణ చెప్పబోయాడు.

"ఆగరా నేనే చెప్తా. ఆరంటే దక్షిణామూర్తి ఆరడుగులు ఎత్తుంటాడు. మూడంటే తెలుగు మేడమ్ ఈయనలో నగం ఉంటుంది"

"నరే... పోదాం పదండి మళ్లీ కలుద్దాం"

అందరూ రవితో చెయ్యికలిపి కరచాలనం చేశారు.

రవి చూపులు మళ్ళీ నంధ్యమీదకు వరిగెత్తాయి. అప్పుడే వాళ్ళూ లేచి బయటకు నడుస్తున్నారు. ఆ నలుగురి మధ్యా నంధ్యా? నంధ్యేనా?

బలవంతంగా కళ్ళు తిప్పుకొని సారథిని అనునరించాడు.

ఇద్దరూ ఇంటర్ పెడ్లనుండి గ్రౌండ్వైపుగా నడవటం మొదలుపెట్టారు.

రవికి ఒకందుకు నంతోషంగాఉంది. కాలేజీ ఇంతవరకూ భూతంలా భయపెట్టింది. ఇప్పుడు తనకి ఆ బెరుకుపోయింది. కనీనం క్లాస్ రూంకి వచ్చి ధైర్యంగా కూర్చోగలడు. నెలరోజులనుండి వాయిదా వేసుకుంటూ వచ్చి ఇప్పుడు ప్రవేశించగలిగాడు. ఏదయినా అంతే ప్రారంభించే వరకే భయం. తర్వాత ఉండదు.

దుర్భేద్యమయిన శత్రుస్థావరంలోకి ప్రవేశించి స్థానం నంపాదించ గలిగిన సైనికుడిలా తృప్తిపడ్డాడు రవి.

"మీరెటు? ఇంటికా?" సారథి అడిగాడు రవిని.

"అదే అనుకుంటున్నా... ఇవ్వాళ ఒక క్లా





సేగా జరిగింది. ఇంకా చాలాసైముంది. ఏం చెయ్యాలి?''

''లంచ్ తర్వాత ఫిజిక్స్ క్లాసుంది-వుంటారా?''

''అరె చెప్పరేం... అన్నిఅయిపోయాయను కుంటున్నా. ఫిజిక్సయితే ఉంటా. నేనసలే ఇంతవరకూ అన్నీ ఆప్సెంటే. ఉన్నవాటిక యినా అటెండ్ అవుతాను- మరి మీరో?''

''మందు డిగ్రీ బిల్డింగ్స్‌లోకి పోయి సూర్యాన్ని కలవాలి. వస్తారా?''

''పదండి పదండి ఇంకా వస్తారా? అడుగుతున్నారు. నేనే మిమ్మల్ని సూర్యం దగ్గరకు తీసుకెళ్లమని చెప్దామనుకుంటున్నాను''

ఇద్దరూ గ్రౌండ్‌దాటి ఆఫీస్‌దాకా వచ్చారు. పై అంతస్థులో జరుగుతాయి డిగ్రీ క్లాసులు. రెండో అంతస్థులో రెండో సంవత్సరం మూడో అంతస్థులో మూడో సంవత్సరం పద్ధతి ప్రకారం పెట్టారు.

మెట్లవరుస పక్కనే ఉంది ఆఫీస్‌గది. అక్కడే ఆ క్లర్కూ అటెండర్ మంగపతీ తనని చూసి నవ్వుకొంది.

రవి నెమ్మదిగా ఆగటంచూసి సారథి వెనుదిరిగాడు. రవి మొహంలోకి పరిశీలనగా చూశాడు. రవి ఆఫీస్‌వైపూ ప్రిన్సిపాల్‌గది వైపూ చూస్తున్నాడు.

''రవీ? ఒక్కవిషయం'' ఆగాడు క్షణంసేపు.

ఏమిటన్నట్లు చూశాడు రవి.

''ఏ మనిషీ స్వతహాగా దుర్మార్గుడుకాడు. కొన్ని కొన్ని పరిస్థితులకు లొంగిపోయి... తన స్వభావాన్ని మార్చుకొంటాడు. మనంకూడా అంతేగా ఇవ్వాళ బుద్ధిగా ఉంటాం అవకాశం వస్తే ఇంకొక రకంగా మారతాం. అందుకే ఎవర్నీ అసహ్యించుకోనవసరంలేదు. మనకి నచ్చని మనుషులుంటారు. వాళ్లని అర్థంచేసుకొని వాళ్లేం తప్పులు చేస్తున్నారో ఎత్తిచూపి మార్చుకొనే అవకాశం ఇవ్వాలి. మనిషి స్వభావం తప్పనిసరిగా మారుతుంది. అదే మనలోని గొప్పతనం మారలేదనుకో. మనం వ్యతిరేకస్తూనే ఉంటాం. ఆ విషయాలవరకూ అతడిపై పోరాడుతూనే ఉంటాం''

''దేవి గురించి నువ్వంటున్నది?''

''నువ్వు అసహించుకొంటున్న అటెండర్ క్లర్కు గురించి. నీ లిష్టులో ప్రిన్సిపాల్‌కూడా ఉండే ఉంటాడు. వాళ్లుకూడా మనుషులే అని గుర్తుంచుకోమంటున్నాను''

రవి మాట్లాడలేదు. అతడు సందిగ్ధంలో ఉన్నాడు.

తోటి వారినెలా అర్థంచేసుకోవాలి? అందరూ గొప్పవాళ్లుకారు. నిజమే. కానీ కనీసధర్మం ఒకటి ఉంటుంది. తోటి వ్యక్తిని ఆదరించటం అనేది అది ఇక్కడ మచ్చుకైనా కనపడలేదు. తనని అర్థంచేసుకొనేవాళ్లులేరు. మానవత్వం మచ్చుకైనా కానరాదు.

రమేష్‌ని చూస్తే ఒకప్పుడు అద్భుతంగా అనిపించేది. అతడిని ఆదర్శంగా ఎంచుకొని అనుసరిస్తే ఒక చీకటి కూపంలోకి చడిపించాడు. తనని వాడుకోవాలని చూశాడు. పరమ స్వార్థపూరితంగా ప్రవర్తించాడు. నతకు సీటు ఇప్పించినందుకు జీవితాంతం ఋణపడి ఉండాలన్నట్లు కోరుకున్నాడు. తనూ మనిషే అది అర్థంచేసుకున్నదెవరు?

సూర్యం... అవును సూర్యం తనను ఓదార్చినప్పుడు ఎంత కృతజ్ఞతగా అనిపించింది? తన ప్రాణం కూడా ఇచ్చేద్దామన్నంత కోరిక కలిగింది. ఆ మాటలూ ఆ ఓదార్పు తనకు ప్రపంచంమీద నమ్మకం కలిగించాయి. ప్రజల్ని చూసి మనిషిని చూసి ఇప్పుడు విశ్వసించగలుగుతున్నాడు. అతడి సామీప్యంలో ఎంతో నిశ్చింతగా ఉండిపోగలిగాడు. ఆ కాస్తేసేపైనా.

రోజూ నవాలక్షమంది నవాలక్ష బాధలతో తిరుగుతుంటారు. ఎక్కడో ఓమూల కూర్చొని ఏడుస్తున్న తనను పట్టించుకోవాల్సిన అవసరం సూర్యానికేముంది? అతడు తనకేమవుతాడు. అన్నా? తండ్రా? తల్లా? ఊహుఁ! కాదు. అతడు ఇవేవీకాదు అతడు మనిషి. మానవత్వం ఉన్నవాడు అదీ... కావల్సింది మనిషిగా జివించటం మనిషిగా ప్రవర్తించటం సూర్యం లక్షణాలు.

అందరూ మనుషుల్లా ఉండాలనే తను కోరుకుంటున్నది.

''సారథి ఏమంటున్నాడు. వాళ్లని అర్థం

చేసుకోవాలంటున్నాడు. బెల్టుదెబ్బ తగిలి మనసు భిద్యమైపోయినా సరే సిద్ధప్పని క్షమించమంటున్నాడు. అలా చెయ్యగలడా?

దుగ్గిరెడ్డి... రంగారావూ... వీళ్ళు తనతో మామూలుగానే ఉన్నారు. వాళ్ళలో తప్పులు లేవనా? వాళ్ళు స్ఫటికాల్లాంటి వాళ్లా? కాదు కానీ వాళ్లతో కలవగలుగుతున్నాడు. స్నేహంగానే ఉండగలుగుతున్నాడు. తన మాట ఏమిటి? తాను సవ్యంగా సరిగ్గా ఉన్నాడా? బహుశా తనలోనూ ఏవో లోపాలు ఉండే ఉంటాయి. తానూ తప్పులు చేస్తున్నాడు.

మరి? సిద్ధప్పా మంగపతీ మనుషులు కాదా? వాళ్ళు తప్పొప్పులకి అతీతులు కారే! వాళ్ళు తనని అర్థంచేసుకోవాలంటున్నాడు కానీ వాళ్ళని అర్థంచేసుకోవటంలేదు. అవును. తాను ఒకపైపునుండే ఆలోచిస్తున్నాడు అవతలివాడి కష్టనష్టాలు పట్టించుకోనంతవరకూ తనకు ఏమీ కోరుకునే హక్కుండదు. నువ్వు వాళ్లతో సరిగ్గా ఉంటే కాదా? వాళ్లూ నీతో ఉండేది?

రవి భుజంమీద చెయ్యివేసి ముందుకు కదిలాడు సారథి. ఆలోచనలోంచి బయటకొచ్చాడు అతడు. ఇద్దరూ ఒక వరుస మెట్లెక్కిన డిచారు. ఫస్ట్‌ఫ్లోర్‌మీద రెండు బక్కెట్లు మోసుకొంటూ వస్తూన్నాడు మంగపతి. వాటినిండా నీళ్లున్నాయి.

అతడి శరీరం చెమటతో ధారగా కారుతోంది. బట్టలు ఒంటి కతుక్కొని ఉన్నాయి. రొప్పుతున్నాడు.

సారథి రవిని ఆపి మంగపతిని అడిగాడు.

"ఏం మంగపతీ టాంకులోంచి తెస్తున్నావా"

అతడు బకెట్లోకిందకి దించి ఆయాసం తీర్చుకొన్నాడు.

"ఊc! మరే... కింద టాప్ పెట్టించమంటే మా సిద్ధప్పబాబుకి కోపం నేనెక్కడ సుఖపడిపోతున్నానో అని. మీ క్లాసుదగ్గర ఉంది చూడు. ఆ టాప్‌లో తెమ్మంటాడు. ఎల్లి రావటానికి అరకిలోమీటరు నడవాలి. అందుకే పైనుంచి తెస్తున్నా"

"ఏదీ మూడో అంతస్థుకాక ఇంకా దాని పైనా?"

"ఊc! అక్కడే. ఇదే మొదటిదనుకుంటున్నావేమిటి? ఇది నాలుగో సారి. కింద సార్‌ల క్యారేజీలు కడగాలి. కప్పులూ, గ్లాసులూ, వళ్ళాలు ఒకటా రెండా. ఐదారు బకెట్లువద్తాయి"

సానుభూతిగా కాస్సేపు అవీ ఇవీ కబుర్లు చెప్పాడు సారథి.

"సరే...పైకిపోతున్నా. సాయంత్రం కలుద్దాంలే" అని ముందుకి కదిలాడు.

"సాయంత్రమా? నేను ఉండను. ఫిజిక్స్ హెడ్డుగారు పిక్నిక్‌కి రమ్మన్నాడు. ఎల్లకపోతే ఊర్కుంటడా?" మంగపతి వెనకనుండి అనటంతో మళ్ళీ ఆగిపోయాడు.

"అయితే మంచి విందుభోజనమన్న మాట" సారథి నవ్వాడు.

"అది మొహం... ఆయనా, ఆయన చుట్టాలూ ఖాళీచేసిన బొచ్చెలు కడగాలి. సామాన్లు మొయ్యాలి. ఎవడికయినా అయితే కూలీ ఇవ్వాలని నన్ను పిలిచాడు"

అప్రయత్నంగా రవి అడిగాడు-

"ఏంటీ బొచ్చెలు కడగాలా? అందుకు ఇక్కడ్నించీ నువ్వెళ్లాలా?" అతడి కంఠంలో ఆశ్చర్యం.

మంగపతి రవిని అపుడు గమనించాడు. ఇంతవరకూ తొందరలో ఉన్నాడు. కింద నీళ్ళు కావాలని కేకలు పెట్టారన్న ఆలోచనలో చూడలేదు.

"ఏం రవిబాబూ నువ్వేనా? సారథిబాబెనక నుంచున్నావే కనపడకుండా. ఏ బాబూ మన సారథిబాబు పేరు చెప్తే ఆరోజు అంతవరకూ రానిచ్చేవాణ్ణికాదు. నువ్వు చెప్పాలా?"

అంటే నేను పంపించినవాళ్లని మంచిగా చూస్తావుగాని ఇంకెవర్నీ పట్టించుకోవన్నమాట. అది మంచి పద్ధతికాదు మంగపతీ...ఎవర్నయినాసరే ఏడిపించకుండా సాయం చెయ్యాలి. నాకేం నచ్చలా నీ పద్ధతి" సారధి అసంతృప్తిగా అన్నాడు.

"భలే చెప్పావుబాబూ... అందరూ నీకుమల్లే ఉంటారా. ప్రతోడూ నామీద రువాబు చేసేవాడే... ఈ కాలేజీలో ఎవుడయ్యా తల మాసినోడంటే - మంగపతి. మన లెక్చరర్ బావు





లుంటారా? ఆదివారం అందరూచాయ్‌కి పిలుస్తారు. దేనికనుకున్నావో... ఇల్లు కడగిపెట్టాలి,వంటగది తుడవాలి. ఏ మాంసమో మార్కెట్లో ఎతికెతికి తెచ్చిపెట్టి ఖైమాకొట్టాలి. ప్రెమ్మగా కోడిమెడకోసి బొచ్చుపీకి, బొమికలు ఏరి అమ్మగారికి అందియ్యాలి. ఊరికెల్లాలంటే ముందే రిజర్వేషనుచెయ్యాలి.దగ్గరుండి బండెక్కించి సామాన్లు మొయ్యాలి. పెళ్లాం పుట్టింటికెల్తే అడికి తోడుగా వడుకొని ఆడిపెళ్లాం చేసేవనులన్నీ నేను చేసిపెట్టాలి.ఆడే పుట్టింటికెల్లాడనుకో. ఆడి బదులు నేను ఇంటిక్కావలి కాయాలి కుక్క మాదిరి. మీ స్టూడెంటు కుర్రోళ్ళు తక్కువ్వాళ్ళా. మొన్న ఆఫీను గోడమీద 'అయ్యిలవ్యు మాధవి అయివాంటు యువర్...' అని బూతు కూత రాశాడెవడో. నేను చూళ్ళా. సిద్దప్పబావు చెడామడా తిట్టిపోశాడు.ఎవర్ని? ఇంకెవుడు మంగపతే అన్నిటికీ. నీకే మంటొచ్చినా మంగపతి రెడీగుంటాడు. వచ్చి ఆడిమీదవడి కడుపుమంటనల్లార్చుకో'అన్నాడు సుదీర్ఘంగా మధ్యమధ్యన అభినయం చేస్తూ.

మంగపతి మాటల్లో అంతర్లీనంగా బాధ కనవడింది రవికి.

అతడు కష్టపడుతున్నాడనికాక మనసుని కష్టపెట్టుకుంటున్నాడని సానుభూతి కలిగింది.

ఇంతలో కిందనుండి కేకపెట్టారు మంగపతికోసం.

"పోయొత్తా బావూ... కింద సార్లకి హాస్టలు నించీ కేరేజీలు తేవాలి. అక్కడ తింటే పరువు తక్కువని స్పెషలుగా ఇక్కడికి తెప్పించుకుంటారు. లంచ్ టైంకల్లా కుంభాలు రడీగుండాలి. లేకపోతే చిందులు తొక్కుతారు - రవిబాబూ పోయొత్తా"

రవికి చెప్పి బకెట్లు ఎత్తుకున్నాడు అతడు.

రవి తల వూపి సారథిని అనుసరించాడు.

ఆలోచిస్తే ప్రతివాడికీ ఓ కథ, ఓ బాధ. ఇప్పుడు మంగపతి తనతో మనసు విప్పి బాధ వెళ్లబోసుకున్నాక తనకీ అతడిలో మార్పు కనిపిస్తోంది. ఇంతకుముందు తన చుట్టూ పెంకు కప్పుకుని ఉన్నాడు.గంభీరవు ముసుకు వేసుకున్నాడు. ఇప్పుడది చిరిగిపోయింది. ఎలా సాధ్యమయిందది? సారథి ప్రభావం.

కొంచెం సానుభూతి, నాలుగు ఓదార్పు మాటలు.

పాపం ఆరోజు సిద్దప్పని లాగేసింది మంగపతే. లేకుంటే ఇంకా దెబ్బలు తగిలేవి తనకి.

"త్వరలో మళ్లీ గొడవలు జరిగే సూచన కనపడుతుంది" సారథి అన్నాడు.

"ఎందుకు?" అడిగాడు రవి.

"మొన్న రమేష్ బ్యాచ్‌లో నళినీ అనే అతన్ని కొట్టారు. అరుణ్ కుమార్ వాళ్లు. అదీగాక ఫస్ట్‌ఫ్లోర్‌లో చూశావా శివాజీ ఉన్నాడు. ఇన్నాళ్లికి కాలేజిలో కనిపించాడంటే ఏదో ప్రివరేషన్‌లో ఉన్నాడని అర్థం చేసుకోవచ్చు"

"శివాజీనా. నేను చూడలేదే?"

"ఫస్ట్ బి.ఎస్సీ దగ్గర ఉన్నాడు. ఆ రోజు ఆడిటోరియంలోకి దున్నపోతుని తోలారు. అది తప్పనే భావం విద్యార్థులలో ఉండటం. ఎన్నికయిన నాయకుణ్ణి ఎదిరించలేక ఆ పని చేశారని అనుకోవటంతో నళినీని కొట్టినా ఇంత వరకూ ఊరుకున్నారు. పైగా కొట్టినప్పుడు అది ఈ సమస్య మీద కాకుండా ఏదో వ్యక్తిగత భేదంలో ఒక భాగంగా జరిగింది. రాధాకృష్ణ అనే అతనికీ సాగర్ అనే అతనికీ గొడవ జరిగితే నళినీ అడ్డొచ్చాడని అందుకే కొట్టారనీ ఫోకస్ చేశారు అరుణ్‌వాళ్లు. అందుకే ఇంకా పార్టీల మధ్య పోరాటం ప్రారంభం కాలేదు. చెప్పాడు సారథి.

ఇద్దరూ సెకండ్ ఫ్లోర్‌కి వచ్చారు. అక్కడన్నీ ద్వితీయ సంవత్సరం క్లాసులే.

బియ్యే రూం వైపు నడుస్తుంటే కొందరు సారథిని పలకరించారు.

వాళ్ల సంభాషణను బట్టి సారథి అందరికీ తెలుసని అర్థమయింది రవికి. బహుశా సూర్యంతో జత కలిపాడని కావచ్చు.

వరండాలో రవిని ఆగమని చెప్పి ఓ రూంలోకి వెళ్లాడు సారథి. సూర్యం వస్తాడా బయటకు? ఎన్నాళ్లకు అతడితో కలుస్తున్నది? రవి హృదయం ఆనందోద్వేగాల మధ్య ఊగిసలాడుతోంది. మొదట ఎలా పలకరించాలి? మొహం ఎట్లాపెట్టాలి?

సారథి కోసం చూస్తున్న రవిని వెనుకనుండీ

పిలిచారు ఎవరో.

తల తిప్పి చూస్తూనే గుండెల్లో రాయి పడింది. మెట్ల దగ్గర శివాజీ చెయ్యి ఊపుతూ పిలుస్తున్నాడు రవిని.

రవికి తీవ్రమయిన అశక్తతతో కూడిన కోపం ఆవహించింది. వీళ్లు తనని వదలరు. ఇప్పుడు వెళ్లకపోతే రమేష్ ఊరుకోడు. వెళ్తే సూర్యాన్ని కలవటం కుదరదు. ఎలా?

అతడు ఊగిసలాటలో ఉండగానే సారథి ఒక్కడే బయటకు వచ్చాడు.

"సూర్యం లేడంట. వాళ్ల ఫ్రెండ్ మ్యారేజికి వెళ్లాడని చెప్పారు. క్లాసంతా ఖాళీగానే ఉంది. వాళ్ల ఫ్రెండ్‌ది ఈ క్లాసే" రవికి చెప్పాడు సారథి.

సూర్యం లేడన్నదే విన్నాడు రవి. ఫ్రెండంటే స్నేహితురాలనీ ఆమె పేరు సరితనీ తెలుసుకోలేదు.

"సారథీ... ఫిజిక్స్ క్లాసులో కలుస్తాను. ఇప్పుడే వస్తా. కొంచెం పనుంది" అంటూ శివాజీ వైపుకు నడిచాడు. అతడి నడకలో అయిష్టత కనపడుతోంది.

సరిత పెళ్ళి ముందే అనుకున్నట్లుగా జరుగుతోంది.

వరుడి పేరు ప్రకాష్. తండ్రి విశ్వనాథం.

సరిత తండ్రి రాఘవరావూ, విశ్వనాథమూ బాల్యస్నేహితులు.

పెళ్ళికి ఆమె స్నేహితులంతా వచ్చారు. క్లాస్‌మేట్సేకాక ఇతర గ్రూపుల విద్యార్థినీ విద్యార్థులు కూడా వచ్చారు.

ప్రభు, షఫీ, రామకృష్ణా, అనిల్, భానూ, రవళీలు పెళ్ళిపనుల్లో కలుగజేసుకొని పెళ్ళివారికి సాయపడుతున్నారు. హడావిడిగా తిరగటంలో కూడా ఆనందం పొందుతున్నారు.

వాళ్ళని చూసి సంతోషించింది సరిత. తమ వైపువారెవరున్నారు? తల్లిలేదు. తండ్రి రాఘవయ్యా మాష్టారుకి వయసు పైబడిన కారణంగా, ఆయన పెళ్ళిపనుల్లో జోక్యం చేసుకోవటంలేదు. ఆ లోటుని వాళ్ళు తీర్చారు.

ఒకప్పుడు జరిగిపోయినదాన్ని మర్చిపోయి అనిల్‌ని కూడా మామూలుగానే ఆహ్వానించింది.

వేణూ, సూర్యం ఇంకా రాలేదు.

సూర్యం ఒక్కడు వచ్చినా బావుండుననుకుందామె.

సన్నాయి వాయిద్యాల సందడిలో ఆమె పెళ్ళికూతురిగా మారటం, బంధుమిత్రుల కోలాహలం, పెళ్ళికొడుకు పరివారం. ఇవన్నీ సరితకు మనసుకు పట్టటంలేదు. ఆమె అన్యమనస్కంగా ఉంది.

అనిల్ పన్నీరుబుడ్డి పట్టుకున్న రవళిని ఆటపట్టిస్తూ, జోకులు వేస్తూ, సీరియస్‌గా అభిప్రాయాన్ని వెలువరుస్తూ ఆమెకు దగ్గరకాగలిగాడు. సరిత పెళ్లి సందర్భం అతడికి బాగా ఉపకరించింది. నిజానికి అతడు వచ్చిందే అందుకు.

సరితను చూసి ఏమిటన్నట్లు చూసింది భానూ. ఆమె సరితలోని ఆదుర్దాన్ని గమనిస్తోంది చాలాసేపటినుండి.

ఏమీలేదన్నట్లు తలూపింది సరిత. అది అటూ ఇటూ కాకుండా ఉంది. అంటే అర్థం ఏదో ఉన్నట్టా, ఏమీ లేనట్టా?

ఆమె ఎవరిగురించి ఆలోచిస్తోందో ఆ ఇద్దరూ ఆ సమయానికి



హోటల్లో కూర్చొనివున్నారు వేణూ, సూర్యం. కష్టమర్లు ఎవరూలేరు. ఇద్దరూ ఒక మూలగా బల్లమీద కూర్చుని టీ తాగుతున్నారు.

వేణూని పరిశీలించి చూశాడు సూర్యం.

అతడు ఏదో సంఘర్షణలో ఉన్నట్లుగా అర్థమవుతోంది.

అప్పటికి అరగంటనుంచీ ఏదో ప్రా





రంభించబోయి చెప్పలేక ఆగిపోతున్నాడు.

"ఏంటి వేణూ? ఏదయినా సమస్య ఉంటే చెప్పు. నాదగ్గర నీకు దాపరికం ఎందుకు" ఆప్యాయంగా అడిగాడు సూర్యం.

గొంతు సవరించుకొని మళ్లీ ఆగిపోయాడు వేణూ.

బేరర్‌వైపుకి తిరిగి రెండు టీకి ఆర్డరిచ్చాడు.

టీ వచ్చేవరకూ బల్లమీద గీతలు గీస్తూ ఉండిపోయాడు. సూర్యం నిశ్శబ్దంగా ఉండిపోయాడు.

ఎలాగో గొంతు సవరించుకొని అన్నాడు.

"సూర్యం... సృష్టిలో తియ్యనిదేది?"

"అన్నీ తీపైనవే" క్షణం ఆగి అన్నాడు సూర్యం.

అయోమయంగా చూశాడతడు.

"సారీ! నువ్వు చెప్పక చెప్పక మొదలుపెడితే జోక్ చేశాను. అది శ్రీశ్రీ జోక్... ఊఁ! ఏమిటీ? సృష్టిలో తీయనిదేదనా? ప్రేమ అంటారు అనుభవజ్ఞులు"

"అవునా? మరి... మరి... ఆ ప్రేమలో మోసం జరిగితే"

అతడి గొంతు రుద్ధమయింది... బాధతో.

"అంటే నీ ఉద్దేశం ప్రేమించిన వాళ్లు ద్రోహం చేస్తేఅనా?"

వేణూ మూగగా తల ఊపాడు.

"అది ప్రేమే కాదు" అన్నాడు సూర్యం.

అర్థంకాలేదతడికి.

"వేణూ... నీ సమస్య నాకు అర్థమయింది. నాకు తెలిసినంతవరకూ చెప్తాను. ప్రేమ అనేది చాలా ఉన్నతమయింది. ఇవాళ రోడ్డు మీద పోతూ అరగంటకొకళ్లని ప్రేమించటం సంగతికాదు నేను చెప్తున్నది. ప్రేమంటే రెండు జీవితాల్ని కలుపుకొని సుదీర్ఘకాలం వ్యవహరించేది. అందులో స్నేహం ఉంటుంది, కామం ఉంటుంది, మోహం ఉంటుంది. ప్రేమలో ప్రమాదకరమైన లక్షణం ఉంటుంది. అది ఏమిటంటే తన భాగస్వామిని చేరుకొనే ప్రయత్నం. ఆ ప్రయత్నానికి ఎటువంటి అడ్డంకి వచ్చినా తీవ్రంగా బాధకలుగుతుంది. దానిని ఎదుర్కొనేందుకు విశ్వప్రయత్నం జరుగుతుంది. వైల్డ్‌గా రియాక్టవుతారు. ఫలితంగా ఒకోసారి జరగరానివి జరుగుతుంటాయి. ప్రేమకు ఆలోచన జోడిస్తే అది ఉన్నతంగా ఎదుగుతుంది.

ద్రోహం అన్నావు. అంటే ఏదశలో? మొదట నువ్వొకరిని ప్రేమిస్తే అవతలి వ్యక్తి తిరస్కరించిందనుకో. అప్పుడు సంగతి తీసుకో... అసలు ప్రేమ అనేది ఉంటే తిరస్కారం జరగదని నేననుకోవటం. ప్రేమభావన అంటే ఏమిటి? అది వాడిపోయిన పువ్వు కాదు. అది వికసించేటటువంటిది. నువ్వు నోటితో చెప్పనవసరంలేదు. ఆ భావన అవతలి వ్యక్తికి ఎప్పుడూ అర్థమవుతూ ఉంటుంది. నీ కంటిచూపులో, కదలికలో, ప్రవర్తనలో, నవ్వులో, మాటలో, అభినయంలో అనుక్షణం అది వెల్లడవుతుంది. ఎవరిని ప్రేమిస్తున్నావో ఆ వ్యక్తినే అది తాకుతుంది. ఏమధ్యవర్తీ మేఘసందేశమూ అవసరం లేదు. ఆ వ్యక్తి కనపడితే... నీ కంటిచూపు పరిధిలోకి వస్తే... చాలు నీలో కలిగే మార్పు నీ ప్రవర్తనలోని తీరు నీ ప్రేమను తెలియజేస్తాయి.

నిన్ను ప్రేమిస్తున్నానని చెప్పాల్సిరావటం ప్రేమకు ఉండాల్సిన లక్షణం కాదు. చెప్పాల్సి వచ్చిందంటే ఆ ప్రేమికుడు దురదృష్టవంతుడనుకోవాలి. లేకుంటే నోటితో చెప్పటం ఎంత అబ్సర్డ్ విషయం. 'నిన్ను ప్రేమిస్తున్నాను' అంటే అర్థం డిమాండ్ చేస్తున్నావన్నమాట. నువ్వు ప్రేమిస్తున్నావు కాబట్టి అవతలి వ్యక్తి నిన్ను ప్రేమించాలి. వ్యాపారసూత్రం. సమాన విలువలమధ్య మారకంలాగా. నువ్వు అలా అన్నావంటే మూడు విషయాలు అర్థమౌతాయి.

ఒకటి, నీ ప్రేమ సంగతి అవతలి వ్యక్తికి తెలీదు. అప్పటివరకూ అంటే ఆ వ్యక్తి నిన్ను ప్రేమించలేదు, నువ్వు నోటితో చెప్పేంతవరకూ. రెండోది, నీకు నీ ప్రేమను వెల్లడిచేయటం కూడా రాదన్నమాట. ఇది చాలు నిన్ను తిరస్కరించటానికి. ఆ భావన ఆ వ్యక్తిని తాకలేదంటే నీ ప్రేమ శక్తివిహీనమయింది. మూడోది నీ డిమాండ్. ఇకనైనా నన్ను ప్రే

మించవూ అని అర్థించటం. ప్రేమను అడుక్కోవాల్సిన పరిస్థితన్నమాట.

కాబట్టి ప్రేమ నోటితో చెప్పి అడిగేది కాదు. అది సహజంగా ఇద్దరిమధ్య ఏర్పడాల్సి భావం. ఇద్దరికీ కలగాల్సిన అనుభవం. ఇద్దరికీ స్పర్శనిచ్చే అనుభూతి. అలాంటి ప్రేమ తిరస్కరించబడిందంటే మన భావం అవతలి వ్యక్తికి చేరటంలేదంటే అర్థం ఆ మనిషికి ప్రేమ అవసరం లేదన్నమాట. అలాంటి దురదృష్టవంతుల్ని గురించి మహోన్నత అనుభవాన్ని ఏవగించుకునే ఆ అల్పప్రాణులగురించి ఒక్క సెకను కూడా ఆలోచించటం అనవసరం. ఆ వ్యక్తిని గురించి ఆలోచించటం ప్రేమకే అవమానకరమైన విషయం.

రెండోదశ సంగతి. ఇద్దరూ ప్రేమించుకోవటం అయ్యాక కొన్నాళ్ళకి అవతలివ్యక్తి దూరమయ్యిపోవటం. లేకపోతే ఇంకెవర్నో పెళ్లిచేసుకోవటం. అదీకాకపోతే మరొకర్ని ప్రేమించటం సంగతి.

నువ్వు ఇటునుండీ ఆమెను ప్రేమిస్తున్నావు. కానీ ఆమె లేపోతే ఆ మనిషి అటుతిరిగి ఇంకెవర్నో ప్రేమిస్తుంది. ఒక్కసారి ఆ దృశ్యాన్ని ఊహించు. నువ్వెవరిని ప్రేమిస్తున్నావు? ఇంకెవర్నో ప్రేమిస్తున్న ఒక మనిషిని. అంటే నువ్వో లేక ఆ మనిషో ఏదో చేస్తున్నారు. అది ప్రేమ కాదు, ప్రేమ పేరుతో ఒక నాటకంలాంటిది ఒకటి ఆడుతున్నారు. నిజంగా ప్రేమమీద నమ్మకం ఉన్నవాడు ఆ నాటకాన్ని ఎంతోసేపు చూస్తూ ఆనందించలేడు. తక్షణం ఆ నాటకానికి తెరదించుతాడు.

చెప్పేదేంటంటే నిజంగా ద్రోహం అనేది జరిగితే ఇంకా నువ్వు ప్రేమిస్తూఉండటం ఆ విషయాల్ని తలుచుకు దుఃఖించటం అర్థంలేని విషయాలు. ఎప్పుడయితే నీమీద అవతలి వ్యక్తికి ప్రేమ లేదో ఆ వ్యక్తిమీద ప్రేమ పోతుంది. పోవాలి. లేకపోతే అది ఇమ్మెచ్యూర్ దశలోనే, అడాల్‌సెంట్ దశలోనే ఉందని అర్థం'' అని ఆగిపోయాడు సూర్యం.

వేణూ ఒక మహోధృత ప్రవాహంలో కొట్టుకుపోతూ సూర్యం ఆగటంతో తేరుకున్నాడు.





అతడికేదో అర్థమవుతున్నటూట ఉంది, కానట్టూ ఉంది. ఊపిరాడక మునిగిపోతున్నవాడికి ఒక ఆధారం దొరికినట్లే అనిపిస్తోంది. కానీ ఆ లింక్ ఏమిటో సరిగ్గా అర్థం కావటంలేదు. సరిగ్గాఅందటంలేదు.

నిజంగా అంత ఉన్నతమయిందా ప్రేమంటే? అలా ఉంటుందా? అది అంత ఉజ్వలమయిందా? ఆ అనుభవం అంత అపురూవమయిందా?

అతడికి సిగ్గువేసింది. తన ప్రేమ సంగతి ఆలోచిస్తే ఎంత సంకుచితమయిందది. సూర్యం మాటలనుబట్టి అసలది ప్రేమేనా అన్న సందేహం వస్తోంది.

నిన్ను ప్రేమిస్తున్నానని చెప్పాల్సిరావటమే దురదృష్టం అన్నాడు సూర్యం. నిజంగా అది సాధ్యమే అయితే ఆ ప్రేమ అద్భుతమయినది. అసలు సూర్యం చెప్పటం సంగతి ఎంత సూటిగా చెప్పేశాడు. అతడి విశ్లేషణ, వివరణ.

వేణూ తన సంగతికాక సూర్యంగురించి ఆలోచనల్లో మునిగాడు.

అల్పప్రాణట. ప్రేమను తిరస్కరించటం వాళ్ల దురదృష్టమేనట. అలాంటి వాళ్లగురించి ఆలోచించటం వృధా అన్నాడు. నిజంగానే కదూ?

వేణూ సూర్యంవైపుకు తలెత్తి ''ఇంకో టీ తాగుతావా?'' అన్నాడు.

ఇందాకటి బాధపోయి ఉత్తేజం కనిపిస్తోందతడిలో.

సూర్యం తలూపి అడిగాడు.

''ఇంతకీ నీ సమస్య సంగతి ఏమిటి? అభ్యంతరం లేకపోతేనే చెప్పు''

''అభ్యంతరమా? నీదగ్గరా? సూర్యం... నిజంగా నేను నిన్నేఉద్దేశంతో తీసుకొచ్చానో తెలుసా? నాకు సానుభూతి చూపించి నువ్వు కూడా ఆ బాధను అనుభవించాలనీ, నామీద జాలిపడతావనీ, జాలిపడేట్లు చెయ్యాలనీ అనుకున్నాను. కానీ నాకా అవకాశం ఇవ్వలేదు నువ్వు. నీకసలు ఏమీ చెప్పకూడదనుకున్నాను. ఏదో నిగూఢమయిన సమస్య వేణూని తినేస్తుందని నీలో నువ్వు బాధపడేట్లు చేద్దామనుకున్నాను. కానీ నీ ఉధృతానికి అవన్నీ బెండుముక్కల్లాగా కొట్టుకుపోయాయి.

చెప్తాను... అంతా విని నామీద తేలిక అభిప్రాయం ఏర్పరచుకోవని నాకు విశ్వాసముంది. నిజానికి నువ్వూ నేనూ వేరువేరనుకోవటంలేదు. ఈక్షణాన నా మనస్సంతా విప్పుకోవాలని ఉంది.

సరిత... సరితతో నేను ఒకరకంగా ప్రవర్తించాను. ఇప్పుడాలోచిస్తే అర్థమవుతోంది. ఆమె అందరితోనూ చనువుగా ఉండేది. ఆమెకి అదే ఇష్టంకావొచ్చు. నేను నామీద ఎక్కువ దృష్టుంది అనుకునేవాడిని. ఆరకంగా దరిచేరబోతే ఆమెకి అర్థమవ్వలేదు. అప్పుడు బిడియ పడుతుందనుకునేవాడ్ని. నాపై ప్రేముండీ ఎక్స్‌ప్రెస్ చెయ్యలేకపోతుందనుకునేవాణ్ణి. నేను ట్రైచేసేకొద్దీ ఆమె దూరమవుతూవచ్చింది.

ఆమెకు చేరువవ్వాలని మిగిలినవాళ్ళని కూడా ద్వేషించేవాడిని. వాళ్ళు నాతో పోటీకి వచ్చినట్టనిపించేది. ప్రభు, మనోహర్ వీళ్ళందరిమీద పీకలవరకూ కోపంవచ్చేది. ఇంకా దారుణం ఏమిటో తెలుసా?'' మంచినీళ్ళకోసం ఆగాడు వేణూ.

''ఒక దశలో నిన్ను తీవ్రంగా అసహ్యించుకొన్నా. సరితని నీవెంట తిప్పుకొని ఆమెను వాడుకొంటావని అనిపించేది. నీ ఆదర్శాల గురించి తెలుసు. కానీ ఆమె నన్ను పట్టించుకోకుండా నీవెంట తిరుగుతుంటే నిన్నారూపంలో తలుచుకొని నువ్వంటేనే అసహ్యం పుట్టేట్టు తయారయ్యాను. సరితముందు నిన్ను అవమానించాలనిపించేది. నాకు సరితని నువ్వే దూరంచేస్తున్నావని అప్పట్లో నమ్మకం.

ఓసారిక విసిగిపోయి ఆమెకి గడువు ఇచ్చాను. ఒకరోజు నా ప్రేమను అంగీకరించేట్లయితే ఆకుపచ్చరంగు చీర కట్టుకొని రమ్మన్నాను. ఆమె కూడా నాతో విసిగిపోయి నేను అడిగిన రోజు ఎర్రడ్రస్సు వేసుకొచ్చింది. ఆమెమీదకాక నీమీద ఇంకా ద్వేషం పెరిగింది. అది ఎక్కడకు దారితీసేదోగానీ ఆమె పెళ్లి నిశ్చయమయింది. దాంతో నిన్ను శత్రువుగా తయారుచేసుకొంటున్న నాకు ఊహించని దెబ్బ తగిలింది. నువ్వేమో మామూలుగా ఉన్నావు. నేను మాత్రం నరకం అనుభవించాను.

నువ్వు ఆమెను అసలు ఆ దృష్టితోనే చూసినట్లు లేవు. నేను ఇష్టమొచ్చినట్టు ఊహించుకుని నా స్వభావాన్ని నీకంటగట్టి నా లోకంలో నేనుండిపోయాను. ఓసారయితే సూర్యం... నిన్ను...''

''నాకు తెలుసు'' అన్నాడు సూర్యం ఆతడిని ఆపుతూ.

''తెలుసా? తెలిసిపోయిందా?'' ఆశ్చర్యంగా అడిగాడు వేణూ. ఊహించని దెబ్బ అది.

''ఆమాత్రం ఊహించలేనూ... ఆరోజు నువ్వు దారికాచి దాడిచేస్తావని ముందే తెలిసింది. నేనే నీకవకాశం ఇవ్వకుండా ఆగాను. నీకోపం ఈలోపు చల్లారుతుందని. తర్వాత నిన్ను కూర్చోబెట్టి వివరంగా మాట్లాడాలనుకున్నాను. నీకు టైం కుదరలేదు.

అమాటకొస్తే ఇప్పుడు నువ్వు తీసుకొచ్చాక వేసిన మొదటి ప్రశ్న సరిత గురించే అని అర్థమయింది. ఎటూ నువ్వే ఎత్తావుగా. ఇక ఈ రకంగా నీతో మాట్లాడాను.

వేణూకి తనమీద తనకే అసహ్యంవేసింది. సూర్యంమీద తను దాడిచేయాలనుకొన్నాడు ఏ విషయంలోనూ కాలిగోటికి కూడా సరిపోలేని తను.

''వేణూ... జీవితం... మన మానవ జీవితం ప్రపంచంలోకెల్లా అద్భుతమయింది. ఏ ప్రాణికీ లేని వరం మనకుంది. అది ఆలోచన. ఆలోచించగలిగే శక్తి మనకుంది. మనం తప్పు చేస్తే సరిదిద్దుకోగలం. అది మరేజీవీ చెయ్యలేదు. ఆ వరాన్ని మనం దుర్వినియోగం చెయ్యకూడదు. మన జీవితాన్ని మనమే దిద్దుకోవాలి. మనకోసం నిలుపుకోవాలి. ఒకరు కాదన్నారనీ, ఇంకొకరు తిరస్కరించారనీ కాదు. ఇవ్వాళ మన కాలేజీ లైఫ్ ఎలా ఉందంటే ఒక గర్ల్‌ఫ్రెండ్‌ని సంపాదించుకోవటం అనేకమందికి జీవితసమస్యగా తయారయింది. అదే జీవిత లక్ష్యంగా భావిస్తున్నారు. దానికీ కారణం ఉంది. అది మనచుట్టూ ఉన్న వాతావరణం, సినిమా, సాహిత్యం, నవలా చివరికి వ్యాపారం కూడా యువతని ఒకవైపుకు తీసుకుపోతున్నాయి. ఒక వాతావరణం మనచుట్టూ క్రియేట్ అవుతోంది. ఫలానా టూత్‌పేస్ట్ వాడితే

మనం బస్‌స్టాండ్‌లో నిలబడగానే ఓ లక్షాధికారి కూతురు కారులోకి ఆహ్వానిస్తోంది. ఫలానా చాక్లెట్ తింటే పదిమంది ప్రేమిస్తూ వెంటబడతారు. దీనికి లొంగిపోని వాళ్లని ఇంకోటి వంచుతుంది. అది నిత్యమూ మన మనసులోకి స్లోపాయిజన్‌లా ప్రవేశిస్తోంది. ఒక్కసారి నువ్వు ఆలోచించు. అది నీ ప్రేమ సంగతి. నువ్వు ఆలోచించగలవనీ, ఆత్మవిమర్శ చేసుకోగలవనీ నాకు నమ్మకం ఉంది''

సూర్యం కుర్చీని వెనక్కినెట్టి నిలబడ్డాడు.

వేణూ కూడా బిల్లు కట్టి సూర్యాన్ని అనుసరించాడు.

రోడ్డుమీద నడుస్తూన్నప్పుడు అడిగాడు సూర్యం-

''మరేమిటి? వెళ్దామా? వద్దా? సరిత పెళ్లికి. ఈసరికి ముహూర్తం దాటి అరగంటన్నా అయి ఉంటుంది''

''నామీదే నిర్ణయం పెట్టావా? పద. అంతా మారిపోయాను నీ మాటలతో అని అనను గానీ కొంత మార్పయితే వచ్చింది. నువ్వన్నట్టు జీవితాన్ని ఆటగా తీసుకోకూడదు. చిన్నపిల్లాడిలా ఉక్రోషం చూపించి పెళ్లికి రాలేదనుకుంటుందేమో. కనీసం ఆమె అంచనానయినా తప్పని నిరూపించాలిగా. పద వెళ్దాం. కానీ సూర్యంకు ఇంకా ఏమూలో చాలా ఇదిగా ఉంది. ఇక ఆమె వేరే వ్యక్తికి స్వంతం అయిపోతుందే. నా కలలు భగ్నమయ్యాయే అన్న భావన లోపల కాల్చేస్తూంది. బహుశా కొంతకాలానికి అంతా పోతుందేమో. కాలం అన్నిటినీ మార్చుతుంది...'' వేణూ సూర్యంతో చెప్తూ నడుస్తున్నాడు.

★ ★ ★

రవికి కాలేజ్ వాతావరణం పరిచయం అయ్యేకొద్దీ కొత్త విషయాలు తెలుస్తున్నాయి. వివిధ రకాల వ్యక్తులూ, వారి ప్రవృత్తులూ, హావభావాలూ, కోరికలూ, వాంఛలూ, ఆశయాలూ, ఆదర్శాలూ, నడతా, నవ్యతా అవగతమవుతుంటే అతడి మనోప్రపంచపు సరిహద్దులు విస్తరించసాగాయి.

తను చదివే ఫస్టియర్‌లో గోపీచంద్, రమణలు ఆకర్షించారతడిని.

రమణ తన కుటుంబాన్ని పోషిస్తూనే చదువుతున్నాడు. పార్ట్‌టైం జాబ్ ఒక వడ్రంగి దగ్గరా, రాత్రి పన్నెండువరకూ ఒక టీ దుకాణంలో సర్వర్‌గా పనిచేస్తాడు. నెలకు ఆరొందలవరకూ సంపాదించి తండ్రినీ, తమ్ముడినీ, తల్లినీ పోషించుకుంటున్నాడు. తమ్ముడు స్కూల్లో చదువుతూ తోడుగా పెయింటింగ్ చేసి అన్నకి సాయపడుతున్నాడు. తండ్రి మంచంపట్టి లేవలేడట.

అతడు ఈ విషయాల్ని తేలిగ్గా చెప్తుంటే నివ్వెరపోయాడు రవి. హాయిగా చదువుకోవాల్సిన వయస్సులో ఒక పని చెయ్యటమేకాక కుటుంబభారాన్ని కూడా భరించటం అంటే నమ్మలేకపోయాడు. కానీ అతడు అలా కనిపించడు. సిగరెట్లు తాగుతూ అమ్మాయిల మీద కామెంట్లు చేస్తూ సరదామనిషిలా కనిపిస్తాడు. మళ్లీ చదువులో ఫస్టే. గోపీచంద్‌ని ఓడించగలడు అవకాశం వస్తే. కానీ కాలేజీకి రావటానికి కుదరదు ఉద్యోగం పనులతో.

గోపీచంద్ కూడా బాగా చదువుతాడు. కానీ ట్యూషన్లూ, ఇంటిదగ్గర తల్లిదండ్రుల శిక్షణా లేనిదే ఒక్క పాఠంకూడా చదవలేడు. రోజల్లా తోమి తోమి చదివిస్తారు. అందుకే క్లాస్ ఫస్ట్. అతడికి రమణమీద మంటని రవికి అనుమానం. అంత ఏడుపెందుకు ఇంకొకరు చదవితే? అతడిమీద చిరాకు కలిగింది.

ఇక అమ్మాయిల గురించి ఎప్పుడూ చర్చలు జరుగుతాయి. కొత్తగా చేరిన వాళ్లే కాబట్టి ఇంకా తమ క్లాసులోవాళ్లని పట్టించుకోలేదు. లోపల ఏమనుకున్నా పైకిమాత్రం ఆ ఆడపిల్లలమీద మాటలు లేవు. కానీ సినిమా తారలు, డిగ్రీ అమ్మాయిలూ, రోడ్డునపోయే వాళ్లగురించే యధేచ్ఛగా ఊహాగానాలు జరుగుతున్నాయి. ఆ ఊహలలో ఉండే సార్వజనీనమైన విషయం ఒకటే.

కనపడిన అమ్మాయికీ, ఫలానా అబ్బాయికీ ఏదో ఉందని.

టూసిక్స్, ఎఫైర్, స్టెపీన్నీ లింకు, సెంచరీ, బౌండరీ, సింగిల్‌రన్‌లాంటి పదాలు సంకేత శబ్దాలుగా వినవస్తున్నాయి.

వీళ్లుకాక ఇంకా పెద్దమనిషి తరహాగా ఉండే వాళ్లున్నారు. వారిలో చదవాలన్న తీవ్ర




మైన ఆకాంక్ష ఉండేది. కానీ ఎక్కువమంది వీక్. ఎంత చదివినా గుర్తుండేదికాదు. క్లాసులు అర్థమయ్యేవికావు. అయినా వారంటే గౌరవ భావం చూపుతారు అందరూ.

ఇంకొందరు బంధుత్వాలు లాగటంలో తల మునకలు అవుతుండేవాళ్లు. ఫలానా ఊళ్లో మా పెదనాన్నగారి అల్లుడి తమ్ముడు, మీ ఊళ్లో ఫలానా ఆయనకి షడ్డకుడి రెండో బావ మరిది అవుతాడట. అయితే మీరూ మనోళ్లే అన్నమాట. అంటూ పీచు సంబంధాలు లాగే వాళ్లు. వారికి ఎప్పుడూ ఆ చర్చల్లోనే జీవితమా ధుర్యం కనిపించేది. తమకు నచ్చనివాళ్ల గురించి గంటల తరబడి చెప్పకొనేవాళ్లు. తమలో ఎవరయినా రాకపోతే ఆ రానివాడిమీదే చర్చలు పెట్టేవారు. వాళ్లతో మాట్లాడటం కష్టం. ఎందుకంటే మాటలయ్యాక తనవెనకే తన మీద వ్యాఖ్యానాలు మొదలవుతాయి.

తాము వాడే టూత్‌పేస్టునుండీ కాలి చెప్పులదాకా మాటలు కోటలుదాటేవి. ఆ సరకుల సమాచారం వారి జ్ఞాపకాల్లో నిత్యమూ పునరావృతం అయ్యేది.

ఖరీదైన సరుకుల్ని వాడటం ఒక క్రేజ్‌లా భావిస్తుంటారు వాళ్లు.

"ఫలానా సబ్బు లేకపోతే నేను నెలరోజులయినా స్నానమే చెయ్యను"

"ఆ టూత్‌పేస్ట్ స్మూత్‌గా ఉంటుంది, అయ్ లైకిట్"

"ఈ చెప్పులు చూశారూ? పందొమ్మిది వందల డెబ్బై అయిదులో కొన్నా ఇంతవరకూ చిన్న గీతకూడా పడలేదంటే నమ్మండి"

"మా అమ్మగారు అన్నం వండుతారు... ఇప్పుడు చూడండి, నేను తింటానా? తిననా అని ఆమె భయంతో గజగజలాడుతుంది. ఎందుకంటే అడుగుకొంచెం మాడినా కూడా అయ్ హేట్ దట్ స్టఫ్. పళ్లెం రోడ్డుమీదకు విసిరేస్తాను"

"మంచి సబ్బులు వాడాలని ఉండుద్దయ్యా. కానీ దొరికిచావవు. మీ ఏరియాలో ఏమయినా ఎవైలబులా?"

"ఆ కంపెనీ ప్రొడక్ట్సు హైక్వాలిటీవి. అయ్... అయ్ రియల్లీ లవ్‌దెమ్"

ఎక్కువగా గొప్పకోసం చెప్పకుంటున్నారని పించేది రవికి.

ఇంకొందరు తమకన్నీ సమస్యలే అని తెగ నీరసం నటిస్తుంటారు. ఒక్క నిముషం కూడా తీరికలేదంటారు. 'నోటైమ్ బాస్' అని ఇరవై సార్లు చెప్తారు ఒక రోజులో. మరికొందరు ఇంగ్లీష్‌లో మాట్లాడేందుకు ప్రయత్నిస్తారు. కొత్తవాళ్లముందు హడావిడిచేస్తారు.

"అరెయార్" అన్నది ఊతపదం.

"యా! యా!" అంటే అవునని అర్థం.

"ఆర్‌యూ గోయింగ్ టూ విలేజా?" అని ఇంగ్లీష్‌ని తెలుగులో అడుగుతారు.

"యా! అయామ్ గోయింగ్ టూ వీలేజే" అని తెలుగు ఉచ్చారణతో జవాబిస్తారు.

ఈ రకం సంభాషణలమీద జోక్ చెప్పాడు రమణ.

ఒకసారి ఓ రైల్వే ఉద్యోగి రైల్లోని ప్రయాణిస్తున్నాడట. ఇంతలో టి.టి.ఇ. వచ్చి టికెట్ అడిగాడట. అప్పుడీయన "అయ్ రైల్వే, యూ రైల్వే, వై టికెట్" అన్నాడట. అంటే మనిద్దరం రైల్వే ఉద్యోగస్తులమే టిక్కెట్ ఎందుకు అని భావం. అప్పటినుండీ అలాంటి ఇంగ్లీష్‌కి 'రైల్వే ఇంగ్లీష్' అని పేరొచ్చిందట.

తనివితీరా నవ్వుకున్నాడు రవి అర్థమయ్యాక.

ఇంగ్లీషునీ, తెలుగునీ కలిపి వాడేవాళ్లది అసలు వేరేభాషట. వాళ్ల మాతృభాష పేరు 'ఇంగ్లీము' అని చెప్పాడు అతడు. వినయబాబుడి ఆ తెలుగేనన్నాడు.

శివుడు అనే స్టూడెంట్‌కి చిత్రమాలోకం అని పేరుపెట్టారు. అతడు ఎప్పటికయినా సినిమా హీరోనవుతాననేవాడు. గాఢంగా నమ్మేవాడు. అందుకోసం డాన్సులూ, పాటలూ నేర్చుకున్నాడు. పూర్వకాలంలాగా తన పాటల్ని తనే పాడనిస్తేగానీ నటించననేవాడు.

ఎవరయినా కొత్తవాళ్లొస్తే వాళ్లముందు నాట్యప్రదర్శన జరిపించేవాళ్లు. ఫలానా డైరెక్టర్ తాలూకు అని చెప్తేచాలు తన విద్యలన్నీ ప్రదర్శించేవాడతను. కొంగలా గెంతుతూ,



పాడుతూ, నేపథ్య సంగీతంకోసం చప్పట్లు కొడుతూ గిరగిరా తిరుగుతుంటే పొట్టచెక్కలయ్యేట్లు నవ్వుపుట్టేది. కానీ రవి జాలిపడ్డాడు అతడి అమాయకత్వానికి.

యాంగ్రీ యంగ్‌మాన్ పాత్ర పోషించాలనుకువాళ్లు మరికొందరు. అవసరమయిన దానికంటే ఎక్కువ కోపధారణతో నలుగురి దృష్టిలో పడతారు. పుస్తకాలు విసిరికొట్టడం, బల్లనో, గోడనో గుద్దటం, చేతులు విరిగిపోయాయా అనుకునేట్లు చేయటం భావావేశం కనబరచటం కొన్ని లక్షణాలు. ఖచ్చితంగా, నిజాయితీగా నిలబడేందుకు ప్రయత్నిస్తారు. అమ్మాయిల్ని గమనించనట్లుగా ప్రవర్తిస్తారు. కానీ ఓరచూపులు చూస్తారు.

నిజవిద్యార్థి లక్షణాలు కొందరిలో అరుదుగా వుంటాయి. ప్రతీదాన్ని పరిశీలించటం, తెలుసుకోవటం అధ్యయనం చేయటంలో వీరికి సాటిఎవరూ లేరు. ప్రతి విజ్ఞానరేఖనూ తమలోకి పీల్చుకొంటారు. నిరంతరం అదే ధోరణిలో ఉంటారు. భౌతిక విషయాలపట్ల అలక్ష్యంగా ప్రవర్తిస్తారు. జుట్టు దువ్వుకోవటం, ఇస్త్రీ బట్టలు ధరించటం లాంటివి ఆలోచించదగ్గ విషయాలు కావని నమ్ముతారు. కాడ్వెల్ నుండీ క్రాంవెల్ దాకా, వేంగఫ్‌నుండీ జాయిస్‌దాకా మనసులో నిక్షిప్తమై వుంటారు.



భవిష్యత్తుని నిర్మించుకోవటం కోసం శ్రద్ధగా ఇటుక ఇటుకనూ పరీక్షించి వరుసలుగా పేర్చి నిరంతర శ్రమతోవుండే చదువరులు ఇంకొందరు. వీరూ అరుదుగా క్లాసుకొకరు కూడా వుంటారా అనిపిస్తుంది. 'పర్‌ఫెక్షనలిజం' అన్న మానసికతత్వం వీరిది. రేపటి పని నేడే. ఇవ్వాళపని ఇప్పుడే. అనే సూత్రం ఖచ్చితంగా పాటిస్తారు. క్రమశిక్షణా కార్యసాధనా వీరికి రెండు భుజాలు. ఏమాత్రం అనుకున్నది జరగకపోయినా, చేయలేకపోయినా తీవ్ర ఆందోళన చెందుతారు. కలత చెందుతారు. తరచుగా డిప్రెషన్‌కి గురయ్యేది కూడా వీరే. పరీక్షల్లో అత్యున్నతస్థాయిని అందుకోలేకపోయినా, అందుకున్నా కెరీర్‌కీ ఉద్యోగాలకీ అవకాశాలు లేకపోయినా క్రానిక్ యాంక్సైటీకి తద్వారా డిప్రెషన్‌కి గురవుతారు. తీవ్రమైన మానసిక అసహాయత వీరిని వెంటాడుతుంది.

సాధారణంగా వీరి తల్లిదండ్రులు ఉన్నత విద్యావంతులై ఉండటం గమనించాడు రవి.

ప్రతిపనికీ బీదఅరుపులు అరిచేవాళ్లింకొందరు. వారిలో నిష్ఠూరధోరణి కనిపిస్తుంది. మాకేం వస్తాయి? మీ అంతటివాళ్లమా? ఏదో మీలాంటి దయవల్ల, మావల్ల కాదుబాబూ, మాలాంటి పనికిమాలినవాళ్లు, చేస్తే మీరే చెయ్యాలి అనేవి ఊతపదాలుగా వాడతారు. సానుభూతిని కోరుకుంటారేమో అనిపిస్తుంది. మీరూ సమర్థులే అని చెప్పినా ఛస్తే ఒప్పుకోరు. నిన్న రిఫిల్ కొన్నానో లేదో శంకర్‌నడుగు. అప్పుడు నేను అలాగా అన్నాను. అన్నానో లేదో టిజ కాలేజీలో జూనియర్





ఇంటర్ ఎంపీసీ తెలుగు రోల్‌నెంబర్ నూట తొంభై... కుమార్‌నడుగు. అంటూ సాక్ష్యాలు గుమ్మరిస్తారు. అసలు రీఫిల్ కొనటం సంగతి చెప్పటం ఎందుకో అర్థం కాలేదనుకుంటే ఫలానావాళ్లగటం, ఆ ఫలానా వాడినడిగేందుకు ఉత్సాహం చూపిస్తున్నట్టు నటించకపోతే వాళ్లు మూతి ముడుచుకోవటం అసలే అర్థంకాదు. వాళ్ల అసందర్భ వ్యాఖ్యానాలకి రవికి ఏవగింపు కలిగింది. సందర్భం అలాంటిది.

ఓసారి క్లాసులో లెక్కల ప్రపంచంలో మునిగివున్న అతడిని పిలిచాడో మిత్రుడు. ఏదో కొంపమునిగిందన్న ఆదుర్దాతో లెక్చరర్ అనుమతి తీసుకుని వెళ్లాడు. అతడు రవి భుజంమీద చెయ్యివేసి చెప్పలేనంత సీరియస్‌గా అడిగాడు.

"నీకో విషయం చెప్పాలనుకుంటున్నాను రవీ. చెప్తే ఏమనుకోవుగా?"

"చెప్పండి" మొహమాటంగా అడిగాడు రవి. అతడి శరీరం ఎలర్ట్ అయింది. ఏదో వ్యక్తిగత విషయం తనకు చెప్పాలనుకుంటున్నాడు మిత్రుడు. తన సామర్థ్యాన్ని గుర్తించాడన్న ఆనందంతో రవి మనసు పొంగిపోయింది.

"మీ క్లాసులో ఫలానా అమ్మాయి ఉందిగా. ఎలా ఎప్రోచ్ అయితే మంచిదంటావు? అసలు ఆమె పరిస్థితి ఏంటిగురూ? నీకు తెలిసిన వివరాలు ఏమైనాసరే నాకు చెప్పు. పోనీ కుదరదంటే ఓ వారం టైంతీసుకో. కానీ నాకు

ఏటూజడ్ తెలవాలి. నేనసలే ఫర్‌ఫెక్టు మని షిని" అని కాసేపు స్వంత డబ్బా వినిపించా డు.

రవికి జుగుప్స అంటే ఏమిటో తొలిసారిగా అర్థమయింది. అతడు సీనియర్ విద్యార్థి. పొద్దున వరండాలో పరిచయం. అదీ ముఖపరి చయం. ఏక్లాసు ఏం పేరులాంటివి తెలుసుకు న్నాడు. అంతే ఇప్పుడొచ్చి వాలాడు. ఫలానా వివరాలు, ఫలానా అమ్మాయి గురించి తన అభిప్రాయం చెప్పాలట. ఎలా ఎప్రోచ్ అవ్వాలో సలహా ఇవ్వాలట. ఏటూజడ్ వివరా లు కావాలట. అందుకు వారం మాత్రం టైం ఇస్తాడట. అసలా అమ్మాయి గురించే తనతో పరిచయం చేసుకున్నాడా అని రవికి సందేహం వేసింది. లేకపోతే మధ్యాహ్నానికల్లా గుంటనక్కలా ఎలా తయారయ్యాడు.

శరీరంమీద గొంగళిపురుగులు పాకుతుంటే కలిగేభావం జుగుప్స. అదే కాలిగోరునుండీ తల వెంట్రుకదాకా ఆక్రమించుకుంటుంటే ఓ పక్కన నవ్వటం. వారంటైం అంగీకరించటం, వివరాలు చెప్పటానికి అంగీకరించటం ఎలా సాధ్యమైందా తనకు అని రవికి అనుమానం వచ్చింది. అసలు అంతసేపు ఎలా భరించగ లిగాడు? అతడు పక్కనున్నంతసేపూ మాన సిక చిత్రహింస. అమ్మాయిల గురించి అనుకో వటం అతడికి ముందే తెలుసు. కానీ ఇతడి ప్రవర్తన మాత్రం అత్యంత హేయంగా కనప డింది. కానీ నిస్సహాయత. ఎదురు చెప్పలేడు.

రమేష్ విషయంలోనూ తను నిస్సహాయు డే. అతడుగానీ అతడి మనుమలుగానీ కలిస్తే వద్దు వద్దనుకుంటూనే వెళ్తున్నాడు. పనులు చేసిపెడ్తున్నాడు. కష్టంగా వున్నా భరిస్తున్నా డు. ఆ కష్టం అయిష్టత మూలంగా వచ్చిందని కొద్దిగా తెలుస్తోందతడికి. అయిష్టత ఉన్నా చేయక తప్పటంలేదు.

అంతకంటే అతడిని బాధపెడుతున్న విషయం తన ప్రవర్తన. అయిష్టత చేసేపను ల్లో తెలిసిపోతుంది. హావభావాల్లో వ్యక్తమవు తోంది. కానీ అది తనలో లేదు. ఆ పనులు చేసేప్పుడు పూర్తిగా ఇన్‌వాల్వ్ అయిపోతున్నా డు. ముందు అయిష్టంగా వున్నా ప్రా రంభించాక అలా అనిపించటంలేదు. మన స్సులో రహస్యంగా ఇష్టంగానే అనిపిస్తుంది. అదే అతడిని బాధపెడుతోంది. వద్దు ఇది నాకు నచ్చదు అని నర్దిచెప్పుకుంటున్నాడు. కానీ విఫలమవుతున్నాడు. ఒక వ్యసనానికి లొంగిపోయిన వ్యక్తిలాగా.

బస్‌పాస్ గురించి సిద్ధప్పను కలిసినప్పు డు... ఇక అన్నీ మరిచిపోయి కష్టపడి చదవా లనుకున్నాడు. అందుకు ప్రయత్నించాడు. చదవాలంటే పాఠ్యాంశాలు అర్థం కావాలి. అర్థమైతేనే ఉత్సాహం కలుగుతుంది. దానికి పట్టుదల తోడయితే కష్టపడి మంచి మార్కు లు సంపాదించుకోవచ్చు. క్లాసులో అందరి కంటే ముందుండవచ్చు. కానీ అసలు మొ దటే గండిపడింది. సబ్జెక్టు అర్థంకాని బండరా యిగా వుంది. టెంత్‌వరకూ తెలుగుమీడియం విద్యార్థి తను. ఇప్పుడు ఒక్కసారిగా ఇంగ్లీషు వాతావరణం. టెంత్‌లో ఇంగ్లీషు సబ్జెక్టును నోటికొచ్చేంతవరకు వల్లెవేసి చూసిరాత రాసి ఔపోశన పట్టాడు. ఇప్పుడు దాదాపు అన్నీ సబ్జెక్టులూ ప్రతి పదమూ, వాక్యమూ గుర్తుంచు కోవటానికి బట్టీవేయాల్సి వస్తోంది. ఒక ఈక్వే షన్ను, ఒక ఫార్ములాను మరో లెక్కను గు ర్తుంచుకొనేంతవరకూ చదువు ముందుకుసాగ దు. అది మోయలేని భారంగా వుంది. క్లాసులో కూడా సంభాషణ అంతా ఇంగ్లీషులోనే. తెలు గు నిషిద్ధం. లెక్చరర్ చెప్తున్నది అర్థంకావటం అటుంచి సందేహాలు అడగాలంటే ఇంగ్లీషు రాక తనలోనే వుంచుకుంటున్నాడు. అవి క్ర మంగా పెనుభూతాలయ్యి పాఠాల్ని లాటిన్ అండ్ గ్రీక్‌లా చేశాయి. లెక్చరర్ ఏమైనా ప్రశ్నలు వేస్తాడేమో అని గుండెలు అరచేతిలో పెట్టుకుంటున్నాడు. సమాధానం చెప్పాలని కాదు. అసలా ప్రశ్న ఏమిటో ఎలా తెలుసుకో వాలా అని. కెమిస్ట్రీలో వినయబాబు అసాధా రణ శైలివల్లకానీ మరెందుకోగానీ అందరి కంటే వెనుకబడివున్నాడు. ఆ పుస్తకం తెరవ టానికి ధైర్యం కూడగట్టుకునేందుకు చాలా కష్టపడుతున్నాడు. ఫిజిక్స్ లెక్చరర్ అంటే ప్రాణం లేచివస్తోంది. చక్కగా పాయింట్లవా రీగా వివరించి చెప్తున్నాడాయన. రవిలాంటివా రిని ఉద్దేశించి కష్టమైనా ఆలస్యమయినా ఎంత సమయమైనా తీసుకొని బోధిస్తున్నాడు.




అతడి కాలేజీ జీవితంలో మరిచిపోలేని వ్యక్తి ఆ లెక్చరర్.



పార్టీ అధినాయకుడి రాకతో అంకినీడు స్వాగత కార్యక్రమాల్లో మునిగిపోయాడు. ఆయన ముందు తన సత్తా చూపించటంకోసం ఏర్పాట్లు చేసేశాడు.

ఒక ఫ్యాక్టరీ శంకుస్థాపన చేయటంకోసం అధినాయకుడు టౌనుమీదుగా ప్రయాణం సాగిస్తాడు. ఆ రోడ్డునిండా తోరణాలు, స్వాగత ద్వారాలు, ప్రజలనుద్దేశించి ప్రసంగించటానికి వెయ్యిగజాలకో వేదిక, మేళతాళాలు, ఊరేగింపులు, విన్నపాలు సిద్ధంగా ఉన్నాయి.

శివాజీ ఆధ్వర్యంలో విద్యార్థి యువజనులు వందల సంఖ్యలో పాల్గొనబోతున్నారు.

శివాజీకి జిల్లా స్థాయిలో ఏదోఒక పదవి లభించబోతోందని ప్రజలు అనుకొన్నారు.

మిట్టమధ్యాహ్నం రెండింటికి అధినాయకుడు వస్తాడు.

అందుకోసం పదింటికే చెమటలు దిగకారుకుంటూ జనం వేచివున్నారు. గ్రామీణ ప్రాంతాలనుండి రైతులు, కూలీలు, పంచాయతీ బోర్డు మెంబర్లు, సర్పంచ్‌లూ వేలసంఖ్యలో చేరుకున్నారు.

ఇతర నియోజకవర్గాల్లో ఓడిపోయిన మాజీ ఎమ్మెల్యేలూ, పార్టీముఖ్యులూ కూడా టౌనుకు చేరుకున్నారు.

అంకినీడుకు ఈసారితో మంత్రిపదవి ఖాయం అన్నవార్తకు మరింత బలం చేకూరింది.

పురప్రముఖులూ, అధికారులూ అంకినీడు వెంబడి తిరుగుతున్నారు. తమ పనులు ఏమయినా చేయించగలడేమో అని. తమ విన్నపాల్ని అధినాయకుడికి అందివ్వమని అతడిని కోరారు. అందరికీ అనేక అవసరాలు ఉన్నాయి.

అంకినీడు ముందస్తుగా అభయం ఇచ్చేశాడు. అధినాయకుడు తనపట్ల సానుభూతితో వున్నాడని పార్టీవర్గాల భోగట్టా. అదే అతడి ధైర్యం.

రెండింటికనుకుంది మూడు దాటింది.

అయినా జనంలో ఉత్సాహం తగ్గలేదు. ఇంతవరకూ ఏ టౌను పరిసరాల్లోకి ఏ అధినాయకుడూ వచ్చిన దాఖలాలు లేవు. ఇదే తొలిసారి.

టౌను బయటే వెయ్యిమందితో స్కూటర్ ర్యాలీ అధినాయకుడి కారుని అనుసరించాలి ముందు వేసుకున్న ప్లాన్ల ప్రకారం.

కానీ చిన్న సమస్య వచ్చింది.

అధినాయకుడు పదిమిషాల్లో వస్తాడనగా పోలీస్‌బలగం అక్కడికి చేరుకొంది. ఎస్పీ స్వయంగా పర్యవేక్షిస్తున్నాడు.

ఆయన ఈ 'న్యూసెన్సు'పట్ల మండిపడ్డాడు. అధినాయకుడి రక్షణ బాధ్యతకు భంగం కలగకూడదని ఆయన నిశ్చితాభిప్రాయం. అవన్ని తొలగించమని ఆదేశించాడు.

ఆ అభిమానులంతా అంకినీడుని చేరుకుని గొడవ చేశారు. అసలే ఆ ఎస్పీకి అంకినీడుకి పడదు. పూర్వం ఓసారి ఆయన్ని ట్రాన్స్‌ఫర్ చెయ్యాలని నిరాహారదీక్ష కూడా చేశాడు.

"కుర్రాళ్లు సరదాపడుతున్నారు. అంతా మనోళ్లే. ఏమీ కాదు. నేను చూసుకుంటా"నన్నాడు అంకినీడు ఎస్పీ దగ్గరికి వెళ్లి.

ఎస్పీ భృకుటి మండిపడింది. ఒక కానిస్టేబుల్ని పిలిచాడు ఆయన.

"ఎవరీయన? ఏదో అంటున్నాడు. కాస్త చూడు" అని అవతలికి పోయాడు.

అంకినీడుకి కడుపు రగిలిపోయింది. తన స్థాయి కానిస్టేబుల్‌తో అన్నమాట. పైగా ఎవరీ

యన. ఎమ్మెల్యేకి అంత విలువ ఉంది ఎస్పీ దగ్గర.

అతడు చివాలున వెనక్కితిరిగి తనవాళ్లతో ఎస్పీ ప్రవర్తన గురించి చెప్పాడు.

వాళ్లకి ఆవేశం పెరిగిపోయింది. అమీతుమీ తేల్చేయ్యాలి ఈసారి అనే కేకలు పెట్టారు. ఇంతకాలం ఊరుకున్నందుకు అంకినీడుని తప్పుపట్టారు.

అప్పుడే పోలీసులు ఆ వాహనాల్ని స్కూట ర్లనీ తొలగించుతున్నారు. శివాజీ శంకర్రావులు అడ్డంవెళ్లి వారించబోయారు. వాళ్లని ఓపక్కకు తోసేశారు.

అధినాయకుడి కారూ పైలట్ జీపూ ఫర్లాంగుదూరంలోకి వచ్చేశాయి.

యువకులంతా హఠాత్తుగా పోలీసుల్ని తోసుకుంటూ ముందుకుపోయి రోడ్డుకడ్డంగా బైఠాయించారు. పోలీసు జులుంకు నిరసనగా నినాదాలు అందుకున్నారు.

అంకినీడు పరిస్థితి చెయ్యిదాటి పోతుందని గుర్తించాడు. ఇప్పుడు వాళ్లని నివారించాలా? వద్దా?

ఓ పక్కన తమ నాయకుడు వస్తున్నాడు. తామే నిరసనగా బైఠాయించారు. నిరసనతో స్వాగతమిస్తున్నారు.

ఇప్పుడు వద్దంటే కుర్రాళ్లలో తనకి విలువ పోతుంది. ఇక ఈ ఎస్పీకి పట్టపగ్గాలుండవు. రెండూ తనకి నష్టాలే.

ఇంక క్షణం ఆగకుండా అంకినీడు కూడా ముందుకువెళ్లి రోడ్డుమీద తనవాళ్లకి నాయక త్వం వహిస్తూ తానూ బైఠాయించాడు.

ఎస్పీ అంతకంటే వేగంగా ఆదేశాలిచ్చాడు ముందే ఇలాంటివి ఎదుర్కొనేందుకు సిద్ధంగా ఉన్నాడాయన.

అంకినీడుని ఎత్తుకెళ్లి కారులోకి నెట్టడం, రోడ్డుమీద ఉన్నవాళ్లని తరిమికొట్టడం, ఎత్తిపా రెయ్యటం విసిరెయ్యటం, లాఠీచార్జీ చె య్యటం క్షణాల్లో జరిగిపోయింది.

ఒక్క సెకను కూడా ఆగకుండా అధినాయ కుడి కారు వెళ్లిపోయింది. ఏ అడ్డంకీ లేకుండా. ఆ కారులోంచి బయటకు చూశాడు ఆయన.

"ఏమిటి? ఏదో గొడవ జరుగుతున్నట్లుందే" అడిగాడు పక్కవారిని.

"లేద్సార్ తమకు స్వాగతం చెప్పటానికి తోసుకుంటున్నారు. అంతే" అన్నాడు ఒక ఉపనాయకుడు.

కాలేజ్ బంద్-

గేట్ల దగ్గర శివాజీ బృందం అడ్డుగా నుంచుంది. వచ్చినవారిని ఆపేసి వెనక్కి పంపిస్తున్నారు. గేటును దగ్గరికి లాగేసి గడిపె ట్టేశారు. లెక్చరర్లు కూడా వెళ్లలేక ఆగిపోయా రు.

అరుణ్‌కుమార్ ఇంకా రాలేదు. అతడి మనుష్యులు వెనక్కి వెళ్లేవారిని పిలిచివుండ మన్నారు. కాలేజ్ మామూలుగా జరుగు తుంది. బందూలేదు ఏమీలేదు అన్నారు.

విద్యార్థులు ఊగిసలాటలో పడ్డారు. క్లాసులు జరుగుతాయా లేదా? చూడగా శివాజీ బలం తక్కువగా ఉన్నట్లుంది. జరగొచ్చునని పిస్తోంది.

ఇంతలో అరుణ్‌కుమార్ వచ్చాడు. అతడి వెనుక ఓ పదిమంది వున్నారు. ఇంకా మామూ లు విద్యార్థులు కూడా అనుసరిస్తూ వచ్చారు. అతడు గేటు దగ్గరికి వెళ్లాడు.

"ఎస్పీని ట్రాన్స్‌ఫర్ చెయ్యాలని మనం నిరసన తెలుపుతున్నాం. ఒక శాసనసభ్యుడిప ట్ల అమర్యాదగా ప్రవర్తించినందుకు బాధ్యత కలిగిన పౌరులుగా విద్యార్థులుగా ఈ నియోజ కవర్గంకు చెందిన మనుషులుగా ఈరోజు బంద్ చేస్తున్నాం" అన్నాడు శివాజీ.

"చేస్తున్నామా? ఎవరు చేస్తున్నారు? మమ్మ ల్ని పోనీయండి. మీతో కలిసి వచ్చినవాళ్లతో బంద్ చేసుకోండి. గేటు తెరవండి" అన్నాడు అరుణ్‌కుమార్.

"మీరు విద్యార్థి ప్రతినిధి. మీరే అట్లంటే ఇక మన ఎమ్మెల్యేని ఏం గౌరవిస్తున్నట్లు. ఆయనకి అవమానం జరిగితే మనకు జరిగిన ట్లు కాదు. తనకి బాధ్యత లేదూ?"

"ఆ ఎస్పీతో మాకేం సంబంధంలేదు. అంకి నీడు ఎమ్మెల్యే అయ్యాక మన మొహం కూడా చూసి ఎరగడు. అట్లాంటి వాడికోసం మా

చదువులు చెడగొట్టుకోలేం. ముందు గేట్లు తెరవండి. విద్యార్థులకి ప్రతినిధిగా వారికి క్లాసులు జరిగేట్లు చూడటం నా బాధ్యత. వాళ్లని క్లాసులకెళ్లనీయండి. మీకంత బలంవుంటే లోపలకొచ్చి మీ సమస్య వివరించి వాళ్లని కన్విన్స్‌చేసి తీసుకెళ్లండి. నేను కాదనను''

వాగ్వివాదం పెరిగింది. చేతులు అడ్డంపెట్టి నుంచొన్నవాళ్లని తోసుకుంటూ వెళ్లి గేటు తీశారు అరుణ్ అనుచరులు. శివాజీ మనుషుల బలం చాలలేదు.

లెక్చరర్లూ, స్టూడెంట్స్ లోపలికి నడిచారు. ఇంకా కొందరు బయటే నిలబడివెళ్లటానికి సందేహిస్తున్నారు. వాళ్లని ఆపుతూ శివాజీ బృందం నిల్చొంది.

మళ్లీ అరుణ్‌కుమార్ వెనక్కి వచ్చి విద్యార్థులకి క్లాసులకి వెళ్లమన్నాడు.

''నేను చెప్తున్నాను పదండి. మనకి సంబంధించని వాటికోసం బంద్‌లు చేస్తే మన భవిష్యత్తు మట్టిలో కలుస్తుంది. నేనున్నాను. ఎవరూ ఏమీ చెయ్యరు'' అన్నాడు ధైర్యం చెప్తూ.

ఊగిసలాడేవాళ్లు కూడా లోనికి నడిచారు. శివాజీ మనుషులూ అతడిని సపోర్ట్ చేసేవారు తప్ప ఎవరూ మిగల్లేదు. ఇందాకటివరకూ జనంతో కిక్కిరిసిపోయిన ఆ స్థలం బోసిపోయింది. శివాజీ నిస్సహాయుడిలా పళ్లు కొరుక్కుంటూ నిల్చున్నాడు.

రమేష్‌కి అవమానంగా వుంది. ఇది రెండోసారి ఫెయిలవ్వటం.

అప్పుడే డబడబా శబ్దంచేస్తూ మోటారుసైకిలు వచ్చి ఆగింది. నళినీమోహన్ వెనక శంకర్రావు ఉన్నాడు.

''ఏంటి ఎవరూ లేరు? ఇళ్లకుపోయారా లేకపోతే క్లాసుల్లో ఉన్నారా?'' నళినీ అడిగాడు.

''లేదురా, అంతా లోపలే వున్నారు'' విసుగ్గా అన్నాడు రమేష్.

''అదేం మీరంతా ఏం చేస్తున్నారు?'' ఆశ్చర్యం ధ్వనించింది శంకర్రావు గొంతులో.

''మేమూ? మేమేం చేస్తాం. అందర్నీ రండిరా. ఇక్కడ ఎనిమిదికల్లా ఉండకపోతే కష్టం అని ముందే చెప్పాం. ఎవడు వింటాడు. ఎవడిష్టం వారిది'' అన్నాడు రమేష్.

''అయితే మేం రాకపోతే వదిలేయటమేనా? ఇంతమంది వున్నారు. ఎందుకు? మేం ఇద్దరం వస్తే అవుతుందా?'' శంకర్రావు తీవ్రంగా అడిగాడు.

రమేష్ శంకర్రావు ఘర్షణ పడ్డారు.

''జాయింట్ సెక్రటరీవి. నువ్వుంటే వాడు అట్లా వాగేవాడా? నేనే విద్యార్థుల ప్రతినిధిని అని చెప్పి అందర్నీ తోలుకుపోయాడు. సెక్రటరీగా ఉన్నావు దేనికి?'' అరిచాడు రమేష్.

శివాజీ వచ్చి సర్దిచెప్పే ప్రయత్నం చేశాడు.

''సరే నేను రాకపోయినందుకు ఫెయిలయ్యిందంటున్నాడు రమేష్. కానీ మీరెవరూ లేకుండా ఇప్పుడు రప్పిస్తాను అందర్నీ. నేను తీసుకొస్తా అందర్నీ. అప్పటికయినా సిగ్గుతెచ్చుకోండి'' శంకర్రావు లోపలికి నడిచి చెప్పాడు పెద్దగొంతుతో.

''ఏంటది? శంకర్ ఒక్కడివే ఏంచేస్తావు?'' పిలిచాడు శివాజీ.

''బైటకి రమ్మంటే ఎవడు రాడో చూస్తాను. మాటలతో లాభంలేదు'' వెనక్కి తిరిగి అన్నాడు శంకర్రావు. మళ్లీ నడిచాడు కాలేజ్ లోపలికి ఒక్కడే''

''అరేయ్ నళినీ పదండి మీరు కూడా. వీడేం అఘాయిత్యం చేస్తాడో. రమేష్ నువ్వు కూడా. ఏం గొడవలురా ఇవి. మనలో మనకే పడకపోతే ఎట్లా. అందరూ పదండి'' శివాజీ ఆదేశించాడు.

అందరూ కదిలారు. ముందంత ఉత్సాహంలేదు. బయటే ఆపాల్సింది. ఇప్పుడు ఒక్కో క్లాసుకి వెళ్లి రమ్మనటం. వాళ్లు కొందరొస్తారు. కొందరురారు. రానివాళ్లని చూసి మళ్లీ వీళ్లూ కూర్చుంటారు. ఒక క్లాసులో వుంటే ఇంకో క్లాసువాళ్లు ఇంకో క్లాసువాళ్లు తిరిగి అటెండ్ అవుతారు. తలనెప్పి.

అని అనుకుంటూ శంకర్రావుని విసుక్కుంటూ నడిచారు.

గ్రౌండ్ దగ్గర కొందరు రమేష్‌తో కలిసి ఇంటర్ విభాగంవైపుకు చీలారు. మిగిలినవా

ళ్లు డిగ్రీ బిల్డింగ్‌వైపుగా వెళ్లారు.

★ ★ ★

దక్షిణామూర్తి లెక్చరు వింటున్న పిల్లలు ఉలిక్కిపడ్డారు.

రమేష్ ఇంకో నలుగురూ లోనికి వచ్చారు.

క్లాసులో నిశ్శబ్దం చెదిరిపోయింది. గుసగుసగా మాటలు మొదలయ్యాయి.

"ఫ్రెండ్స్ కొంచెం పనుంది. ఇవాళ బంద్ పాటించాలని నిర్ణయించుకోవాలి. మన ఎమ్మెల్యేని అవమానించిన ఎస్పీని ట్రాన్స్‌ఫర్ చెయ్యాలని మనం డిమాండ్ చేస్తున్నాం. దయచేసి మీరు సహకరించాలి. క్లాసులు జరగవు ఇవ్వాళ. పదండి... అందరం బయట కలుద్దాం. మన శివాజీ ప్రసంగం వుంటుంది. అందరూ రావాలి. రండి బయటకు రండి"

రమేష్ పెద్దగా ఎనౌన్స్ చేశాడు.

దక్షిణామూర్తి ఎప్పుడో లెక్చరు ఆపేసి ఓ పక్కన నిల్చొన్నాడు.

స్టూడెంట్స్ నుంచీ స్పందనలేదు. ఎవరికివాళ్లు గుసగుసలు మాని పక్కవాడితో సంభాషిస్తున్నారు. కొందరికి పోదామని వుంది. క్లాస్ బోర్‌గా వుంది.

ఆడపిల్లలు ఒకింత భయంతో ఆదుర్దాతో నిలబడ్డారు. ఎందుకొచ్చామా అన్న భావం కనపడుతుంది వారిలో. సంధ్యా ఇంకా ఒకరిద్దరు కూర్చునే వున్నారు.

స్టూడెంట్స్ మధ్యలోకి వెళ్లి అటూ ఇటూ తిరుగుతూ లేవగొడుతున్నారు వచ్చినవాళ్లు. రమేష్ కొంతమందికి సమాధానంగా నవ్వుతూ నచ్చజెప్పి బెంచీల మధ్యగా వెనక్కి నడిపించాడు. అతడికి లోపల విసుగ్గా వుంది శంకర్రావు ప్రవర్తనతో.

అక్కడ రవి కనబడ్డాడు.

"ఏరా రవీ... ఇక్కడే వున్నావా? ఇవ్వాళ రాలేదేమో అనుకున్నా. మనోళ్లంతా బయట ఉన్నారు. చూళ్లేదా?"

అంటే తను వాళ్లతో కలిసి గేటు దగ్గరే తిష్టవేయాలని అంటున్నాడు. ఇంకా తనని వాడుకొందామనే. వాళ్లకోసం తహతహ లాడుతున్నానే అనుకుంటున్నాడు.

"ఊఁ... ఊఁ..." నీళ్లు నమిలాడు రవి.

అది సారథి గమనిస్తున్నాడు. అతడికి ఇంతవరకూ సరిగ్గా తెలీదు. రవికీ రమేష్‌కీ మధ్య ఎలాంటి రిలేషన్ ఉందో.

రమేష్ సారథిని చూసి గుర్తుతెచ్చుకోవాలని ప్రయత్నించాడు. సాధ్యం కాలేదు. ఎక్కడో చూశాడు తను.

"పదండోయ్. మీరు మాత్రం కూర్చున్నారు. అందరూ ఎప్పుడో వెళ్లిపోయారు"

సారథి లేచి ముందుకు వెళ్లాడు. కొందరు లేచి వేళ్లేందుకు సిద్ధమవుతున్నారు. వాళ్లని చేత్తో తట్టి ఆగమన్నాడు.

"ఓ నిమిషం ఆగండి. మనం వెళ్లబోయే ముందు రెండు విషయాల్ని తెల్సుకోవాలి" గొంతుపెంచి క్లాసంతా వినపడేట్లు చెప్పాడు.

'వీడేదో చెప్తున్నాడు. అది మనకు ప్రమాదం' అనుకున్న రమేష్ మనుషులు అభ్యంతరం పెట్టబోయారు. అతడి చుట్టూ నిలబడి వారిస్తున్నారు.

"చెప్పు చెప్పు" వెనకాల రమణ అరిచాడు. ఇంకొందరు గొంతు కలిపారు.

సారథి తనముందు అడ్డంగా ఉన్నమనిషిని పక్కకునెట్టి అందరినీ కలియచూశాడు.

"మనం బంద్ పాటిస్తాం. సరే. దేనికి. ఎవరి ప్రయోజనాల కోసం? అంకినీడుని ఎస్పీ అవమానించాడు. సరే అవమానించాడు. అది తప్పే. దాని బ్యాక్‌గ్రౌండ్ మీకు తెలుసో లేదో. ఒక్క ఎమ్మెల్యే సపోర్టు లేకుండా అంకినీడు మంత్రిపదవిని కోరుతున్నాడు. అది అధినాయకుడికి ఇష్టంలేదు. ఇప్పటికే అసమ్మతితో లుకలుకలాడుతోంది రాష్ట్రప్రభుత్వం. అంకినీడుకి అసమ్మతితో సంబంధం ఉందనేది అందరికీ తెలుసు. అలాంటివాడు తన బలాన్ని చూపిస్తే ఏమన్నా గుర్తిస్తారేమో అని ఆ ప్రదర్శనకి తలపడ్డాడు. చివరికేమయింది. ఎస్పీ దానిని జరగనీయలేదు. ఎందుకూ?" ఆగాడు సారథి.

"అది ప్రభుత్వ ఆదేశాలను అనుసరించి. అధినాయకుడి ఆదేశాలను బట్టి అంకినీడు ప్రయత్నాన్ని భగ్నం చేశాడు. ఎస్పీ చర్యకు అసలు కారణం అధినాయకుడి దగ్గర వుంది.





ఇప్పుడు మనం బంద్ చేస్తాం. కానీ మీరు ఒక హామీ ఇవ్వాలి" రమేష్‌వైపు చూస్తూ అన్నాడు.

రమేష్ మోహం పాలిపోయింది. చివరికి ఇంటర్‌లో కూడా ప్రతిఘటన ఎదురయింది.

అంకినీడు సంగతే తెలీని విద్యార్థులు తెల్ల బోయారు. ఏదో లిటిగేషన్ ఉందని అనుకున్నారు. సారథి మాటలు కొద్దిగా పనిచేశాయి.

అందరూ సారథివైపు తిరిగే సూచనలు కనిపిస్తున్నాయి. సారథిని ప్రోత్సహించారు చెప్పటం ఆపొద్దని.

"ఆ హామీ ఏమిటంటే అంకినీడు పార్టీకి రాజీనామా ఇవ్వాలి. ఎందుకంటే మన ఎమ్మెల్యేని అవమానించింది ఎవరు. ఆయన పార్టీ వాళ్లే. ఆ పార్టీ నాయకులే. అలాంటిచోట మన మనిషికి ఏమాత్రమూ గౌరవం లభించనిచోట ఇంకా ఆయన కొనసాగటాన్ని మనం ఒప్పుకోలేం"

రమేష్ ఏమీ మాట్లాడలేదు. మొత్తం పరిస్థితి తలక్రిందులయ్యేట్లుంది. వీడెవడో అరుణ్‌కుమార్ మనిషిలా ఉన్నాడు. కానీ వాళ్లకి మాటలతో పనిలేదే? ఏంటీ తక్షణ కర్తవ్యం?

సారథ ప్రసంగం నిరంతరాయంగా సాగుతోంది.

"ఇంకో వింత తెలుసా. మన ఎమ్మెల్యే అంకినీడు అధికార పార్టీవాడు. ఆయనని అవమానించింది ఒక ప్రభుత్వ అధికారి. అంటే ప్రభుత్వ ప్రతినిధికీ, ప్రజాప్రతినిధికీ వడటంలేదు. అలాంటప్పుడు కూడా ఒకటే పరిష్కారం. అది రాజీనామా" ఆ హామీ ఇస్తారా మరి?"

"ఊహూ... మీరు హామీ ఇవ్వలేరు. కారణం స్పష్టం. ఏదోఒక పదవి దొరికేదాకా అంకినీడు నిద్రపోడు. అందుకోసం అసమ్మతిలోనూ ఉంటాడు. అవసరమయితే చెంచాగిరీ చేస్తాడు. ఎంత అవమాన్నయినా మింగుతాడు. అందుకోసం మీలోమీరు కుమ్ములాడుకున్నప్పుడల్లా జనంమీద పడండి. జనం అన్నిటినీ భరిస్తారు గంగిగోవుల్లాగా. ఇక అంకినీడు విషయం ఒకటి మనకు తెలియాలి. ఈనరికి మన కాలేజి స్టూడెంట్సులో చాలామంది తెల్సుకోనేవుంటారు. అది ఏమిటో తెలుసా? కులరాజకీయం సంగతి కాదు. ఇప్పుడు వీళ్లు వచ్చింది కులప్రాతిపదికనే అనుకోండి"

రమేష్ ముందుకి కదిలాడు. అతడికి కోపం తన్నుకువస్తోంది. వేలెడంతలేడు. ప్రతివాడూ ప్రశ్నలు కురిపించేవాడే. సారథి దగ్గరకు వెళ్లి అతణ్ణి బయటకు నెట్టెయ్యాలని అనుకున్నాడు.

"బోసు బొమ్మ సెంటర్‌లో ఒక కూల్‌డ్రింక్స్ షాపుంది..." పెద్దగా అంటున్నాడు సారథి.

ఇక రమేష్ ఆగలేదు. పరిగెత్తుకుంటూ వెళ్లి వెనక్కి తోశాడు. ఇద్దరు సారథిని నోరు మూసి బయటకు ఈడ్చెయ్యబోయారు. అతడు ప్రతిఘటించాడు.

కొందరు విద్యార్థులు ముందుకుపోయి అతడి సాయానికి నిల్చున్నారు. సారథిని వదిలెయ్యమని కేకలు పెట్టారు. తోపులాట మొదలయ్యింది.

"మీ సంగతి తర్వాత తేలుస్తాంరా" అరిచాడొక రమేష్ వర్గీయుడు అందర్నీ కలయజూస్తూ.

అంతే ఆమాట విద్యార్థులమీద తీవ్రమైన ప్రభావం చూపింది. అందర్నీ శత్రువుగా తీసుకొంటున్నారు. అంటే తమకూ, వాళ్లకీ శత్రుత్వం వచ్చేసింది. ఇక వెనక్కితగ్గే ప్రసక్తిలేదు.

"నోర్మూసుకుని బయటకు పొండి. అసలు మీకు మా క్లాసులో ఏంపని" అరిచాడు రమణ.

ఒక నూతనోత్సాహం స్పష్టంగా కనపడుతోంది అందరిలో. ఒక సంఘటితతత్వం అలవడిన కారణాన ఒకరికొకరు సున్నితంగా భావించుకొంటూ శత్రువుల్ని ఎదిరించారు. మాటలతోనే నిలబెట్టేశారు. తిట్లవర్షం కురిపించారు.

తమ స్నేహితుడివట్ల అవమానంగా ప్రవర్తించారనే ఆవేశం అది.

పక్కక్లాసుల విద్యార్థులు తొంగిచూస్తున్నారు డోర్ దగ్గర. చాలామంది రూంబయట గుమిగూడారు.

దక్షిణామూర్తి యధాప్రకారం బయటకు పరుగుతీశాడు.

"చివరసారిగా చెప్తున్నాం. బంద్ పాటించారా సరే. లేకపోతే మీరేచూస్తారు" అరిచాడు రమేష్ అసహనంగా. అతడికి అంతమంది

ముందు ఓడిపోతున్నందుకు అవమానంగా ఉంది.

"ఏంట్రా నువ్వు చూసేది..." ఎవరో అరిచారు.

బూతులు కూడా వదిలారెవరో. హేళనగా నవ్వులూ, కేకలూ, తిట్లూ...

"పదండ్రా తర్వాత చూద్దాం" రమేష్ అన్నాడు తనవాళ్ళతో.

ఆ నలుగురూ వెనక్కి తిరిగారు. రూంలోంచి బయటకు నడిచారు. రూంలో గాలికూడా కదలనంత నిశ్శబ్దం వాళ్ళు వెళ్తుంటే.

తర్వాత మెల్లగా సద్దు మొదలయింది. ఇంతలో రమేష్ మళ్ళీ వెనక్కి వచ్చాడు. లోపలికి నాలుగడుగులు వేసి వెనకబెంచీలవైపు చెయ్యి ఎత్తి పిలిచాడు-

"అరేయ్! రవీ... ఓసారి రా వనుంది" ఆ గొంతులో అధికారముంది.

రవి అప్రయత్నంగా నుంచున్నాడు. అందరి చూపులూ తనమీద ఉన్నాయి.

వెళ్ళాలా? వద్దా? ఇంతవరకూ జరిగిన ఘర్షణలో అతడు మానసికంగా సారథివైపు నిలిచి వున్నాడు. ఇప్పుడు రమేష్ పిలుస్తున్నాడు. అందరిముందు నా మనిషి అని చెప్పటంకోసం పిలుస్తున్నాడు...

క్లాసంతా తనను గమనిస్తోంది. రవినుదుట స్వేదబిందువులు అలుముకున్నాయి. ఏంచెయ్యాలి? వెళ్తే అందరికీ చులకన అవుతాడు. తనకే ఇష్టంలేదు. వెళ్ళకపోతే?

"త్వరగా" కేకపెట్టాడు రమేష్. అతడి అధికారం అంతా రవిమీద ప్రయోగిస్తున్నాడు. ఆ క్షణం అనిపించింది. అటో, ఇటో తేలిపోయే క్షణం...

"రాను" అన్నాడు రవి ఖచ్చితంగా. నిశ్శబ్దం బ్రద్ధలయింది.

రూంలో చప్పట్లు మోగాయి. విద్యార్థులు రవిని అభినందించుతూ కేకలు పెట్టారు.

సారథి మెచ్చుకోలుగా చూడటంతో ఆత్మవిశ్వాసం పుంజుకున్నాడు రవి.

"నేన్రాను. చదువుకోవాలి. ఇక అసలు మీతో కలవను. నన్ను ప్రతిదానికీ పిలవకండి" గబగబా అన్నాడు రవి.

"ఏంటీ?" దిగ్భ్రాంతిగా అన్నాడు రమేష్.

చివరికి రవిగాడు కూడా తనని అడుక్కొని సీటు ఇప్పించుకున్నవాడు. చెప్పుకింద తేలు లాంటి వెధవ. పేనుకు పెత్తనం ఇస్తే తలంతా...

"బికారి వెధవా? నీకూ పొగరెక్కిందే. అడుక్కుతినే నా కొడుకులికి సీట్లు ఇప్పించిన నేను పిచ్చివెధవనంట్రా. ఒరేయ్ రవీ... నువ్వు నలుగుర్నీ చూసి రెచ్చిపోతున్నావేమో. చూస్తాను... నీకు టౌనులో నీళ్ళు పుట్టకుండా చేస్తాను. అసలు నువ్వు... పుటక పుట్టావంట్రా? మన కులంలో నీ తండ్రికడుపునే పుట్టావా? అని. నీలో ఆ రక్తం ఉందా? ఉంటే ఇవ్వాళ నాకు ఎదురుతిరగవు" నానా మాటలు అన్నాడు రమేష్.

ఆవేశం థర్మామీటరు రీడింగ్‌లా పెరిగి పెరిగి అతడు గబగబా రవిని చేరుకొని చెంప మీద ఈడ్చికొట్టాడు. రవి బెంచీలమధ్య పడిపోయాడు.

అతడు చరచర్గా బయటకు పోయాడు.

అందరూ రవి దగ్గరకు పరిగెత్తుకువచ్చారు. ఆడపిల్లలు చేష్టలుదక్కి నిలబడ్డారు. ఎందుకో సంధ్యకంట్లో తడి మెరిసింది.

★ ★ ★

డిగ్రీ బిల్డింగ్‌లోకి శివాజీ, నళినీ, మరికొందరూ ప్రవేశించారు.

పై అంతస్తుల్లో అరుణ్‌కుమార్ బలగం ఎక్కువ. అందుకని ముందు ప్రథమ సంవత్సరం తరగతులని ఖాళీచేయించారు. అక్కడ ఎక్కువగా శివాజీ సపోర్టర్స్ ఉన్నారు.

కానీ ఫస్ట్ బి.కాం.లో గొడవ జరిగింది. రాధాకృష్ణది ఆక్లాసే.

అతడు నలుగురు మిత్రులతో కలిసి క్లాసు నందర్నీ కూర్చొబెట్టాడు. బంద్ మనకి ఎందుకు? ప్రతిదానికీ చేస్తే విలువ పోతుందన్నాడు.

శివాజీతో వాదోపవాదాలు చేశాడు. ఇద్దరూ అరుచుకున్నారు.

హఠాత్తుగా నళినీ అతడిమీద దాడిచేశాడు.





ఇద్దరూ క్రోధంతో, కసిగా కొట్టుకున్నారు. శక్తి నంతా పెట్టి పిడిగుద్దులు గుద్దుకున్నారు. మిగిలినవాళ్లు కూడా ఆ గొడవలో పాలువంచుకొన్నారు. తోసుకోవటం అయ్యాక సహాయంకోసం కబుర్లుపంపారు. పైఅంతస్థులో అరుణ్ వర్గానికి వార్త అందింది. వాళ్లు పది మందిని వెంటేసుకొని కిందకి వచ్చారు.

ఈలోపు శంకర్రావు ఓ పొడవాటి చెక్కముక్క సంపాదించి క్లాసులోకి జొరబడ్డాడు. రాధాకృష్ణ తలమీద బలమంతా పెట్టి కొట్టాడు. అడ్డంవచ్చిన వారిమీద వీరవిహారం చేస్తూ తటస్థంగా చూస్తున్నవారిమీదకు కూడా వెళ్లాడు.

రూంలోనివారంతా ప్రాణభయంతో పారిపోయారు.

రాధాకృష్ణ తల పగిలింది. అతడు నేలమీద పడిపోయాడు.

ఇంతలో అరుణ్‌వర్గం మెట్లుదిగి ఆ వరండాలోకి వచ్చారు. రూంబయటనుండీ శివాజీని హెచ్చరించారు అతడి మనుషులు.

శివాజీ శంకర్రావుని పట్టుకొని బలవంతంగా తోసుకుంటూ బయటకు తీసుకొచ్చాడు. అతడి మనుషులు కూడా వరండాలోకి చేరుకున్నారు.

''అన్నా! రాధాకృష్ణని కొట్టేశారు'' అని వస్తున్న అరుణ్‌కుమార్‌తో చెప్పారు రూంలోంచి పారిపోయినవాళ్లు వరండా చివరవున్న శివాజీ బృందాన్ని చూపిస్తూ.

రెండు గుంపులు ఎదురెదురుగా కొంత దూరంలో ఆగిపోయాయి. క్లాసుల్లోని జనం వరండాలోకి తొంగితొంగి చూస్తున్నారు.

శివాజీ జరిగినదానికి క్షమాపణ అడుగుదామని ఆలోచిస్తున్నాడు. ఎంతయినా క్లాసు జరుగుతుండగా లెక్చరర్‌ముందు తల పగలగొట్టటం తప్పు అని అతడి ఆలోచన.

అరుణ్‌కుమార్ కూడా సందేహంలో ఉన్నాడు. అవతలివాడి స్థితి తెలుసుకోకుండా ఏమీ చేయలేము. ఎటాక్ చేసేంతగా పరిస్థితి ముదిరిందా? నళినిని కొట్టింది రాధాకృష్ణ. ఇప్పుడు వాళ్లు తిరుగు జవాబు చెప్పారు. రాధాకృష్ణని కొట్టారు.

అతడు ఆలోచనలో ఉండగానే రాధాకృష్ణకి సన్నిహితులు ఇద్దరు పక్కక్లాసుల్లోకి జొరబడి

చేతికందిన ఛైర్స్ నాలుగు తెచ్చారు. వాళ్లు రాధాకృష్ణకు జరిగినదానికి ప్రతీకారం తీర్చుకోవాలనుకున్నారు.

ఒకడు పదడుగులు ముందుకు వెళ్లి బలమంతా వినియోగించి ఆ కుర్చీని విసిరాడు. అది గింగిరాలు తిరుగుతూ శివాజీవైపు వెళ్లింది.

అంతే... శివాజీ మనుషులు వరండాలోంచి పరుగుతీశారు.

అరుణ్‌వర్గం కుర్చీలతో వెంటబడ్డారు. సందేహిస్తున్నవాళ్లు కూడా అవతలివాళ్ళు పారిపోవటంచూసి తరమసాగారు. అరుణ్ వారించేలోపు అంతా జరిగిపోయింది.

శివాజీ బృందం గ్రౌండ్‌లోకి దూకి హాస్టల్‌వైపుగా పరిగెత్తారు. శంకర్రావుని ఈడ్చుకుంటూ పోయిపోయి హాస్టల్‌లో దూరి గేటువేసుకున్నారు. ఆ సమయానికి హాస్టల్ గదులు లాక్‌చేసి ఉన్నాయి. అంతా కాలేజీలో వున్నారు.

వార్డెన్ ఈ గొడవకి గేటుదగ్గరకి వెళ్లాడు. అప్పుడే మెస్ పని ముగించుకొని వస్తున్నాడతడు.

గేటుకవతల అరుణ్ వర్గం కుర్చీలు, కర్రలతో ఎదురుచూస్తోంది. కొందరు గేటుదూకి లోపలికి వచ్చేందుకు ప్రయత్నిస్తున్నారు. బయటనుండీ సవాల్ చేస్తున్నారు.

వార్డెన్ గేటుతీయబోయాడు. అతడికి పరిస్థితి తెలీదు.

వెనుకనుండీ శివాజీ వచ్చి వార్డెన్‌ని లాక్కుపోయాడు.

లెక్చరర్లు కొందరు హాస్టల్ వద్దకు చేరుకున్నారు. గేటుకడ్డంగా నిలబడి అరుణ్ మనుమల్ని వారించే ప్రయత్నం చేశారు.

లెక్చరర్స్‌కీ, వాళ్లకీ వాగ్వివాదం జరిగింది. రాధాకృష్ణని కొడుతుంటే అడ్డుపడనివాళ్లు ఇప్పుడెందుకు వచ్చారు. అంతకుముందు కూడా నళినీమీద దెబ్బ పడినందుకే రాధాకృష్ణని వారంరోజులు సస్పెండ్ చేయించారు. ఇప్పుడు గుడ్లప్పగించి చూస్తూ అతడి తల పగలగొట్టించారు. శివాజీ అంటే మీకు ఇష్టం. పక్షపాతం చూపిస్తున్నారని కేకలు వేశారు వాళ్లు.

ఆ వాదన జరుగుతుండగా ఆవేశాలు మిన్నుముట్టాయి. లెక్చరర్స్‌ని పక్కకి తోసేశారు. పరిస్థితి విషమించేట్లుంది.

అప్పుడు వచ్చాడు వినయబాబు. అతడు మరికొందరు టీచింగ్‌స్టాఫ్‌ని తీసుకొచ్చాడు. వాళ్లు వస్తూ వస్తూ దారిలో కంప్యూటర్ బిల్డింగ్స్ పునాదులదగ్గర కనిపించిన వాసాలూ, కర్రలూ తీసుకొచ్చారు. శివాజీ ప్రాణాలు రక్షించాలన్న తొందరపాటుతో వినయబాబు లెక్చరర్లకి కర్రలందించాడు.

సాయుధులైవచ్చిన గురువర్యుల్ని చూసి ఖంగుతిన్నారు విద్యార్థులు. అప్రయత్నంగా వెనకడుగువేశారు.

వినయబాబు పొడుగాటి కర్రని తిప్పుతూ వాళ్లమీద పడ్డాడు. కకావికలుగా చెదిరిపోయారు విద్యార్థులు. అతడి వెంటవచ్చిన వాళ్లు కూడా అతడికి తోడుగా వాసాలూ, బొంగులూ ఉపయోగించారు. అరుణ్ వర్గాన్ని తరిమికొట్టారు.

ఎదిరించటానికి సంకోచించారు అరుణ్ మనుషులు. రోజూ తమకు పాఠాలుచెప్పే గురువులు వాళ్లు. అందుకే గ్రౌండ్‌లోకి వెళ్లిపోయారు. అయినా వినయబాబు వదలలేదు.

కాలేజి గేటువరకూ వెంటబడ్డాడు. విద్యార్థులు ముందూ, లెక్చరర్లు వెనకా పరిగెత్తుకుంటూ కాలేజీల చరిత్రలో ఒక కొత్త అధ్యాయాన్ని సృష్టించారు.

గేటుదాటాక మట్టిరోడ్డుమీద కూల్‌డ్రింక్ షాపువరకూ సాగింది ఆ ఛేజింగ్. అక్కడ తెరపడింది. అక్కడ బడ్డీకొట్టుదగ్గర...

అరటి గెలలు కోసే కత్తిని, కొబ్బరిపీచు తీసే పలుగునీ అరుణ్‌కుమారూ, ఇంకొకరూ అందుకొని తమవాళ్లకి రక్షణగా నిలబడ్డారు. రోడ్డుకడ్డంగా నిల్చొన్నారు.

హఠాత్తుగా పరిస్థితి మారిపోయింది.

ఈసారి లెక్చరర్లు వెనుదిరిగి పారిపోవటం ప్రారంభించారు.

అరుణ్‌వర్గం వెంబడించే ప్రయత్నం చేయలేదు.

లెక్చరర్‌కీ, విద్యార్థికీ ఉండే ఒక సన్నటి




తెరకి ఆ సంఘటనతో చిల్లుపడింది. కులసమ రానికి తెరలేచింది.

★ ★ ★

కాలేజీ ఒకరోజు మూతపడింది. అవాంఛ నీయ సంఘటనలు జరగకుండా ముందుజాగ్రత్తగా శలవు ప్రకటించారు. రాధాకృష్ణ హాస్పటల్‌లో ఉన్నాడు. తలకి ఏడు కుట్లు పడ్డాయి.

శంకర్రావుని అరెస్ట్‌చేసి నెలరోజులు రిమాండ్‌లోకి పంపారు. హత్యాయత్నంకింద కేసు నమోదయింది. అది ఒక కొలిక్కి రావటానికి కొన్ని నెలలు పడుతుంది.

కానీ ఆ ప్రభావం ఒక్క నిముషం వాయిదా పడకుండా అందరిలోనూ కనిపించింది. వాళ్ల వాళ్ల చర్యల్ని గమనిస్తున్న విద్యార్థులు మొత్తంగా భయోత్పాతానికి గురయ్యారు. ఈ విషయం అంతటితో ఆగదు. మరింత తీవ్ర రూపం తీసుకొంటుంది. మరింతగా ముండుతుంది, అనుకుంటున్నారు.

ఇప్పటివరకూ కులసమస్య నాయకత్వస్థానంలోనే ఉంది. శివాజీ అతడి వర్గీయులూ, అరుణ్ అతడి అనుచరులూ ముందునుండే కులరాజకీయాల్లో ఉన్నారు. వారివారి అభిమానులమధ్య ద్వేషభావం ఉంది. ఇప్పుడు అదే విస్తరించింది. విద్యార్థి ప్రతినిధులనుండీ విద్యార్థులకు అది ప్రయాణం సాగించింది. ఒక బీజరూపంలో ప్రారంభమయిందది. భయంతోపాటు సమాంతరంగా ఒక భావం వ్యాపించింది.

రాధాకృష్ణపై దాడి చేయటానికి గల కారణాన్ని ఎవరికివారు తరచి చూసుకున్నారు. ఎవరికి వారు భాష్యం చెప్పుకున్నారు. ఎవరికోణంలో వారు ఆలోచించుకున్నారు. కొందరికి అరుణ్ వర్గంలో తప్పు కనిపించింది. ఇంకొందరికి శివాజీ వర్గంలో తప్పు కనిపించింది. తప్పులు కనిపించాక ఆ తప్పుల్ని శిక్షించటంమీద అంగీకారం కుదిరింది. అలా ఒక వర్గానికి కావలసిన మద్దతు విద్యార్థుల్లో జనించింది. అదింకా పైకి కనిపించటంలేదుగానీ లోలోపల వ్యాపించసాగింది.

అసలీ మొత్తం విషయాన్ని ఏవగించుకొని ఇరువర్గాల్నీ తిరస్కరించే వారి నమ్మకం మరింత బలపడింది. దుష్టరాజకీయాలపై మరింత ఏవగింపు కలిగింది.

జూనియర్స్. చాలామందిలో ఇలాంటి భావమే ఉంది. వారింకా కుల భావనలకు దూరంగానే ఉన్నారు. విద్యార్థినీలోకంలో కూడా అత్యధికులు తటస్థంగా ఉన్నారు.

సూర్యం ఈ సంఘటనకి తీవ్రంగా స్పందించాడు. రెండు వేలకు పైగా కరపత్రాలు ప్రింటయ్యాయి. సారథీ, వేణూ, భాస్కర్‌లుకాక మరికొందరు డిగ్రీ విద్యార్థులు వాటిని క్లాసు క్లాసుకీ పంచారు.

'విదార్థి మిత్రులు' పేరుతో వెలువడ్డాయి అవి.

విద్యార్థులకు వాస్తవ పరిస్థితులను వివరిస్తూ ఎలాంటి ఉద్రిక్తతలకూ లోనుకావద్దనీ, రెండు గ్రూపులమధ్య తగాదాలు కాలేజీ మొత్తానికి వ్యాపించనీయరాదనీ, ఈ తగాదాలకి మూలమైన అసలు రాజకీయాలను నిరసించి విద్యార్థుల నిజమైన అవసరాలకై పోరాడేందుకై కలసి రమ్మనీ, ఈ విషయంలో ఆ గ్రూపులను కూడా వత్తిడిచేసి పరస్పర కలహాలనుండీ విద్యార్థి డిమాండ్లవైపుకు తీసుకురావాలనీ, వీటినేమాత్రం నిర్లక్ష్యం చేసినా ముందు ముందు కులోన్మాదం పడగవిప్పుతుందనీ హెచ్చరించాయి.

లెక్చరర్లు కొందరు కర్రలు చేతపట్టి మరింత కొలిమి రాజేశారనీ, వారి వైఖరిని ఖండించవలసిందిగా విద్యార్థులను కోరుతూ ఈ విషయంలో అలసత్వం పనికిరాదని విజ్ఞప్తి చేసాయి.

ఈ ప్రచారంలో సారథి ముఖ్యపాత్ర వహించాడు. ముందే రమేష్‌ని ఎదిరించి బంద్‌ను విఫలం చెయ్యటంలోనూ, ఇప్పుడీ ప్రచారంలోనూ అతడు ముఖ్యుడు కాబట్టి, అందరికీ అతడు పరిచయం అయ్యాడు. రమేష్ బృందం సారథిని తమ లిస్ట్‌లోకి ఎక్కించారు. ముందుముందు అతడిని ఒక పట్టు పట్టాలనుకున్నారు. అరుణ్ వర్గంకి అనుకూలపవనాలు వీస్తుండటంతో వెనకాడుతున్నారు కానీ ఇంతకాలం ఆగటం వారికి దుర్భరంగా ఉంది. తగిన సమయంకోసం వేచివున్నారు.

★ ★ ★

రవికి మళ్లీ చీకటి జీవితం అలవాట య్యింది.

ఉదయం పదికల్లా టౌనులో బస్సుదిగి సందుల్లో గొందుల్లో పడి తిరుగుతున్నాడు. రోడ్లమీద నడిచీ నడిచీ చెప్పులు అరిగేదాకా తిరిగి ఏదో ఒక సినిమా హాల్లో ఉదయం ఆట చూస్తాడు. మధ్యాహ్నం మళ్లీ అదే హాల్లో మ్యాట్నీకి వెళ్తున్నాడు.

డబ్బులు చాలకపోతే నేల తరగతిలో కూర్చుంటున్నాడు. అందుకు వీలుకాకపోతే ఏ పార్కులోనో ఏ రోడ్డు పక్కన చెట్టునీడలోనో కూర్చొని రోజల్లా గడిపేస్తున్నాడు. పాములు ఆడించేవాళ్లనీ, కనికట్టు ప్రదర్శనల్నీ, తాయెత్తులు కట్టేవాళ్లనీ, లైంగిక పటుత్వానికి నాటు మందులు అమ్మేవాళ్లనీ పరిశీలిస్తున్నాడు. నలుగురు జనం గుమిగూడి వాటిని చూస్తుంటే తానూ అక్కడికి చేరుతున్నాడు. నలుగురిలో కలిసిపోయి తననుతాను మర్చిపోయేందుకు ప్రయత్నిస్తున్నాడు.

వాటిని చూసి ఆనందిస్తున్నాడని కాదు. అసలు సినిమాహాల్లో కూర్చుని కూడా తెరమీద ఏంజరుగుతుందో గమనించటం లేదు. అతడికి కావలిసింది తనను ఎవరూ గమనించకుండా ఉండటం. ఎవరి గొడవలో వారుండి తనను పట్టించుకోకపోవటం. సమూహంలో ఒంటరితనం.

కాలేజీనుండీ పారిపోయి ఇక్కడ మన శ్శాంతిని వెతుక్కుంటున్నాడు. రమేష్‌నీ, శివాజీనీ, క్లాసుల్నీ, విద్యార్థుల్నీ మర్చిపోవాలనుకుంటున్నాడు. మానసికంగా క్రుంగుతున్నాడు.

రమేష్‌ని అసహ్యించుకొంటున్నాడు. అతడి ప్రవర్తనా, స్వార్థం, అజమాయిషీల్ని ద్వేషిస్తున్నాడు. అతడు ఏదో చేస్తాడని భయపడటంలేదు కానీ తనంటే శతృత్వం చూపుతున్నందుకు బాధపడుతున్నాడు.

కాస్సేపు అతడిమీద కోపం వస్తుంది. ఇంకాస్సేపు తనంటే తనకే అసహ్యమేస్తుంది. అలా ప్రవర్తించి ఉండాల్సింది కాదు. చూసీ చూడనట్టు పోతే ఇంత గొడవ వచ్చేది కాదు. అనవసరంగా సృష్టించుకున్నానని అనుకుంటాడు.

ఒక్కోసారి ఆవేదన... ఈ ప్రపంచం ఇలా ఎందుకుండాలి? తను రమేష్ సాయం ఎందుకు తీసుకోవాలి? రమేష్ అలాగే ఎందుకుండాలి? అతడు ఇంకా మంచిగా ఉంటే తనని దూరం చేయకుండా ఉంటే బాగుండేది కదా అనుకుంటాడు.

తను రమేష్ మాట వినకుండా తిరస్కరించినప్పుడు అతడిలో కనిపించిన కర్కశత్వం, క్రూరత్వం మర్చిపోలేకపోతున్నాడు. రమేషన్నయ్య అనుకుంటూ మొదట్లో తిరిగినప్పుడు అతడిలో ఈ లక్షణాలున్నాయని ఏమాత్రం భావించలేదు. ఇప్పుడు ఆ ముసుగు చిరిగిపోయింది. అసలు రమేష్‌ని చూస్తున్నాడు. మనిషి సమాజంకోసం వేసుకున్న ముసుగు ఒక సమయంలో అవకాశం దొరికినప్పుడు తొలిగిస్తాడు. అదే జరిగింది.

దీనికంటే రవికి ఇంకొక విషయంలో ఎక్కువ బాధకలుగుతుంది.

ఇంట్లో తల్లిదండ్రులు అతడ్ని తిట్టిపోశారు. రమేషన్నయ్యకి అంత ద్రోహం ఎలా చేశావురా అని మందలించారు. ఇక రవి ప్రవర్తన మూలంగా బంధువుల్లో తలెత్తుకోలేమన్నారు. ఇకనైనా రమేష్‌ని క్షమాపణ కోరుకుని అతడి కాళ్లదగ్గర పడిఉండమన్నారు. సీటు ఇప్పించి సాయం చేసినందుకు చెంపదెబ్బ కొట్టినా ఇంకేం చేసినా పడి ఉండాల్సిందేనన్నారు. అందులో తప్పేంలేదు. ఆమాత్రం జరగాల్సిందే నన్నారు. కూటికి తక్కువైనా కులానికి కాదన్నారు.

తొలిసారిగా రవి తండ్రిని మనసులో ఏవగించుకున్నాడు. తనకి జరిగినదాన్ని తనుపడిన ఆవేదనని, అవమానాన్ని తండ్రి అసలు గుర్తించకపోవటం అసంతృప్తికి గురిచేసింది. తండ్రి చేసిన పని మనసుకి శరాఘాతంలా తగిలింది.

ఇంట్లో జరిగిన ఆ సంఘటన గుర్తుండిపోయిందతడికి.

కాలేజీలో ఘర్షణ జరిగిన రెండోరోజు రవిని ప్రశ్నించాడు జగన్నాథం. అప్పుడే ఇంటికొచ్చాడు రవి.

''ఏలా? కాలేజీలో గొడవయ్యిందటగా'' అన్నాడాయన చుట్ట చుట్టుకుంటూ పొగాకు




ముక్కల్ని ఏరుతూ... అప్పుడే ఇంటిలో తెల్సిందంటే ఎవరో చేరేసి ఉంటారని ఊహించాడు రవి.

''క్లాసులో చదువుకుంటుంటే రమేష్ పిలిచాడు నాన్నా. చూడు వెళ్ళనందుకే చెంపదెబ్బ కొట్టాడు'' ఉక్రోషంగా అన్నాడు రవి. ఆ ఘర్షణ తాలూకూ ప్రభావాన్ని తనకనుకూలంగా మార్చుకుంటూ-

''ఏంటీ చదువుకుంటుంటేనే తప్పయిపోయిందా? ఏమే ఇటుచూడు నీ కొడుకుని కొట్టాడట ఆ రమేష్‌గాడు. డబ్బు సంపాయించాక కళ్లు నేలమీద ఆనటం లేదు'' అని అంటాడని ఊహిస్తున్నాడు రవి.

చుట్ట వెలిగించుకుంటూ ప్రశాంతంగా అడిగాడు ఆయన.

''అయితే చెంపదెబ్బ కొట్టాడంటావ్'' అందులో వ్యంగ్యం కనపడింది.

రవి మాట్లాడలేదు.

''ఏదీ మళ్లోసారి చెప్పు... రమేషన్నయ్యావాళ్లు బందు చెయ్యబొయ్యారు. మీరు పట్టించుకోకుండా క్లాసుల్లో కూర్చున్నారు. ఒక్కరోజుకూడా మానెయ్యలేరుగా. తెగ చదువుతున్నారు. ఊ! అప్పుడు ఏమయింది? రమేషనయ్య వచ్చి క్లాసునించీ నిన్ను రమ్మన్నాడు. ఎవడో తలమాసినాడు అన్నయ్యని తిట్టి మీ అందర్నీ కూచోబెట్టాడు. నువ్వెళ్లలా. నిన్ను నోరారా పిలిచాడు. ఏరా రవీ నీకు కాలేజీలో సీటు నేనేరా ఇప్పించింది. నువ్వీరోజున క్లాసులో కూచేటానికి నేనేరా కారణం. నన్ను గుర్తుబట్టావా లేదా, గుర్తుబడితే కొంచెం బైటకి రారా. మనాళ్లంతా బందు చేద్దామనుకుంటున్నాం. మన అంకినీడు మామయ్యని అవమానించారు. మనం మనం ఒకటి. మనకి మనమే సాయితాగా ఉండకపోతే మనాళ్లకి కాలేజీలో ఇలువుండదూ అన్నాడు. నువ్వేం జేశావు! ఆ డెవడో తలమాసినవాడి ఉపన్యాసానికి రెచ్చిపోయి ఠాక్ వీల్లేదు. నీతో కలిసేది లేదు. నేను చెమటోడ్చి చదివి మా నాన్నని సుఖపెట్టాలి అన్నావు. అప్పుడు రమేషన్నయ్య వచ్చి ఏం జేశాడూ? చెంపమీద పెళ్ళుమని కొట్టాడు. అంతేనా ఇంకా ఉందా?'' గొంతు పెంచి అడిగాడాయన.

రవికి లోపల ఆవేదన సుడులు తిరుగుతోంది. తనని అర్థంచేసుకోరు. తనని ఓదార్చటం పోయి, తనకి ధైర్యం ఇవ్వటం పోయి, తనని ఒడిచేర్చుకోవటంపోయి తనని తిడుతున్నాడు తండ్రి. ఇంత క్రూరత్వం ఎక్కడయినా ఉందా? మానవత్వం అంటే తెలుసా వీళ్లకి.

జగన్నాథం కొడుకునే పరీక్షగా చూస్తున్నాడు చుట్టపొగలలోంచి. ఆయన ఇంతకు ముందే పొలానికి ఎరువు తోలి దుక్కి దున్నించి కూలీల్ని అజమాయిషీ చేసి ఇంటికి వచ్చాడు. పనిభారంతో అలసి ఇంటికి చేరిన వెంటనే ఈ వార్త అందింది. అసలే రోజా దినదినగండంగా బండి ఈడ్చుకొస్తుంటే ఇదొక గొడవ. కుర్రతనం కొద్దీ వీడు సమస్యలు తెచ్చిపెట్టాడు గదా? ముందే జాగ్రత్త పడకపోతే చెయ్యిదాటిపోతాడు. మొక్కై వంగనిది మానై ఒంగుతుందా?

''ఊ! చెప్పరా... ఇంకేం చేశాడు కొట్టాడు అంతేనా'' కఠినంగా అడిగాడు.

రవి మౌనం ఆయనకి పిచ్చికోపాన్ని కలిగించింది. నోట్లోంచి చుట్టజారి కిందపడింది. అది అందుకోనేందుకు వంగాడు. కాలిచెప్పులు అక్కడే ఉన్నాయి.

''నేనయితే ఏంచేసేవాణ్ణో తెలుసా... చెప్పుతీసుకుని పళ్ళు రాలకొట్టేవాడ్ని'' అని గభాలున లేచి రవిని సమీపించాడు రౌద్రంగా ఒకచేతితో చెప్పు ఎత్తి పట్టుకొని-

రవి కొయ్యబారిపోయి నిల్చున్నాడు. అతడి శరీరం ఫ్రీజ్ అయిపోయింది. ఇది కలా నిజంగా జరుగుతుందా? తండ్రి చెప్పు తీసుకొని కొట్టబోవటం. ఇది కలేఅయ్యుండాలి. తన తండ్రి, ఇంతకాలం గారాబంగా చూసిన తండ్రి కడుపులో పెట్టుకొని కాపాడిన తండ్రి ఈయనకాదు. ఇది కలే. సందేహం లేదు.

ఆయన అరుపులకి లోపల్నుంచి పరిగెత్తుకొచ్చింది తల్లి. కొడుకుని కొట్టబోతున్న భర్తని చూసి అడ్డుపడింది. రవిని కాపాడేందుకు ఆ దెబ్బలు తనకే తగిలినా అడ్డుగా నిలబడిపోయింది ఆ తల్లి. కొడుకుని కౌగిలిలోకి తీసుకొంది.

లోపలి భోజనం చేస్తున్న రమేష్ కూడా పరిగెత్తుకు వచ్చాడు. జగన్నాధాన్ని అవతలికి లాగుతూ ఆ చెప్పుని ఊడలాక్కుని అవతలవ దేశాడు. అతడు మధ్యాహ్నామే రవి ఇంటికి వచ్చి జరిగింది చెప్పాడు, తనకనుకూలంగా మార్చి. తనకి ఎదురు తిరుగుతున్నందుకు నిష్టూరమాడాడు. బంధుత్వాలు గుర్తుచేశాడు. తన తండ్రి ఈ విషయానికి కలత చెందుతు న్నట్టూ జగన్నాధాన్ని కలుసుకోవాలనుకుంటు న్నట్టూ చెప్పాడు.

అందుకే జగన్నాధం ఉద్రేకాన్ని అణుచు కుంటూ రవి రాగానే విరుచుకుపడ్డాడు ఇప్పు డు.

"ఏంటి బాబాయ్! వాడేంచేశాడని. ఊరు కో... పెద్దవాడివి. నెమ్మదిగా నచ్చజెప్పాలి. తప్పుచేస్తే చేసుండొచ్చు. మన బిడ్డని మనం. శిక్షిస్తామా. వాడుమాత్రం మనిషి కాదూ. చిన్న వాడు తెలియక చేసి ఉండొచ్చు. కొట్టటమేనా? అట్లా చేస్తావనుకుంటే అసలు నీకు చెప్పేవా డినే కాదు"

ఉద్రేకపడుతున్న జగన్నాధాన్ని కేకలు వేశా డు రమేష్. క్లాసులో అందరిముందూ రవిని తను కొట్టిన విషయం మర్చిపోయి, జగన్నాధం ఆ తిట్లు తింటూ తన బిడ్డని రమేష్ కాపాడి నందుకూ రవి తప్పుల్ని క్షమించి ఇంకా దూరమవ్వనందుకూ తృప్తిపడ్డాడు. ఎంతైనా శాయోజీరావు కొడుకే వీడు. శాయోజీరావెవరు తనకి వరసకి అన్నే కదా! రక్తసంబంధం ఎక్కడికి పోతుంది.

రవి పరిస్థితి గురించి ఎవరికీ పట్టలేదు. రమేష్ తన ఇంట్లో ప్రత్యక్షమవ్వటం, తనకి వ్యతిరేకంగా అబద్ధాలు చెప్పి తండ్రిని రెచ్చగొ ట్టి తనమీదకు తోలటం ఇంకా ఘోరమేమి టంటే అతడే తండ్రినించి తనను రక్షించబూ నుకోవటం.

"చెప్పరా అన్నయ్యకి క్షమాపణ చెప్పూ. తప్పయిపోయిందని కాళ్లు పట్టుకో" అరిచాడు జగన్నాధం లేవబోతూ.

రమేష్ ఆయన్ని భుజాలు పట్టి కూర్చోబెట్టి సర్దిచెప్పాడు.

"ఉరుకో బాబాయ్. మనలో మనకి క్షమాప ణలేంటి. ఎంతైనా వాడు నాకు తమ్ముడు కాదూ? పిన్నీ పద. వాడిక్కూడా అన్నంపెట్టు. ఎప్పుడు తిన్నాడో. రాగానే బాబాయ్ ఇంత పని చేశాడు పదరా రవీ"

తమ్ముడు... తమ్ముడు... తను రమేష్‌కి తమ్ముడు. తనకి రమేష్ అన్న. భయంకమైన కొండచిలువ గుర్తొచ్చింది రవికి. అది తల్లినీ తండ్రినీ ఎప్పుడో మింగేసింది. ఇక తనను మింగేందుకు సిద్ధంగా ఉంది. పిచ్చిగా నవ్వా లనిపించింది.

తర్వాత టౌనులో రమేష్ కనబడ్డాడు ఒంట రిగా. రవి కోసం ఎదురు చూస్తున్నాడతడు. రవిని వళ్లు దగ్గరుంచుకొమనీ బాబాయ్ వాళ్లని బాధపెట్టొద్దనీ ఈసారి తప్పుచేస్తే ఊరు కోమనీ చెప్పాడు. తనమాట వినకపోతే ఎముక లు విరుగుతాయన్నాడు.

మరెందుకు ఇంటికొచ్చి ఆ నాటకం ఆడా డు? రవికి అర్థంకాలేదు.



టి.జె. కాలేజీ లెక్చరర్ తిరుపతిరావు ఇల్లు.

తలుపు మీద మెల్లగా తట్టిన శబ్దం వినప డింది.

"రండి గడి తీసేఉంది" అని అంటూనే లేచివెళ్లి తలుపు తీశాడు తిరుపతిరావు. ఇలాటి వ్యక్తిని చూడగానే అతడి మొహం వికసించింది.

భాస్కర్ లోపలికి వచ్చాడు. టి.జె. కాలేజీలో అతడు తిరుపతిరావు స్టూడెంట్.

"ఏమిటో ఊరకరారు మహాత్ములు. ఇవ్వాళ విశేషమేమిటీ?

"ఏం లేదండీ... చిన్నపనిమీద వచ్చాను"





"అంతేలే పనుంటేనే వస్తారు. ఏయ్ నిర్మలా భాస్కర్ వచ్చాడు. కొంచెం టీ పంపించు" అన్నాడు లోపలకు వినపడేట్లు.

"ఏవండోయ్ ఇప్పుడేం వద్దు. తర్వాత ఎప్పుడయినా ఇవ్వండి మళ్లీ వచ్చినప్పుడు"

"ఇంతకీ చెప్పనేలేదు ఏమన్నా?"

"సూర్యం చెప్తానన్నాడు మర్చిపోయా డేమో? మిమ్మల్ని కలవలేదా?"

"ఆఁ! ఆఁ!! గుర్తొచ్చింది. కెమేరా కావాలన్న నాడు అదేనా"

"అవును దానికోసమే ఇప్పుడు రావటం. సమస్యేమిటంటే దాన్ని ఉపయోగించటం రాదు. మీరు సాయం చేస్తారుగా"

"కూర్చోమరీ. సుంచోబెట్టి మాట్లాడేస్తున్నా తెస్తానుండు"

ఇంతలో టీ తెచ్చి భాస్కర్ కందించి ఎదురుగా కూర్చుంది నిర్మల. భాస్కర్‌తో కలుపుగోలుగా ఉంటుంది. ఆప్యాయంగా పలకరిస్తుంది.

"వద్దన్నా ఊరుకోరుగా" అని టీ అందుకొన్నాడు.

తిరుపతిరావు లోపలినుండి కెమేరా తెచ్చాడు. నికాన్ కంపెనీకి కావటంతో ఖరీదు ఎక్కువ. వేరే వాళ్లకి ఎప్పుడూ ఇచ్చి ఎరగడు.

ఫిల్మ్‌లోడ్ చేసి ఎలా ఫొటోతీయాలో చెప్పాడు.

నిర్మల కలుగజేసుకొని కొన్ని సూచనలు ఇచ్చింది. ముఖ్యంగా స్నాప్ తీసేప్పుడు లెన్స్ ముందుండి కవర్‌ని తొలిగించాలి. లేకపోతే ఒకటి వృధా అయిపోతుంది.

"ఇంతకీ ఏంటీ పని? ఏదయినా మీటింగా?" నిర్మల అడిగింది.

"ఆఁ!... కాదు... వేరే పని" భాస్కర్ జవాబు తడబడింది"

"ఏమిటో అంత రహస్యం నాక్కూడా చెబుదూ"

"అదీ...చెప్పొచ్చుగానీ"...సంకోచంగా ఆగాడు.

"సరే నేను లోపలికి పోతాగానీ గురుశిష్యులిద్దరూ మాట్లాడుకోండి" అని లోపలికి నడిచింది నిర్మల.

"అదే సార్! బోసుబొమ్మ సెంటర్‌లో రాధిక థియేటర్ రోడ్డుమీద" అని భాస్కర్ వివరించి చెప్తున్న సమయానికి అక్కడ 'షో' బిగిన యింది.

బోసు బొమ్మ సెంటర్‌కి రెండొందల గజాల అవతల ఉంది ఒక కూల్‌డ్రింక్ దుకాణం. మంచి సెంటర్‌లో ఉన్నాగానీ ఒకప్పుడు బోసిపోయి ఉండేది. ఇప్పుడు మాత్రం కిటకిటలాడిపోతోంది. దాని మేనేజ్‌మెంట్ కొత్తగా తీసుకున్న నిర్ణయం మంచి ఫలితాలనిస్తోంది.

ఆదుకాణం ముందు వసారాలో ఒక బోర్డు నిలబెట్టిఉంది. దాని మీద ఒక ఆకర్షణీయమైన నినాదం కనబడుతోంది. అది ఆ దుకాణం పేరూ కాదు. ఒక కూల్‌డ్రింక్ ఖరీదు ఐదు రూపాయలనీ కాదు. కూల్‌డ్రింక్‌తోపాటు ఉచితంగా వీడియో సినిమా చూడవచ్చనీ కాదు. అది ఆరోజు ప్రదర్శించే సినిమా పేరు.

నిజానికి సినిమా పేరుకూ సినిమాకూ సంబంధంలేదు. బయట బోర్డుమీద ఒక పేరుంటే లోపల ఇంకోటి ప్రదర్శింపబడుతోంది.

అయితే ఆ పేరున్న సినిమా వచ్చిందంటే లోపల ఒక ప్రత్యేక ప్రదర్శన జరుగుతుందని రసజ్ఞులైన ప్రేక్షకులకు తెలుసు. ఆ పేరు రహస్యసంకేతంలాగా వాడబడుతోంది.

అందుకే ఇప్పుడు కిటకిట. ఇంకా షో ప్రారంభానికి ఒక నిముషం సమయముంది.

అప్పుడు వెనకాముందూ చూసుకుంటూ ఒక యువకుడు వచ్చి చటుక్కున మెట్లెక్కి వసారాలోకి ప్రవేశించాడు. గుసగుసగా అక్కడ కూర్చున్న మనిషిని అడిగాడు.

"తియ్యి ఇరవై తొందరగా" అన్నాడు ఆ మనిషి.

"ఇరవయ్యే?" వెనుకాడాడు ఆ యువకుడు.

"ఊఁ! మరి. ఒక్క సీటే ఖాళీగా ఉంది. ఎవరయినా వస్తే అదీ అయిపోతుంది"

"సినిమా అదేనా?"

అదేనయ్యా బాబూ! నువ్వు చూస్తావా? చూడవా? అదుగో ఎవరో వస్తున్నారు నీ ఖర్మ. నీకు

చూసేయోగంలేదు'' అని వస్తున్న వ్యక్తివైపు తిరిగి ఆహ్వానించాడు.

ఆ వచ్చిన వ్యక్తి ఒక గెజిటెడ్ ఆఫీసరు. ఒక సెంట్రల్ గవర్నమెంట్ శాఖకి మేనేజర్. వయను ఏభైలోపు ఉంటుంది. ఆయన ఈ షాపుకి పాత కాపే అని ఆ యువకుడికి అర్థమయింది వారి సంభాషణబట్టి.

ఆయనను లోపలికి పంపి ఆయువకుడిని మళ్ళీ అడిగాడు ఆమనిషి

''ఇంకేంటి. ఇక దయచెయ్యి లేటు చేస్తే అంతేమరి''

ఈ సారి వెనుకాడలేదు పాతిక రూపాయలు తీసి ఆ మనిషి చేతిలో పెట్టాడా యువకుడు.





అయిష్టంగా తీసుకొని ఒక రేకుఛైర్‌ని ఆ యువకుడికిచ్చి లోపలకు పంపాడు ఆ మనిషి.

లోపలకి అడుగు పెడుతూనే స్థంబించి పోయాడు అతడు. ఇంతవరకూ నోటి మాటల ద్వారా విన్నాడు. ఊహించుకొని ఆనందించాడు. కానీ ఇలా ఇదేనా?...

అది మరోలోకం నృప్తచేతనలో మనోవేగంతో ప్రారంభమయిన ఒక కల్లోలం ఉప్పెనై హెూరుగా జోరుగా అలలు అలాలుగా మొహాన్ని విసిరికొడుతుంటే శరీరం ఒక మత్తులోకి ప్రవేశించిందేమో అన్న సందేహం. శరీరంలో ఏ భాగానికాభాగం విడివిడిగా ఉన్నత చిత్రకారుడి చిత్రలేఖనాల్లా కంపిస్తూ మూర్ఛిల్లుతూ నర్తిస్తూ... ఎదురుగా ఉన్న ఏభైసెంటీ మీటర్ల తెరపైకి చేరాయి.



ఆ చీకటి గదిలో చెమట, ఉక్క... చీకటీ ఇవేవీ పట్టించు కోలేని స్థితిలోకి ప్రవేశించింది. ఆ ఒక్క యువకుడే కాదు ఇంకా నలభైమంది. ఇరుక్కోని కూర్చున్నారు వారంతా.

కాలేజీ పిల్లలూ, ఉద్యోగులూ, ఉన్నతాధికార్లూ, పల్లెటూరి వాతావరణంలో ఉండి కూడా పట్నవానంలోని మెలకువల్ని వంటబట్టించుకున్న గ్రామీణ యువకులూ.

మనిషి మనిషికీ మధ్యన ఉండే ఒక నంకోచపు తెరని ఛిన్నాభిన్నం చేస్తూ ఆ ప్రదర్శనని గుడ్లప్పగించి చూస్తున్నారు.

అది ఒక బ్లూ పిల్మ్ విశృంఖల ఉన్మాదాభినయం.

ఆ ఇల్లు ఒక వీడియో హోమ్.

ముందే వాటాలు నిర్ణయించి సక్రమంగా అందించటంతో ఆ ఇంటి మీద ఎవరి కన్నూ పడదు. ఏదయినా రెయిడింగ్ జరిగేట్లయితే ముందుగానే తెలిసిపోతుంది. అప్పుడు మామూలు సినిమా మాత్రమే ప్రదర్శింపబడుతుంది.

వసారాలో కూర్చున్న మనిషి ఎప్పుడూ అప్రమత్తంగా ఉంటాడు.

అది తెలిసినా ఏ వ్యాపార నంస్థ అయినా ప్రజలతో నంబంధం పెట్టుకొని ఉన్నట్లయితే దానికి నంబంధించిన ప్రతి అంశాన్ని ప్రజలకు తెలిపే హక్కు ఒకటి ఉందని నమ్ముతూన్న భాస్కర్ అజాగ్రత్తగా ఉన్నాడనే చెప్పాలి.

అప్పటికే ఆ షాప్ మీదున్న నేమ్‌బోర్డునీ, షాపునీ, వసారాలో కూర్చున్న మనిషినీ తన కెమేరాలో బంధించాడు. కెమేరాని బ్యాగ్‌లో నర్దుకొంటూ ఉండగా అతడికో వెర్రికేక వినిపించింది. అది వసారాలో కూర్చున్న మనిషిది.

అతడు పరిగెత్తుకుంటూ వచ్చి భాస్కర్‌ని ఉడుంపట్టు పట్టేశాడు. వెనకనే ఇంకో ఇద్దరు వచ్చారు. వాళ్లు బ్యాగ్ లాక్కుని కెమేరాని బయటకుతీశారు.

ఉడుంపట్టుని వదిలించుకున్నా కెమేరా వాళ్లచేతుల్లో ఉండిపోయింది.

"ఎవడ్రా నువ్వు? వచ్చి ఫొటోలు తీస్తున్నావు" అడిగాడొకడు.

"నీ కనవనరం. ఆ కెమేరా ఇటివ్వు" అన్నాడు భాస్కర్ పళ్లబిగువున.

"ఇస్తాం... ఇస్తాం... వాణ్ణిలోపలకి ఈడవండిరా" అని కెమేరాతోనహా లోనికి నడిచాడు అతడు.

లోపలికి వెళ్తే మళ్లీ ఏ రూపంలో తిరిగి వస్తారో భాస్కర్‌కి తెలును. అతడు అరిచి కేకలు పెట్టాడు. జనం గుమిగూడారు. ఏమిటేమిటని అడుగుతున్నారు.

"ఇందేంట్రోయ్... దొంగ దొంగ అని అరిచినట్టుంది. మావాడి జేబు కొట్టింది కాక మా మీదనే ఎగుర్తున్నాడు చూడండి. ఏరా... నీ... కష్టపడి నంపాయించుకోలేవురా దున్నపోతులా

గున్నావు. ఇదేంబుద్ధి'' సహజత్వంకోసం భాస్కర్ చెంపమీద గట్టిగా కొట్టాడొకడు.

''వళ్లొంచి పంజేయటం కష్టమైపోయింది కొడుక్కి. జేబులుకొట్టి మేడలు కడతాడేమో'' ఇంకొకడు ఎడాపెడా కొట్టటం మొదలుపెట్టాడు.

జనం కూడా ఆవేశపడి తలా ఒక దెబ్బవేశారు.

''పోలీసుల్ని పిలవాలండి. ఆళ్లయితే కానీ మక్కెలిరగదీయరు'' అన్నారొకరు.

భాస్కర్‌కి మాట్లాడే అవకాశమే రావట్లేదు. నోరెత్తకుండా చేస్తున్నారు. ఏదయినా చెప్పే ప్రయత్నం చేస్తే.

''నోర్ముయ్ చంపేస్తా... పేగులు తీస్తా'' అని జనంలోంచి ఒక వ్యక్తి మీదపడి కొడుతున్నాడు. ఆ వ్యక్తికి ఓసారి జేబులోంచి రెండొందలు పోయాయి. ఎవడో జేబు కొట్టేశాడు. తననే అవమాన పరిచినట్లు భావించాడు అతడు. తన అజాగ్రత్తని ఒక జేబుదొంగ ఎత్తి చూపించటం ఏమిటి? వాడే వీడేమో?

తల్చుకున్న కొద్దీ ఆవేశం వస్తుంటే భాస్కర్‌ని అసలు వాళ్లకంటే అతడే శిక్షించటంలో ప్రధాన పాత్ర వహిస్తూ... కొడుతూ ఉండగా...

షాప్‌లోపల ఒకడు ఫోన్ చేశాడు. అది రింగయిన కాస్సేపటికి అటునుండీ ఎవరో ఎత్తారు.

అతడు పరిస్థితి వివరించాడు. బయటకు తొంగి చూసి భాస్కర్‌ని ఎలా ఫోకస్ చేసిందీ జనం ఎలా రియాక్టవుతున్నదీ చెప్పాడు.

''సరే ఎక్కువసేపు సీన్ చెయ్యకండి. అనవసరంగా జనం దృష్టి షాపు మీద పడుతుంది. లోపల షో జరుగుతుందంటున్నావుగా జాగ్రత్త. వీలయినంత తొందరగా అది ముగించెయ్యి. షాపు కొచ్చేవాళ్లకి అసౌకర్యం కలగకూడదు. ఇంతకీ వాడెవడో తెలుసుకున్నావా? ఎవరయినా విలేఖరి కాదు కదా?''

''కాద్సార్ ఇంతవరకూ ఆగేవాడు కాదు విలేఖరి అయ్యుంటే. ఎవడో స్టూడెంట్ లాగున్నాడు''

''ఊఁ... టుటౌన్‌లోకి తీస్కెళ్లు. పిక్‌పాకెటింగ్ అయితే మంచిది. నేను అటు కూడా ఓ మాట చెప్పి ఉంచుతాను'' అని ఫోన్ పెట్టేశాడు ఆ వ్యక్తి.

అతడే అంకినీడు. ఆ వీడియో హౌం యజమాని.

అంతటివాడికి ఈ వ్యాపారాలు ఎందుకు అనుకోవచ్చు కానీ కొత్తగా పట్టుకొచ్చిన ఏ లాభసాటి వ్యాపారమూ పెద్దవాళ్ల చేతులు దాటిపోదు. అతడి అనేక వ్యాపారాల్లో ఇదొకటి.

టౌనులో ఉన్న మూడు వీడియో ప్రదర్శనశాలల్లో రెండు అంకినీడువి అయితే ఒకటి ఒక రిటైర్డ్ జడ్జిగారిది. పోటీగా ఒకర్ని మించి ఇంకొకరు ఎక్కడా దొరకని వాటిని సంపాదించి ప్రదర్శిస్తున్నారు.

పూర్వం ఓసారి ఆ రిటైరయిన జడ్జిగారి వీడియో దుకాణం మీద దాడి చేస్తే కొన్ని కాసెట్లు దొరికాయి. వాదోపవాదాలను ఆలకించే ఇప్పటి జడ్జీగారు. మరింత సమాచార సేకరణ కోసం ఆ వీడియోను కోర్టు హాల్లో ప్రదర్శింపచేశారు. ఆ దృశ్యాల్ని చూసి తట్టుకోలేక వాంతి చేసుకున్నారు. సభ్య సమాజం వీటిని బహిష్కరించాలని ఆయన అభిప్రాయపడ్డారు.

వైట్ కాలర్ నేరాలకు పాల్పడే ఘరానా పెద్ద మనుషులు ధన బలంతో ప్రజాప్రతినిధుల అండతో చాకచక్యంగా ఎవరికీ పట్టుబడకుండా అతి గోప్యంగా నేరాలు సాగిస్తున్నారని లా కమిషన్ సిఫార్సు చేసింది. వీరికి గౌరవ ప్రదమైన ఉదాత్తమయిన వృత్తులలోని వారు కూడా తోడ్పడు తున్నారనీ, పోలీసులు ఏమీ చేయలేకపోతున్నారనీ అది పేర్కొంది.

కళాఖండాలు దొంగిలించి విదేశాలకు చేరవేయటం దొంగనోట్ల ముద్రణ, వ్యభిచార గృహాలకు స్త్రీలను అమ్మటం, బోగస్ చిట్‌ఫండ్ కంపెనీలు, విద్యాసంస్థల పేరిట వ్యాపారం, పన్నులు ఎగవేయటం, మందులు కల్తీ చేయటం ఇవన్నీ ప్రజాశ్రేయస్సుకు భంగం కలిగిస్తున్నా అరికట్టలేకపోతున్నారని కూడా లాకమిషన్ నివేదిక పేర్కొంది.

జడ్జీగారు ఈ నివేదికని తన తీర్పులో పూర్తిగా చదివారు.





ఈ ఘరనా పెద్ద మనుషులు మీద నేరాలు మోపినప్పుడు వారే తమ నిర్దోషిత్వాన్ని నిరూపించుకోవాలన్నది ఒక సిఫార్సు. కఠిన శిక్షలుండాలనీ, ఈ నేరాలు తిరిగి జరిగితే జైలు శిక్ష విధించాలనీ లా కమిషన్ పేర్కొంది.

ఈ సిఫార్సులు ఒక ఫార్సులాగా మిగిలాయి.

ప్రస్తుతం భాస్కర్‌ని జేబుదొంగని చేసి పోలీస్ స్టేషన్‌లో పెట్టారు. అతడి వాచీ లాక్కున్నారు. రెండొందలు రూపాయలు కూడా తీసుకున్నారు. కెమేరా స్వాధీనం చేసుకున్నారు.

అంతకుమించి దారుణంగా కొట్టారు.

అంకినీడు పలుకుబడి అలాంటిది.

★ ★ ★

పట్టణజీవితంలో ఎవరి బాధలు వారివి. ఎవరి కష్టాలూ, కన్నీళ్లూ వారివే. నిత్యమూ సంక్లిష్టమవుతున్న జీవనంలో మానసిక వత్తిడుల సంఖ్య పెరుగుతున్న కొద్దీ ఒక మనిషి సమాజం నుండీ పారిపోయేందుకు ప్రయత్నిస్తాడు.

ఇక ఎవరికో ఏదో జరిగిందని, ఎవరో ఒక భాస్కర్‌ని తన్నారని ఎక్కడో ఏదో నేరం జరిగిందని ఆలోచించటం అసంభవం.

భాస్కర్ పోలీస్ స్టేషన్‌లో ఉన్నాడని కొద్ది మందికే తెలిసింది.

అందులో సగంమంది జేబులు కొట్టటం ప్రారంభించాడేమో మనకెందుకు అన్న నిర్లిప్తత ప్రదర్శించారు. సగంమంది ఏంచేయగలం అన్న వేదాంతాన్ని ఆశ్రయించారు.

ముందుగా సూర్యం తిరుపతిరావుని కలిశాడు. ఇద్దరూ తక్షణ కర్తవ్యాన్ని ఆలోచించారు. విద్యార్థులలో ఈ విషయాన్ని ప్రచారం చెయ్యాలి. వీలయినంత మందిని కలుపుకొని ఒక పత్రికలో ప్రకటన ఇవ్వాలి. ముందు అంకినీడుని కలిసి అతడి వైఖరి ఏమిటో తెలుసుకోవాలి. దాని ప్రకారం వీడియోలో అసభ్య ప్రదర్శనని ప్రజలకు తెలియజేయాలి.

కార్యక్రమం నిర్ణయించటం అయింది.

ఆ సాయంత్రం తిరుపతిరావు భాస్కర్‌కి లెక్చరర్ హోదాలో అంకినీడుని కలిశాడు.

అంకినీడుకి సూర్యం గురించి తెలుసు. విద్యార్థుల ద్వారా విన్నాడు. ఇప్పుడు ప్రత్యక్షంగా చూస్తున్నాడు. అతడి ద్వారా టి.జె. కాలేజి హాస్టల్‌లో చిన్న కదలిక వచ్చినప్పుడు సువర్ణరాజు తనని ఆశ్రయించాడు. నర్సిమ్మ సాయంతో ఆ కదలిక ఆగిపోయింది.

మళ్లీ ఇప్పుడు డిగ్రీ కాలేజిలో మొదలయింది. అసలే రమేష్ ఓటమితో శివాజీకీ, అతడి మీద ఆధారపడి ఉన్న తనకీ ఒక దెబ్బ తగిలింది. దెబ్బ మీద దెబ్బలా ఈ సూర్యం దృష్టి తన వ్యాపారం మీద పడింది. ఇప్పటికే కాలేజి బంద్ విఫలం చేయటంతో అతడి పాత్ర ఉంది.

అవతల ఆ భాస్కర్‌ని కొట్టటం ద్వారా తనకీ సూర్యానికీ శతృత్వం ముఖాముఖీ స్థాయికి చేరింది. డైరెక్టుగా ఇక వైషమ్యం ప్రారంభమయినట్లే.

ఇప్పుడేం చెయ్యాలి?

తిరుపతిరావు పెద్దమనిషి తరహా మధ్యవర్తిత్వం వహిస్తున్నాడు.

ఇంతలో అంకినీడుకి ఒక వార్త అందింది. డిగ్రీ కాలేజికి సంబంధించిందది.

అరుణ్‌కుమార్ సూర్యానికి తోడుగా ఈ విషయం గురించి ఒక పత్రికా ప్రకటన చేశాడనీ పోలీస్ స్టేషన్ వరకూ ఒక ఊరేగింపు జరిపి అక్కడ ధర్నా చేయాలని నిర్ణయం జరిగినట్లూ... రేపు భాస్కర్‌ని విడిచిపెట్టాలనీ ముఖ్యంగా తన వ్యాపారాన్ని జనం దృష్టికి తేవాలని కరపత్రాలు కూడా తేవాలనుకుంటున్నట్లూ ఆ వార్తలోని సారాంశం చెబుతోంది.

ఇక రాజీమినహా మరో గత్యంతరంలేదు.

విద్యార్థులతో తల కొరివి పెట్టించుకోవటమే అవుతుంది ఈ గొడవను కొనసాగిస్తే. పైగా ఆ ఫొటోలు ప్రమాదకరమయినవికాదు. షాప్‌నీ నేమ్ బోర్డునీ తీస్తే ఏం నష్టం? వేడి చల్లబడ్డాక మళ్లీ మొదలుపెట్టొచ్చు. టీవీ, విసిపి, కాసెట్లూ ఎక్కడికిపోతాయి.

ఆ రాత్రికే భాస్కర్ విడుదలయ్యాడు. వీడియో ప్రదర్శన ఆగిపోయింది.

అయినా మరునటి దినం పత్రికా ప్రకటన వచ్చింది. విద్యార్థినాయకుడి హోదాలో



అరుణ్‌కుమార్ భాస్కర్ అరెస్టుని ఖండించాడు.

ఊరేగింపు మాత్రం రద్దయింది, భాస్కర్ విడుదలయ్యాడు కాబట్టి.

అరుణ్‌కుమార్ ఈ విషయాన్ని ఉపయోగించుకొని తన విస్తరణకి మొదట అడుగువేశాడు. అంకినీడుని ఎదుర్కోవటం అతడి అసలు లక్ష్యం.

సూర్యం రాజీని అంగీకరించటానికి అది ఒక కారణం. విషయం చెయ్యిదాటిపోయి మంగిరెడ్డి అరుణ్‌కుమార్‌ల స్వార్థానికి ఉపయోగపడకుండా ఆపగలిగాడు.

భాస్కర్ అరెస్టు విషయం డిగ్రీ కాలేజిలో ఒక కదలికను సృష్టించింది.

ఆ విభేదాల చదరంగంలో ఆడపిల్లలు తటస్థవైఖరితో ఉన్నారు. ఇంకా వారిలో ఈ కుల రాజకీయాల మీద వ్యతిరేకత ప్రారంభం కాలేదు. వారు సూర్యానికి మద్దతు నిచ్చారు.

తాత్కాలికంగా విద్యార్థులు కూడా కులాలకు అతీతంగా ఈ విషయంలో కదలివచ్చారు. వారిలో శివాజీని అభిమానించేవారూ ఉన్నారు.

నైతిక విలువలు ఇంకా నాశనమై పోలేదనటానికి అది ఒక నిదర్శనం.

ఈ అనుభవంతో సూర్యం ఒక నిర్ణయానికి వచ్చాడు.

సమస్యలు ఎప్పుడూ ఉంటూనే ఉన్నాయి. వాటిని ఎదుర్కొంటే గానీ విద్యార్థులు కలిసిరారు., ఏ సమస్యయినా పట్టించుకుంటే ఫలానా కులానికి వ్యతిరేకి అని ముద్రపడుతుందని ఇంతవరకూ తటస్థవైఖరి ప్రదర్శించాడు.

ఇవుడు న్యాయమయిన పోరాటాలకు ప్రజల మద్దతు ఉంటుందని స్పష్టంగా తెలుస్తోంది. ఇక ఆ పనిలో ఉంటూ కుల రాజకీయాల్ని ఎదుర్కోవటం వాటిని తుడిచిపెట్టటం చెయ్యగలగాలి.

ఈ ప్రపంచం మహాక్లిష్టమయింది. ఒక మనిషికీ ఇంకో మనిషికీ పడదు. ఒకళ్లమీద ఇంకోకళ్లకి ఏదో ఒక అబ్జెక్షన్ ఉంటుంది. ఒకరిలో ఒకరికి అవకరం కనపడుతుంది. ఒకరి మీద ఇంకొకరికి వేరే వేరే అభిప్రాయం ఉంటుంది. ఒకరిపై ఇంకొకరు కారులూ మిరియాలూ ఒకరినింకొకరు ఎత్తిపొడవటం ఒకరి వెన్ను ఇంకొకరి కన్ను... ఒకరి నొకరు...

ఇద్దర్ని కలిపి ఒక కార్యక్రమంలోకి తీసుకురావటం తల ప్రాణాన్ని తోకకి తెస్తుంది. ఇక ఒక పదిమందిని కూడగట్టటం, ఓ వంద మందిని ఆర్గనైజ్ చెయ్యటం వెయ్యిమందిని ఒకే తాటిమీద నడిపించటం అంటే బ్రహ్మప్రళయం అన్నమాటే.

ఇద్దర్ని కలపటం కష్టం. కానీ ఇద్దరు కలవటం తేలిక. ఎప్పుడూ? ఒక సమస్యవచ్చినప్పుడు. ఒక కష్టం వచ్చినప్పుడు ఆ సమస్యా బాధితులు ఆ కష్టాన్ని భరాయించేవాళ్లూ ఒకరికొకరు దగ్గరయ్యి ఒకరినొకరు ఓదార్చుకొని ఒకరికింకొకరు సాయపడితే అదే ఒక సంఘటిత శక్తి అవుతుంది.

డిగ్రీ కాలేజిలో వచ్చిన చైతన్య దీపాన్ని కొండెక్కనీయకుండా కొడిగట్టకుండా కాపాడుకొంటూ విద్యార్థి ఐక్యతని సాధించాలి.

ఇంతవరకూ తనకు ప్రత్యక్షంగా మద్దతు దొరికింది ఇప్పుడే. ముందెన్నడూ లేదు. దాన్ని నిలబెట్టుకోవాలని నిర్ణయించుకున్నాడు సూర్యం.

★ ★ ★

ఫస్ట్ బియ్యేలో శ్రీనివాస్ ఒక్కడే వున్నాడు. అతడి బాధ మొహంలో వ్యక్తమవుతూ వుంది.

ఇంకా విద్యార్థులు రాలేదు. క్లాసులు మొదలవ్వటానికి అరగంట సమయం ఉంది. పగలంతా సందడిగా వుండే ఆ గది ఇప్పుడు నిశ్శబ్దంగా వుంది. బెంచీలూ, డస్కులూ దిగులుగా కూర్చున్నాయా అన్నట్లుంది. లెక్చరర్ కూర్చునే డయాస్ వెలవెలాపోతోంది. ఆ గదిని చూస్తుంటే ఇంకా గుబులు పుడుతోంది అతడికి.

ఇల్లు మనసులో మెదిలింది. ఒక పల్లెలో ఒంటినిట్టాడి పూరిపాకలో ఒక కుక్కిమంచం. దానిపై నీరసించిన, శుష్కించిన శరీరం. అమ్మ. అమ్మ కళ్లల్లో ఆశలు తనపైనే. కొడుకు మంచి ఉద్యోగం చెయ్యాలని, వెట్టిచాకిరీ




నుంచి తన బిడ్డయినా విముక్తి పొందాలనీ రెపరెపలాడుతున్న ప్రాణదీపాన్ని కాపాడు కుంటోంది. నా బిడ్డ కలక్టరవుతాడు అనుకో వటం తల్లికి సహజం. మన చదువుకి కండక్టర యినా అవుతాడా? అమ్మని సుఖపెడతాడా. ఇంతవరకూ పుస్తకం ముట్టనైనా లేదు. హాస్ట ల్‌లో కొన్నాళ్లుగా కరెంటులైట్ అనేదేలేదు. బిల్లు ఎగ్గొట్టినందుకు ఎలక్ట్రిసిటీ-డిపార్ట్‌మెంట్ శిక్ష విధించింది. ఆ శిక్ష విద్యార్థులే అనుభవి స్తున్నారు. లెక్చరర్ ఒక్క ముక్కకూడా అర్థమవ్వ కా పుస్తకాలు కొనుక్కునేందుకు ప్రభుత్వమి చ్చిన సొమ్ము క్లర్కుకీ, వార్డెన్‌కీ ధారాదత్తమ వ్వగా ఇంకా ఏం మిగిలింది చదివేందుకు. అంతవరకే అయితే ఫరవాలేదు.

స్టీవెన్సన్ దౌర్జన్యం అతడికి కలతపెడు తుంది. దౌర్జన్యం విద్యార్థి జీవితంలో ఒక భాగమయ్యాక పువ్వులాంటి హృదయాలమీద బరిసెపోట్లు ప్రత్యక్షమవుతున్నాయి. గుండెలు చితికిపోతున్నాయి. పిల్లలూ దేవుడూ చల్లని వారే కల్లకపటమెరుగనీ కరుణామయులే అని ఒక చరణం వుంది. నిజంగానే బాల్యం ఏ కల్మషమూ అంటని మల్లెపొద. ఏ కల్తీలేని తెల్లదనం. యవ్వనం ప్రారంభమయ్యేదశలో కాలేజీ ప్రవేశంతో ఒక దుస్సంఘటన సంభవి స్తోంది. మల్లెపొదలమీద మహిషాల పదఘట్ట నలు. తెల్లదనంమీద ఎండిపోయిన నెత్తుటి చిప్పటి చారికలు.

శ్రీనివాస్ హృదయం దగ్ధమవుతోంది. తల్లికి పంపాలనుకున్న పదీపాతికా ఒక మహిషాసురు డి పోషణకి ఖర్చయితే, అదీ తాగబోయించి, మాంసం తెప్పించి పీకలదాకా తినిపించటాని కి. చివరకు స్టీవెన్సన్ మురికితోళ్లలాంటి దుస్తు లు మల్లెపూవులా ఉతకాల్సివస్తోంది. వెట్టిచా కిరి తమ బతుకులకి కొత్త కాదు. ఒక కళాశాల విద్యార్థికి అంతో ఇంతో తమకు లభిస్తున్న ఆత్మగౌరవం ఇక్కడ మంటగలిసిపోతోంది. అదే అసలైన గుండెకోత. ఒక రౌడీకి బట్టలుత కటం. ఆ గది ఊడ్చిపెట్టడం. టూత్‌పేస్ట్ నుంచీ చెప్పులదాకా తమ వస్తువులను ధారాద త్తం చేయటం అంతా వంతులవారీగా జరుగు తుంది. రోజుకొకరు ఆ పనులు చేసిపెట్టాలి. రోజుకొకరి వస్తువులు ఇచ్చెయ్యాలి.

ఎదిరించబోయిన ఒకరిద్దరికి జరిగిన అను భవం ఎవరూ మర్చిపోలేనిది. శారీరకహింస అలావుంచి, వాళ్లు పెట్టే మానసికహింస వర్ణ నాతీతమైంది. వారంరోజులు పనివాళ్లబదులు వంటపాత్రలు తోమటం, గదులు తుడవటం, బాత్‌రూమ్‌లు శుభ్రం చెయ్యటం. వీటికి ము ద్దుపేరు 'సోషల్‌వర్క్'. ఆ సోషల్‌వర్క్ చె య్యాలి. ఎవరికావంతు వస్తుందో అని గుండె లరచేతబట్టుకొని ఉండాలి.

అతడు ఆలోచనలో మునిగివుండడం చూశా డతడి స్నేహితుడు శ్రీధర్. అతనికీ తెలుసు హాస్టల్ పరిస్థితి. అతడా రూంలోకి ప్రవేశించా డు. పక్కనే ఇంకొకవ్యక్తి వున్నాడు. ఇద్దరూ అతడిని సమీపించారు.

"ఏరా శ్రీనూ? ఈయన తెలుసా? మొన్న బోస్ బొమ్మసెంటర్‌లో..."

శ్రీనివాస్ మర్యాదపూర్వకంగా నవ్వాడు. లేచి చెయ్యి కలిపాడు.

"తెలీకపోవటమేంటిరా? సూర్యం అంటే ఈయనే కాదూ...?"

"సూర్యం నేచెప్పాను చూడు. శ్రీను ఇతనే" పరిచయం చేశాడు శ్రీధర్.

"ఏంటి సోదరా... విశేషాలు. హాస్టల్ గు రించి నాకు కొంత తెలుగులోగానీ, వార్డెన్ విషయంలో అతడి బలగం విషయంలో సరైన వివరాలు లేవు. మీది స్టూడెంట్స్ మేనేజీ మెంట్‌దేకదా? అయినా అంతా ఘోరంగా ఎలా వుంది" సూర్యం ఏ మొహమాటలూ లేకుండా ప్రారంభించాడు.

శ్రీనివాస్ చెప్పటం ప్రారంభించాడు. మధ్య మధ్య ప్రశ్నలు వేస్తూండిపోయాడు సూర్యం.

"సరే శ్రీనూ... మనం దీనికి పరిష్కారం వెతకాలి. ఎంతకాలం ఊరుకుంటాం. కనీసం మీరూ వార్డెన్ని డిమాండ్ చేయటానికి వీల్లేని స్థితి. కారణం నువ్వన్నట్లు అతడి వెనక వున్న బలం. మేనేజ్‌మెంట్‌వైపునుంచిగానీ, స్టీవె న్సన్ నుంచిగానీ అతడికి సపోర్టు కావాల్సి నంత ఉంది. అయితే మనం ఎలా దీన్ని పరిష్కరించాలి? కొందరు వెళ్ళి బలం చూ పిస్తే కాదు. ఎందుకంటే మీరు చాలాకాలం హాస్టల్‌లోనే వుండే విద్యార్థులు. సమస్యలు మీరే ఎదుర్కోవాల్సి వస్తుంది. అందుకని మీ

రంతా సంఘటితంగా ఉంటే కానీ ఏదో ఒకమే రకు విషయం కదలదు. సమస్య అందరిదీ కదా! అందరికీ లోలోపలే వార్డెన్‌మీద వ్యతిరే కత వుంది. అది బయటకు రావాలి. ముందు డిమాండ్ చెయ్యగలిగే ధైర్యం కావాలి. అది ఎలా వస్తుంది? ప్రారంభం ఎక్కడో ఒకచోట అవ్వాలి. అది అందరికీ చేరాలి. నీనుంచే ప్రారంభం కాని. నీవు నీ మిత్రుల్ని కదిలించు. ముందు భయపడతారు. పడనీ. అది సహజం. నీలాంటివాళ్లు కొంతమంది అయినా ఉండేఉంటారు. వాళ్లని సిద్ధం చెయ్యాలి. ముందు అడగటం అనేది చిన్నవిషయం. రోజూ వందల మెమోరాండంలు వందల మందికి ఇస్తున్నారు. ఈ చిన్నవిషయంవరకూ ఒక్కటిగా నిలబడితే తర్వాత మనకి సుల భంగా పనిజరుగుతుంది. కాలేజీ స్టూడెంట్స్ కూడా ఈ విషయంలో మీకు అండగా వుంటా రు..." వివరించాడు సూర్యం.

శ్రీనివాస్‌కి కొద్దికొద్దిగా ధైర్యం వచ్చింది. అంకినీడు విషయంలో సూర్యానికి విజయం లభించిన సంగతి అతడికి తెలుసు. ఎలాగ యినా తమ సమస్యలు పరిష్కరించగలిగితే అంతకంటే కావాల్సిందేముంది. దినదినం జీవచ్ఛవాల్లా ఎంతకాలం బతకాలి?

ఆ సాయంత్రమే బసవకోటి స్టీవెన్సన్‌కి ఈ వార్త చేరవేశాడు.

★ ★ ★

సుజాత ఇల్లు-

ఆమె తల్లి వంట ఏర్పాట్లలో వుంది. రాక రాక వచ్చిన తమ్ముడికోసం తీపిపదార్థాలు తయారుచేయటంలో మునిగివుంది: ఇంటిల్లి పాదీ వచ్చిన అతిథిపట్ల ఆదరణ చూపిస్తున్నా రు. మధ్యతరగతి కుటుంబాలలో బంధువుల పట్ల ఉండే ఆప్యాయత కాదది. అంతకంటే ఎక్కువ.

కారణం అతడు కాబోయే అల్లుడు. సుజాత కి చిన్నతనంలోనే భర్తని నిర్ణయించారు. మేన రికం జరగాలనీ, సుజాతకి తమ్ముణ్ణే ఇచ్చి పెళ్లిచేయాలని ఆమె తల్లి పట్టుబట్టింది. కట్న కానుకల పట్టింపులేకుండా ఉన్నదాంతో సర్దుకు పోయే తమ్ముడికంటే బయటి సంబంధం అనవసరం అని ఆమె అభిప్రాయం. కుటుంబ సభ్యులందరికీ సమ్మతమే ఈ సంబంధం.

కానీ సుజాత ఆందోళనగా వుంది. మామ య్య హఠాత్తుగా రావటంతో ఆమె ఇరుకున పడింది. అతడు తనతో మాట్లాడేందుకు ఉద యంనుంచీ ప్రయత్నిస్తున్నాడు. ఏదోఒకవని కల్పించుకొని తప్పించుకొంటూ అతడికి అవ కాశం ఇవ్వలేదామె.

తొమ్మిదవగానే కాలేజీకి బయలుదేరింది. సాయంత్రంవరకైనా ప్రశాంతంగా వుండొచ్చని. తల్లితో ఎలా చెప్పలా అని ఇబ్బంది పడు తోంది. కాలేజీ మానెయ్యమంటుందేమో అని భయం.

అతడే రక్షించాడు.

"అక్కా... సుజాత క్లాసులు చెడగొట్టుకో వటం దేనికి. ఇవ్వాల్టికి పోయిరానీ. నేను నాల్రోజులు ఉంటాగా" అన్నాడు తల్లితో. ఆమె అయిష్టంగానే తలఊపింది.

సుజాత నెమ్మదిగా బయటికి జారుకుంది. అంతగా అయితే సాయంత్రం సర్దిచెప్పొ చ్చులే అనుకొంటూ.

వడివడిగా నడుస్తూ మెయిన్‌రోడ్‌ని సమీ పించింది. అనిల్‌ని ఎలా కలవాలా అనేది సమస్య. మేనమామ వచ్చి వత్తిడి చేస్తుంటే... పెళ్లి గురించి ఇకనైనా ఏ విషయమూ తేల్చుకో వాలి. లేకపోతే సమస్య ఇంకా జటిలమవు తుంది. అతడిలో ఆశలు రేపెట్టి ద్రోహం చేసినట్లవుతుంది. చిన్నప్పటినుండీ తనను భార్యగానే భావిస్తున్నాడు. తనకి అది ఇష్టంలే దు.

ఇంతలో వెనకనుండి ఎవరో పిలిచారు. ఆమెకి ఆగక తప్పలేదు.

సుజాత గుండె నీరయ్యింది. మేనమామ. తనతో పర్సనల్‌గా మాట్లాడేందుకే బయటకు పంపి వెనకాల బయలుదేరాడన్నమాట.

అతడు వేగంగా నడుస్తూ వచ్చి ఆమెను కలుసుకున్నాడు.

"ఏం సుజా? నేనంటే ఇష్టం లేకపోయినా కనీసం మాట్లాడొచ్చుగా"

ఆమె మౌనాన్ని ఆశ్రయించింది. ఏదయితే





జరగకూడదనుకుంటుందో అదే జరుగుతోంది.

“నిన్ను ఇబ్బంది పెట్టనుగానీ వద. ఓ అరగంట నాకు కేటాయించు. నిన్నిక అవనరంగా బాధపెట్టదలుచుకోలేదు. ఏదయినా పార్కులో కూచుందాం వద” అతడే చొరవ తీసుకుని ఆమెని పార్కులోకి నడిపించాడు.

ఓ బెంచీమీద కూర్చున్నారు. ఆమె తల ఎత్తటంలేదు.

“నేను హఠాత్తుగా ఎందుకొచ్చానో తెలుసా? మన పెళ్లివిషయం తేల్చుకోడానికే. ఈ ఏడు జరిపిద్దామని పెద్దవాళ్లనుకొంటున్నారు. నాకు ఉద్యోగం దొరికింది. నాకు ఊహ తెలిసి మనిద్దరమూ భార్యాభర్తలుగానే అనుకున్నాను. ఇక అది నిజంగా జరగబోతోంది. పెళ్లి ఒకటే అడ్డంగానీ అందరూ కూడా అనుకుంటున్నారు. కానీ నా ఉద్దేశం, నీ ఇష్టం ఏమిటో తెలుసుకోకుండా ఇది జరగటం తప్పని. పెళ్లంటే చిన్నపిల్లలు ఆడుకొనే బొమ్మల పెళ్లి కాదుగా. అది మన జీవితాంతం ముడిపడి వుండే బంధం. అందుకే నిన్ను కలుసుకొని వివరంగా అడుగుదామని వచ్చాను.

నువ్వు చిన్నపిల్లవి కాదు. నీకూ జ్ఞానం వచ్చింది. కాలేజీలో చదువుతున్నావంటే నీకూ కొన్ని ఇష్టాఇష్టాలు ఏర్పడివుంటాయి. పెద్దవాళ్ల మాట అలావుంచు. నీ సంగతి చెప్పు. నీ భర్తగా ఎలాంటి మనిషిని కోరుకుంటున్నావు. ఎలా ఉండాలనుకొంటున్నావు. నన్ను గురించి ఏమనుకొంటున్నావు. నాతో ఫ్రీగా చెప్పు. నేనేం అనుకోను. లేకపోతే జీవితాంతం మనకు మిగిలేది నరకం”

ఏమాత్రం స్పందనలేదు ఆమెనుండీ. కనీసం తల ఊపటం, ఏ భావాలతో అతడి మాటలకు స్పందించటం కూడా లేదు.

అతడు దాదాపు గంటసేపు ఎదురుచూశాడు. ప్రశ్నలు వేశాడు. సంసారం గురించి తన అభిప్రాయాలు చెప్పాడు. ఆమెని చెప్పమన్నాడు. కానీ ఆమెనుండీ వచ్చింది మౌనమే.

అతడు విసుగెత్తిపోయాడు. ఇక ఇంకొక్క నిమిషం వేచిచూడటం వృధా అనుకున్నాడు. తనకి కంఠశోష మాత్రం మిగిలింది. ఆమెను ఘాటుమాటలతో విమర్శించి ఇంటికి వెళ్లిపోయాడు.

సామాన్లు సర్దుకొని తన ఊరికి బయలుదేరాడు.

నాలుగురోజులు ఉండాలని వచ్చి రెండో పూటే వెళ్లిపోయిన తమ్ముణ్ణి చూసి అవాక్కయింది సుజాత తల్లి.



పెళ్లిరోజు మధురస్మృతిగా మిగిలిపోవటానికి కారణం వివాహానంతరం జీవితంలో మాధుర్యం తగ్గిపోవటమేనట. సరిత ఎక్కడో వింది. నిర్లిప్తత. యాంత్రికత, విముఖత ప్రారంభయ్యాక ఇంక మాధుర్యం ఎక్కడ ఉంటుంది? ఆమె అభిప్రాయం ప్రకారం...

పెళ్లయిన మొదట్లో దంపతులిద్దరూ ఎదుటివారిలో గొప్పదనాన్నే చూస్తారు. వారి స్వభావం తప్పనిసరిగా నచ్చుతుంది. అందం, అలంకరణ, ప్రదర్శన, హుందాతనం ఇత్యాదులు మెచ్చుకోదగిన లక్షణాలుగా కనబడతాయి. అంతవరకూ తనతో పరిచయం కూడా లేని వ్యక్తి జీవితాన్ని వంచుకోవటం, తన సమస్తాన్నీ రెండవ వ్యక్తికి అర్పించటం, తన బరువుబాధ్యతల్ని ఆ వ్యక్తి స్వీకరించటం, తనకి అండదండలుగా చేదోడువాదోడుగా ఉండటం అపురూపమైన అనుభవం. అది ప్రపంచంలో ఎక్కడా దొరకని ఏ అద్భుతమైన అంశమూ కలిగించలేని అనుభూతి. ఎదుటివ్యక్తిలోని ఆ గొప్ప లక్షణాలకి తను సరిపోనేమో అని భయం కూడా కలగవచ్చు. అప్పుడు అలాంటి వ్యక్తి లభించటం అదృష్టంగా అనిపించుతుంది.

తర్వాత కాలచక్రం తిరిగేకొద్దీ స్థితి మారుతుంది. చలనసూత్రాల ప్రకారం ఏదీ స్థిరంకాదు. ఏదీ నిలకడగా ఉండదు.

ఇప్పుడు ఎవరి గొప్పతనాన్ని వారు అప్రయత్నంగా చెప్పటం ప్రారంభిస్తారు. అనందర్భంగా, అసంకల్పితంగా తమ గురించి తాము గొప్పగా చెప్పటం మొదలవుతుంది. తమ భాగస్వామితో అప్పటికి చూడని లోపాలు కనిపిస్తుంటాయి. ఏముంది నీలో అన్న ధోరణి. దానివెనుక దాగివున్న అసలు విషయం తామూ రెండోవారికి తగినవారమే అని నచ్చచెప్పుకొనే ప్రయత్నం. తమ స్థితీ తగినదే. తాము సమర్థులమే అంటున్న దశ.

మూడవ దశలో యాంత్రికత ఉక్కుపాదంతో అడుగుపెడుతుంది. బరువు బాధ్యతలూ... కష్టనష్టాలూ... సుఖదు:ఖాలూ... ఏముంది జీవితంలో ఒక నిద్రా. రెండుసార్లు భోజనం, మూడుసార్లు టీలు, నాలుగుసార్లు పోట్లాటలూ. ప్రతిరోజూ అదేగా. అదే విషయమేగా. అనుకోవటం. •కీచులాడటం మనశ్శాంతిని కోల్పోవటం. దాన్ని హోటల్స్‌లో వెతుక్కుంటూ తిరిగే భర్తలూ... పక్కింటివారితో అమ్మలక్కలు చెప్పుకొనే కబుర్లలో వెతుక్కునే భార్యలూ.

అయితే సరిత ఊహించినంత లేదు తన సంసారజీవితం. మాధుర్యం నిత్యమూ వికసించే పుష్పంలా ఆమెను తాకుతోంది. ఆనందం నిత్యనూతనంగా ఆమెకు అనుభూతమవుతోంది.

కారణం ఇద్దరూ ఆలోచనాపరులయి ఉండటం. ఒకరినొకరు అర్థం చేసుకోవటం. సాహిత్యపఠనం ఇద్దరికీ ఇష్టమైన విషయం. అదే ముందు ఒకరినొకరు అలవాటు పడటానికీ సాన్నిహిత్యం పెంచటానికీ కారణమయింది.

ప్రకాష్ సరితలోని సౌందర్యానికి అచ్చెరువు చెందాడు. ఒక్క భౌతిక విషయంలోనే కాదు. ఆమె ఎటూ అందమైనదే. ఆమె ఆలోచనల్లో విరాజిల్లే పరిమళంతో మానసిక సౌందర్యాన్ని దర్శిస్తున్నాడు. అది అంతర్ముఖమైనది.

ఆనందం శృతిమించినప్పుడు కవితలు రాస్తుంది సరిత. గొప్ప ఉదాత్తతోనూ వెన్నెల పూల పరిమళాలతోనూ నిండిఉంటాయవి. అతడికి చూపిస్తుంది.

అతడు చదివి గాఢమైన అనుభూతి చెందుతాడు. అదే ఒకరిపట్ల ఇంకొకరికి ప్రే





మానురక్తిని కలిగిస్తుంది. ఈమధ్యన ఆమెకు అత్యంత ఆనందం కలిగించిన విషయం తను చదువు కొనసాగించేందుకు ప్రకాష్ అంగీకరించటం. తన కల నిజమవ్వటం.

★ ★ ★

రవి క్లాసుకి వచ్చాడు సుదీర్ఘ విరామం తర్వాత.

ఒకరోజు సారథి దొరికిపోయాడు. ఒక సినిమాహాలు ముందు పడిగాపులు పడుతుండగా భాస్కర్‌తో కలిసివెళుతున్న సారథి చూశాడు. తప్పించుకొనే వ్యవధి లేకపోయింది.

భాస్కర్‌ని వెళ్లమని సారథి రవిని తీసుకుని ఓచోట కూర్చోబెట్టి బాధపడొద్దని ఓదార్పుగా మాట్లాడాడు. క్లాసులో అందరిముందూ తనని చెంపదెబ్బ కొట్టడం మర్చిపోలేక బాధపడుతున్నాడు రవి.

సారథి అన్నాడు.

"నువ్వు తేలిగ్గానే తీసుకోవాలి రవీ. తప్పదు. ఇవాళ మన కాలేజీలో ఎంతెంత దారుణాలు జరుగుతున్నాయో నువ్వు ఊహించ లేవు. నీకు జరిగింది వెంట్రుకవాసంత. నీ పరిధిని బట్టి అదే పెద్దదిగా కనిపిస్తున్నది కానీ అది చాలా చిన్నది. ఎవరినీ చూసి భయపడకు. నీకు అవమానం జరిగితే మన క్లాసుకంతటికీ జరిగినట్టే. అందరూ ఏమనుకుంటున్నారో అని సిగ్గుపడుతున్నావుకదూ. నువ్వు కాదు మేము సిగ్గుపడాలి. కులం పేరు చెప్పి తనమాట విననందుకు రమేష్ విరుచుకుపడ్డాడు. అది నీకు ఒక్కడికి ఎదురవుతున్నదనుకోకు. ప్రతివాడికీ జరుగుతోంది. మన కాలేజీలో రెండున్నరవేలమంది విద్యార్థులు ఎదుర్కొక తప్పని సమస్య అది. కులనాయకులు అని పేరు పొందిన వాళ్ల వెనుక ఉండకపోతే వాడికి కులభ్రష్టత్వంతోపాటు అవమానం కూడా జరుగుతుంది. అంతదాకా ఎందుకు మొన్న సూర్యంకి కూడా తప్పలేదు"

"సూర్యంకా? ఏమయింది?" ఆతృతగా అడిగారు రవి.

"సూర్యం వాళ్ల ఊరిలో తిరుపతిరావు అని ఒకతను ఉన్నాడు. ఆయనదీ సూర్యానిదీ ఒకే పెద్దకులం. ఆయనేం చేశాడంటే నిర్మలనే ఓ చిన్నకులం అమ్మాయిని ప్రేమించాడు. ఇంట్లో వాళ్లు ఈ విషయం విని మండిపడ్డారు. ఊరితగాదాలు ఎంతవరకూ పోతాయంటే ఒకవర్గం ఇంకోవర్గం మీదకు దాడిచేసి ఘోరమైన హింసాకాండ చేస్తుంది. కారణం చిన్నది. ఒక కులం అబ్బాయీ ఇంకో కులం అమ్మాయీ ప్రేమించుకున్నారనో... ఇంకోటనో... సరే సూర్యం వాళ్లిద్దరినీ అడిగాడు. ఎంత కష్టానికైనా భయపడకూడదనీ, పెళ్లయ్యాక తప్పు చేశాం అన్న ఫీలింగ్ రాకూడదనీ, అన్నిటికీ సిద్ధంగా వుండాలనీ, ఉంటేనే పెళ్ళి చేసుకోండనీ అన్నాడు. వాళ్లు ఒప్పుకున్నారు. ఒకరిని విడిచి ఇంకొకరు బతకలేమన్నారు.

వాళ్లిద్దరినీ ఈ టౌనుకే తీసుకొచ్చి పెళ్లి జరిపించారు. మన స్నేహితులందరూ వచ్చి సాయం చేశారు. వాళ్లిద్దరికీ ముందు తిండికి గడిచేంతవరకూ తలా కొంత ఇచ్చారు. సూర్యం ఒక్కడూ వాళ్ల ఊరు వెళ్లాడు. వెళ్తే ఏముంది? తమ కొడుకుని చెడగొట్టి ఓ కులం తక్కువ దానికిచ్చి కట్టబెట్టాడని తిరుపతిరావు వాళ్ల నాన్న ఊరి సెంటర్‌లో పంచాయతీ పెట్టాడు. పెద్దవాళ్లకెన్నో నమ్మకాలుంటాయి. ఈ కాలంకి అనుగుణంగా మారేందుకు బాధగానే ఉంటుంది. ముందు కోపగించినా తర్వాత వాళ్లే సర్దుకొని కొడుకునీ కోడలునీ తెచ్చుకుంటారులే అని సూర్యం ఏమీ మాట్లాడలేదు. ఆయన రెచ్చిపోయి సూర్యాన్ని ఓ దెబ్బ కూడా వేశాడు. నిజంగా సూర్యం తలుచుకుంటే అక్కడో కురుక్షేత్రం జరిగేది. ఎందుకంటే తిరుపతిరావు వాళ్లది పెద్ద కుటుంబం. సూర్యం వాళ్లకి బాగా ఆస్తివుంది. సూర్యానిదే పైచేయి అక్కడ. కానీ ప్రతీకారం కాదుగా సమస్య. తిరుపతిరావు సంసారం కుదుటపడాలిగా. అందుకే అవమానం భరించి ఊరుకున్నాడు. ఇప్పుడు దానికి ప్రతిఫలం కనబడుతోంది. ఇప్పుడిప్పుడే తిరుపతిరావు కోసం అతడి తల్లిదండ్రులు వచ్చివెళ్తున్నారు. ఎంతైనా కన్నవాళ్లు. అతడికీ టౌనులోనే లెక్చరర్‌గా ఉద్యోగం దొరికింది. స్వంతంగా అయినా బతకగలడు. ఇంటినుంచీ సాయం లేకపోయినా పెద్దలతో ఇంకా మొహం ముడుచుకున్నట్టున్నా రాకపోకలైతే వున్నాయి. అవీ ఇంకోటి ఏంటంటే నీ సమస్యకి వాళ్ల సమస్యకీ తేడా



వుంది. నీది కుల అహంకార సమస్య. రమేష్ తన అహంకారం ప్రదర్శించాడు. నీ విషయంలో వాళ్లది దుగ్ధ. ఊరిలో పరువుప్రతిష్టలు పోతాయన్న దుగ్ధ. దానికి సామరస్యధోరణి కావాలి. నీకు పోరాటధోరణి తప్ప పరిష్కారం దొరకదు. పోరాటం అలా వుంచి నువ్వు కాలేజీ మొహం చూడటానికే భయపడుతున్నావు. ఇంకా పరిష్కారం ఎక్కడ?

రవి కళ్లముందు ఒక దృశ్యం మెదిలింది. ఊరి మధ్యలో సూర్యంపై విరుచుకుపడ్డ ఓ నడివయసు సన్నకారు రైతు. ఆ రైతుమీదకు దూకపోతున్న పరివారాన్ని ఆపుతున్న సూర్యం. అతడి పాదాలకి నమస్కరిస్తూ ఆశీర్వాదంకోసం వంగిన భార్యాభర్తలు.

ఈ సమస్య తన ఒక్కడిదే కాదు. ఇంకా అనేకమందిది. అందులో సూర్యం కూడా ఉన్నాడు. సూర్యం తనతోనే వున్నాడు. అంతే ఆలోచించాడు.

ఇప్పుడు కాలేజీకి వచ్చాడు.

కానీ ఎవరైనా తనని గమనిస్తారేమో అన్న భయం పోలేదు. అతడి అదృష్టంకొద్దీ ఎవరూ అతణ్ణి గుర్తించలేదు. సానుభూతి చూపించలేదు.

ఇంకా సమయముండటంతో సారథీ, రవి గ్రౌండు మొదట్లో క్రోటన్స్‌దాకా వచ్చినుంచున్నారు. వచ్చిపోయే స్టూడెంట్స్‌ని చూస్తూ మాట్లాడుకుంటున్నారు. డిగ్రీవాళ్లు కూడా అటుగుండానే వెళ్తున్నారు.

"ఆరోజు మన క్లాసురూంలో రమేష్‌తో గొడవపడ్డాం గుర్తుందా? అదేరోజు డిగ్రీ ఫస్టియర్‌లో రాధాకృష్ణ అనే స్టూడెంట్ తలి పగలగొట్టారు. శంకర్రావు ఇప్పుడు రిమాండ్‌లో వున్నాడు. తెలుసా?" సారథి అడిగాడు.

"శంకర్రావా?" ఆశ్చర్యపోయాడు రవి. నటభీకర పనుల్లో తిరిగినప్పుడు శివాజీవర్గం అంతా పరిచయమే తనకి. శంకర్రావు కూడా తెలుసు. తనతో చక్కగా ప్రవర్తించాడు అప్పుడు. అలాంటివాడు తల పగలగొట్టాడా? ఊహించుకొంటేనే ఏమిటోగా ఉంది. ఎందుకొస్తాయో అంత కోపాలు.

"శంకర్రావు కేసు తేలేసరికి రెండుమూడేళ్లు దాటుతుంది. అప్పటికి ఈ కాలేజీలో స్టూడెంట్స్ అంతా వెళ్లిపోతారు. కొందరు ఎక్కడెక్కడో పైచదువులకి పోతారు. కొత్త బ్యాచ్‌లు వస్తాయి. కానీ జరిగేది ఆగదు. ప్రతీకారాలు తీసుకొంటారు. అసలు అరుణ్‌కుమార్ కొంత అగుతున్నాడుగానీ ఎప్పుడో జరిగేవి. నాయకుడుగా వుంటే అనుచరుల్ని రక్షించాలి. మరి రాధాకృష్ణ విషయంలో ఏంచేస్తాడు. వాళ్ల వాళ్లు వత్తిడి చేస్తున్నారు. మొత్తానికి తగిన సహాయం కోసం చూస్తున్నాడు"

"అంటే మళ్లీ..."

"ఆహ... ఈసారి ఇంకా పెద్దస్థాయి. ఇంతవరకూ కనీసం కారణం వెతికి ఆతర్వాత దాడిచేస్తున్నారు. ఈసారి కారణాలుండవు. ఉన్నా ఎవరో ఒకరిమీద కాదు. గ్రూప్‌లో అందరిమీదా చేస్తారు. ఇంతవరకూ క్లాసురూమ్స్‌లోకి రాలేదు తగాదాలు. మొన్న లెక్చరర్లే ఆయుధాలు చేతబట్టి మార్గం చూపించారు. ఇక మినహాయింపులుండవు. క్లాసురూం ప్రిన్సిపాల్ రూం... ఇవి లెక్కలోకి రావు. పని జరగటం ముఖ్యం. జరుగుతుంది. మనం ఈ విషయంమీద మొదటినుండీ హెచ్చరిస్తూనే వున్నాం. మొన్న గొడవ తర్వాత పాంప్లెట్లు వేశాం. ఎంతో కొంత అరుణ్ ఆలోచిస్తాడని అతడికి నచ్చచెప్తున్నాం. కానీ అతను వినటంలేదు. అసలు మన స్టూడెంట్స్‌లో చైతన్యం వస్తేగానీ ఈ గ్రూపుల కొట్లాటలు ఆగవు"

రవికి భవిష్యత్తు అగమ్యగోచరంగా వుంది. ఏం కాలేజీ? ఏం రాజకీయాలు? సామాన్య విద్యార్థి పరిస్థితి అగమ్యగోచరం. ఎందుకలా జరుగుతాయి అసలు? ఒక్కరన్నా ఆలోచించరేం?

"హలో నరేంద్రా" సారథి చెయ్యి ఊపాడు. అటుగా వెళ్తున్న ఓ వ్యక్తిని చూసి.

నరేంద్ర పలకరింపుగా నవ్వి రవీ వాళ్ల దగ్గరికి వచ్చాడు. రవిని అతనికి పరిచయం చేశాడు సారథి. నరేంద్ర స్నేహపూర్వకంగా రవి భుజం చుట్టూ చెయ్యివేసి పలకరించాడు.

రవి సిగ్గుగా నవ్వాడు. అయినా స్నేహస్పర్శతాలూకూ ఆనందం వదల్లేదు.

"రవీ? నీ గురించి అందరం అనుకుంటున్నామోయ్" అన్నాడు నరేంద్ర.




"ఏం? ఏమనుకుంటున్నారు?" సారథి అడిగాడు రవి తరఫున.

"ఊహూఁ... అదికాదు. రవి పరిస్థితి గురించి... మొన్న సూర్యంతో మనవాడెవరో అన్నారు. భాస్కర్ అనుకుంటా. రవికీ మనకీ తేడా ఏంటంటే, మనం తెలిసి కులరాజకీయాల్ని ఎదిరిస్తున్నాం. ఈయన తెలీకపోయినా వాటిని నిరసిస్తున్నాడు. ఏం రవీ... అవునా? కాదా?"

రవికి మనసంతా నిండిపోయినట్లుంది. తన గురించి పదిమంది ఆలోచిస్తున్నారు. హేళనగా కాదు. తేలికచేస్తూ కాదు. మంచి ఉద్దేశంతో. అందులో సూర్యం సహచరులు. ఆదర్శాలు కలవాళ్లు. తనకంటే గొప్పగా ఆలోచించగలవాళ్లు. మనసుకితోడు ఇంకొక మనసే కదా! అంతకంటే సంతోషం ఎక్కడ దొరుకుతుంది. ఒక చెంపదెబ్బతింటే తిన్నాడు. ఒక అవమానాన్ని అనుభవిస్తే అనుభవించాడు. కానీ ఈ తృప్తిముందు అదెంత? తన మనసు చెప్పినట్లు నడుస్తాడు. తనకితోడు వీళ్లంతా ఉన్నారు. ఈ పోరాటంలో తానూ పాలుపంచుకుంటాడు. వీళ్లతో భుజంకలిపి నడుస్తాడు. తన ప్రాణాలయినా ఇస్తాడు.

"అయితే సూర్యం ఒకటి అంటున్నాడు. రవీ నువ్వే ఆలోచించు. నీ గురించే. నీకు రమేష్ సీటు ఇప్పించాడటకదా. అంటే నువ్వు అతడి కారణంగానే కాలేజీకి రాగలుగుతున్నావని రమేష్ ఉద్దేశం. అతడిమీద ఆధారపడి వున్నంతకాలం నిన్ను వేధిస్తూనే ఉంటాడు. నీకు గౌరవం మాట అటుంచి నీ ఆత్మాభిమానాన్నే దెబ్బతీస్తుంటాడు. అందుకని ఒక పరిష్కారం అయితే వుంది. రవి ఒప్పుకుంటేనే జరుగుతుందనుకో" నరేంద్ర సారథివైపు తిరిగి చెప్పాడు.

"ఏంటిది? చెప్పవోయ్. ఆలోచిస్తాం" అన్నాడు సారథి.

"నీకెంత పర్సెంటేజ్ ఉంది రవీ?" అడిగాడు నరేంద్ర.

"ఫిఫ్టీదాకా వుంది" అన్నాడు రవి.

"అయితే... ఏ రికమండేషనూ లేకుండానే నీకు ఆర్ట్స్ గ్రూప్స్‌లో సీటు వస్తుంది. అంటే సీయీసీగానీ ఇంకోటిగానీ. ఇప్పుడు గ్రూప్ ఛేంజ్ కోసం ప్రయత్నం చేస్తే వాటిల్లోకి మారే అవకాశం వుంది. కాలేజ్ మొదలయ్యి ఎంతో కాలం అవలేదు. ఎంపీసీ కోసం రమేష్‌మీద ఆధారపడ్డావుకదా! ఇక అది ఉండదు వాటిల్లోకి నువ్వు మారితే. ఏదయినా బాగా ఆలోచించి చెయ్యాలి. ఇంకా టైం ఉందిలేగానీ?"

ఈ ఆలోచన రాలేదు రవికి. రమేష్ కబంధ హస్తాలనుండీ బయటపడాలంటే ఎలా? అదే సమస్య. ఇప్పుడు నరేంద్ర చెప్పేవరకూ తోచలేదు. ఇంతవరకూ తన జీవితంలో ఏ నిర్ణయమూ స్వంతంగా తీసుకోలేదు. తనకేదో కావాలన్నా ఇంకొకరు నిర్దేశించాల్సిందే. ఇంకొకరు పర్యవేక్షించాల్సిందే. గ్రూప్ మారితే ఇంట్లో యుద్ధం జరుగుతుంది. తనో ఇంజనీరు కావాలనుకుంటున్నాడు తండ్రి. ఆయన హతాశుడవుతాడు అవనీ. తన బాధను ఏం పట్టించుకొన్నాడాయన. ఆయన ఆశల్ని మాత్రం తను పట్టించుకోవాలా? తనకేం చెయ్యరుగానీ తను మాత్రం వాళ్లు చెప్పినట్లు చెయ్యాలి. రమేష్ కాళ్ల దగ్గర పడివుండాలట. ఏ తండ్రయినా ఆమాట అంటాడా? తనకీ బాధలుంటాయనీ, వ్యక్తిత్వం ఉందనీ గుర్తించరేం?

ఆలోచించేకొద్దీ రవికి ఉద్రేకం పెరుగుతోంది.

"నేను గ్రూప్‌ఛేంజ్‌కి అప్లయి చేస్తాను" డెస్పరేట్‌గా అన్నాడు రవి.

సారథి ఆశ్చర్యపడ్డాడు. రవి నోటినుండేనా ఈ మాటలు రావటం. రవిలో మార్పు కనబడుతోంది... తనకు తెలీని, తను ఊహించని మార్పు.

"తొందరేంలేదు ఆలోచించి..." అంటున్నాడు నరేంద్ర.

"మీకు తెలీదు నరేంద్రగారూ. రమేష్ మూలంగా ఎన్ని బాధలు పడ్డానో? ప్రతిసారీ నా భుజాలమీద ఎక్కి కూర్చుని నన్ను తొక్కేసేవాడు. ఎన్ని రోజులని భరిస్తాను. ఎన్ని అవమానాల పాలవుతాను? మొన్నేం చేశాడో తెలుసా? మా ఇంటికొచ్చి మా నాన్నకి ఎక్కించేశాడు. నానారకాల అబద్ధాలు. అసలది నోరా? వాడు మనిషేనా? ఉత్త పశువు. మా నాన్నకేమో వాళ్లంటే గౌరవం. రమేష్ వాళ్ల నాన్న నాకు వరసకి పెదనాన్నవుతాడు. ఆ బంధుత్వంకొద్దీ



ఆ దున్నపోతుని నెత్తికెక్కించుకొని నామీద కొచ్చాడు. చివరికి చెప్పుతీసి..." రవి కంటనీరు పెట్టాడు.

నరేంద్ర రవిని మరింత దగ్గరకు లాక్కున్నాడు ఓదార్పుగా. సారథి కూడా రవి చేతిని పట్టుకొన్నాడు.

"అంతే రవీ. పెద్దవాళ్ళు పట్టించుకోరు. వాళ్ల ఆలోచన వాళ్లదేగానీ... పోనీలే. మీ నాన్నయినా అలా చేశాడంటే తెలిసి చేశాడని కాదు. ఎప్పటినుండో వచ్చే సాంప్రదాయాలూ, బంధువులూ... చుట్టాలూ... కులగౌరవాలూ... వాళ్ల ప్రపంచం వేరు. ఇవ్వాల్టికివాళ మారాలంటే కష్టమే. మనమే అర్థంచేసుకుని వాళ్లకి నచ్చజెప్పే ప్రయత్నం చెయ్యాలి. టైం పడుతుంది. కానీ ఎప్పటికయినా మనని అర్థం చేసుకొనే రోజూ వస్తుంది. ముందుముందు ప్రపంచంలో బతికేది మనం కానీ... వాళ్లుకాదు. మనం మారితే. వాళ్లకీ తప్పదు. మారతారు" అన్నాడు నరేంద్ర.

సారథి కూడా సానునయంగా చెప్పాడు. రవి మొహం ముడుచుకున్నాడు.

"అది ఒకటే కాదులెండి. నాకూ ఎంపీసీ గ్రూప్ కష్టంగా వుంది. ఒకముక్క అర్థం కావటం లేదంటే నమ్మండి. ఈ రకంగా చదివితే ఖచ్చితంగా తప్పుతాను. అప్పుడయినా మా నాన్న బాధపడాల్సిందే. అసలు తప్పటంకంటే ఇంకో గ్రూపయినా తీసుకుని పాస్కావటం మంచిదికాదా?" అన్నాడు రవి.

"అలా అయితే సరే. రేపోసారి క్లర్కుకి చెప్పి చూద్దాం. నీకిది తెలుసా సారథీ" అడిగాడు నరేంద్ర.

సారథి ప్రశ్నార్థకంగా చూశాడు.

"రాత్రి శ్రీనివాస్ని రూంలో పెట్టి తాళం వేశాడు స్టీవెన్సన్. మొన్న ఓసారి సూర్యాన్ని కలిశాడు. హాస్టల్ సమస్య గురించి ఆ మంట. ఇక మనకి తప్పలేదు. నేనూ, భాస్కర్, సూర్యం పొద్దున వెళ్లాం. రామ్మూర్తి హడలిపోయాడనుకో."

"ఏం జరిగిందేమిటి?"

"తాళం వేసుకొని ఎక్కడికో పోయాడు స్టీవెన్సన్. శ్రీధర్ వచ్చి మనవాళ్లతో చెప్పాడు. మేం వెళ్లేసరికి వాడులేడు. రామ్మూర్తి నడిగితే మీరెవరు అడగటానికి అన్నాడు. ఎవరు కావాలి? అసలు స్టీవెన్సన్ ఎవడు? వాడు హాస్టల్లో ఎందుకుంటున్నాడు? నీకూ వాడికీ ఏంటి సంబంధం అన్నాం. అవుటర్స్ వచ్చి హాస్టల్లో జోక్యం చేసుకోగూడదట. ఆ పశువు వాగుతున్నాడు. భాస్కర్ రామ్మూర్తిని పట్టుకుంటే సూర్యం ఓ పార అందుకుని పై అంతస్థు లోకెళ్లి తలుపు పగలగొట్టాడు. తాళం గడితో సహా ఊడిపోయింది. శ్రీనివాస్ని ఆ గదిలోంచి తీసుకొచ్చాడు. పాపం అతనికి నిన్నటినుంచీ తిండీతిప్పలు లేవంట. చివరికి బాత్రూంకి కూడా పోనీయలేదంట. సూర్యం గాడితో మాట్లాడతావా అని బూతులు తిట్టి ఆ గదిలోకి నెట్టాడు స్టీవెన్సన్. శ్రీనివాస్ని విడిపించటం అంటే ఏమిటి? ఒక కోట గోడని బ్రద్దలు కొట్టినట్లే. రామ్మూర్తి పునాదులు కదిలాయి. అక్కడ స్టూడెంట్స్కి ధైర్యం వచ్చింది మనని చూసి. అందరూ వార్డెన్ గది ముందు నిలబడ్డారు. లోపల భాస్కర్ నాలుగు ఝాడించాడు. స్కాలర్షిప్లు మింగటం, డే స్కాలర్స్కీ, హాస్టలర్స్కీ వచ్చే అలవెన్స్లు రామ్మూర్తి, క్లర్కు కలిసి సగం మింగి సగం మాత్రం ఇవ్వటం అన్ని అడిగాం. స్టూడెంట్స్ కూడా ప్రశ్నల వర్షం కురిపించారు. ఇక అవుటర్స్ జోక్యం అనేందుకు వీల్లేకపోయింది వాడికి.

ఇక ఏమంటాడు? చేస్తాను. చూస్తాను అన్నాడు. ఇది పేరుకి ఎస్.ఎమ్.హాస్టలేగానీ స్టూడెంట్స్ మేనేజ్మెంట్లేదు. ఆ మెస్ సెక్రెటరీ ఒకడు స్టీవెన్సన్కి బంటు. వాడు చెప్తే గుంజీలు తీస్తాడు. ఆ కమిటీని రద్దు చేసి మళ్లీ ఎన్నికలు జరిపించమన్నాం. ఒకటని కాదులే. మొత్తం ఏటూ జడ్ రీకన్స్ట్రక్షన్ గురించి. స్టీవెన్సన్ని హాస్టల్ నుంచీ బయటకు వెళ్లగొట్టటం ముందు చెయ్యాల్సినపని. అసలు వార్డెన్ సిద్ధప్ప కదా? ఈయనని తీసుకొచ్చి ఆ పని జరిపించాలి.

అయితే మనం అడగటం తేలిగ్గానే జరిగిపోయిందిగానీ, వాటిని సాధించటం మాత్రం చాలా కష్టం. అందులో రామ్మూర్తికి ఉన్నలింకులు పెద్దవి. మన కరస్పాండెంట్ నుంచీ స్టీవెన్సన్ వరకూ వాడికి అండగా ఉన్నారు. ఒక్క స్టూడెంట్ యూనిటీ ద్వారానే దీన్ని





సాధించగలం. అదే పొద్దున ప్రారంభం అయింది. ఒక్కొక్కరూ ఎంత ఆవేశపడ్డారని. నువ్వు చూస్తే అదిరి పోయి ఉండేవాడివి. ఎన్నాళ్లి అణచివేతకు ఫలితమో అది. ఇక వాళ్ల ఆటలు సాగనియ్యకూడదు''

''అయితే పొద్దున్నే జరిగిన సంగతా ఇదంతా'' సారథి అడిగాడు.

''మరి ఉదయం ఏడుకల్లా అంతా జరిగిపోయింది'' నరేంద్ర నవ్వాడు.

రవి మళ్లీ ఆశ్చర్యంలోపడ్డాడు. వీళ్ల ప్రపంచం కూడా కొత్తగా ఉందతడికి.

పోరాటం, ఉద్యమాలూ, ఐక్యత, హక్కులూ... ఇవన్నీ కొత్తగా వింటున్నాడు. కానీ అతడికి ఒక భేదం తెలుస్తోంది. రమేష్ బృందంలో విలువలు వేరు. ఇక్కడ విలువలు వేరు.

అక్కడ కొంత కపటత్వం ఉంది. కులతత్వం ఉంది. వాళ్లలో అహంకారం ఉంది. ఇతర కులాల మీద ఏవగింపు ఉంది. హేళన వుంది. అదికాక ఒకరికొకరు సాయపడే తత్వం మాత్రం భూతద్దం పెట్టి చూసినా కనపడదు. ఏదొకరకంగా ఇంకొకరిని వాడుకోవాలి. అందు కోసం నానా రకాల ముసుగులు వేసుకుంటారు. ఆత్మవంచన పరదూషణ నిత్యకృత్యాలు. మొహం ముందు పొగిడి అటు తిరగగానే విమర్శలు గుప్పిస్తారు. వాళ్ల మనసులు తెరిచి చూస్తే ఏ ఒక్కడికీ ఇంకొకడితో పొసగదని అర్థమవుతుంది.

ఇక్కడ అవేమీలేవు. సమాజానికేదో చేయాలన్న తపన మాత్రం ఉంది. అదే అంతకంటే వ్యక్తిగతంగా లాభించే అవకాశాలు లేవు. వ్యక్తిగత ప్రయోజనాల ఊసే ఉండదు.

''సూర్యం వస్తున్నాడా వెనకాల?'' సారథి అడిగాడు నరేంద్రని. రవి కూడా చెవులు రిక్కించాడు సూర్యం ఊసురాగానే.

''లేదు... ఇవ్వాళ పొద్దున్నే వాళ్ల ఊరు నుండీ ఎవరో దిగబడ్డారు. ఈయన గొంతు మీద కూర్చుని ఇంటికి తీసుకెళ్లారు. ఓ గంట క్రితమే బస్సెక్కి వెళ్లాడు. ఏదయినా స్పీచ్ ఉందేమో'' నరేంద్ర నవ్వాడు అర్థవంతంగా.

''ఓ.. అదా? ఇంటికెళ్లాడంటే తప్పదులే'' నవ్వుతూ వంతపలికాడు సారథి.

''హాస్టల్ నుంచీ రాగానే సూర్యం అటెల్లాడు. నేనిటు వచ్చా. సరే వస్తా... మీకూ క్లాసికి టైం అవుతుందిగా. లంచ్ టైంలో కలుద్దాం. వస్తారనీ'' రవి భుజాన్ని తట్టి ముందుకి నడిచాడు నరేంద్ర.

''అదేంటోగానీ సారథీ ఇంతవరకూ సూర్యాన్ని కలుద్దామంటే కుదరలేదనుకో. నేను వచ్చినప్పుడల్లా ఆయన ఉండడు. ఆయనొస్తే నేనుండను. ఇద్దరం వస్తే కాలేజి ఉండదు'' అన్నాడు రవి.

సారథి నవ్వాడు. ఇద్దరూ వెనక్కి తిరిగారు క్లాస్ రూం వైపుకి.

కోటేశ్వర్రావు వస్తున్నాడు అటునుండీ. కొంచెం అవతలే చూశాడు ఇద్దరినీ.

''హాయ్ రవీ'' అన్నాడు.

''ఏంటి బ్రదర్ ఒక్కడివే వస్తున్నావు'' సారథి మాట కలిపాడు.

''ఎక్కడా? వెనకాల వస్తుందిగా మా గార్డియన్'' నవ్వాడతడు.

''ఎవర్హూ?'' రవి ప్రశ్న అవకముందే నోరు మూతపడింది.

సంధ్య అతని వెనకాలే ఉంది. అతడు పక్కకి జరగటంతో రవికి ఎదురుగా కనబడింది. బిడియం లేకుండా సారథిని పలకరించి రవిని చూసి నవ్వింది. రవి ఆలోచనలు ఎక్కడో ఉన్నాయి.

ఆమెనవ్వు ఆ నవ్వు నెక్కడో చూసినట్లుగా చాలా సుపరిచితంగా ఉంది. ప్రపంచాన్ని ధిక్కరించి తనకోసమే వెలిగిన నవ్వు. తన కోసమే విరిగిన నవ్వు. కేరింతలు కొట్టే పసిపిల్లాడిని హత్తుకునే ముచ్చటైన లాస్యం ఆ నవ్వు. తన బిడ్డని వడిలోకి లాక్కుని ముద్దు చేష్టల్ని చూసి మురిసిపోయే నవ్వు. ఒక కన్నతల్లి నవ్వు.

అతడికి లీలగా స్ఫురించింది.

తనను బాల్యంలో లాలించి ఆడించిన ఒక స్త్రీ నవ్వది. ఎక్కడో దూర ప్రదేశం నుండి బ్రతుకు వేటలో తన ఇంటికి చేరి అమ్మ బాధ్యతలు తను తీసుకుని ఇంటిల్లి పాదికీ చాకిరీ చేసి ఏదో తెలీని జబ్బుతో అవిరైపోయి

మాయమయిన స్త్రీ. ఆమె తనకు అత్తయ్యే అవుతుందట. వయసు వచ్చాక వివరాలు విన్నాడు. కట్నం కోరలకి బలయ్యి చావుత ప్పించుకుని తన ఇంటికి వచ్చిందట. రవిని పంచప్రాణాలుగా చూసుకునేదని అందరూ గుర్తు చేసుకున్నారు. వాళ్లు చెప్తే తప్ప ఆమె గురించి ఒక్కటీ తెలీదు రవికి. ఒక్కటీ గుర్తులేదు. కానీ అంతరాంతరాల్లో ఆమె రూపం అస్పష్టంగా ప్రత్యక్షమవుతూనే ఉంటుంది. ఆమె తనను చూసి నవ్వుతూనే ఉంటుంది. ఆలాస్యం కలలో కూడా మర్చిపోలేనిది.

సంధ్య పెదవులమీద మళ్లీ అదే నవ్వు అదే లాలింపు అదే ఓదార్పు.

"ఈమధ్య రావటం లేదే" అడిగాడు సారథి. ఇవాళే వచ్చావేం అన్న అర్థంతో.

"ఎక్కడా... ఈమె ఊరుకుంటుందా? ఇవ్వాళ పట్టుబట్టి లాక్కొచ్చింది. అందుకే గార్డియన్ అంటున్నాను. ఇక ఇంతకుముందు సంగతా?" అడిగాడు కోటేశ్వర్రావు.

"వచ్చి ఏం చేయాలి. ఇదొక కాలేజీ మనం చదువుకోటానికే వచ్చాం అని మీరు నమ్ముతుంటే నాకూ రావటానికేం అభ్యంతరంలేదు. అయినా ఆలోచనలో మాకంటే పెద్దలు మీకు చెప్పగలవాణ్ణికాదు. రవికైతే అర్థమయ్యే ఉంటుంది. సంధ్య చెప్పింది తన గురించి. క్లాసులో ఏదో అయిందటగా. రవి ఇక్కడ ఉండి అనుభవిస్తున్నాడు. నేను ఇంటి దగ్గర కూర్చుని అనుభవిస్తున్నా. తేడా అదే. మనందరం అదే జాతి. అదే సమస్య బాధితులం. ఒకే ఆలోచన గలవాళ్లం"

సంధ్య గొంతు విప్పింది అన్న పరిస్థితి గురించి చెప్పాలని.

"చూడండి... ఈయన ఇంటి దగ్గర కూర్చొని తపస్సు చేస్తున్నాడు. మన సమస్యల్ని ఎలా సాల్వ్ చేయాలా అని ఆలోచిస్తున్నాడట. తిండీ తిప్పలూ మానేశాడు. ఇంక కొన్నాళ్లుంటే ఏమవుతాడో అని రవి గురించి చెప్పి తీసుకొచ్చా. మామూలుగా అయితే వచ్చేవాడుకాదు. కానీ మొన్న రమేష్ వాళ్లని మీరు ఎదిరించటం, ఆ కోపం రవి మీద చూపించటం వినేసరికి ఇవాళ పరిగెత్తుకొచ్చాడు. ఏం రవీ? మీరు కూడా రావటంలేదు. బాధపడుతున్నారా? జరిగినదానికి" అడిగింది సంధ్య అనునయిస్తూ.

రవి గుండె చలించింది. తన గురించి ఒక ఆడపిల్ల ఆలోచించటం, తన బాధ గురించి ఆవేదన చెందటం, ఆమె ప్రశ్నలోనే కొండంత ఓదార్పు. అనంకల్పితంగా గుండెలోని తడి కంటికి ఎగబాకింది. వద్దు వద్దనుకుంటూనే ఉన్నాడు. కానీ అశక్తుడయ్యాడు.

"కాదు సారథీ... అప్పుడు నేనూ రవీ ఓటు వేయటానికి వచ్చాం. కానీ నాకయితే ఈ స్థితి చూసి షాక్ తగిలింది. బయట గూండాల తండాలు వందలమంది మొహరించి కూర్చున్నారు. నిజంగా నేను జీవితంలో ఎరుగని బాధ గుండెల్ని నొక్కిపారేసింది. డిప్రెషన్ అంటారు చూడు అదేనేమో. సైకలాజికల్ హెల్ప్‌లెస్‌నెస్. నేను అశక్తుడినయిపోయాను. ఒంటరిగా ఏంచేయాలి? కొండను ఢీకొనే పొటేలులాగా ఆలోచనలతో ఛిద్రమయ్యాను. ఏంపరిస్థితులివి? నా బాధ ఎక్కడ మొదలయిందంటే... నా గురించి గొప్పగా చెప్పటంకాదుగానీ నా ర్యాంకింగ్ పడిపోవటంతో. నేను నాకు తెలిసి బాగా చదివేవాళ్లలో ఒకడిని. ఎప్పుడయితే ఇక్కడ సీటు దొరికిందో అప్పుడే చదువు అటకెక్కింది. మీకూ, నాకూ తేడా ఉంది. మీరు అందరి సమస్యల్ని చూసి పోరాటం మొదలుపెట్టారు. నేను నా ఒక్కడితోనే ఉండిపోయాను. ఈ పరిస్థితి లేకపోతే నేను మీతో కలిసేవాణ్ణికాదు. కానీ ఎక్కడెక్కడి వాళ్లనీ సమస్యలే ఏకంచేస్తున్నాయి. అందరం ఒక తాటి మీదకు రాకతప్పటంలేదు. అదేనేమోకదూ యూనిటీ అంటే" నిజాయతీ ధ్వనించింది కోటేశ్వర్రావులో.

అక్కడిగాలిలో ఆ నిజాయితీ వ్యాపించి అందరి గుండెల్ని వాటిలో రహస్యాల్ని బయటకు తెచ్చింది. ఒకరి బాధ ఇంకొకరికి చెప్పుకున్నారు. ఒకరి హృదయం ఇంకొకరిముందు విప్పారు.

ఇంతలో రమణా, రంగారావూ వచ్చి వీళ్లతో కలిశారు.

స్నేహపూర్వకమయిన లాస్యం అక్కడ నాట్యం చేసింది.





సారథి అటుగా వెళ్తున్న గోపీచంద్‌నీ, దుగ్గి రెడ్డినీ పిలిచాడు. వాళ్లూ గుంపులో కలిశారు.

"మనకి పైకి కనబడటం లేదుగానీ నూటికి తొంభైమంది ఈ సమస్యతోనే ఉన్నారు. దారి తెలీకా, ఒక్కళ్లే అయిపోయీ ఎవరిదారిన వాళ్లు ఎవరి గొడవలో వాళ్లుండిపోతున్నారు. అందరికీ అసంతృప్తి ఉంది. అందరికీ ఆవేదన ఉంది. అది రకరకాలుగా బయటకు వస్తోంది. ఒక సూక్తి ఉంది. సమస్య ఎప్పుడొస్తుందంటే దానికి తగిన పరిష్కారం ఉండేటప్పుడే వస్తుందట. అంటే పరిష్కరించగలిగే పరిస్థితుల్ని సృష్టిస్తుంది ఆ సమస్య. లేకపోతే ఇవ్వాళ ఇంతమందిమి ఎలా ఒక్కటిగా ఆలోచిస్తున్నాం" అన్నాడు సారథి.

రమణ కూడా బలపరిచాడు ఈ మాటల్ని.

సారథి కాలేజి పరిస్థితుల గురించి వివరించాడు కొంతసేపు. తమకు ఇంగ్లీష్ లెక్చరర్ని నియమించాలనీ డిగ్రీస్థాయిలో డొనేషన్స్ రద్దు చేయాలనీ, కంప్యూటర్ క్లాసులపేరిట జరుగుతున్న దోపిడీని అరికట్టాలనీ, వారిచ్చిన సొమ్ము తిరిగి చెల్లించాలనీ, లేడిస్‌కి వెయిటింగ్ రూం కావాలనీ, ఆడపిల్లలపై రోజుకోజుకీ పెరుగుతున్న టీజింగ్‌ని అరికట్టాలనీ, క్యాంటీన్ పరిస్థితుల్ని మెరుగు వరచాలనీ ఇంకా రకరకాల సమస్యలపై ఈ రకంగా అందరూ సూచనలిచ్చారు. ఇవి కాక హాస్టల్ సమస్యలు ఎటూ ఉండనే ఉన్నాయి.

ఇక్కడి సందడికి క్లాసులో కూర్చున్న అమ్మాయిలు కూడా వచ్చేశారు.

తర్వాత సంగతెలా ఉన్నా ముందు అందరికీ ఏదో సాధించాలన్న తపన కలిగింది. ఒక సజీవమైన ప్రవాహంలాంటి ఉత్సాహం ఉరకలువేసింది. జీవశక్తి పొంగులువారింది.

ఈ ఐకమత్యాన్ని చెదరనీయకూడదనీ అందరూ ఒకే తాటిపై నిలవాలనీ మిగతా విద్యార్థినీ విద్యార్థుల్ని కలుపుకు రావాలనీ కులతత్వానికి వ్యతిరేకంగా పోరాడాలనీ అనుకున్నారు.

అందులో అన్ని కులాల వాళ్లు ఉన్నారు. అన్ని వర్ణాల వాళ్లూ ఉన్నారు.

తమకు "సారథి నాయకత్వం వహించాలనీ రమణ ప్రతిపాదించాడు.

అందరూ ఏకగ్రీవంగా ఆమోదించారు.

అతడి అభ్యంతరాన్ని లక్ష్యపెట్టకుండా కేకలు వేశారు, నినదించారు.

"మనకు సారథి సారథే" నవ్వుల మధ్య అనుకున్నారు.

రవి నమ్మలేక పోతున్నాడు. ఇంతమంది తమ వెనుక ఇంతమంది తనతో ఇంత మందిలో తను. అందరికోసం ఒక్కరూ ఒక్కడి కోసం అందరులాంటి చైతన్యం. ఇందులో అనేకానేక లోపాలు కలవాళ్లున్నారు. తప్పులు చేసే వాళ్లున్నారు. కానీ ఒకరికొకరు తోడుగా ఉంటున్నారు. ఒకరికొకరు నీడ అవుతారంటు న్నారు. ఒకరి సమస్యలో ఒకరు పాలు పంచు కుందామనుకుంటున్నారు. ఒకరినొకరు ఓదా ర్చుకుంటున్నారు. సమూహానికీ వ్యక్తికీ భేదం లేదంటున్నారు. అందరిదీ ఒకే మాట ఒకే బాట అంటున్నారు. సమూహంలో ఏకాకి ఇక ముందు అర్థంలేని పదం అవుతుంది.

ఇక తను ఒంటరికాదు. ఇక తను అశక్తుడు కాడు. అందరూ తనకి తోడు ఏమివ్వగలడు వీళ్లకి. ఏం చెల్లించగలడు. తన దగ్గర అమూ ల్యమైనది తన ప్రాణమే. దాన్నే తృణప్రా యంగా ఇవ్వగలడు.

"క్లాసుకి టైం అయి పోవుగంట దాటింది. వెళ్దామా ఒద్దా" దుగ్గిరెడ్డి అడిగాడు.

అందరూ ఉత్సాహంలోంచి తేరుకున్నారు. ఇక నుంచీ కృషి చేయాలనుకున్నారు. క్లాసువై పుగా నడిచారు.

రవి జీవితంలో ఆత్మవిశ్వాసం తొణికిసలా డిన క్షణాలు ఇవే.

అదే క్షణాన డిగ్రీ సెకండియర్‌లోకి కొందరు ప్రవేశించారు.

శ్రీనివాస్ మెడ పట్టి తోసుకుంటూ ఒక రూంలోకి వెళ్లారు. క్లాస్ జరుగుతోంది. వచ్చిన వ్యక్తుల్ని చూసి అందరూ బిగుసుకుపోయారు.

క్లాసరూంలోకి మొదటిసారిగా కర్రలూ, రాడ్లూ తెచ్చారు. స్టీవెన్సన్ అనుచరులు వాళ్లు. వచ్చీరాగానే తలుపులు దగ్గరకువేసి లోపల గడియపెట్టారు. మొత్తం ఆరుగురు ఉన్నారు. వాళ్లముందు శ్రీనివాస్ వేలాడిపోతూ అతి కష్టం మీద నుంచునే ప్రయత్నం చేస్తున్నాడు.

శ్రీనివాస్ నడుం మీద కర్రపెట్టి బాదాడు ఒకవ్యక్తి. గాలిలో జూయ్ మన్న శబ్దం వచ్చింది. భయంగొల్పే కేక పెట్టాడతను. క్రింద పడిపోయాడు.

శ్రీనివాస్‌ని కాలర్‌పట్టి లేపుతూ ప్రశ్నించా డు ఇంకొకడు క్లాస్‌ని ఉద్దేశించి.

"ఎవర్రా సూర్యం అంటే. ఈ డయాస్ దగ్గరకొచ్చి నుంచోవాలి. పదిలెక్కపెట్టేలోపు ఇక్కడ ఉండాలి"

పిన్‌డ్రాప్ సైలెన్స్. ఊపిరిబిగబట్టి కూర్చు న్నారు స్టూడెంట్స్. లెక్చరర్ పై ప్రాణాలు పైనే పోయాయా అన్నట్టు కళ్లు తేలేసి చూస్తున్నా డు.

ఒకడు అంకెలు లెక్కబెట్టటం ప్రా రంభించాడు. అతడి చెవిలో బనవకోటి ఏదో చెప్పాడు. అతడు అంకెలు ఆపేసి మళ్లీ ఇంకో ప్రకటన చేశాడు.

"నరేంద్ర ఎవడు. వాడు రావాలి. సూ ర్యంగాడెవడోగానీ బతికిపోయాడు. ఇవాళ ఎక్కడో దాక్కున్నాడు పిరికి లం... కొడుకు... దమ్ములేని నాయాలు... హాస్టల్‌కొచ్చి ఫోజులు కొట్టటం దేనికి ఊ‌ం... నరేంద్ర ఎవడు?"

అతడి మాట పూర్తి కాకముందే నరేంద్ర లేచాడు. ఎటూ వీళ్లు ఊరుకోరు. తాను పోయే ముందు ప్రతిఘటించే పోవాలనుకున్నాడు. ముందుకి దూసుకుపోయి ఒకడిచేతిలో ఇనుప చువ్వని లాక్కొబొయ్యాడు. వాడు వదలలేదు. పెనుగులాట జరిగింది.

ఇంతలో వెనుకనుంచి ఒకడు నరేంద్రతల మీద కొట్టాడు ఇనుపరాడ్‌తో. తల ఎముక చిట్లిన చప్పుడు రూంలో ప్రతిధ్వనించింది. అతడు తల పట్టుకొని పడిపోయాడు. మొదటి దెబ్బతోనే స్పృహతప్పటం అదృష్టం. అతడికి స్పృహతప్పింది.

కిందపడిన శరీరాన్ని కదిలించి చూశారు వాళ్లు..

"ఊ‌ం... ఇంకెవడన్నా ఉన్నాడా సూర్యంగా డి... హాస్టల్ సమస్యలంటూ వచ్చేవాడెవడైనా ఇక్కడకొచ్చి అడగొచ్చు. దమ్ముంటే రండి. ఓ తల్లికి పుట్టిన వాళ్లయితే"

ఓ కులం పేరు చెప్పి పరమ అది మాన





వుల భాష గుప్పించారు. అది సూర్యం కులం, అని వాళ్ల ఉద్దేశ్యం. ఆ కులస్థులందర్నీ బూతులు తిట్టారు. ఈ క్లాసులో ఎవరయినా సరదాపడే వాళ్లుంటే రమ్మన్నారు.

హాస్టల్ గురించి ఎవడయినా మళ్లీ నోరెత్తితే ప్రాణం తీస్తామన్నారు. తాము చేసేవనుల్ని ధైర్యంగా చెప్పారు. హాస్టల్ అవకతవకలు చెప్పారు. చేతనైతే వచ్చి ఆపమని సవాలు చేశారు. వచ్చినవాడికి నరేంద్రగతే పడుతుందన్నారు.

పావుగంట తర్వాత బయటకు నడిచారు.

ఇంకోరూంలోకి ప్రవేశించారు. మళ్లీ అదే తంతు. మళ్లీ దౌర్జన్యం. నలుగురికి దెబ్బలు తగిలాయి. అందులో వేణూ, సుమన్, ప్రభాత్, కృష్ణారెడ్డి ఉన్నారు. అందరూ సూర్యం మిత్రులు శ్రీనివాస్‌ని హింసిస్తూ రూం రూంకీ తిప్పారు.. కులం పేరుతో బూతులు తిట్టారు.

తెలిసో తెలియకో కులం పేరు ఎత్తటం ద్వారా కొలిమి రాజేసి పోయారు. కారణం అరుణ్ కులమూ అదే కావటం. వాళ్ల తిట్లు అరుణ్ కులాన్ని అవమానిస్తూ ఉండటం.

★ ★ ★

ఆ హాలు పురాతన కళావైభవంతో విలసిల్లుతోంది. పరుపులూ, దిళ్లూ, బాలీసులూ టేకు కుర్చీల మీదా, సోఫాలమీద పరిచి ఉన్నాయి. తివాచీ మెత్తగా తగులుతూ ఉంది. ఆ హాలులో కూర్చున్న నలుగురు పెద్ద మనుషుల కళ్లకి దానిమీద పర్షియన్ కళాకారుల నైపుణ్యం, కళ్లకు కట్టే వనితనం కనబడుతోంది.

హాలు మధ్యని సూర్యం నిలబడి ఉన్నాడు. నాలుగు జతల కళ్లు అతడిని గుచ్చిగుచ్చి చూస్తున్నాయి.

అక్కడ చాలాసేపటినుండి మౌనం రాజ్యమేలుతోంది. లోపల ఎవరో ఏడుస్తున్నట్లు సన్నగా వినపడుతోంది.

ఆ హాలు బయట విశాలమయిన వరండా కింద మెట్ల దగ్గర ఇద్దరు పాలేర్లు చేతులు కట్టుకొని లోపల ఏంజరుగుతోందా అని తర్జన భర్జన పడుతున్నారు. సూర్యంబాబుకి ఈసారి గట్టి హెచ్చరిక తప్పదనుకొంటున్నారు వాళ్లు.

వరండా కిటికీల పక్కన చేరిన ఆడంగులు బుగ్గలు నొక్కు కుంటున్నారు. ప్రవీణమ్మని చేసుకోడంట సూర్యంబాబు. ఏంమాయరోగం. ఆ అమ్మకి ఏంతక్కువయిందటా. చిచిమి దీపం పెట్టుకోవచ్చు. అని గుసగుసలాడుతున్నారు- మెటికలు విరుస్తున్నారు.

లోపల మాటలు మొదలవటంతో అందరూ చెవులు రిక్కించారు.

"అయితే ప్రవీణమ్మని చేసుకోవుట్రా సూర్యం" అన్నాడు తూగుటుయ్యాల మీద కూర్చున్న తండ్రి.

"ముందు ఆ పిల్లని చదువుకోనివ్వండి. పెద్దయ్యాక ఇష్టమొచ్చినవాడిని చేసుకుంటుంది. అసలా పిల్ల వయసు సంగతి ఆలోచించరేం. నిండా పదిహేనులేవు"

"ఆపరా అప్రాచ్యుడా. నీకోసం కాదూ కళ్లల్లో వత్తులేసుకొని బావా బావా అని పడిగాపులు పడుతోందది. మనిషివి కాదట్రా నువ్వు" హుంకరించాడు తండ్రి.

"పోనీ బావా... దాన్ని చేసుకోకపోతే చేసుకోకపోయాడు. అసలూ వీడి జాతకంలో పెళ్లి ప్రసక్తి ఉందా లేదా అదడుగు" ప్రవీణ తండ్రి కలుగజేసుకొన్నాడు.

"జీవితంలో వివాహం తప్ప ఇంకేం లేనట్టు మాట్లాడతారేం" చిరాకుగా అన్నాడు సూర్యం.

"నోరుముయ్యరా వెధవా. మాకు చెప్పొచ్చావ్. వేలెడంతలేవు.నువ్వేమయినా మారతావని ఇంతకాలం ఊరుకొన్నా. ఇక నావల్లకాదు. ఇక వీడు మారడు బావా" అన్నాడు సూర్యం తండ్రి.

"మారాల్సింది నేను కాదు. మీరు ఇంకా మీ సాంప్రదాయాల్ని మీరే వదలకపోతే... మారుతున్న కాలానికి ...ఇంతకు ఇంతా అనుభవిస్తారు"

"అప్రాచ్యుపు వెధవా ఏమిట్రా నువ్వనుభవిస్తున్నది. అలగా జనాన్నేసుకుని తన్నులు తింటూ తలలు పగలకొట్టించుకుంటూ తిండీ తిప్పలు లేక దిక్కుమాలినవాడిలాగా తిరుగుతున్నావు. నువ్వట్రా మాకు చెప్పేది, ఇదిగో చెప్తున్నాను విను. నువ్వు చదివి ఉద్ధరించాల్సిందేమీలేదు. నువ్వేదో వెలగబెడతావని చే

ర్మించాం. బుద్ధొచ్చింది. ఇహ ఇల్లు కదల కుండా ఇక్కడే పడిఉండు. మన పొలాలూ, కమతాలూ చూసుకుంటూ ఇక్కడే బతుకు. ప్రవీణని చేసుకుంటావో లేదో తర్వాత సంగతి, ఈ గడపదాటి పోయావంటే ఇక ఈ ఇంటితో సంబంధం తెంచుకోనేపోవాలి''

''బావా'' ఆందోళనగా వారించబోయాడు ప్రవీణ తండ్రి.

''ఆగరా నువ్వు. ఇది కోపంతో కాదు నేన నటం. వీడికి సంవత్సరంనించీ చెప్తున్నా. ఎంతకాలం ఊరుకోను. నామాటంటే లెక్కా జామూ లేదు. తండ్రిమాట విననివాడు కొడుక వుతాడా? మన చిన్నబ్బాయ్ లేడూ. వాడికొ డుకు తిరుపతిరావుని చెడగొట్టింది వీడుకా దూ? ఆ చిన్నబ్బాయ్ నానా తిట్లూ తిట్టి చెయ్యిచేసుకున్నాడంటే చూడు. ఊరికే చెయ్యి చేసుకుంటాడా? వీడెన్ని తప్పుడు పనులు చెయ్యకపోతే ఇదొకటేనా టౌనులో ఎన్నెన్ని చే స్తున్నాడో మనకేం తెలుసూ. మన రక్తం లేదు వీడిలో, అలగాజనంతో...''

''నాన్నా... మీకర్థంకాని విషయాల గురించి అనవసరంగా మాట్లాడొద్దు. అయినా ఇది మొ దటిసారా? నేను చెప్పటం మీరు వినటం. మళ్లీ చెప్తున్నాను. నేనేమీ తప్పుడుపనులు చె య్యటం లేదు. నలుగురికీ మంచి జరగాలనే నేనేం చేసినా. కానీ అవే మీకు తప్పుల య్యాయి. ఒకప్పుడు మనవాడొకడు పీకలదా కా తాగి ఊళ్లో అమ్మాయిమీద అత్యాచారం చేస్తే మీరేం చేశారు. మీసం మెలేశారు. మగ తనం నిరూపించాడన్నారు. బహుశా నేనూ ఆ పనిచేసినా మీకు ఆనందమే కానీ నలుగురి కోసం మంచి చేస్తే మాత్రం తప్పు. మీకూ నాకూ పొసగదు. మీ విలువలు వేరు నావివేరు. ఇక నా చదువు సంగతి. చదువుమానేసి ఇక్కడే ఉండమన్నారు. అది జరగని పని''

''అయితే ఈ గడప తొక్కకూడదని నిశ్చ యించు కొన్నావన్నమాట''

''అని నేను అనటం లేదు. మీరే అంటున్నా రు. మళ్లీ ఇంటికి రావద్దని''

''ఏదయితే ఏంటిలే''

''కాదు... మీకు సరిగ్గా అర్థంకాలేదేమో చెప్తు న్నావినండి. నేను ఎంచుకున్న మార్గంలో నన్ను పోనీయండి. మంచో చెడో నాకెదురయిన అను భవాన్ని బట్టి నేనే నిర్ణయించుకుంటాను. మీదే కరెక్టనుకోండి, నేను ఎదురు దెబ్బతిని మీ మార్గంలోకి వస్తాను. లేదు నాదే కరెక్టయితే నేను గెలుస్తాను. కొడుకు గెలిస్తే సంతోషం ఉండదా మీకు. ఏది జరిగినా మంచికే అని ఓ సామెత. అలాక్కాదు నువ్వు ఆ మార్గంలోకి వెళ్ళొద్దు అంటే మాత్రం ఇక మీ ఇష్టం. మీ ఇష్టమైనది చేసుకోండి. నువ్వు నా కొడుకివే కాదు పోరా అంటే పోతాను. మీకు లేకపోయాక ఇంకా నాకెందుకు ఉండాలి అభిమానాలు. పోనీలే మాకిష్టంలేకపోయినా నువ్వు చేసేది చేసుకో. నువ్వే తెలుసుకుంటావని వదిలేస్తే మరీ మంచిది. మీ మీదే ఆధారపడిఉంది నేను ఇంటికి వచ్చేదీ లేనిదీ, ఇంటిగడప తొక్కేదీ లేనిదీ''

''చూశావా చూశావురా బావా. వీడి పొగరు. నామీద దయదల్చి వస్తాడట ఇంటికి. లేకపోతే పోతాడట. వీడికే ఇంత పొగరుంటే నాకెంత ఉండాలి. ముసలాడు. ఏమీ చెయ్యలేడను కుంటున్నాడేమో. ఇక వాడిమొహం చూడద ల్చుకోలేదు. పొమ్మను ఇక్కడనుంచి. కాదు ఈ ఇంటి నుంచే బయటికి పొమ్మను. ఏదో ఒక రోజు తెలుసుకొని ఏడుపు మొహంతో వస్తాడు. అప్పుడే రానిస్తాను. అప్పటిదాకా ఆ ముష్టిబతు కే బతకనీ. వాడికంత ఇష్టంగా ఉంటే, నేను మాత్రం పైసా ఇవ్వను. నామాట వినకపోతే నేనెందుకిస్తాను- అడుక్కుతిని బతకమను''

''మీ ఇష్టం'' ముక్తసరిగా అన్నాడు సూర్యం.

ప్రవీణ తండ్రీ ఇంకో ఇద్దరు పెద్దమనుషు లూ అవాక్కయి పోయిఉన్నారు. వ్యవహారం ఇంతదూరం వస్తుందని ఊహించలేదు వాళ్లు. సూర్యాన్నీ తండ్రినీ వారించే ప్రయ త్నం చేశారు. రక్తసంబంధం తెంచుకొనేది కాదన్నారు. ఎప్పటికయినా తండ్రికొడుకులు ఒక్కటేనన్నారు.

ససేమిరా వీల్లేదన్నాడు సూర్యం తండ్రి.

''ఇంకా ఇక్కడే ఉన్నాడేం. నాముందు నుంచీ పొమ్మన్నాగా'' అరిచాడాయన.

సూర్యం ద్వారంవైపుకి అడుగులు వేశాడు. అవి మధ్యలోనే ఆగిపోయాయి. లోపల నుంచీ





ఒక్కపెట్టున ఏడుపు మొదలయింది. హృద యవిదారకంగా రోదిస్తోంది తల్లి. భర్తనీ కొడు కునీ కలవలేక నిస్సహాయతతో కుములు తోందామె.

అటు నడవబోయాడు సూర్యం తల్లికోసం.

"అటెక్కడికీ ఇటు... గుమ్మం ఇటుంది. తల్లిప్రేమ గుర్తొచ్చిందేం? అన్నీ కాదనుకు న్నాక తండ్రీలేదు తల్లీలేదు. బయటికి దయ చెయ్యి. నా ఇంట్లోకి నా అనుమతి లేకుండా వెళ్తావు- ఎవడ్రా నువ్వు"

సూర్యం వెనుదిరిగాడు. అతడి మొహంలో ఏముందో ఎవరికీ అర్థంకాలేదు. రాగద్వేషాలకి అతీతమైన స్థితిలో ఉన్నాడతడు. తండ్రి మీద కోపం రావటంలేదు. అలాని దుఃఖమూ లేదు. ఆస్థితిలోనే గుమ్మందాకా నడిచాడు.

"ఆగు" తండ్రి గొంతు వినిపించింది వెనక నుండి.

"ఆ వాచీ ఇక్కడ పెట్టి వెళ్ళు. అది నా సొమ్ముతో కొన్నదేగా. ఇంకా నీ చేతికెందుకు?"

సూర్యం చేతికున్న వాచీ, జేబులో పర్సు, బ్యాంక్ పాస్ బుక్కూ తీసి పక్కనే బల్లమీద ఉంచాడు. ఇంకేమయినా ఉన్నాయా అని చూసుకున్నాడు. ఎప్పుడో తాత బ్రతికి ఉన్న ప్పుడు పుట్టినరోజుకి ఇచ్చిన ఉంగరం, లాకెట్ జేబులోంచి తీసి వాచీ పక్కనే ఉంచాడు. వంటిమీద ఇంకేం లేవని నిర్ధారించుకొని బయటకు నడిచాడు కట్టుబట్టలతో.

మౌనంగా... రాగద్వేషాలకు అతీతంగా.

చూస్తూ కూర్చున్న పెద్దమనుషులు నిశ్చేష్టు లయ్యారు.



"హేయ్... సరితగారూ" అరిచాడు ప్రభు గారూని నొక్కివలుకుతూ.

దాదాపు రెండు నెలల తర్వాత మిత్ర బృందాన్ని చూస్తోంది సరిత. ప్రభూ, షఫీ, భానూ, సుజాతా, వేణూ ఇంకా పాతా కొత్తా అనేకమంది. ఆప్యాయంగా పలకరించింది.

ప్రకాష్ గురించి వివరాలు అడిగారు.

"ప్రస్తుతం ఒక ట్యుటోరియల్ కాలేజీని నడుపుతున్నారు. పార్టనర్ షిప్ సంపాదనలో ఇంకా పడలేదు. నాన్నగారు కొంత సాయం చేశారు. ప్రస్తుతానికి అంత సమస్యలేం లేవు. గడిచిపోతోంది. ఓసారి మీరంతా రావాలి. ఆయన కూడా సంతోషిస్తారు" క్లుప్తంగా వివ రించింది.

ఇంతలో రామకృష్ణ మనోహర్ వచ్చి పలక రించాడు.

అతడిని చూస్తూనే రమా గుర్తొచ్చింది. రవ ళిని ఏడిపిస్తూ ఉండేవాడు ఇంతకుముందు.

"అవునూ అనిల్... రవళి కనపడరేం? ప్రాక్టి కల్సగానీ ఉన్నాయా. ఈ జియాలజీ స్టూ డెంట్సు రాళ్లూ రప్పలూ వెతుక్కుంటూ టూర్ లకి వెళ్తుంటారు కదా ప్రాక్టికల్స్‌కని"

"ప్రస్తుతం వాళ్లిద్దరూ బిజీ. ఆఫ్‌కోర్స్ మీర న్నట్టు ప్రాక్టికల్స్‌కే వెళ్లినట్టున్నారు" అన్నాడు మనోహర్ నర్మగర్భంగా.

"ఏ ఏరియాకి వెళ్లారు? ఎప్పుడువస్తారు?" అర్థంకాక అడిగింది సరిత.

భానూ మోచేతితో పొడిచింది ఈ ప్రసక్తి ఇంతటితో ఆపమన్నట్లుగా. అప్పటికే సుజాత మొహం మ్లానమయింది. తల వంచుకొని దుఃఖం రాకుండా పైపెదవిని పంటితో నొక్కిప ట్టింది. చేతులు వణకకుండా పుస్తకాలని గట్టిగా పట్టుకొంది.

భానూ కళ్లతో అందించిన సూచన అర్థమ యింది సరితకి సుజాతను చూడగానే.

"మరి సూర్యం?"

"ఈ మధ్యన కాలేజికి అంతగా రావటం లేదు. పరిస్థితి ఇది వరకులా లేదు. బయట ముగ్గురో, నలుగురో పోలీసులు ఉన్నారు చూడ లేదా?" అడిగాడు ప్రభు.

అతడిలో సూర్యంపట్ల ఉండే ఇదివరకటి

తేలికభావం ఇప్పుడు తగ్గటం గమనించింది సరిత.

"చూశాగానీ ఏమిటీ? ఏం జరిగింది" ఆందోళన ధ్వనించింది ఆమె గొంతులో.

"బహుశా మీరు కాలేజీ వదిలివెళ్లిన రోజు అనుకుంటా ఒక ప్రసక్తి వచ్చింది. టీ.జె.కాలేజి హాస్టల్ సంగతి. ఆ ఇష్యూలో సూర్యం మీద రాత్రిపూట దాడిచేసి పారిపోయారు. అదైనా అతడి రూం దగ్గర జరిగింది. ఆ సంగతి ప్రభు చెప్తుండగా మీరు అడిగారు. ఆ దాడి జరిపించిన వార్డెన్‌తో రాజీవడ్డాడేమిటి సూర్యం? అని. గుర్తుందా?" అడిగాడు వేణూ.

"వేణూ... సూర్యం గురించి నేను మర్చిపోవటమా" అనుకొని గుర్తున్నట్టు తల ఊపింది సరిత.

"అప్పుడు సూర్యం ఏకాకి. ఒక్కడే అయిపోయాడు. అందుకని రాజీకి వెళ్లాల్సి వచ్చింది. కానీ ఇప్పుడు ప్రభు అన్నట్లు పరిస్థితి మారింది. ఇప్పుడు సూర్యం వెనక అనేకమంది ఉన్నారు. అతడికోసం ప్రాణాలు కూడా ఇవ్వగల వాళ్లు ఉన్నారు. అతడికోసం చావుకైనా వెరవని వాళ్లున్నారు. అతడు అంటే వ్యక్తి అనికాదు. ఆ వ్యక్తి దేనికోసం నిలబడ్డాడో ఆ ఆదర్శాల కోసం ఆశయాలకోసం అలాగే అటు వైపున కూడా పరిస్థితి మారింది. ఇదివరకు తల పగలగొట్టి పారిపోయారు. ఇప్పుడు ఇంకా ముందుకుపోయారు. అతడి ప్రాణాలకే ప్రమాదం ఏర్పడింది. కనబడితే చాలు ఏం జరుగుతుందో చెప్పలేం. సూర్యం కోసం ఎవరెవరో వచ్చి చూస్తున్నారు, వెతుకుతున్నారు.

ఉదాహరణగా చెప్పాలంటే మన ఎస్సెమ్ హాస్టల్‌లో సమస్యలు గురించి ఈయనని కలిసినందుకే ఆ స్టూడెంట్స్‌ని చిత్రహింసల పాలు చేశారు. ఈసారి కూడా దాడి చేశారు. ఆయన కోసం. ఎక్కడో తెలుసా... మన కాలేజి లోనే, క్లాసులు జరుగుతుండగానే. లెక్చరర్స్ ముందే. పట్టపగలే చేతనైతే వచ్చి అక్కడ ఎదిరించమని ఛాలెంజ్ చేశారు. మన నరేంద్ర తల మీద ఐరన్‌రాడ్‌తో కొట్టారు. క్లాసురూంలో తలుపులు బిడాయించి అందరి ముందే. అతడికి ఏడు కుట్లుపడ్డాయి. ఇక తర్వాత మా అందరికీ తప్పలేదు. నా చెయ్యి ఫ్రాక్చర్, సుమన్ మొహం పగిలింది. ప్రభాత్‌కి ఒక కాలు మీద. అడ్డం రాబోయిన వాళ్లని గొడ్డుని బాదినట్లు బాదారు. ఊహించని దాడి కావటంతో వాళ్లదే పై చెయ్యి అయింది"

అప్పుడు సరిత చూసిందతడి చేతిని. కట్టు తీసేసినా ఇంకా వాపు తగ్గలేదు. కుడి చెయ్యికీ ఎడమ చెయ్యికీ తేడా తెలుస్తూంది. మోచెయ్యి క్రింద మచ్చలు కనపడుతున్నాయి.

తన చేత్తో వేణూ చేతిని స్పృశించింది. చిన్నగా నొక్కి వదిలేసింది.

ఈసారి వేణూ సరిగ్గానే అర్థం చేసుకున్నాడు. ఆ స్పర్శలోని స్నేహాన్ని అతడి మొహం వికసించింది. తనకు తెలిసిందంతా చెప్పాలన్న ఉత్సాహం కలిగింది.

"అందుకే ఇప్పుడు రావటంలేదు సూర్యం. వేరే ఏవగేవన్స్‌లో ఉన్నాడు. టౌనులో ఇంకా అనేక సమస్యలు ఉన్నాయి. వాటి పనిలో ఉన్నాడు. ఇక్కడ వ్యవహారాలు నరేంద్ర, ప్రభాత్‌లు చూస్తున్నారు. ఇక ఇంకో సమస్యేమిటంటే సుమన్ బాగా హర్టయ్యాడు. అతడి బ్యాక్‌గ్రౌండ్ అలాంటిది. ఎప్పుడూ పీసమెత్తు అవమానం కూడా జరగలేదు. ఇప్పుడు పట్టీగ్గా నలుగురిముందూ మొహం పగలగొట్టి వెళ్లిన వాళ్లని ఊరుకోకూడదంటాడు. దెబ్బకు దెబ్బ తీయాల్సిందే అని అతడి అభిప్రాయం. వ్యక్తిగతంగా చూసుకుంటే నిజమే, అవమానం సహించటాన్ని ఎవరూ ఒప్పుకోరు. ఇక్కడ ఇది సంఘటిత సమస్య అయ్యేటప్పటికి అలా రియాక్ట్ కాలేం అని సూర్యం నచ్చచెప్తున్నాడు. అసలు సమస్యలు అలాగే ఉంటాయి. కులతత్వం, హాస్టల్‌లో దౌర్జన్యం. ఇవి పక్కకిపోయి మనం దెబ్బకుదెబ్బ తీస్తుంటే వాడు వాళ్ల దాడి చేయటం అదే ప్రధానమైపోతుందని అంటున్నాడు సూర్యం. సుమన్ మాత్రం అసహనంతో ఉన్నాడు. తనకు జరిగిన దాన్ని మిత్రులు పట్టించుకోవటంలేదనీ. అలాటప్పుడు తాను ఇవన్నీ ఎందుకు పట్టించుకోవాలనీ మనతో ఈమధ్యన ముభావంగా ఉంటున్నాడు. మెల్లగా దూరమౌతున్నాడు. దీన్ని ఎలా సాల్వ్ చేయ్యాలో అర్థం కావటంలేదు"

సరిత వేణూని చూసి ఆశ్చర్యపోతోంది. ఒక





ప్పుడు తన చుట్టూ తిరిగి తన చిరునవ్వు, పలకరింపు కోసం వెంపర్లాడిన యువకుడు ఇతడేనా? అనిపిస్తోంది. తనని ఆకర్షించాలని పడరాని పాట్లుపడ్డ వేణు ఇప్పుడు ఇంతగా మారాడా?

వయసు పెరిగే కొద్దీ మానసికంగా ఎదగటం తప్పదు. కానీ అది చాలా నెమ్మదిగా ఉంటుంది అనేకమందిలో. బహుశా సూర్యం సాహచర్య ఫలితంగా ఇతడిలో ఇంత మార్పు వచ్చి ఉండాలి. వ్యక్తిస్థాయి నుంచీ సమాజస్థాయికి ఆలోచనలు ఎదగటం ఖచ్చితంగా అభివృద్ధే. అందులో తనకి సందేహంలేదు. తనకీ వైవాహిక జీవితంలో మెల్లగా అసంతృప్తి కనిపిస్తోంది. అది వ్యక్తిగతంగా కాదు. సమాజానికి ఏమీ చెయ్యలేక పోతున్నాననే అసంతృప్తి. ప్రకాష్‌కి ఆ రకమైన ఆలోచనంటేనే గిట్టదు. ఎవరి బాగువాళ్లు చూసుకుంటే సమాజం దానంతటదే బాగుపడుతుందంటాడు. సమాజసేవ ప్రజాసేవ అనేవాళ్లు మోసం చేస్తున్నారంటాడు. ఇతరుల్ని మోసం చేయకపోయినా ఆత్మవంచన అయినా చేసుకుంటారట. తాము జీవితంలో ఏమీ సాధించలేకనే ఈ ట్రాష్ అంతా చెప్తారట. ఇంటగెలిచి రచ్చగెలవటం చేతకాదట.

రెండు రోజులక్రితం తమ ఇద్దరి మధ్యా వచ్చిందీ వివాదం. అతడి అభిప్రాయాల్ని తను వ్యతిరేకించింది. సమాజానికీ వ్యక్తికీ ఉన్న విడదీయరాని సంబంధం గురించి చెప్పింది. నీకు మంచితనం ఉంది గనుక అలాగే అనిపిస్తుంది. నువ్వో అమాయకపు మనిషివి అని తనమీద జాలిపడ్డాడు. ఇక ఆ విషయం వదిలెయ్యమన్నాడు. వదిలిపెట్టకపోతే విసుక్కున్నాడు.

ప్రకాష్ తన సంకుచిత స్వభావాన్నించి ఎదగాలని కోరుకుంటోంది సరిత. ఒకప్పుడు తను తిరస్కరించిన వేణులో ఆ మార్పు కనబడుతోంది. అతడు విరహప్రేమ నుంచీ బయటపడి ఆ రోజుల్లో అతడెలా మారాలనుకుందో ఇప్పుడలా మారగలిగాడు. అతడిపై తిరస్కార భావానికి కారణం అదే. తన గురించీ ప్రేమ గురించి తప్ప అతడికి వేరే ఏమీ అవసరంలేదు. అదే ప్రేమని నమ్మలేక అతడిని తిరస్కరించింది.

ఇప్పుడు తన భర్త మళ్లీ అదే స్థితిలో ఉన్నాడు. ఆ స్థితినుంచీ ఎదగాలని సరిత కోరిక. చిత్రంగా అతడూ ఆమెనుంచీ అదే ఆశిస్తున్నాడు. ఆదర్శాలూ కలలూ పిచ్చిపిచ్చి ఊహల ప్రపంచం నుంచీ వాస్తవలోకంలోకి రావాలనీ ఆమె ఇంకా అమాయకత్వాన్ని వీడలేదనీ ఇంకా ఎదగాలనీ అతడి అభిప్రాయం.

ఎవరి వాదన సరైనదో అర్థం కాలేదు ఆమెకి.

ప్రభా వాళ్లు మధ్యలో కల్పించుకుని ఇంకా కొన్ని విషయాలు చెప్పటంతో మళ్లీ ఈ లోకంలోకి వచ్చింది సరిత.

మారిపోతున్న కాలేజ్ వాతావరణం గురించే వాళ్లు చెప్తున్నది.

ఆడపిల్లల విషయంలోనే గొడవలు జరుగుతున్నాయట. ఒక అమ్మాయిమీద కామెంట్ చేశారని ఒక గ్రూప్‌మీద ఇంకోగ్రూప్ దాడిచేయబోయిందట. దాడికి కారణం కులభేదాలు. పైకి మాత్రం వేరే రూపంలో వ్యక్తమౌతున్నాయి.

భానూ ఒక విషయం చెప్పింది.

"మొన్న కాలేజ్ హాస్టల్ దగ్గరేమయిందో తెలుసా సరితా? మట్టిరోడ్డు హాస్టల్ పక్కనే పోతుంటుంది కదా? నేనూ, రోహిణీ సాయంత్రం కాలేజ్ వదలగానే టెన్నికాయిట్ ఆడి లేటుగా వెళ్తున్నాం. ఐదూ ఐదున్నర అవుతుంది అప్పుడు. హాస్టల్ టెర్రెస్ మీద కూర్చొని ఉన్నారు పదిమంది. రోడ్డుమీంచి చూస్తే వాళ్లు బాగానే కనపడుతున్నారు. రోహిణీని చూసి అరుపులు మొదలుపెట్టారు. దాన్ని పిలుస్తూ ఈలలూ పాటలూ. రాత్రికి వాళ్ల హాస్టల్‌కొస్తే ఏంచేస్తారో ఎలా మొదలుపెడతారో కామెంట్ చేశారు. నాకు వళ్లు మండిపోయింది. రోడ్డుమీదనించే చెప్పుతీసి చూపించాను. రోహిణీ వద్దంటూనే ఉంది. నిలువుగాడిదలా ఇంతింత ఉన్నాడు ఒక్కొక్కడు. ఆ దున్నపోతులతో రాత్రి గడపాలట. ఇంతకుముందు ఓసారి పరీక్షల్లో రోహిణీకి సాయం చేశాడట ఒకడు. ఓ ప్రశ్నకి ఆన్సర్ చెప్పాడు కాబోలు. ఆ రాస్కెల్ అప్పటినుండి దీన్ని ఫాలో చెయ్యటం,

ఇది పారిపోవటం మొదలు పెట్టేసరికి కనపడి నప్పుడల్లా కామెంట్ చెయ్యటం మామూల యింది. కాపీ కొట్టటం ఇది చేసిన తప్పునుకో. అయితే మాత్రం ఇక ఓ పదిమార్కులు వాడి మూలంగా వచ్చాయని వాడితో తిరగాలా? వాడే ఆరోజు హాస్టల్ మీద వీరంగం లేపింది. మానించీ రియాక్షన్ వచ్చేసరికి వెక్కిరింపుగా పిల్లికూతలూ, గాడిద ఓండ్రలూ మొదలెట్టారు. ఆ దున్నపోతు వంటిమీద లుంగీ ఊడదీసి గొరిల్లాలాగా చిందులు వేశాడు. మిగిలిన వాళ్లకీ ఆ జబ్బు అంటుకొంది. కోతి మూకలాగా వంటిమీద బట్టలన్నీ ఊడదీసి డాన్సు మొదలుపెట్టారు. రోహిణీ భోరున ఏడవటం మొదలుపెట్టింది. ఆ గాడిదలకి ఇంకా లోకువ అయిపోవటానికీ కాకపోతే వాళ్లముందే ఏడవటం దేనికి. ఇక లాభం లేదని దీన్ని తీసుకొని వెనక్కి వచ్చి ప్రిన్సిపాల్‌కి రిపోర్ట్ చేశాను. సిద్దప్పకి ఒకటే ఒణుకు. ఈ హాస్టల్ బ్యాక్ గ్రౌండ్ అలాంటిది. రమేష్ శివాజీల కోట అది. రేపు చూద్దాం అని వాయిదా వేయబోయాడు. ఇంతలో ఎలా తెలిసిందో గానీ అరుణ్‌కుమార్ వచ్చాడు. రోహిణీకీ అతనికీ ఏదో బంధుత్వం ఉంది. అతను రోహిణీని తీసుకొని వాళ్లవాళ్లని కూడగట్టి హాస్టల్‌కి బయలుదేరాడు. సిద్దప్పకి ఇక తప్పలేదు. వాళ్లని ఆపేందుకు వెంటబడ్డాడు.

వాళ్లింకా టెర్రస్‌మీదే ఉన్నారు. ఎవడొస్తాడని కాబోలు. వీళ్లు వెళ్లేసరికి గడగడలాడిపోవటం మొదలుపెట్టారట. కొందరు పక్కనే ఇనుకగుట్టలమీదకు దూకి పారిపోయారు. రోహిణీ వెంట పడుతున్న వాడి పేరు సాగర్. వాడు దొరికిపోయాడు. వాడిని ఫుట్‌బాల్ ఆడారు వీళ్లు. చితగ్గొట్టి వదిలి పెట్టారు.

తర్వాత రోహిణిని తీసుకొని రూము రూముకీ తిరిగి ఎవడికైనా రాత్రికి కావాలంటే చెప్పమనీ ఒంటి ఆడపిల్లముందు అరవటం కాదు దమ్ముంటే ఇప్పుడు రమ్మనీ ఛాలెంజ్ చేశాడట అరుణ్. ఆ దున్నపోతులు బట్టలు తడుపుకొన్నారు.

మొత్తానికి ఆ సాగర్‌ని నెలరోజులు సస్పెండ్ చేశాడు హాస్టల్ నుంచీ. వాడు శివాజీ అనుచరుడు. చివరికి ఈ గొడవ అటు తిరిగి ఇటు తిరిగి ఈ రెండు గ్రూపులమధ్యనా తేలింది''

ఆవేశంగా చెప్పటంవల్ల ఊపిరి తిప్పుకోనేందుకు ఆగింది భానూ.

''అదే అసలువిషయం. రోహిణీకేదో న్యాయం జరిగిందని కాదు. ఓ పక్కన ఈ అరుణ్ వర్గంవాళ్లు కొంతమంది టీజింగ్ చేస్తూనే ఉన్నారు. రేపు గొడవ ఎక్కడ మొదలవుతుందంటే ''మావాడు తప్పుచేశాడని హాస్టల్ మీద పడి కొట్టారు. మరి మీవాళ్ల సంగతేమిటి? మేం మాత్రం ఊరుకోవాలా'' అంటారు వీళ్లు. ఆయుధాలూ, కత్తుల వరకూ వెళ్తుంది వ్యవహారం. కులపరంగా చూస్తే ఎవడో ఒకడు-వాడు అరుణ్‌కులం అయి ఉండొచ్చు. వాడు ఎప్పుడో ఓసారి టీజింగ్ చేసిన అమ్మాయి శివాజీ రమేష్‌ల కులం అయి ఉండొచ్చు. అప్పుడు ఆ అమ్మాయి తరుపున వాళ్ళు వస్తారు. అమ్మాయిల్ని ఏడిపించేవాళ్లు ముందే కులం... మతం శాఖ తెలుసుకోవటం కుదరదుగా ఎవడో ఒకడుదొరక్కపోతాడా?'' అన్నాడు వేణూ.

''ఇప్పటికే మొదలయ్యాయి. నిన్న కాంటీన్‌లో తన్నుకున్నారు. మీకు తెలియదేమో ఆ విషయం. మా చెల్లెల్ని కాలు తొక్కావంట కదా అని ఒక స్టూడెంట్ ఇంకొకడిని కొట్టాడు. పాపం అతను అలాంటివాడుకాదట. కొట్టినవాడు రమేష్ గ్రూప్‌వాడు. రోహిణీ ఇమ్మాకి జవాబన్నమాట, ఇది'' అన్నాడు ప్రభు.

''బయట పోలీసులు వచ్చింది ఇందుకే. సూర్యం కోసం క్లాస్ రూంలమీద దాడి జరిగిందని వాళ్లని పెట్టారు. వాళ్లుండగానే జరగాల్సినవి జరుగుతూనే ఉన్నాయి'' రాధాకృష్ణ, మనోహర్ అన్నారు.

''కొన్ని కొన్ని సందర్భాలలో తప్పకపోవచ్చుగానీ, కొట్టుకుని ఈ సమస్యల్ని మార్చగలరా? అసలు మన అంతరాంతరాల్లో అమ్మాయిలంటే తేలికభావం జీర్ణించుకుపోయిఉంది. ఆ రకమైన సంస్కృతిని నాశనం చెయ్యకుండా వ్యక్తుల్ని నాశనం చేస్తే మాత్రం ఏమీ మార్పు ఉండదు. పైగా ఈ రెండు గ్రూపులూ ఒకళ్లని దెబ్బతీసేందుకు ఇంకొకళ్లు ప్రయత్నిస్తున్నారుగానీ, అసలు సమస్య ఎవరికీ పట్టలే





దనేది వాస్తవం" అన్నాడు వేణూ.

"ఏమో బాబూ! ఈ గొనలతో తల తిరుగుతోంది" విసుగ్గా అంది గానూ.

"పదండి క్లాసుకి టైం అవుతోంది. ఇంకా బోలెడు సమయం ఉం. తర్వాత మాట్లాడుకోవటానికి" లేవగొట్టాడు ప్రభు.

అందరూ దుమ్ముదులుపుకొని పుస్తకాలు చేతబట్టి లేచారు.

సరితకి మధ్యాహ్న లంచ్ టైంలో మరికొన్ని వివరాలు తెలాయి రవళి, సుజాతల గురించి.

సుజాతను వంచి పెళ్లిని తప్పించుకొని తిరుగుతున్నాడు అనిల్. వాళ్లిద్దరికీ ఇంత వ్యవహారం నడిందని ఎవరికీ తెలీదు. ఓరోజు గ్రౌండ్ నిలదీసిందట సుజాత. ముందు నువెరో తెలీదన్నాడు. తర్వాత నువ్వే నావెంటపడ్డావన్నాడు. నీ వాంఛల్ని చల్లార్చుకోటా నన్ను వాడుకున్నావన్నాడు. అసలు నేనొక్కదొరికానా నీకు. ఎంతమంది వెనక తిరిగా. ఎవడి మూలంగా కడుపు తెచ్చుకొన్నావన్నాడు. సుజాత ఆ మాటకు ఘోరంగా మిలిపోయిందట. అనిల్ చెంప వగలగొట్టి ఏడుస్తూ భానూ దగ్గరకొచ్చి చచ్చిపోతానందట. చేతనైనంత ఓదార్చి తోడుగా ఇంటి ద దిగబెట్టి వచ్చారు. అనిల్ మళ్లీ కాలేజ్ ట్టి తిరుగుతున్నాడు.

ఈసా రవళిని బయటే కలిసి తనతో తిప్పుకున్నాడు. ఈమె కూడా క్లాసులు ఎగ్గొ సుజాత విషయం తెలుసోలేదో రవళి తెలిస్తే అనిల్‌తో ఎందుకు తిరుగుతుం అనుకొంది సరిత. అదే అడిగింది భాను.

లాంటి సిగ్గులమొగ్గ ఒక మగవాడి వెం తిరగటమే తనకు వింతగా ఉంది. ఇక మగవాడు అనిల్ అయితే అంతకన్నా పె ప్రపంచంలోనే లేదు. అనిల్ తన స్కిల్ తో ఉపయోగించి ఉంటాడు.ఏదో వరద ంటి ఆకర్షణ కలిగించి ఉంటాడు. ఆ వదలో రవళి కొట్టుకుపోతుండాలి. తన పెళ్లికి ద్దరూ వచ్చారు. అప్పుడే గమనించింది.

కానీ రవళికి ఉన్నంతగా అనిల్‌కి నమ్మకాలు లేవు. బహుశా అతడి దృష్టిలో మళ్లీ ఈ స్నేహం కొంతకాలం సరదాగా గడపటానికే అయి ఉండాలి. అతడు తన గమ్యం చేరాక రవళి స్థితి ఏమిటి?ఊహించటానికి భయంగా ఉంది.

భానూ హెచ్చరించబోతే "'పూర్ ఫెలోస్' మీదో అమాయకపులోకం. అతడి గురించి నాకు తెలుసు. సుజాత మోసానికి పాపంఇప్పటికే అతడి హృదయం ముక్కలైంది. ఒక ఆడదానిగా మనసున్న మనిషిగా అతడిని ఓదార్చటం నాబాధ్యత. లోకం కాకిలాంటిది. మెత్తని వాళ్లని వెంటబడి పొడుస్తుంది. మీరూ లోకానికి లొంగిపోయారు" అని జాలి పడిందట.

ఇతరులమీద జాలిపడి అతడిని ఓదార్చే అదృష్టం పొందినందుకు మురిసిపోతుందంటే ఊహించుకోవచ్చు ఆమె పరిస్థితి. ఆమెని అసహ్యించుకోవాలో... జాలిపడాలో అర్థంకావటంలేదు.

దానికంటే ముందు సూర్యాన్ని కలవాలి. ఒక్కసారైనా. పెళ్లిరోజే కనిపించాడు వేణూతో. మళ్లీ చూడలేదు. నరేంద్ర సాయం చేయవచ్చు అతడిని కలవటానికి.

★ ★ ★

సరిత వంటపనుల్లో బిజీగా ఉంది.

"మీ ఫ్రెండ్ వచ్చాడోయ్" అంటూ పిలిచాడు ప్రకాష్.

వేణూ ముందుగదిలో కూర్చుని ఉన్నాడు. ప్రకాష్‌కి పరిచయం చేసింది సరిత. తమ పెళ్లికి వచ్చినందుకు సంతోషపడ్డాడు ప్రకాష్. అప్పట్నించీ రాలేదేం అని ప్రశ్నించాడు.

వేణు తడబడ్డాడు. ప్రకాష్‌కి స్నేహం అన్నా బంధుత్వం అన్నా తగని ఇష్టం అని తెలుసుకోగలిగాడు ఈ కొన్త పరిచయంలోనూ. తరచుగా వచ్చి పొమ్మని చెప్పాడు ప్రకాష్. రానందుకు సున్నితంగా మందలించాడు.

తనకి టైం అవుతున్నందుకు ఖంగారుపడుతూ మళ్లీ రండని నొక్కిచెప్పి ఏమీ అనుకోవద్దని సారీ చెప్పి హడావిడిగా లేచాడు అతడు.

అతడు వెళ్లేవరకూ కూర్చున్నాడు వేణూ.

"సరితగారూ..." వంటింట్లోకి వచ్చి చూశా

డు. ఆమె పనుల్లోనే మునిగితేలుతోంది. అతడు వంటింట్లోనే కుర్చీమీద కూర్చున్నాడు.

సరితకి తండ్రి గుర్తువచ్చాడు. ఆయనా ఇలాగే తను పని చేసుకొంటుంటే పక్కనే కూర్చొని ఆమాటా ఈమాటా చెప్తుండే వాడు ఓపిక ఉన్నంతకాలం ఒంటరిగా ఉండనివ్వమని తమ పాత ఇంట్లోనే ఉంటున్నాడాయన.

"ఈరోజుకి అవకాశం దొరికింది సరితా! సూర్యం ఇవాళ వస్తానన్నాడు. మీరు నరేంద్రని అడిగారటకదా, తన గురించి ఇక్కడే కలుస్తానన్నాడు. బయట కంటే మీ ఇంటిలోనే మంచిద నిపించింది. మధ్యాహ్నం పన్నెండుకి ఇద్దరం వస్తాం. ఏమయినా ఇబ్బంది ఉంటే చెప్పండి" అన్నాడు వేణూ.

"నిజంగా... అదే మంచిది. ఇక్కడికే రండి ఇద్దరూ. మీకూ వండుతాను. భోజనం ఇక్కడే చేసెయ్యొచ్చు" అంది సరిత.

"వస్తానయితే" అని వెళ్లిపోయాడు వేణూ.

★ ★ ★

ఇద్దరూకాక ఇంకో యువకుడు వచ్చాడు. అతడు సారథి సూర్యంతో చూసిందొకసారి. సన్నగా ఉన్నాడు.

సూర్యం కూడా చిక్కిపోయాడు. కానీ మును పటికంటే ఉత్సాహంగా ఉన్నాడు. సరితని చూసి హాయిగా నవ్వాడు వచ్చీరాగానే.

"బాగున్నావా సరితా?"

ప్రశ్నలోనే ఆప్యాయత ఉంది. చిన్నగా నవ్వింది ఆమె.

"సంసారజీవితం ఎలా ఉంది? పెళ్లి అయిపోయాక ఓ ఇంటి దానివయ్యావు. ఆ రకమైన బాధ్యతలూ, బరువులూ మాలాంటివాళ్లకి తెలియవు. అప్పుడే పెద్దదానివయినట్లు కనపడుతున్నావు. అందులో ఆడపిల్లలు మగపిల్లల కంటే త్వరగా ఎదుగుతారట" అన్నాడు కూర్చుంటూ.

"బానే ఉంది గానీ. నాది సంసారజీవితం అంటున్నావు. మరి నీదేమిటో?"

క్షణం ఆలోచించాడు సూర్యం.

"అయితే నాది సంచార జీవితం అనుకో" అందరూ నవ్వారు.

"నిజంగానే ఫున్నాను. మొన్నమొన్నటివరకూ నాకో తీవ్రమైన కోరిక ఉండేది. రాహుల్ సాంకృత్యాయనలాగా ప్రపంచం అంతా తిరగాలని. విహారయత్రలూ, తీర్థయాత్రల్లాగా కాదు. ప్రజల జీవితాన్ని సమస్యల్ని వివిధ జాతుల సంస్కృతి, చరిత్రనీ, వాళ్లగత వైభవాన్ని, అస్థిత్వంకోసం చేసే పోరాటాన్నీ తెలుసుకోవాలని. మానవజీవితం మహాద్భుతమైన గ్రంథం. అందులో ఓ వాక్యం కూడా చదివి ఉండటం మనం. మొదటి పేజీలో మొదటి పదంలోనే ఉన్నాం ఇకా. ఇప్పుడు దేశాలు తిరిగి నా యాత్రానుభవాలు అని రాసేవాళ్లు అక్కడి బిల్డింగుల్ని ట్టడాల్ని సంపదనీ మాత్రం అద్భుతంగా స్తారు కానీ మానవ సంబంధాల గురించీ, టిలోని వైరుధ్యాల గురించి ఏమి రాస్తున్నా. ఇక రాహుల్‌జీ మాత్రం మనకి మహోపకారం చేశాడు. ఏమాత్రం అవకాశం ఉన్నా సే సంచారజీవిని అయ్యేవాడినేమో, ష కాలేజీకి సంబంధించిన చరిత్ర నుచేసుకోవటానికే తలకిందులవుతున్నాను. ఇంకాలం గడిచాక నేనొక సత్యం తెలుసు కోగలిగా. మన కాలేజీ గురించి" ఆగాడు సూర్యం.

అందరూ ఆసక్తిగా చూశారువాళ్ల ఉత్సుకతని చూసి నవ్వాడు సూర్యం

"చెప్పమంటారా!"

తల ఊపింది సరిత.

"అదేమిటంటే... నాకు ఓనమాలు కూడా రావని. ఇక్కడి సమస్యల్ని అంచేసుకోవటంలో పెద్ద తప్పు చేశాను"

"అదేమిటి?" వేణూ సారథి ఒంరి ఆశ్చర్యపోయారు.

"చెప్తాను తొందరపడకండి. నర్సో, ప్రభాత్ కూడా వస్తామన్నారు ఇక్కడికి. జో పది పదిహేను నిముషాల్లో రావొచ్చు. ఇదరం చర్చించుకొందాం. ఈలోపు ఇంకేమయి చెప్పండి. నువ్వే ఏమయినా చెప్పు తా. మేము ఎటూ కలుస్తూనే ఉంటాం"

"సుజాత సంగతి తెలిసిందా?" అడిద్ది సరిత.

"ఏం కాలేజీలో ఏమయినా?" ప్రశ్నార్థకం అడిగాడు సూర్యం.





"ఎందుకో అనిల్‌తో మొన్న ఘర్షణ పడింది. మాటామాటా పెరిగింది. అతను తీవ్రంగా దూషించాడు. ఇంతకుముందే ఒక సారి జరిగిందట. ఇప్పుడు సుజాతని కొట్టబోయినంత పని చేశాడు. వల్గర్‌గా మాట్లాడి నోటికొచ్చినట్టు తిట్టాడు. అతనేమయినా మారతాడని కాబోలు ఇంకా అడుగుతోంది. వదిలించుకోవటం గురించి అనిల్ ఆలోచిస్తున్నాడు"

"బహుశా పెళ్లివరకూ వచ్చాక అడ్డం తిరిగి ఉంటాడు. ముందునుంచీ అనుకొంటున్నదే" సూర్యం.

"ఇంత జరిగాక కూడా రవళి అతడితో తిరగటం ఆశ్చర్యంగాఉంది" అంది సరిత.

"అంత ఆశ్చర్యం కలిగించేది ఇది కాదు. టీనేజ్ అనిల్‌కి ఎవరిని ఎలా డీల్ చెయ్యాలో బాగా తెలును. నీకూ అనుభవమేగా. చలంగురించి ఎత్తాడు నీదగ్గర. అడొలెసెంట్ మనస్థత్వం రవళిది. ఇతగాడు జాలిగా మొహం పెట్టి ఓదార్పుకోసం అప్పులు చేస్తున్నట్టు నటించాడు. నలుగురిచే తిరస్కారం పొందిన వాడిమీదే రవళికి జాలికలిగింది. ఓదార్పు ఇస్తున్న భ్రమలో ఉంది ఆమె. ఏదయినా షాక్ తగిలేవరకూ అదే భ్రమలో ఉండిపోతుంది. అనిల్‌నుంచీ ఆ షాక్ ఎదురయితే మాత్రం పర్యవసానం దారుణంగా ఉంటుంది. సుజాతంటే కొంతధైర్యంతో నిలబడిందిగానీ, రవళి అలా కాదు. మరీ సున్నితం. ప్రాణం తీనుకున్నా ఆశ్చర్యంలేదు. అంత భ్రమా ఒక్కసారి చెదిరిపోతే తప్పదు. మనం అంతా నోరు తెరుచుకొని చూస్తూ ఉండాలి అది జరిగే వరకూ. ఏం లాభం?"

"అదే చాలా బాధగాఉంది సూర్యం. మనం అంతా ప్రేక్షకుల్లాగా ఉండిపోయామే అని. అనిల్‌ని ఏమీ చేయలేకపోతున్నాం" నిస్పృహగా అంది సరిత.

"మొన్నీమధ్య ఒకటి జరిగింది. నరేంద్రని కలిసిందట సుజాత నాగురించి తర్వాత ఆమెని తీసుకొచ్చాడు.

అనిల్‌ని వదలకూడదు. మామూలుగా వదిలేస్తే ఇంకెందరినైనా బలితీసుకుంటాడు. నమ్మించి మోసం చేశాడు కాబట్టి ఏమయినా చేయండి అంది. అంటే ఆమె ఉద్దేశ్యం వాడిని కొట్టాలనో- తన్నాలనో, ఏదో ఒక శారీరక శిక్ష విధించాలని. దానికి నావరకూ ఎందుకూ? ఎవర్నయినా కిరాయి మనుషుల్ని ఏర్పాటు చేద్దాం అన్నాను.

తర్వాత సారీ చెప్పింది. మీ దగ్గరకి కిరాయి మనుషులకోసమని రాలేదు. వీడిని తలుచుకొంటేనే అసహ్యమేస్తుంది. ఎన్నెన్ని చెప్పాడని. అంటూ వాడి గాలి కబుర్లగురించి రెండు గంటలకుపైగా తలచుకొని గుర్తుచేసుకొని ఏడ్చుకొంటూ చెప్పింది"

"నిన్ను కలిసిందా? ఈ విషయం గురించి?" వేణూ అడిగాడు ఆశ్చర్యంగా.

తల ఊపాడు సూర్యం.

"అసలీ సంబంధమే విచిత్రంగా ఉంది వేణూ. సరితా! నీకో వింత తెలుసా? ఈ ఆరేడు నెలల కాలంలోనూ అంటే లాస్టియర్ మధ్య నుండీ ఇప్పటివరకూ సుజాతకీ అనిల్‌కి మధ్య పెళ్లి ప్రసక్తి రాలేదు. వాడు సర్వశక్తి సంపన్నుడు. సర్వజ్ఞాని అనుకొందీపిల్ల. అన్ని వాడికే తెలును గదా అని తనగురించీ, తన జాగ్రత్తల గురించీ మర్చిపోయింది.

బలవంతంగా స్త్రీల మీద రుద్దుతున్న అత్యాచారాల్ని పక్కన పెడితే, కనీసం అనిల్ పెళ్లిపేరుతో మోసం చేశాడనటానికీ వీలులేదు. ఆ ప్రసక్తే రాలేదు. కాబట్టి. చివరికి ఇప్పుడు చెయ్యికాల్చున్నాక సుజాతకి అర్థమయితే ఏం లాభం?. రేపు వాడి వాదనేమిటో తెలుసా? ఈ సుజాత తన వాంఛల్ని చల్లార్చుకోవటానికి తన వెనక పడిందంటాడు. కానీ వాడు ఇన్‌డైరెక్టుగా ఆమెకు భ్రమలు కల్పించిన విషయం ఎవరికీ తెలీదు ఆమెకి తప్ప. అందరూ అదే నమ్ముతారు"

"అయ్యో! రేపు కాదు. ఇప్పటికే అన్నాడట. తన వెంటబడింది వాంఛల్ని తీర్చుకొటానికే అని. అంతటితోనే ఆగలేదు. ఎందరితో తిరిగావో అని వాగాడు"

"అదే జరిగిందన్నమాట. తనకు తప్ప ఇంకెవరికయినా మోసం జరగొచ్చు తనకు మాత్రం మినహాయింపు ఉందని సుజాత నమ్మకం మొన్నటిదాకా" అన్నాడు వేణూ.

సారథి మౌనంగా వింటున్నాడు.

"ఇప్పుడు రవళి నమ్మకం కూడా" అన్నాడు సూర్యం.

"అబ్బ ఈ సమస్యలు ఎప్పుడు ఆగుతాయో. ఏం పరిష్కారం ఉంది వీటికి" ఆవేదనగా అంది సరిత.

"అవునూ! నువ్వేం చెప్పావు సుజాతతో" సూర్యాన్ని అడిగింది సరిత.

"నేనా? అనిల్‌ని మర్చిపోవటంకంటే మంచి పరిష్కారం లేదని చెప్పాను" తాపీగా అన్నాడు సూర్యం.

"అదేమిటి? నువ్వు మర్చిపొమ్మని చెప్పావా?" నమ్మలేనట్టు అడిగిందామె.

"ముందు ఇంకోటి అడిగానూ ఇప్పుడేం చెయ్యాలి అనేదానిగురించి సమాజానికి భయపడకుండా అందరిముందు ఈ విషయాన్ని బయటపెట్టటం. అనిల్ ఎలాంటివాడనేది ఎక్స్‌పోజ్ చెయ్యటం. దీనికి ఒప్పుకుంటావా? అని అడిగాను. అలా చేస్తే ఏదోక మేరకు వాడిని సాంఘికంగా శిక్షించవచ్చు. నలుగురి ముందూ అవమానం భరించలేడు. మొహం ఎత్తుకోలేడు. కానీ అంతకంటే పెద్దశిక్ష సుజాతకే పడుతుంది. స్త్రీ అరిటాకు దశలోనే ఉంది కాబట్టి ఆమెకే ఎక్కువ నష్టం అలా చేస్తే. అందుకు ఆమె భయపడింది సహజంగానే.

మరొకటి చెప్పాను. ఇంతకుముందే ఆమెకి ఒక పెళ్లి సంబంధం కుదిరింది. అతను స్వయనా మేనమామేనట. మంచి మనిషి అని చెప్పింది. అతడి విషయం చెప్పి, ఏదీ దాచకుండా వివరించి, నిర్ణయం అతడికే వదిలేయమన్నాను. అర్థంచేసుకొనేవాడయితే పెళ్లికి ఒప్పుకుంటాడు. లేదా చేసిన తప్పుకు ఇంకొక అర్థంచేసుకునే వ్యక్తి దొరికేవరకూ శిక్ష అనుభవించక తప్పదు. లేదూ అంటే ఒంటరిగా మిగిలిపోతుంది. ఇది చేయాలంటే అనిల్ అనేవాడి గురించి మర్చిపోక తప్పదు. ఏమీ చేయలేనప్పుడు ఆలోచించటం అనవసరం కాదా?" అన్నాడు సూర్యం.

"ఏమో సూర్యం నాకు గజిబిగజిగా ఉంది, నువ్వుతప్పుగా నిర్ణయం తీసుకుంటున్నావనిపిస్తోంది" తల నొక్కుకుంటూ అంది సరిత.

"ఏం చెయ్యాలి? పోనీ మీరయినా చెప్పండి





ఇంకే మయినా చేయగలమా''

"అవును. ఏం చెయ్యాలి? ఇంకేముంది చేయటానికి ఇది సినిమాకాదు. బెదిరించో, భయపెట్టో, ఉపన్యాసమిచ్చో, పాటపాడో అని ల్ని మార్చటానికి ఇది జీవితం''

"అదే ఈ విషయం గురించీ ఇంకొకదాని గురించీ కూడా మనం ఆలోచించాలని ఇక్కడకు వచ్చింది. నరేంద్రా వాళ్లు రావాలే ఈ పాటికి?'' అని వాల్‌క్లాక్ వైపు చూశాడు సూర్యం.

"ఇంకొకటి ఏమిటి?''

"అది సారథి చెప్తాడు'' సూర్యం సారథిని చెప్పమన్నట్లు చూశాడు.

సారథి చెప్పటం ప్రారంభించాడు.

"మా క్లాసులో శైలజ అనే అమ్మాయి ఉంది... జూనియర్ ఇంటర్. కొత్తగా జాయిన్ అయ్యింది. మీకు వినయబాబు తెలిసే ఉంటాడు. శివాజీ చేర్పించిన లెక్చరర్. ఆయన క్లాసులో పాఠాలు తప్ప అన్నీ చెప్పేవాడు. ఆయన భార్య గురించీ, ఇద్దరూ పెళ్లికి ముందే ఎలా ప్రేమించుకొందీ, ఎలా కలుసుకొనేవాళ్లూ ఎలా లేచిపోయిందీ పెద్దవాళ్లకి దొరక్కుండా పెళ్లి ఎలా చేసుకున్నారో చెప్పేవాడు. లేచిపోయి, పారిపోయి అని నొక్కినొక్కి చెప్పేవాడు. నిజానికి ఇద్దరిదీ పెద్దవాళ్లు మెదవంచి చేసిన పెళ్లేనట. క్లాసులో మాత్రం నానారకాల కథలు చెప్పేవాడు. ఆయన భార్యతో ఏం చేస్తాడో ఆమె ఎలా రియాక్టవుతుందీకూడా చెప్పేవాడు. ఒకసారి పడగ్గది సంగతులు కూడా. ఈ రొచ్చువాగుడు వినీ వినీ మగపిల్లలకి రోతపుడితే ఆడపిల్లలలు కొందరు నోరు వెళ్లబెట్టి ప్రశ్నలడిగి మరీ చెప్పించుకునేవాళ్లు.

మేం కొన్నిసార్లు అడ్డుచెప్పినా ఫలితంలేదు. ప్రిన్సిపాల్‌కి రిపోర్ట్ చెయ్యాలని అనుకున్నాం. ఈ లోపున ఈ శైలజ అనే అమ్మాయి వినయబాబు మాటలకి ఏ రకంగా ప్రభావితం అయ్యిందోగానీ అతడిని పెళ్లిచెసుకోమని వెంటపడింది. ఆమె వయసు ఎంతనీ ఇప్పుడే పధ్నాలుగు దాటిఉంటుంది. పెళ్లి అయిందని తెలిసీ రెండో భార్యగా ఉండటానికి సిద్ధమయింది. ప్రభుత్వ ఉద్యోగి కాబట్టి రెండు పెళ్లిళ్లు కుదరనివనంటే పెళ్లి చేసుకోకుండానే భార్యస్థానంలో ఉంటానందట. అంటే భూస్వామ్య సమాజాల్లోని దాసి ఆచారం లాగా అతడికి బానిస అవటానికి కూడా సిద్ధపడుతోంది. ఇంకా ఘోరం ఏమిటంటే ఆ త్రాష్టుడు దానికి ఒప్పుకోవటం. ఆమె వేడికోలుకి కరిగిపోయి అందుకు ఒప్పుకోక తప్పటం లేదన్నాడట. విద్యార్థులకు గురువు స్థానంలో ఉండి విద్యాబుద్ధులు నేర్పాల్సింది పోయి తప్పుడు పనులు చేస్తున్నాడు. వాడి ఆకర్షణకి ఎంతమందో లొంగిపోయారు కానీ ఈ అమ్మాయి మాత్రం మరీ అధ్వాన్నస్థితిని కూడా ఒప్పుకొంటోంది. ఆ స్థితిలో జీవించటానికి సిద్ధపడి''

వినేశక్తి కూడా లేనట్లు అచేతనంగా కూర్చుండి పోయింది సరిత. దాదాపు అందరూ అదే స్థితిలో ఉన్నారు- సూర్యం తప్ప. మరో ప్రశ్న వేసే ఓపిక కూడా లేకపోయింది.

వాళ్ల కళ్లముందు లేతలేత మల్లెమొగ్గలపైకి ఉరుకుతోన్న లావా కనిపిస్తోంది. ఆ లావా జలం భగభుగలాడుతూ ఉడుకుతోంది. అదొక కర్కశత్వం, విలాపం. గడ్డకట్టిన విషాదం.

ఇంతలో తలుపు తట్టిన శబ్దానికి సరిత లేచి వెళ్లింది. ఐదుగురు యువకులున్నారు. ఇద్దరు పిల్లలు. నరేంద్ర, ప్రభాత్... ఇద్దరే తెలుసామెకి. రమ్మన్నట్లు తప్పుకొంది పక్కకి.

వెనకే వచ్చిన సూర్యం వాళ్లని లోనికి తీసుకెళ్లి కూర్చొబెట్టాడు.

నరేంద్ర, ప్రభాత్, భాస్కర్, శ్రీనివాస్, కృష్ణారెడ్డి, దాను రామస్వామి.

లోనికి వస్తూనే వాతావరణంలోని సీరియస్‌నెస్‌ని గుర్తించారు వాళ్లు. ఫార్మాలిటీ కోసం నవ్వటం, పలకరించటం చేయకుండా వీలైన చోట కూర్చొన్నారు.

దాను, రామస్వామి కూడా గంభీరతకు అలవాటయినట్లు మొహాలుపెట్టారు.

వేడిని తగ్గించి మాటల్లో పెట్టాల్సిన బాధ్యతను సూర్యం తీసుకున్నాడు.

"సరే ఫ్రెండ్స్... మనందరం ఇవ్వాళ ఇక్కడ కూర్చున్నామంటే ఒక కారణం ఒక అవసరం ఉంది. అది ఇన్నాళ్లుగా మనం



ఎదుర్కొంటున్న సమస్యల్ని విశ్లేషించుకోవాల్సిన అవసరం. మన భవిష్యత్ మార్గాన్ని నిర్ణయించాల్సిన అవసరం. నేనే ఇక్కడ కలుసుకుందామన్న ఆలోచన చేసింది. సరిత ఇల్లయితే మనం కొంత ఫ్రీగా ఉండొచ్చునన్న ఆలోచనతో అందర్నీ ఇక్కడికే రమ్మన్నాను. ఇక మనం ప్రారంభిద్దాం. దానికంటే ముందు తలా ఒక కప్పు టీ తాగితే బావుంటుంది. సరిత పుణ్యాన మనం తాగుబోతున్నాం అని వేరే చెప్పాలా?''

చిన్నగా నవ్వులు వినిపించాయి. సరిత కూడా నవ్వేసింది. అవని చూడటానికి లోనికి వెళ్లింది. సాయంగా సూర్యం కూడా నడిచాడు.

వాతావరణం తేలికవటంతో చిన్న చిన్నగా మాట్లాడుకోవటం ప్రారంభించారు. కాసేపటికి టీలు వచ్చాయి. సరితకి ఎవరెవరో పరిచయం చేశారు.

పావుగంట తర్వాత సూర్యం వచ్చి కూర్చోవటంతో మాటలాపి యుద్ధానికి సన్నద్ధమైన సైనికుల్లా కూర్చున్నారు. సూర్యం ప్రారంభించాడు.

''మొదటనుండీ మనం మన కార్యక్రమాల్ని పరిశీలించుకుంటూ వస్తే ఒకటి స్పష్టమవుతోంది. మన కాలేజిలో సమస్యలు తీసుకుంటే కులతత్వం, దౌర్జన్యం, మేనేజ్‌మెంట్ అవినీతి ఇలాంటి విషయాల్ని మనం డీల్ చేశాం, చేస్తున్నాం. అయితే ఎక్కడికక్కడ ఎదురు దెబ్బలే మిగిలాయి. దాదాపు ఏ సమస్యాకూడా పరిష్కరించగలిగే స్థితిలో మనం లేం. మన అశక్తత ఒకటే కారణం కాదు. మన పొరపాటు ఆలోచన.

మొదట టి.జె. కాలేజి హాస్టల్‌లో పిల్లల సమస్యల్ని తీసుకున్నాం. అప్పటికి మీలో కొందరికి నాతో పరిచయమేలేదు. కాబట్టి తీసుకున్నాను అనటానికి సాహసిస్తున్నాను. నేను ఒక్కడినే అక్కడ ప్రవేశించింది. అయితే పిల్లల్ని జమచేసి సువర్ణరాజు అవినీతికి వ్యతిరేకంగా నిలబెట్టబోతే ఏమయిందీ? నా మీదకి ఒక గుంపుని ఎగదోలాడు ఆ వార్డెన్. పిల్లల్ని తీవ్రంగా కొట్టించాడు. ఇక నేను ప్రత్యక్షంగా జోక్యం చేసుకునే పరిస్థితి పోయింది. మంచి ఉత్సాహంతో ముందుకొచ్చిన పిల్లలు నీరు కారిపోయారు. భయపడ్డారు. నాతో కలిస్తేనే దారుణంగా తన్నులు తినాల్సిన పరిస్థితి. మరి ఏం చేయ్యాలి? నేను నర్సిమ్మ అనే వాడిని ఎదురు దెబ్బ తీస్తే ఎలా ఉంటుందని ఆలోచిస్తే... వాడు పోతే ఇంకొకడు వస్తాడు. స్టీవెన్‌సన్ గ్రూప్ అప్పుడప్పుడే బలంగా ఎదుగుతోంది. వీడుపోతే వాడొస్తాడు. మొదట పిల్లలికి ధైర్యం చెప్పి చైతన్యవంతుల్ని చేసే ప్రయత్నానికి గండిపడింది. తర్వాత రహస్యంగానే ఆ పిల్లల్ని కలుస్తూ వచ్చాను. ప్రస్తుతం అలాగే నడుస్తోంది. మన దానూ, రామస్వామి. అక్కడ నాకు ఆధారమయ్యారు. వీళ్లద్వారా మిగిలిన వాళ్లని కలుస్తున్నా.

తర్వాత ప్రధానంగా మన డిగ్రీ కాలేజికొస్తే కనబడేది కుల బలం. ఎన్నికల ద్వారా విద్యార్థులకు రిప్రజెంటేషన్ ఉండాల్సింది పోయి కులాల రిప్రజెంటేషన్ వచ్చింది. కులాల ప్రాతినిధ్యం. ఎన్నికల్లో గెలవటానికీ కులాల బలాలు నిరూపించుకోడానికీ గట్టి సంబంధం ఉంది. శివాజీ రమేష్‌లు ఒక కులం. అరుణ్ వర్గం మరో కులం, వీళ్లిద్దరి కులాల ఘర్షణే ఎన్నికలద్వారా జరిగింది. అరుణ్ గెలిచాడు.

కాలేజిలో ఉండే వేలాది మందికీ ఈ నాయకులు ఆధారమయ్యారు. సినిమా అభిమాన సంఘాల ద్వారా మొదలయిన కుల భేదాలు తారాస్థాయికి చేరాయి. ఎవడి బలం వాడు నిరూపించుకునే ప్రయత్నాలు చేశారు. మనం దాన్ని గండి కొట్టేందుకు మొదటినుండీ ప్రయత్నిస్తున్నాం. సారథి జూనియర్స్‌ని బాగా కదిలించాడు.

వాళ్లింకా కపటత్వానికి లొంగిపోలేదు. డిగ్రీ స్థాయి కొచ్చేప్పటికి స్థితప్రజ్ఞత సంతరించుకుని కులతత్వంతో రాటుదేలిపోవటం వల్ల మన క్లాసుల్లో ఆ కదలిక తక్కువగా ఉంది. కాబట్టి మనం బలహీనంగా మిగిలిపోయాం. ఈ మొత్తానికీ మీకర్థం కావాలంటే మన పోరాటంలో విఫలం కావటానికి ప్రధానమయిన కారణం ఇప్పుడు చెప్తున్నాను'' ఆగాడు సూర్యం.

అందరూ చెవులు రిక్కించి వింటున్నారు. వాళ్లవైపు సాలోచనగా చూశాడతడు.

''అదేమిటంటే కాలేజీని మనం సమాజ





న్నించి విడగొట్టి చూస్తున్నాం. అది ఐసొలేటెడ్ సిన్డంగా భావిస్తున్నాం. కేవలం విద్యార్థుల్ని చైతన్యవంతుల్ని చేస్తే సమస్యలు పరిష్కరించ బడతాయని అనుకుంటున్నాం.

మీకర్థం కావటానికి ఒక ఉదాహరణ ఇస్తాను. కులతత్వం అనేది మన సమాజంలో వేళ్లూనుకొన్న మహావృక్షం. ముఖ్యంగా మన టౌనులో చుట్టువక్కల పల్లెల్లో అది మరీ బలంగా ఉంది. విద్యార్థులంటే ఎవరు? ఈ సమాజంలోంచి వచ్చినవాళ్లు. వాళ్లు దానికి లోబడి ఉండక తప్పనప్పుడు కులాలకు అతీతంగా ఎలా రాగలరు? ముందే అన్నట్లు ఆ కుల వృక్షానికి అనేక కొమ్మలూ శాఖోపశాఖలూ ఉన్నాయి. వాటిలో కొన్ని మన కాలేజిలోకి విస్తరించాయి. ఆ కొమ్మల్నే మనం పడగొట్టాలనుకున్నాం. కానీ వాటి మూలం ఎక్కడుందీ? సమాజంలో ఉంది. మనం చేసే యుద్ధం కాలేజికే పరిమితం అవటంతో తాత్కాలికంగా కొన్ని కొమ్మలు విరిగినా మళ్లీ అది చిగురించక తప్పదు. అది మరీ బలంగా వసంత కాలంలో పూచిన చెట్టులా అవుతోందిప్పుడు. మనం మన గురించి ఏమనుకుంటున్నాం. ఏ సమస్యనీ దేనికదే చూడనివాళ్లం. వాటి మూలాల్ని వెదికి పట్టుకుని వాటిపై పోరాడే వాళ్లం. మౌలికమయిన మార్పు కోసం ప్రయత్నించే వాళ్లమనుకుంటున్నాం. ఆచరణకొస్తే ఇంత కాలం మనం ఆ మూలానికే పోలేదు.

మీలో కొందరికి సుజాత విషయంలోనూ శైలజపట్లా మన వైఖరికి అసంతృప్తి ఉందని నాకు తెలును. ఒక అనిల్‌నీ, విజయబాబునీ సరిచేస్తేనే చాలదనేది గుర్తించాలి. అనిల్ సమస్య సమాజ సమస్యే. దాని పరిష్కారం ఎలా? విద్యార్థినీలోకాన్ని జాగృతం చేయాలి. విద్యార్థుల్ని చైతన్యవంతుల్ని చేయాలి. స్నేహం పేరుతో, ప్రేమ పెళ్లి పేరుతో వంచించే పరిస్థితిని తొలగించాలి. టీనేజ్ మైథాలజీ నుండి వాళ్లని బయటకు తేవాలి. టీనేజర్స్‌ని భ్రమల్లో ముంచుతున్న సమాజ ధోరణుల్ని కూల్చివేయాలి. అందుకుగానూ, సాహిత్య, సాంస్కృతిరకంగాల్లో అభ్యుదయ శక్తుల్ని ప్రోత్సహించాలి. మొత్తంగా సమాజంలోని పునాదుల్ని పెకలించాలి. ఇంత కార్యక్రమం మనముందు వుంది. అదంతా పక్కన పెట్టి అనిల్‌కి దేహశుద్ధి చేస్తేనే అది సాల్వ్ అవుతుందా. అయితే ఒకానొక తప్పనిసరి పరిస్థితిలో మనకి మరోమార్గం ఉండదు. కేవలం తక్షణప్రయోజనాల దృష్ట్యా మాత్రమే... గుర్తుంచుకోండి. తాత్కాలికంగా మాత్రమే కొన్ని చర్యలు చేపడతాం. అదే సమాజంలో సుదీర్ఘ పోరాటం కొనసాగిస్తూనే ఉంటాం.

నేను ప్రతిపాదిస్తున్న కొత్త అంశాలు కొన్ని ఉన్నాయి. అది సమాజంలోకిపోయి ఈ కాలేజీ సమస్యలకి మూలమైన పునాదుల్ని తొలగించాలనేదే ఒకటి. రెండు మన ఆత్మరక్షణ. ప్రతివాడు ఒక హింసాత్మకమయిన దారిలో నడుస్తున్నాడు. సినిమారంగం ద్వారా విద్యార్థులకి అది ప్రసరిస్తోంది. ఈమధ్యనే రిలీజ్‌అయిన ఓ సినిమా కాలేజీ పాలిటిక్స్‌ని బేస్‌గా తీసుకొని ఒక విద్యార్థి పట్టణాన్ని శాసించే నాయకుడిగా ఎదగటం చూపించింది. అది మనవాళ్లని తీవ్రంగా ప్రభావితం చేసింది. నలుగుర్ని తోడుతీసుకుని షర్టుచేతులు పైకిమడిచి గుండీలు విప్పుదీసి నడుస్తూ నేను ఫలానా బ్యాచ్ అని చెప్పుకొనేంత స్థాయికి పోయారు. హింసా రాజకీయాలు శివతాండవం చేయటం ప్రారంభించాయి. అలాంటి వాతావరణంలో మనం చేతులు కట్టుకొని ఉండలేం. మనపై దాడిచేస్తున్న దుష్టశక్తులకి బుద్ధిచెప్పాల్సిందే. ఆ ప్రతిఘటన అవసరమయితే ఎంతయినా తీవ్రరూపం తీసుకోవచ్చు. మనని వెర్రివెధవలుగా జమచేసి ప్రతిగ్రూపు తమ సత్తాని ప్రదర్శించాలనుకొంటున్నాయి. ఎట్టి పరిస్థితిలోనూ అది సాగనియకూడదు.

ఓ వ్యక్తి కత్తి పట్టుకున్నంతమాత్రానే రౌడీ అయిపోతాడనీ, అతడికి అందరూ భయపడి విధేయులవుతారనీ అనుకొంటారు చాలా మంది. నిజంగా అది సాధ్యమా? మనం విశ్వసించే విలువల్ని వదిలేసి రౌడిగా మారిపోతే లోకం భయపడుతుందా?

ఓ మనిషికి నలుగురూ భయపడే పరిస్థితి ఎప్పుడొస్తుంది? కత్తి చేతబడితే ఇంకా లోకంలో కత్తులే వుండవా? అవతలివాడికి నీకన్నా కండబలం లేదా? గుండెబలం ఉండదా?

కాదు. సమాజం రౌడీని ఆమోదించాలంటే



వాడివెనుక ఒక ఆధారం వుండాలి. సాయం ఉండాలి. బలం కావాలి. అది ధనబలం రాజకీయబలం కులబలం మరేదైనా కావచ్చు. బ్రహ్మాండమయిన ఒక మహావృక్షానికి పూచే అతిచిన్నపువ్వులు వాళ్లు. ఆ మహావృక్షం సమాజంలోని కొన్నివర్గాలనుండీ పుట్టింది. చివరికి రౌడీయిజం, గూండాబలం కూడా సమాజంలోని అవకతవకలకు ప్రతిరూపాలే. కాబట్టి మరీమరీ చెప్తున్నాను. మనం సమూహంలో ఒంటరిగా మిగిలిపోతే ఎన్నటికీ సాధించలేం. ఒక విద్యార్థి చదువుకొనే పరిస్థితి సృష్టించలేం. కాలేజ్‌ని శుద్ధిచేయలేం.

అన్ని సమస్యలకీ మూలం ఒకటుంది. దాన్నంటిపెట్టుకొనే చిన్నాచితకా సమస్యలు ఉంటాయి. మనం యాధృచ్ఛికంగా ఈ చిన్న సమస్యలని తీసుకొన్నాం. అది పోయిపోయి సమాజ నిర్మాణంలోని ఒక వైరుధ్యాన్ని చేరుకొంది. విద్యార్థిగా ప్రారంభించి సమాజంలోని పౌరుడిగా ఆ వైరుధ్యాన్ని పరిష్కరించగలగాలి.

అరుణ్ కూతురూ, శివాజీ వీళ్లు వ్యక్తులే. అయితే వీళ్లవెనుక కొన్ని శక్తులున్నాయి. వాళ్లు బలపడేందుకు తగినస్థితి ఇంకా సమాజంలో ఉంది. నిజంగా వాళ్లు శత్రువులు కాదు. శత్రువైరుధ్యం లేదు. ఒకే అంశానికి రెండు కోణాలు వాళ్లు. ఒకే నాణానికి బొమ్మా బొరుసులు.

ఆ అంశం సమాజాన్ని నియంత్రించేంత బలమైంది. ఆ అంశాన్ని మనం మన టార్గెట్‌గా ఎంచుకోవాలి.

అంకినీడూ మంగిరెడ్డీ వీళ్లెవరు? రాజకీయ శక్తుల ప్రతినిధులు. ఒకరినొకరు పూర్తిగా నాశనం చేసుకోవాలనుకొంటున్నారా? వాళ్లు. కాదు. కేవలం అధికార పంపిణీ మాత్రం చేసుకొంటున్నారు. దానికోసం కుమ్ములాడుకొంటున్నారు. వారిమధ్య విభేదం వుంది కానీ శత్రుత్వంలేదు.

వీళ్లందరినీ కూలగొట్టే శక్తి ఒకటి సమాజంలో వుంది. దానితోనే మనం మమేకమవ్వాలి. అది ప్రజాపునాది. ప్రజాశక్తి. దాన్ని చేరుకోవటమే మన కర్తవ్యం. ఈ రెండుగ్రూపుల మధ్య విభేదాలను ఉపయోగించుకొంటూ రెంటినీ దెబ్బతీయాలి. అదే మన టార్గెట్.

ఈ కాలేజ్ తీగలాగితే సమాజం కదిలింది. కాలేజ్ సమస్యకి పరిష్కారం సమాజంలోనే వుంది.

కులంపోవాలి అని అనుకున్నంతమాత్రానే అదిపోదు. ఏదయినా ఒక కొత్త ఆలోచనని ప్రజలు ఎందుకు స్వీకరిస్తారు? పాతనిర్మాణం పనికిరాని దశకి చేరుకొంటేగానీ కొత్తని ఆహ్వానించరు. అందుకే కులప్రాబల్యం ఇంకా పోలేదు. ఎందుకంటే అది మనుగడ సాగించగలిగే పరిస్థితి ఇంకా ఉందన్నమాట. మన సమాజ నిర్మాణం దానికి అనుకూలంగా ఉందన్నమాట.

కట్నం పుచ్చుకోవటం ఇచ్చుకోవటం తప్పు అన్నాం. ఏమయింది? ఎవరు ఆచరిస్తున్నారు? ఏమేరకు విజయవంతం అయింది? కట్నం తీసుకోవటం అనేది ఒక చర్య. ఆ చర్య చుట్టూ లక్షన్నర సమస్యలు ఉన్నాయి. లక్షన్నర కారణాలు ఉన్నాయి. దానికి అవకాశం ఇస్తున్న నిర్మాణం మన సమాజంలోవుంది. ఆ స్థితిని మార్చకుండా, ఆ నిర్మాణాన్ని కూలదోయకుండా కట్నం తీసుకోవద్దంటే వినేదెవరు? ఎందుకు వినాలి? ఖచ్చితంగా అక్కడే విఫలం అవుతున్నాం మనం. అంటే దీన్ని సమర్థిస్తున్నామని కాదు. సమస్యకి మూలం ఉందనేది ఆలోచించాలి కదా.

భూమి గుండ్రంగా వుందండే ఏమిటి లాభం. గుండ్రంగా ఉండటంవల్ల ఉండే ప్రయోజనం ప్రజలకి చేరనప్పుడు అదెలా వుంటే వాళ్లకెందుకు?

ఈరోజున కులం ఎంత బలంగా వుందంటే సమాజం మొత్తం దాదాపు దానికి లొంగివుంది. కాస్ట్ ఇంపాక్ట్ అన్నింటిమీదా తిరుగులేని విధంగా వుంది. చివరకు అభ్యుదయ శక్తులూ, విప్లవశక్తులూ కూడా దీనికి మినహాయింపు కాదు. అవి కూడా ఈ ప్రభావాన్ని తప్పించుకోలేకపోతున్నాయి.

అలాంటిది... అంత బలమైంది. పోవాలి అంటే దానికి అవకాశం ఇస్తున్న సామాజిక చట్రాన్ని మార్చాలి. మాటలతో మాత్రం అది సాధ్యంకాదు.




అందుకోసం మనం ఉద్యమించాలి. వేరువేరు వ్యక్తులుగా ఉన్నవాళ్లని ఏకం చేయాలి. శక్తిగా మార్చాలి.

ఇదీ నేను చెప్పాలనుకున్నది. ఇందులో మీకేమయినా నచ్చని అంశాలుంటే చెప్పండి చర్చిద్దాం'' ఆగాడు సూర్యం.

అందరూ ఆ మాటల ప్రవాహంలోనుండి బయటపడ్డారు.

కొత్తగా అతడు ప్రపోజ్ చేసిన అంశాలు వాళ్లని ఆలోచనలో పడేశాయి. ముఖ్యంగా ప్రతిఘటన. స్టీవెన్సన్‌లాంటి వారిని ఇక ఏమాత్రం సహించకూడదన్న ప్రతిపాదన. రానురాను తమమీద దౌర్జన్యాలు పెరిగిపోతున్నాయి. ప్రతిగ్రూపూ దాడిచేస్తోంది. రమేష్‌వర్గమూ, నర్సిమ్మ ముఠా, స్టీవెన్సన్‌లాంటి వాళ్ళూ... అరుణ్ ఒక్కడే ఇంకా రంగంలోకి దిగలేదు. అందువల్ల అందరికీ వ్యతిరేకంగా ఇక సాయుధంగా కూడా పోరాడాల్సి వస్తుంది. రౌడీకేడీలు గుండాల తండాలనుండీ బయటపడేందుకు ఒక ఉద్యమంలోకి ప్రవేశిస్తే చివరకు ఎక్కడకు పోయి తేలారు? వాళ్లకి వ్యతిరేకంగా తామూ ఆయుధాలు పట్టక తప్పనిస్థితిలోకి వచ్చారు. పుస్తకాలూ... చదువూ ఇప్పుడిప్పుడే అందుబాటులోకి వచ్చేవిలాగా లేవు. అవి గత స్మృతుల్లోకి ఉంచుకోవాల్సిందే. ఎక్కడ ప్రారంభించి ఎక్కడికొచ్చేరో ఆలోచిస్తే ఆశ్చర్యంగా వుంది వాళ్లకి.

విద్యార్థికి రాజకీయాలతో ఏంపని అంటే సమాధానం ఇదే. బలవంతంగా విద్యార్థిపై రుద్దుతున్న అత్యాచారాలూ... రాజకీయాలూ అతడిని వాటికి లొంగిపోయేట్లు చేయటమో, లేదా వాటికి వ్యతిరేకంగా వేరే రాజకీయాల వైపు నెట్టటమో చేస్తుండగా కేవలం చదువుకే పరిమితం కావాలనుకోవటం ఎంత అసాధ్యమో అర్థమవుతోంది వాళ్లకి.

ఒకరితర్వాత ఒకరు మాట్లాడటం ప్రారంభించారు. సూర్యం చెప్పినవాటిపై తమ అభిప్రాయాలను వ్యక్తం చేస్తున్నారు.

అప్పుడే ఆ ఇంట్లోకి ప్రవేశించారు సుమన్, రవి. ఇద్దరి మొహాల్లో విపరీతమైన ఆందోళన కనపడుతోంది. చెమటతో తడిసిపోయి రొప్పుతూ ఉన్నారు ఎంతోదూరంనుండి పరిగెత్తుకు వచ్చినట్లు.

వచ్చినవారిని చూసి కొద్దిగా ఆశ్చర్యపోయాడు సూర్యం.

సుమన్ తమతో విభేదించి వేరుగా ఉంటున్నాడు. తనతో సరిగ్గా ఉండటంలేదు. అంటీ ముట్టనట్లు తప్పించుకొంటున్నాడు.

రవి తనని ఒకేఒకసారి కలిశాడు. అప్పట్నించీ తన గురించి అడుగుతున్నాడని సారథి చెప్పాడు. తన పరిస్థితి మూలంగా అతడిని కలువలేకపోయాడు.

అలాంటివాళ్లు తమ రహస్య సమావేశానికి ఎందుకొచ్చారు? ఏదయినా జరగరానిది జరగలేదుకదా?

★ ★ ★

నెలరోజుల పథకం అది

ఉదయం పదకొండు కావస్తున్న సమయంలో జరిగిందా దాడి. రెండు అంబులెన్స్ వ్యాన్‌లూ, కార్లూ జీపులమీద వచ్చారు అరుణ్ వర్గం. కాలేజ్‌గేటు దగ్గరే వాటిని ఉంచి లోపలికి ప్రవేశించారు యాభైమంది. పదిమంది గేటు దగ్గర ఉండిపోయారు. ఇంకో అయిదుగురు హాస్టల్‌వైపు వెళ్లారు. మిగిలినవాళ్లు ముందుగా డిగ్రీబిల్డింగ్‌వైపు నడిచారు. కర్రలూ... ఐరన్‌రాడ్లూ... ఛెయిన్‌లూ... కత్తులూ ఉన్నాయి వారివద్ద.

వాళ్లలో నలుగురు తప్ప అంతా అవుటర్సే.

అరుణ్‌కుమార్ ప్రెసిడెంట్‌గా ఎన్నికయినప్పుడు ఆడిటోరియంలోకి దున్నపోతుని తోలినప్పుడే ఈ పథకానికి పునాది పడింది. శివాజీ రమేష్‌లవర్గాన్ని దెబ్బతీయాలని లోపలలోపలే చాపకిందనీరులా ఏర్పాట్లు జరిగాయి. అంకినీడు కోసం కాలేజ్ బంద్ జరపబోవటం... ఆ సమయంలో రాధాకృష్ణ తలపగలకొట్టడం... రమేష్ బృందం కులఅహంకారం... అమ్మాయిలను ఏడిపించటం... రోహిణీ ముందు సాగర్ బట్టలు ఊడదీసి గెంతులేయటంలాంటి అనేక సంఘటనలు ఈ పథకానికి ప్రేరణ అయ్యాయి. స్టీవెన్సన్‌ముఠా సూర్యంకోసం దాడిచేసి తమ కులాన్ని అవమానప

రచటంతో రమేష్‌కీ స్టీవెన్సన్‌కీ మేనేజ్‌మెంట్ ద్వారా ఉన్న సంబంధం మరింత ఆజ్యం పోసింది.

కానీ వీటన్నిటికంటే సూత్రధారిలాంటి ఒక వ్యక్తి ముఖ్యపాత్ర నిర్వహించాడు. అతను టౌను ఎస్సై. వినయబాబు శైలజని మోసం చేయబోవటంతో అతడిని అరెస్ట్ చెయ్యమని అరుణ్‌వర్గం ఎస్సయిని కలిశారు. ఎస్సయికి వినయబాబు గురించి తెలుసు. శివాజీ కులస్థుడైన ఆ లెక్చరర్ తమ కులస్థురాలైన ఒక అమాయకపుపిల్లని తమ కళ్లెదుటే దారుణంగా వంచిస్తుంటే, ఏ ఆధారమూ లేని కారణాన నిస్సహాయుడయ్యాడు ఆ పోలీస్ అధికారి. అతడు అరుణ్‌కుమార్‌ని చెడామడా తిట్టాడు. మన కులంలో పుట్టినవాడెవడూ ఇది చూస్తూ ఊరుకోడు అన్నాడు. ఇంతకాలం శివాజీవర్గీయుల ఆగడాలు ఎలా సహించావన్నాడు. నీలో... రక్తం ప్రవహిస్తోంటే ఇంతవరకూ వచ్చేది కాదన్నాడు. అసలు మీరు మగాళ్లేనా అనే ప్రశ్నించాడు.

అతడిచ్చిన ప్రోద్బలం అనూహ్యంగా మలుపుతిరిగి ఈ దాడికి కారణమయింది. ఇంతకాలం తాము వేస్తున్న పథకానికి ఆ ఎస్సయి పచ్చజెండా ఊపాడు. దాదాపు యాభైవేల రూపాయల విరాళాలు పోగుచేసి ఈ దాడికి ఏర్పాట్లు చేశారు. ఆయుధాలు కొన్నారు. వాహనాలు సంపాదించారు.

డిగ్రీ క్లాసులోకి ఒక పద్ధతి ప్రకారం ప్రవేశించారు. ఒక్కో క్లాసులోకి వెళ్లటం, తలుపులు మూసేసి గడిపెట్టడం, ఆ క్లాసులో ఎవరైతే రమేష్ శివాజీ అనుచరులున్నారో వాళ్లమీద దాడిచేయటం, ఇంకా ఆ కులంవాళ్లని బాదటం, బూతులు తిట్టడం చేశారు.

బయటివ్యక్తులు కావటంతో వాళ్లని గుర్తుపట్టలేని సందర్భాల్లో రమేష్ కులస్థులందర్నీ నుంచోమన్నారు. కొందరు భయపడి నుంచోగానే పశువుల్ని బాదినట్టు బాదారు. నుంచోకపోతే ఇక శరీరవర్ణాన్ని బట్టి కులాన్ని నిర్ణయించి ఆ విద్యార్థులని కొట్టారు. ఎర్రగా వుంటే శివాజీ కులస్థుడనీ, నల్లగా వుంటే స్టీవెన్సన్ మనిషనీ విభజించారు.

ఆ క్షణంలో తమవాళ్లనే తమ కులస్థులనే కొట్టారు. రంగునిబట్టి నిర్ణయించటం తప్పుడు ఫలితాన్ని ఇచ్చినా, కార్యసాధనలో తన, మన భేదాలుండకూడదనుకున్నారు. ఒక క్లాసులో దాడి పూర్తయ్యేవరకూ ఇతర క్లాసులకి ఆ సంగతి తెలీకుండా జాగ్రత్తపడ్డారు.

అరగంట వ్యవధిలో పూర్తయిందది.

కాలేజీ చరిత్రలోనే భయంకరమైన ఆ దాడిలో ఇరవైమందికి తీవ్రమయిన గాయాలయ్యాయి. కాళ్లూ చేతులు విరిగిపోయాయి. తలలు బ్రద్దలయ్యాయి. క్లాసురూంలలో నెత్తుటిచారికలు ఏర్పడ్డాయి. బెంచీలు, డస్కులూ చెల్లాచెదురయ్యాయి.

కొందరు విద్యార్థులు తప్పించుకోగలిగారు. వాళ్లు గేటుదగ్గర వాళ్లకి దొరికిపోయారు. అక్కడ దాడికి గురయ్యారు.

కాపలాగా వున్న ముగ్గురు పోలీసులూ ఎప్పుడో జారుకున్నారు.

వినయబాబుని క్లాసులోనే పొడిచారు. శరీరమంతా తూట్లుపడిపోయింది. నెత్తుటి మడుగులో స్పృహతప్పి పడిపోయి చావుబతుకుల్లో కొట్టుమిట్టాడుతున్నాడు అతడు.

కాలేజ్ బిల్డింగ్స్‌లో పూర్తయ్యాక హాస్టల్‌మీదకు వెళ్లారు. ఎస్సెయ్ హాస్టల్‌వార్డెన్ రామ్మూర్తిని కూడా పొడిచారు. స్టీవెన్సన్ దొరకలేదు. అతడాసమయంలో హాస్టల్‌లో లేడు.

అంతా అయ్యాక ఎటువాళ్లటు చెదిరిపోయారు. చుట్టుపక్కల గ్రామాల్లో తలదాచుకుందుకని అజ్ఞాతంలోకి వెళ్లిపోయారు. అరుణ్‌కుమార్ ఈ రాష్ట్రం సరిహద్దులు దాటిపోయాడెప్పుడో. దాడిచేసిందెవరో తెలీకపోయినా వారి వైఖరిని బట్టి అరుణ్‌కుమార్ ఆ చర్యవెనుక ఉన్నాడని అర్థమయింది విద్యార్థులకి.

పట్టణం మొత్తం అట్టుడికిపోయింది. తక్షణమే ప్రతీకారంకోసం ప్రయత్నాలు ప్రారంభించారు.

ఈ మొత్తంలో ఊహించని మలుపు సూర్యం విషయంలో జరిగింది.

అతడూ, అతడి మిత్రులూ దాడి జరిగిన సమయంలో కాలేజ్‌లో లేరు. దీనివెనక అతడి





# ఏరిన ముత్యాలు

* దేశం అభివృద్ధిచెందడమంటే అద్దాల మేడలు రంగుల గోడలు కాదు- పౌరుని నైతికాభివృద్ధే నిజమైన దేశాభివృద్ధి.

– గాంధీజీ

* అధికారం అవినీతికి మూలం, అంతులేని అధికారం అంతులేని అవినీతికి ఆలవాలం.

– లార్డ్ అక్టన్

* అదృష్టం అన్వేషించేవారినే వరిస్తుంది. ప్రతి వ్యక్తి జీవితంలో అదృష్టం ఒక్కసారే వచ్చి తలుపు తడుతుంది. ఆ క్షణాన 'కృషి' అనే ద్వారాన్ని తెరవకపోతే అదృష్టం అదృశ్యమవుతుంది.

– స్పర్జెయస్

* మనల్ని చూసి జనం జాలిపడేట్లుగాకాక అసూయపడేటట్లు మనం జీవించాలి.

– హేరాక్లిటస్

* దయ ఎప్పుడూ వృధాకాదు. అవతలివానిమీద దాని ప్రభావం లేకపోయినా ప్రదర్శించేవానికి అది మేలుచేస్తుంది.

– ఎస్. హెచ్. సిమ్మన్స్

* భగవంతుడు కన్నీటిని, చిరునవ్వును కూడా సృష్టించాడు. సంభ్రమాశ్చర్యాన్నీ, స్వేచ్ఛను స్వీకరించేందుకు నువ్వు ఉపయోగపడుతున్నట్టే సంతాపం సావధానంగా సర్దుకొనేందుకు కన్నీరు ఉపయోగపడుతుంది. నిర్వేదన, నిస్పృహ, నిరాశలకు దారితియ్యకుండా కన్నీరు కాపాడుతుంది.

–వీహంట్

* చరిత్ర రాజుల యుద్ధాల కథ కాకూడదు- అవి భావాల చరిత్ర కావాలి.

– చెకోవ్

* ఏకార్యంలోనూ విజయం సాధించలేమని ముందుగానే ఒక నిర్ణయానికి వచ్చేవారెన్నడూ విజయం సాధించలేరు.

– సర్-ఆర్థర్ కాటన్

* ఉత్తముడు ఎవరినీ అవమానించడు. ఇతరులు అవమానిస్తే సహించడు.

– హ్యూమ్స్

* తల్లిదండ్రులు పిల్లలను మంచి నడవడిలో దిద్దుకోవడం మంచిదే కానీ, తమ నమ్మకాలను వారిపై రుద్ది వారు మోయలేని భారాన్ని మోపడం మంచిదికాదు.

– బేకన్

* పరిశుద్ధమైన ప్రేమ కొంచమైనా లేనివాడే దరిద్రుడు.

– గాంధీజీ

* ఈ ప్రపంచంలో నీకు శత్రువులు లేరు, మిత్రులు లేరు. నీ ప్రవర్తనే నీకు శత్రువులను, మిత్రుల్ని తెచ్చిపెడుతుంది.

–చాణక్య

పాత్ర ఉందన్న అనుమానం త్వరగా పెనుభూతంగా వ్యాపించింది.

పాత కక్షలకు ఈ అనుమానం తోడవటంతో సూర్యంకోసం వేట ప్రారంభమయింది. అతడు కనబడితే చంపెయ్యమని ఆదేశాలు వెళ్లిపోయాయి. స్టీవెన్సన్ మనుమలూ, శివాజీ అనుచరులూ ఈ డెత్‌వారెంట్‌ని అమలు చేసేందుకై వేటాడటం ప్రారంభించారు. దాడి పూర్తయిన గంట వ్యవధిలోనే అతడికోసం అతడి మిత్రుల రూంలపై, కాలేజ్ స్టూడెంట్స్ ఇళ్లపైనా దాడిజరిగింది. సరిత ఇంట్లో ఉంటాడని ఊహించకపోవడంతో అతడు ప్రాణాలతో మిగిలాడు.

అతడి మిత్రులు కూడా వెతకటం ప్రారంభించారు. ఈ వార్త తెలియజేసి ప్రాణాలు కాపాడుకోమని చెప్దామని అతడెక్కడ వుంటాడో, ఉండే అవకాశం ఉందో అక్కడికి వెళ్లారు. సుమన్‌కి సరిత ఇల్లు తెలుసు.

ఈ ప్రయత్నంలోనే అతడు రవిని వెంటబెట్టుకొని ఆ ఇంటికి చేరుకున్నాడు.

★ ★ ★

రవి సూర్యాన్ని కౌగలించుకుని ఒక్కపెట్టున రోదించాడు. అప్రయత్నంగా దరిచేర్చుకున్నాడు సూర్యం.

అవధులు లేని ఆవేదనా దుఃఖం అతడి శరీరాన్ని కుదిపివేశాయి.

ఎక్కడో పుట్టి ఎక్కడో పెరిగి ఇక్కడికొచ్చి ఈ కాలేజీలో కర్కశమయిన బాధననుభవించి అనేకానేక అనుభవాలు పొంది నరాలుచిట్లి రక్తం ఆవిరయ్యి భయానకమయిన వర్తమానం తాలూకు వికటాట్టహాసానికి వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు అతడు.

సూర్యం ఎవరు? ఏ కులం, ఏ మతం, ఏ వర్ణం ఏదీ తెలీదు. కనీసం పరిచయం కూడా పెద్దగా లేదు. ఒకేఒక్కసారి చూశాడు. ఒకేఒక్కసారి మాట్లాడాడు. అంతే ఈ సుదీర్ఘమయిన జీవితంలో ఒక స్పర్శ, ఒక చూపు, ఒక నవ్వు, ఒకమాట, ఒక ఓదార్పు చాలు మొత్తం జీవితాన్ని తారుమారు చేయటానికి.

ఉరికంబం ఎక్కబోతున్న ప్రియాతిప్రియమైన ప్రాణమిత్రుడిని హత్తుకున్నట్లు కౌగిలించుకున్నాం రవి. వధ్యశిలపై తలఉంచిన ప్రాణనేస్తాన్ని దరిచేర్చుకున్నట్లు అల్లుకుపోయాడు.

నలుగురియిందూ నోరు తెరవటానికీ, నవ్వటానికీ బిడియపడే రవి, సరిత ఇంట్లో తనకు తెలీని అనేమంది అపరిచితుల మధ్య తనను గుర్తుపట్టాడో లేదో తెలీని సూర్యం భుజాలపై తలఉంచి కుమిలిపోయాడు.

ఆ క్షణంలో అతడికి ఎవరూ గుర్తుకురాలేదు. తల్లీ తండ్రీనీ తన యవ్వన జీవితాన్ని కుదిపివేసిన సంధ్య తాలూకు భావనల్నీ బాల్యంలో తనను వడిచేర్చుకున్న అత్తయ్య స్మృతుల్ని అన్నిటినీ మర్చిపోయాడు. ఈ ప్రపంచపు ఉనికినే విస్మరించాడు.

ఆ క్షణాన తననుతాను మర్చిపోయాడు రవి.

అందరూ రవిని ఓదార్చారు. అతడి దుఃఖం ఎవరికీ ఆశ్చర్యం కలిగించలేదు. మనిషికీ మనిషికీ మధ్యన ఉండే ఆత్మీయతతో రవిని అక్కున చేర్చుకున్నారు. మమకారంతో వడిచేర్చుకున్నారు.

సరిత భయోద్వేగాల మధ్య ఊగిసలాడుతోంది. క్షణక్షణానికీ విషమిస్తున్న పరిస్థితి, తీవ్రమయిన వత్తిడి ఆమెకు ఊపిరి సలపనీయటంలేదు.

ఆమెకి కరువుతీరా ఏడవాలనిపించింది. గుండెలవిసేలా రోదించాలనిపించింది.

తన నేస్తం... తన ప్రాణస్నేహితుడు... చావు బతుకుల పొలిమేరల్లోకి నెట్టబడుతున్నాడు. సూర్యం మరణశిక్షకు చేరువవుతున్నాడు.

తామందరూ నిశ్శబ్దంగా, నిస్తబ్దంగా, నిర్వేదంగా పాలిపోయిన మొహాలతో కళ్లు చిట్లించుకుని అస్పష్టంగా కనిపిస్తున్న అతడిని చూస్తున్నారు. అతడు తలవంచుకొని చెక్కుచెదరని చిరునవ్వుతో, నిర్భయంగా నడిచిపోతున్నాడు. కాంతికిరణంలా మెరుస్తున్న కత్తి అంచుమీద వధ్యస్థలివైపు నడుస్తున్నాడు. తలవంచుకొని తనదారిన తను బద్రప్రహారాల మధ్యకు పోతున్నాడు.

గెలిటిన్ యంత్రంలాంటి వ్యవస్థ కొరతమధ్య పవళించబోతున్నాడు.

కాలం పరిగెడుతోంది. చీకటితెర ప్రపంచా





నికి ముసుగువేసేందుకు ఆయ త్తమవుతోంది. సాయంత్రం ఏడవుతోంది.

ముందుగా తేరుకున్నాడు నరేంద్ర. పరిస్థితి తీవ్రత అతడిని వెన్నుతట్టి లేపింది. తక్షణ కర్తవ్యం గురించి ఆలోచించాడు.

"సూర్యం... ఈపాటికి పోలీసులు కూడా నీకోసం వెతుకుతుంటారు. అరుణ్‌కు అనుకూలమైన ఆ ఎస్సయి మొత్తం నేరాన్ని మనమీదకే తిప్పివుంటాడు. అందుకు కావల్సిన మోటివ్ ఎప్పుడో తయారయింది. మనం శివాజీకీ మేనేజ్‌మెంట్‌కి వ్యతిరేకంగా పోరాటం ప్రారంభించినప్పుడే మనకీ వాళ్లకీ మధ్య కక్షలున్నాయనీ స్టీవెన్సన్‌పై ఉన్న పాతపగల మూలంగా ఈ దాడిచేశామని రిపోర్టు తయారయివుంటుంది. ఏదిఏమయినా ముందు నువ్వు టౌను దాటి వెళ్లిపోవాలి. అటు ఆ గ్యాంగులకి దొరికినా ప్రాణాలు పోతాయి. ఇటు రక్షణ కోసం పోలీసుల్ని ఆశ్రయిస్తే ఆ నేరంక్రింద మననే అరెస్టు చేస్తారు.

మనం నమ్మిన ఆశయంకోసం నువ్వు కోరుకున్న కార్యాచరణకోసం ఈ టౌను దాటి వెళ్ళిపోవాలి నువ్వు. ఇప్పుడు అంతకంటే మార్గం లేదు"

తల ఊపాడు సూర్యం. స్పష్టంగా తెలుస్తోంది పరిస్థితి. తనకు మరోమార్గం లేదు. అజ్ఞాతంలోకిపోయే సమయం వచ్చేసింది.

అందరినీ చూశాడు ఒక్కసారి. తన కోసం కష్టనష్టాలకోర్చిన ప్రాణమిత్రులు వాళ్లు. ప్రాణాల్నే పణంపెడుతున్న సహచరులు వాళ్లు.

సుమన్ తననే చూస్తున్నాడు. సూర్యం చూపులో... మన మధ్య ఎన్ని విభేదాలున్నా మనకి అభిప్రాయాలు వేరయినా ఈ క్షణాన వాటిని పక్కన పెట్టి నమ్మిన సిద్ధాంతం కోసం ఏకమవుదాం. అంటున్న సందేశం. సంకేతం.

తను కొత్తగా తీసుకున్న నిర్ణయం అతడికింకా తెలీదు. అయినా తనను రక్షించుకోవటం అనే బాధ్యతను తలకెత్తుకుని తనను వెతుక్కుంటూ ఇక్కడికి వచ్చాడు. అతడే రాకుంటే మామూలుగాబయటకు వెళ్లి ప్రాణాలు పోగొట్టుకోవాల్సి వచ్చేది.

చిన్నగా నవ్వు వికసించింది సుమన్ పెదవులపై. సూర్యం సందేశాన్ని కళ్లతోనే గ్రహించాడతడు.

ఒక్కొక్కరికీ చూపులతోనే వీడ్కోలు చెప్పాడు సూర్యం. మనసుకీ మనసుకీ మధ్య భాష అవసరంలేదు. అది కాంతిపుంజంలాంటిది. హృదయకవాటాలకు తాకే వెలుగది.

అందరి గుండెలూ బరువెక్కిపోయాయి. చీకటితోపాటే దిగులు వాళ్లని కమ్మేసింది.

సూర్యాన్ని ఏవిధంగా బయటికి తీసుకెళ్లాలో చర్చిస్తున్నాడు నరేంద్ర.

ఈ రాత్రికే దగ్గరలోని ఒక పల్లెకు తీసుకెళ్ళాలి. సూర్యాన్నిక్షేమంగా చేర్చేందుకు నలుగురినైనా తోడుగా పంపించాలి. దారిలో ఏదయినా ప్రమాదం ఎదురయితే ఎదుర్కొనేందుకు సిద్ధంగా ఉండాలి.అందుకోసం ఏర్పాట్లు చేస్తున్నాడతడు. ఇద్దర్ని సంగతులు తెలుసుకోమని బయటకు పంపించాడు.. దాంతో కాస్త వ్యవధి దొరికింది.

ఈ లోపున తన భవిష్యత్ కార్యక్రమాల గురించి చర్చించాడు సూర్యం. అరుణ్ వర్గం దాడిపై ఏరకంగా ప్రతిస్పందించాలో ఏఏకార్యక్రమాలు తీసుకోవాలో కాలేజీలో పనివిధానం ఎలా ఉండాలో వివరించాడు. ఈరోజు తీసుకున్న నిర్ణయాలను అమలుపరచమన్నాడు.

ఈ దాడి పూర్వాపరాలను వివరిస్తూ ప్రచారం చేయాలని నిర్ణయించాడు. ప్రతీకారంకోసం ముందుముందు ఇతరులు చేయబోయేదాడుల గురించి హెచ్చరిస్తూ ప్రజల్లో ఉధ్రతంగా ప్రచారం చేయాలని చెప్పాడు. కాలేజి బాధ్యతలు నరేంద్ర, సారథిలను తీసుకోమని సూచించాడు.

అరగంటలో వెళ్లిన ఇద్దరూ వచ్చారు. టౌనులో పరిస్థితి గురించి చెప్పారు వాళ్లు. నరేంద్ర ఊహ నిజమయింది. సూర్యం కోసం పోలీసులు వెతుకుతున్నారు. అటు రౌడీలూ వెతుకుతున్నారు.

సాయంత్రం ఐదింటికి కొందరి ఇళ్లమీద దాడులు జరిగాయట. అరుణ్ అనుచరులు ఎవరూ దొరకలేదు. దానితో అతడి కులానికి చెందినవాళ్లని దొరికినచోట కొట్టారు. శివుడు అనే విద్యార్థిని రాధికా సెంటర్‌లో పొడిచివేయటంతో అరగంట క్రితమే హాస్పటల్‌లో మర

ణించాడు అతడు. అరుణ్‌కుమార్‌కి బంధువవ్వటమే అతను చేసిన తప్పు.

రవి మనసు కలుక్కుమంది. శివుడు తన క్లాస్‌మేటే. అతడు మానసికంగా ఎదగలేదు. ఎప్పటికయినా సినిమా హీరో అవుతాననివెర్రి మొర్రివేషాలు వేసేవాడు అతడి శరీరం పెరిగినా మనసు మాత్రం ఎదగలేదు. ప్రపంచం గురించి ఏమీతెలీదతనికి. అలాంటి అమాయకపు జీవి కూడా కులోన్మాదానికి బలయ్యాడు.

సూర్యం బయలుదేరే సమయం ఆసన్నమయింది.

అతడు సరితని సమీపించాడు. ఆమెలో దఃఖం కట్టలు తెంచుకొని ఉరకబోతోంది. అది గమనించినట్లుగా ఆమె హస్తాన్ని తన చేతుల్లోకి తీసుకుని స్పృశించాడు. ఆమె తల దించుకొని నేలను చూస్తోంది.

“వస్తాను సరితా...బాధపడకు. అసలు బాధలు ముందున్నాయి. ఇది ఆరంభం మాత్రమే. సమాజంలోని కుహనా విలువలు మనందరినీ నియంత్రిస్తున్నాయి. మానవులుగా వాటిని ధ్వంసం చెయ్యటం మనకర్తవ్యం. ఆ ధ్వంసంకోసమే మనం ఈ బాధలను ఆహ్వానిస్తున్నాం. ఆ ధ్వంస రచన కోసమే రక్తాక్షరాలు లిఖిస్తున్నాం.

వ్యవస్థ ఇప్పుడు యుగసంధిలో ఉంది. ఒకప్పటి విలువల స్థానంలో కొత్త విలువలు వచ్చాయి. ఆర్థికసమస్యలు మొదటి స్థానాన్ని ఆక్రమించాయి. మానవులమధ్య సంబంధాలను ఈ ఆర్థిక విలువలే నియంత్రిస్తున్నాయి.

ప్రకాష్ ఇదివరకట్లా నీతో ఆప్యాయంగా ఉండటం లేదన్నా-నీ కవితలు చదివి ఆనందించలేకపోతున్నాడన్నా..రవళి వధ్యస్థలివైపు నడుస్తుందన్నా...సుజాత మోసపోయిందన్నా...నన్ను ఇంట్లోంచి వెళ్లగొట్టారన్నా... ఇవన్నీ వ్యవస్థలోని మార్పుకుసూచనలు. ప్రపంచం వీటితో భుగభుగ ఉడుకుతోంది. భగ్గున మండుతోంది.

ఈ అశాంత పరిస్థితులపై మన పోరాటం మార్పుకై తోడ్పడుతుంది. అప్పుడు ఈ కుళ్లు విలువలు ధ్వంసమైపోతాయి. బ్రద్దలైపోతాయి.

అందాకా నువ్వూ, నేనూ, సుజాతా, శైలజా ఎవరెవరో అందరం ఒకే తాటిమీదకు రావాల్సినవాళ్లం. ఒకేరకమైన బాధలు పడాల్సినవాళ్లం. బలి కావల్సినవాళ్లం.

ఇక ఉంటాను సరితా. నరేంద్ర పిలుస్తున్నాడు. ప్రజల్లోకి వెళ్లి వారిలోని చైతన్యాన్ని రగిల్చి ఈ పట్టణాన్నీ, పట్టణంలోని కాలేజ్‌నీముట్టడించాలి. అరుణ్, శివాజీ, స్టీవెన్సన్‌లాంటి దౌర్జన్య శక్తులను ధ్వంసం చేయాలి. నీవంతుగా నువ్వూ తోడ్పడాలి. నేను లేకపోయినా ఇంకా అనేకమంది ఉన్నారు. నరేంద్రా వాళ్లు కలుస్తుంటారు. వీలయినంత సాయపడు.

మళ్లీ కలుస్తాను. ఉంటే... ప్రాణాలతో మిగులుంటే .... ఎప్పటికైనా కలుస్తాననే నమ్మకం ఉంది-వస్తానూ”

అతడు బయటకు నడిచాడు. అతడికోసం బయటే వేచిఉన్నారందరూ.

సరిత వెళ్లిపోతున్న సూర్యాన్ని కంటతడిలోంచి చూస్తోంది.అతడి ఆకారం అలుక్కుపోయి కంటినిండా ఆక్రమించింది. క్రమంగాకరిగి కరిగి కన్నీటి బిందువులతో నేలకు జారి దూరమై అద్రశ్యమయిపోయింది.

నేలమీద కూలిపోయినట్లుగా కూర్చుంది ఆమె.

అదే నిస్సహాయ స్థితిలో గంటకు పైగా గడిపింది.కంట అశ్రుధారలు జారుతున్నాయి. ఒంట్లో శక్తి జారిజారి ఆవిరయిపోయింది. ఇంట్లో ఒక్కతే ఆ చిక్కని చీకటిలో ఉండిపోయింది- కాస్సేపటికి.

“సరితా”. ప్రకాష్ పిలుపు. గుమ్మం దగ్గర వినపడింది.ఉలిక్కిపడిందామె. ఒక్కసారిగా వాస్తవ జీవితంలోకి వచ్చింది.తన కంటనీరు అతడికి అర్థమయ్యేలోపు... తుడిచేసుకుని చిరునవ్వు పులుముకుని లేచింది...తనచిట్టచివరి హక్కుని కూడా కోల్పోయినట్లు. ★

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad. Tel. 229428. Office Address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad., Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, • Regd.No. H/HD /402

# అల్పాహారానికి ప్రియ తోడు- అద్వితీయమైన రుచులు జోడు!

ఎప్పుడైనా. ఎక్కడైనా... ప్రియ!

ఉదయం, మధ్యాహ్నం, రాత్రి -
ఏ వేళప్పుడయినా సరే,
అల్పాహారం, భోజనం, ఉపాహారం - ఏదైనా సరే,
ఇంటా బయటా - ఎక్కడైనా సరే,
ప్రియ పచ్చళ్లుంటేనే అది బహురుచికరం!

నవకాయ పిండి వంటలెన్నున్నా
ప్రియ పచ్చళ్లతోనే భోజనం పరిపూర్ణం!

మీ పళ్లెంలో ప్రియ ఉంటేనే మీకు
సంతృప్తి సంతుష్టి!!

**ఎంతో రుచి... ఎంతో రుచి...**

# ప్రియ

మామిడి • నిమ్మ • గోంగూర • అల్లం • టొమాటో
పండుమిరప • పచ్చిమిరప • మిక్స్‌డ్ వెజిటబుల్.
పచ్చళ్లన్నీ వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ లభిస్తాయి.






ఉషోదయ
ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్
(ప్రియ ఫుడ్స్ డివిజన్)
ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడ, హైదరాబాదు-500482.